# మక్సీమ్ గోర్కీ




# కథలు

# మక్సీమ్ గోర్కీ

## కథలు





"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి

అట్టమీది బొమ్మ "చెల్కాష్" కథకు సంబంధించినది. ప్రసిద్ధ రష్యన్ చిత్రకారుడైన కుస్తోదియెవ్ చిత్రానికి ప్రతికృతి యిది.

**М. ГОРЬКИЙ**

РАССКАЗЫ

*на языке телугу*

# యిందులో


మకార్ చుద్రా . . . . . . . . . . . . . . . . . . 5

డేగపాట . . . . . . . . . . . . . . . . . . . 20

చెల్కాష్ . . . . . . . . . . . . . . . . . . . 26

ముసలి ఇజెర్గిల్ . . . . . . . . . . . . . . . . 62

పొద్దుబోడానికి . . . . . . . . . . . . . . . . . 86

యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ . . . . . . . 106

తుఫాను పక్షి పాట . . . . . . . . . . . . . . 122

ఇటలీ గాధలు 124

పార్మా పిల్లలు . . . . . . . . . . . . . 124

సారంగం . . . . . . . . . . . . . . . 128

తల్లి . . . . . . . . . . . . . . . . 132

పేపే . . . . . . . . . . . . . . . . 139

కడుపులో చెయిపెట్టి . . . . . . . . . . . . . . 146

ఒక మానవుని జననం . . . . . . . . . . . . . 166

భరత వాక్యం . . . . . . . . . . . . . . . 179

# మకార్ చ్ఋద్రా

సముద్రంనుండి తడి చలిగాలి వీస్తున్నది — ఒడ్డుకు తగిలి చిందిపడే అలల విచార సంగీతాన్నీ, బీచిలోని పొదల సవసవనూ మైదానాలమీదికి మోసుకొని వస్తూ. అప్పుడప్పుడు ఆ గాలి విసరుకు యెండిపోయిన పసుపురంగు ఆకులు వచ్చి నాల్కలు చాపే నెగడులో తిరిగి పడుతున్నాయి, మంటను ప్రజ్వలింప జేస్తూ. మాచుట్టూ వున్న శరద్రాత్రి చీకటి వణికి వెనక్కి తగ్గినప్పుడు, ఆ స్వల్ప క్షణంలో యెడమ పక్క అనంతమైన మైదానమూ, కుడి పక్క అవధిలేని సముద్రమూ, యెదురుగా ముసలి జిప్సీ మకార్ చుద్రా ఆకారమూ కనపడుతున్నాయి. మేము కూర్చున్న చోటికి యాభై అడుగుల దూరంలో గుడారాలు వేసిన జిప్సీ మకాం గుర్రాలను చూసుకునేవాడు మకార్ చుద్రా.

అతని కకేషియన్ కోటును తెరిచి, రోమ సంకీర్ణమైన అతని రొమ్ముమీద దాడి చేస్తున్న ఆ చలిగాలి దెబ్బలను లక్ష్యపెట్టకుండా అతను నావైపు ముఖం తిప్పి, ఒక స్నిగ్ధ బలసూచకమైన భంగిమలో వాలి కూర్చున్నాడు — తన పెద్ద పైపును ఒక క్రమ పద్ధతిలో పీలుస్తూ, నోటిగుండా, ముక్కుగుండా దట్టమైన ధూమ తరంగాలు వదలుతూ, నా తలమీదుగా మృత్యు నిశ్శబ్ద అంధకారంలోకి తేరి చూస్తూ, తెరపిలేకుండా మాట్లాడుతూ, క్రూర వాయు ప్రహారాలనుండి రక్షించుకోడానికి కించిత్తు ప్రయత్నం కూడా చేయకుండా.

"దేశాటనం చేస్తున్నా వన్నమాట? భేష్! అద్భుతమైన పని యెన్నుకున్నావు బాబూ. అదీ పద్ధతి: దేశమంతా తిరుగు, అన్నీ చూడు; చూడదలచుకున్న వన్నీ చూసిన తర్వాత, ఒక చోట పండుకొని చచ్చిపో—అంతే!"

"అంతే" అన్న మాటకు నేను వెలిబుచ్చిన వ్యతిరేకతను అతను నమ్మకుండా యిలా కొనసాగించినాడు: "జీవితమా? యితర్లా? హుఁ. ఆ దిగులు నీ కెందుకు? నీవు మాత్రం జీవితం కాదూ? యితర్లు నీవు లేకుండా జీవిస్తున్నారు, నీవు లేకుండా తమ బతుకులు తాము బతుకుతారు. యెవరికైనా నీ అవసరం వుందని అనుకుంటున్నావా? నీవు రొట్టెవూ కాదు, కట్టెవూ కాదు; యెవరూ కోరరూ నిన్ను.

"నేర్చుకోవడమూ, నేర్పించడమూనా? యితర్లను యెలా సంతోషపెట్టేదీ నీవు నేర్చుకోగలవా? ఊహూఁ, నీచేత కాదు. నేర్పడంగురించి మాట్లాడడానికి ముందుగానే నీ తల తెల్లబడుతుంది. నేర్పేది యేమిటి? ప్రతి వొకనికీ తెలుసు తనకు కావలసిం దేమిటో. తెలివిపరులు యేది దొరికితే అది తీసుకుంటారు, మూర్ఖులకు యేదీ లభించదు, కానీ ప్రతి వొకడూ తనకు తానే నేర్చుకుంటాడు.

"చిత్రమైనవాళ్లు, నీవు చెప్పే మనుషులు. అంతా మందగా చేరి ఒకరి నొకరు తొక్కుకుంటూ వుంటారు, యింత విశాలమైన ప్రపంచంలో," అంటూ అతను చేయి సాచి మైదానాలవైపు విసరినాడు. "యిక, జన్మంతా శ్రమపడడం. దేని కోసం? యెవరి కోసం? యెవరికీ తెలియదు. ఒక మనిషి పొలం దున్నుతుంటాడు చూడు. వాన్నిగురించి యోచించు — వాడు ఆ పొలంమీద తన శక్తిని ఒక్కొక్క బొట్టే చెమటగా కారుస్తున్నాడు, తరువాత ఆ పొలంలో పండుకొని కుళ్లిపోతాడు. వాడు వదలిపోయే దేమీ లేదు, ఆ పొలంనుండి వాడు తెలుసుకొన్న దేమీ లేదు. యెలా పుట్టినాడో అలా గిట్టుతాడు — మూర్ఖుడుగా.

"భూమిని త్రవ్వడానికి పుట్టినవాడు తన కొరకు ఒక గోరీ తవ్వుకోకుండానే మరణిస్తా డంటావా? స్వేచ్ఛ అంటే యేమిటో వానికి తెలుసునా? యీ విస్తార ప్రశస్త మైదానంగురించి వాని కేమైనా తెలుసునా? సముద్రపు అలల సంగీతం వాని హృదయానికి ఉల్లాసం కలిగిస్తుందా? వాడు బానిస, పుట్టిన క్షణంనుండి బానిస, జన్మంతా బానిస — అంతే. వాడు తన కొరకు తాను చేయగలిగిం దేమిటి? వాడు చేయగలిగిం దల్లా ఉరి పోసుకోవడం, కొంచెమైనా జ్ఞాన మనేది ఆర్జించి వుంటే.

"నన్ను చూడు; యాభై యెనిమి దేండ్ల వయస్సుకు నేను యెంత చూసినా నంటే, అదంతా కాగితంమీద రాస్తే, అక్కడ వుండే నీ సంచి, అలాంటివి వెయ్యి సంచులు నిండుతాయి. నేను చూడని స్థలాలు యేమిటని అడుగుతావా? అలాంటి స్థలాలే లేవు. నేను చూసిన స్థలాలు నీవు ఊహించలేవు. జీవించే పద్ధతి అదే — దేశాటనం. అంతే. ఒక చోట చాలా కాలం వుండొద్దు, లాభం లేదు. రాత్రీ, పగలూ ఒక దాన్నొకటి భూమి చుట్టూ తరుముతాయి చూడు, అలా జీవితపు టాలోచనలకు దూరంగా నిన్ను నీవు తరుముకుంటూ పో, జీవితమంటే వెగటు కలక్కుండా. నిలిచి ఆలోచించినావా, జీవితంమీద వెగటు కలుగుతుంది — యెప్పుడైనా అంతే. నా క్కూడా ఒకసారి కలిగింది. హుఁ! నిజంగా కలిగింది బాబూ.

"అప్పుడు జైల్లో వున్నాను, గలీషియాలో. యీ భూమ్మీద దేనికోసం బతుకుతున్నాను? — అని ఆలోచన కలగసాగింది — విసుగు లాంటిది. జైల్లో విసుగ్గా వుంటుంది బాబూ, మహా విసుగ్గా వుంటుంది! కిటికీగుండా పొలాలవైపు చూసినప్పుడు గుండెలో గుబులు కలిగేది; యెంత గుబులంటే, యెవరో నా గుండెను పట్టుకొని పిండు

తున్నట్లు. యెవడు చెప్పగలడు, తాను దేనికోసం బతుకుతున్నదీ? యెవడూ చెప్పలేడు బాబూ! దాన్నిగురించి నిన్ను నీవు ప్రశ్నించుకొని లాభం లేదు. జీవించు — అంతే. దేశం తిరుగు, చుట్టూ చూడు, నీ కెప్పుడూ మనసులో బెంగ వుండదు. అప్పుడు నేను దాదాపు నా బెల్టుతో ఉరివేసుకున్నాను, నిజం!

"హుహ్! ఒకసారి ఒక మనిషితో మాట్లాడినాను. గంభీరమైన మనిషి, మీవాడే, రష్యన్. నీవు జీవించవలసింది నీ యిష్టప్రకారం కాదు, దేవుని ఆజ్ఞ ప్రకారం, అంటాడు అతను. భగవంతుడు చెప్పినట్లు నడుచుకో, నీవు అడిగిందల్లా యిస్తాడు. అతనే చింపిరిపాతల్లో వుండినాడు. ఒక కొత్త సూటు దేవుని అడగరాదా, అన్నాను అతనితో. అతను ఉగ్రుడై నన్ను తరిమేసినాడు, శాపనార్థాలు పెడుతూ. అతను అంతకుముందే నాతో చెప్పుతూ వుండినాడు, మనిషి తన తోటి ప్రాణులను క్షమించాలనీ, ప్రేమించాలనీ. నా మాట ఆ ప్రభువుగారికి నొప్పి కలిగించి వుంటే, అతను నన్ను క్షమించి వుండవచ్చు కదా. యిలాంటివాళ్లు బోధకులు! తక్కువగా తినమని నీకు బోధిస్తారు, తామేమో రోజుకు పది సార్లు తింటారు."

అతను మంటలోకి వుమ్మేసి పైపు మళ్లీ నింపుకుంటూ మౌనంగా వుండిపోయినాడు. గాలి మెల్లగా యేడుస్తున్నట్లు మూలిగింది, చీకటిలో గుర్రాలు సకిలించినాయి, జిప్సీ మకాంనుండి సంగీతపు మృదువైన ఆవేశభర స్వరాలు పైకి తేలుతూ వచ్చినాయి. మకార్ కూతురు, అందమైన నోన్కా, పాడుతున్నది. ఆ మంద్ర ఉదాత్త కంఠస్వరం నాకు తెలుసు. అదెప్పుడూ యెంతో వింతగా వుంటుంది, అసంతృప్తిగా, సాధికారంగా — పాట పాడినా అంతే, పలకరించినా అంతే. ఆ మృదువైన రాగిరంగు ముఖంలో ఒక రాణివాసపు ఠీవి వుంటుంది. ఆ ముదురు గోధుమరంగు కన్నులు తన సౌందర్య సంపద దుర్వారమైనదనే యెరుకతోనూ, తాను కాని సమస్తమూ క్షుద్రమైనదనే నిరసన భావంతోనూ మెరుస్తుంటాయి.

మకార్ పైపు ముందుకు సాచినాడు.

"యిదో, పొగ తాగు! బాగా పాడుతుంది కదూ, ఆ పిల్ల? ఆఁ? బాగా పాడుతుంది! అలాంటి అమ్మాయి నిన్ను ప్రేమించాలని వుందా? లేదూ? భేష్! ఆడపిల్లలను యెప్పుడూ నమ్మవద్దు, వాళ్లకు దూరంగా వుండు. నాకు పైపు తాగడంకంటె వాళ్లకు ముద్దుపెట్టుకోవడం బాగుంటుంది, హాయిగా వుంటుంది. కానీ, ఒకసారి ఆడపిల్లను ముద్దుపెట్టుకున్నావా, యిక నీ స్వేచ్ఛకు స్వస్తి చెప్పు. అదృశ్య బంధనాలతో నిన్ను తనతో బంధిస్తుంది. వాటిని మళ్లీ తెంచుకోలేవు. నీ ఆత్మను ఆమె పాదాలవద్ద అర్పిస్తావు. నిజం! ఆడపిల్లల విషయంలో జాగర్త! వాళ్లందరూ అబద్ధాల కోర్లే! ప్రపంచంలో అన్నిటికంటె నిన్ను యెక్కువగా ప్రేమిస్తున్నా నంటుంది. కానీ, గుండుసూదితో అలా వూరక గుచ్చి చూడు, నీ గుండె

ప్రబద్దలు చేస్తుంది. వాళ్ల సంగతి నాకు చాలా తెలుసు, నిజంగా తెలుసు! చూడు బాబూ, ఒక కత చెప్పమంటావా, నిజంగా జరిగిన కత? చేతనైతే జ్ఞాపకం పెట్టుకో, జన్మంతా గాలిజీవంలాగా స్వేచ్ఛగా వుంటావు.

"అనగనగా ఒక జిప్సీ యువకుడు. అతని పేరు లోయ్‌కొ జొబార్. హంగరీలో, బొహీమియాలో, స్లావోనియాలో, సముద్రంచుట్టూ అందరికీ తెలుసు అతను; భేషైన కుర్రవాడు! ఆ ప్రాంతాల్లో యే వూరైనా యెత్తుకో, అరడజను మందైనా వుంటారు, అతన్ని చంపుతామని ప్రతిజ్ఞ చేసినవాళ్లు. కానీ లోయ్‌కొ చావలేదు. అతనికి యేదైనా గుర్రంమీద మనసుపడితే చాలు, దాన్ని కాపాడుకోడానికి నీవు ఒక సైన్యాన్ని కాపలా పెట్టినా సరే, ఆ గుర్రమెక్కి జొబార్ దౌడుతీస్తుంటాడు! ఓహ్! అతనికి యెవరన్నా భయం లేదు — అసంభవం! అంతెందుకూ, సైతాన్ తన మంద నంతా వెంటబెట్టుకొని వచ్చినా అతను సైతాన్ను కత్తితో పొడిచేస్తాడేమో; తప్పకుండా సైతాన్ను నోరారా తిట్టి మంద నంతా తరిమేస్తాడు, వాళ్ల చెవుల్లో జోరీగలు దూర్చి. నేను చెప్తున్నానుగా, నమ్ము!

"జిప్సీ మకాము లన్నిటికీ అతను తెలుసు, లేదా విన్నైనా వుంటారు. అతను ప్రేమించిందల్లా గుర్రా లనే; మరి దేన్నీ ప్రేమించి యెరగడు. వాటినైనా చాలా రోజులు కాదు. కొన్నాళ్లు అటూ యిటూ తిరిగి వాటిని అమ్మేస్తాడు. ఆ డబ్బు యెవరడిగితే వాళ్లకు యిచ్చేస్తాడు. అతనికి ప్రియతమమైంది యేదీ లేదు. అతని గుండెకాయ కావాలని నీవు అడుగుతా వనుకో — రొమ్ము చించి యిచ్చేస్తాడు, నీవు సంతోషపడితే చాలు. అలాంటివాడు, బాబూ, అతను.

"మా బిడారు బుకొవీనలో సంచారం చేస్తూ వుండింది అప్పుడు — సుమారు పదేండ్ల నాటి సంగతి. ఒకనాడు — వసంత రుతువులో ఒక రాత్రి — అందరమూ చుట్టూ కూర్చొని వున్నాము, నేనూ, కోషుత్ కింద యుద్ధాలు చేసిన ముసలి సిపాయి దనీలొ, ముసలి నూర్, యింకా తక్కినవా ళ్లందరూ — దనీలొ కూతురు రాద్దా కూడా.

"మా అమ్మాయి నోన్కాను యెరుగుదువు కదూ? అందమైన పిల్ల! కానీ రాద్దాతో పోల్చలేం — అంత గౌరవమా! రాద్దాను వర్ణించడానికి మాటలు చాలవు. బహుశా ఆమె అందాన్ని ఫిడేలుమీద వాయించవచ్చునేమో. అప్పుడైనా, ఆ ఫిడేలును తన ఆత్మలాగా యెరిగిన వాడే ఆ పని చేయగలడు.

"ఆమె యెంతోమంది మంచి కుర్రవాళ్ల హృదయాలను కాల్చింది — ఔను, యెంతోమందిని! మొరేవియాలో ఒక షావుకారు, వయసుమళ్లిన గంప తలకాయ మనిషి, ఆమెను చూసి నిలువునా చలించిపోయినాడు. గుర్రంమీద కూర్చున్నాడు, గుడ్లు బిక్కిరించి నిలజూస్తున్నాడు, చలిజ్వరం వచ్చినట్లు వణుకుతూ. పండగపూట సైతానులాగ ముస్తాబైనాడు అతను, ఖరీదైన కోటు, బంగారు జరీ నగిషీ చేసింది, వేసుకొని; పక్కన వేలాడుతున్న

ఖడ్గానికి తాపిన రత్న మాణిక్యాలు మెరుపు మెరిసినట్లు తళుక్కుమంటున్నాయి, గుర్రం అడుగు యెత్తిపెట్టినప్పుడల్లా; టోపీ నీలి మొహమల్ ఆకాశం ముక్క లాగుంది — పెద్ద జమీందారు, ఆ వయసుమీరిన ఆసామీ! నిలజూసి నిలజూసి అతను రాద్దాతో అన్నాడు: 'ఓయ్, ఒక ముద్దియ్యి, నా డబ్బు సంచీ యిస్తాను!' ఆమె ఒక్క పలుకు పలక్కుండా అవతలికి తిరిగింది! 'నిన్ను నొప్పించి వుంటే మన్నించు, కాస్త దయగా చూడలేవూ?' అన్నాడు ఆ వయసుమళ్లిన షావుకారు, వెంటనే ఒక మెట్టు దిగివచ్చి. డబ్బు సంచి ఆమె పాదాలవద్దకు విసరివేసినాడు — బరువైన సంచి, తమ్ముడా! ఆమె దాన్ని కాలితో అలా తోసింది దుమ్ములో, నిర్లక్ష్యంగా — అంతే. 'ఓ, యేం పిల్ల!' అని అతను బాధతో మూలిగినాడు. గుర్రాన్ని కొరడాతో అదిలించి, ధూళి మేఘంలో కలిసిపోయినాడు.

"మరు దినం అతను మళ్లీ వచ్చినాడు. 'ఆమె తండ్రి యెవరు?' అని మకాం అంతా గర్జించినాడు. దనీలొ ముందుకు వచ్చినాడు. 'నీ కూతురును నాకు అమ్ము. నీ కేం కావాల్నో తీసుకో!' మరి దనీలొ యే మన్నాడంటే: 'జమీందార్లు మాత్రమే అన్నీ అమ్ముతారు, పందులు మొదలుకొని అంతరాత్మల దాకా. నేను కోషుత్ కింద యుద్ధాలు చేసినవాణ్ని, యే వస్తువూ అమ్మను!' ఆ పెద్దమనిషికి ఆగ్రహం వచ్చింది, ఖడ్గం తీయబోయినాడు. యింతలో ఒక కుర్రవాడు గుర్రం చెవిలో కొరివి గుచ్చినాడు. గుర్రం రౌతుతో సహా మెరుపులాగా మాయమైంది. మేము గుడారాలు యెత్తేసి బయలుదేరినాం. రెండు రోజులు కాలేదు, అతను మళ్లీ ప్రత్యక్షమైనాడు! 'ఓయ్, వినండి,' అన్నాడు అతను, 'దేవునితోడు, మీతోడు, నా అంతరాత్మలో కల్మషం లేదు. ఆ పిల్లను నా కిచ్చి పెండ్లి చేయండి. నా ఆస్తి అంతటిలోనూ సగం మీ కిస్తాను. నేను చాలా ఐశ్వర్యవంతుణ్ని!' మనిషి మహా ఉద్రేకంలో వున్నాడు, గాలిలో గడ్డి పోచలాగా జీనుమీద ఊగిపోతున్నాడు. అందరమూ ఆలోచనలో పడినాం.

" 'మరి, యేమంటావ్ అమ్మాయ్?' దనీలొ మీసాల చాటున గొణిగినాడు.

" 'తనంతకు తానే కోరి కాకి గూట్లోకి పోయే రాబందు యేమౌతుంది?' రాద్దా అడిగింది మమ్మల్ని.

"దనీలొ నవ్వినాడు, అందరమూ నవ్వినాం.

" 'భలే అన్నావు అమ్మాయ్! విన్నారు గదండీ? అదేమీ కుదరదు! పావురాలలో వెదకు — అవి యింకా అణకువగా వుంటాయి.' మేము సాగిపోయినాం.

"ఆ పెద్దమనిషి టోపీ తీసి నేలకు విసరికొట్టి, యెంత రౌద్రంగా దౌడు తీసినా డంటే, భూమి దద్దరిల్లింది. రాద్దా అలాంటి పిల్ల బాబూ!

"ఔను! ఆఁ — ఒక రాత్రి మేము చుట్టూ కూర్చున్నప్పుడు మైదానంమీదనుండి సంగీతం తేలుతూ వచ్చి వినపడింది. యింపైన సంగీతం! అది నీ రక్తంలో జ్వాలలు

రేపి, అజ్ఞాత లోకాల్లోకి నిన్ను ఆకర్షిస్తుంది. మా కందరికీ మనసులో యెలా వుందంటే — ఆ సంగీతం వింటుంటే దేనిమీదనో తీరని కాంక్ష కలుగుతుంది; అది చేతి కందితే, ఆ తర్వాత, బతికితే యీ భూమండలాని కంతటికీ రాజుగా బతకాలి, లేకపోతే బతకడం దండగ, అనిపిస్తుంది బాబూ!

"ఆఁ— చీకటిలోనుండి ఒక గుఱ్ఱం వెలువడింది. గుఱ్ఱంమీద ఒక మనిషి కూర్చున్నాడు, వాయిస్తూ మమ్మల్ని సమీపిస్తున్నాడు. మకాం నెగడు వద్ద ఆగినాడు, సంగీతం ఆపి, మావైపు చూసి చిరునవ్వు నవ్వినాడు.

" 'ఓ, నువ్వా, జొబార్!' దనీలొ అరిచినాడు సంతోషంగా. ఔను, అతను లోయ్కొ జొబార్!

"అతని మీసాలు భుజాలమీద పడి తల వెంట్రుకలతో కలిసిపోయినాయి, అతని కన్నులు చుక్కల్లాగ కాంతిగా వున్నాయి, అతని చిరునవ్వు సూర్యకాంతిలాగుంది, దేవుని తోడు! అతనూ, అతని గుఱ్ఱమూ ఒక యినుము ముద్దనుండి తయారుచేసినట్లున్నారు. అక్కడ నిలబడినాడు అతను మంట వెలుతురులో రక్తంలాగ యెఱ్ఱగా; చిరునవ్వులో పండ్లు మెరుస్తున్నాయి! అప్పుడు నన్ను నేను ప్రేమించుకున్నంతకంటె యెక్కువగా అతన్ని ప్రేమించినా ననే మాట నిజం కాకపోతే నా తల ముక్కలౌతుంది, అతను నాతో ఒక్క మాటకూడా మాట్లాడక ముందే, నే నక్కడ వున్నట్లు అతను గుర్తించక ముందే కూడా!

"ఔను బాబూ, అలాంటి మనిషి అతను! అతను నీ కన్నుల్లోకి చూసి నీ ఆత్మను వశంచేసుకుంటాడు. నీవు కించిత్తు కూడా సిగ్గుపడవు, పైగా అందుకు నీవు గర్విస్తావు. అలాంటి మనిషితో నీకు మరింత ఉదాత్తత వచ్చినట్లు అనిపిస్తుంది. అలాంటి మనుషులు అరుదు, మిత్రమా! బహుశా అదే మంచిదేమో. యీ ప్రపంచంలో మంచి దనేది అతిగా వుంటే, మంచిగా దాన్ని యెవరూ చూడరు. ఔను! ఆఁ, కత కానీ.

"రాద్దా అన్నది: 'బాగా వాయిస్తావు, లోయ్కొ! యింత మధురస్వరంగల సుతారపు ఫిడేలు నీ కెవరు చేసి యిచ్చినారు?' అతను నవ్వినాడు — 'నేనే చేసుకున్నాను! యిది చేసింది కొయ్యతో కాదు, నేను యెంతో ప్రేమించిన ఒక వయసుపిల్ల రొమ్ముతో చేసినాను; నేను వాయించే తంతెలు ఆమె హృదయ తంత్రులు. ఫిడేలు కొంచెం అపస్వరం పలుకు తుంది, కానీ కమాను యెలా వేయాల్సిందీ నాకు తెలుసు!'

"మా జాతివాళ్లు వున్నారే, వాళ్లు వెంటనే ఆడపిల్ల కన్నుల్లో మబ్బులు కమ్మేటట్లు చేయడానికి ప్రయత్నిస్తారు, మగవాని హృదయం చలించకుండానే మగవాని కోసం విషాదకర కాంక్షతో ఆడపిల్ల కన్నులు మసక లయ్యేటట్లు. లోయ్కొ పద్ధతికూడా అదే. కానీ రాద్దా అలా దొరికేది కాదు. ఆమె ఆవలిస్తూ పక్కకు తిరిగి యిలా అన్నది:

'జొబార్ తెలివిపరుడనీ, నేర్పరి అనీ అన్నారు. పచ్చి అబద్ధం!' ఆ మాటతో ఆమె వెళ్లిపోయింది.

"'ఓహో, అందమైన పిల్లా, నీ కోరలకు పదును వుందే!' అన్నాడు లోయ్‌కొ, ఒక కంటిలో మెరుపుతో, గుర్రం దిగుతూ. 'నమస్తే, సోదరులారా! వచ్చినాను మీవద్దకు!'

"'అతిథికి స్వాగతం!' జవాబిచ్చినాడు దనీలొ. మేము ముద్దుపెట్టుకున్నాం, మాట్లాడుకున్నాం, తరువాత పండుకున్నాం.... మేము గాఢంగా నిద్రపోయినాం. ప్రొద్దున లేచి చూస్తే జొబార్ తలకు పాతగుడ్డ కట్టబడి వుంది. యేమిటది? ఓ—అతను నిద్ర పోయేటప్పుడు ప్రమాదవశాత్తు అతని గుర్రం తొక్కింది, గిట్ట తగిలి తలకు గాయమైంది.

"హహ్హా! మాకు అర్థమైంది గుర్రం యెవరైందీ. మీసాల చాటున నవ్వుకున్నాం. దనీలొ కూడా చిరునవ్వు నవ్వుకున్నాడు. సరే, మరి, లోయ్‌కొ తగడా రాద్దాకు? తగుననే అనుకుంటాను. ఆడపిల్ల యెంత అందమైనదైనా సరే, ఆమెకు సంకుచితమైన, క్షుద్రమైన ఆత్మ వుంటుంది. ఆమె మెడలో మణుమున్నర బంగారు వ్రేలాడవేసినా సరే, ఆమె గుణం మారదు. ఆఁ, అది సరేలే!

"ఆ స్థలంలో మేము చాలా కాలమే వున్నాం. అన్నీ అనుకూలంగా వుండినాయి. జొబార్ మాతోనే వున్నాడు. సహచరుడంటే అతను! వృద్ధుల లాగా యెంతో విజ్ఞుడు, ప్రతి విషయమూ అతనికి తెలుసు, రష్యన్ భాషా, మగ్యార్ భాషా చదవనూ రాయనూ వచ్చు. అతను మాట్లాడడం ప్రారంభిస్తే, నిద్ర మరిచిపోయి అలాగే వింటూ వుంటావు యుగాలు గడిచినా! యిక ఫిడేలు వాయిస్తేనా—నాచర్మం వొలిచి వుప్పులో వూరబెట్టు, అతని లాగా వాయించేవాడు యీ భూప్రపంచంలో మరొకడు కనిపిస్తే! అతను తంతెలమీద కమాను వేసి లాగితే, నీ గుండె రెపరెపలాడడం ప్రారంభిస్తుంది. అతను మళ్లీ కమాను లాగితే నీ గుండె ఆగిపోతుంది, నీవు వింటూ వుంటావు. అతను వూరక వాయిస్తూ వుంటాడు, చిరునవ్వు నవ్వుతూ వుంటాడు. అతని సంగీతం వింటూ వుంటే నీకు యేడవాలనీ అనిపిస్తుంది, నవ్వాలనీ అనిపిస్తుంది, రెండూ ఒకేసారి. వింటూ వుంటే, యిప్పుడు యెవరో ఆర్తనాదం చేస్తున్నట్లు, సహాయంకొరకు వేడుకొంటున్నట్లు, నీ గుండెను కత్తితో లాగా చీలుస్తున్నట్లు వుంటుంది. యింతలో మైదానం ఆకాశానికి యేదో దేవ కన్నెల కథ విషాదభరితమైనది చెప్తున్నట్లుంటుంది. యింతలో యెవరో ఆడపిల్ల ప్రియునికి వీడ్కోలు యిస్తూ యేడుస్తున్నట్లు వుంటుంది! యింతలో యెవరో సాహస యువకుడు తన ప్రియురాలిని మైదానంలోకి రమ్మని పిలుస్తున్నట్లు వుంటుంది. మరు క్షణంలో—హోయ్‌హోయ్! ధైర్యోల్లాసాల రాగం గాలిలో నిండుతుంది, ఆ సూర్యుడే ఆకాశంలో నృత్యం ప్రారంభించ బోతున్నట్లు! ఔను బాబూ, అలా వుండేది అది.

"నీ దేహంలోని ప్రతి అణువూ ఆ గానాన్ని అర్థం చేసుకునేది; నీవు—శరీరమూ, ఆత్మా, అంతా—అతనికి బానిస అయ్యేవానివి. అప్పుడు లోయ్‌కొ 'కత్తులు దూయండి, మిత్రులారా!' అని కేకవేస్తే అందరమూ ఒక్కుమ్మడిగా కత్తులు పుచ్చుకొని గుడ్డిగా

అతనివెంట పోయేవాళ్లం. అతను ఒక మనిషిని యేమైనా చేయగలడు. ప్రతివొకడూ అతన్ని ప్రేమించేవాడు, యెంతో గొప్పగా ప్రేమించేవాడు — రాద్దా మాత్రమే అతన్ని గుర్తించలేదు. అదైనా పరవాలేదు; పైగా ఆమె అతన్ని అపహాస్యం చేసింది. ఆమె ఆ కుర్రవాని హృదయాన్ని గాయపరిచింది — ఔను, బాగా గాయపరిచింది! పళ్లు కొరికేవాడు అతను, మీసాలు కొరుక్కునేవాడు. చీకటి గుహల్లాంటి ఆ కన్నుల్లో ఒకోసారి తళుక్కుమనేది, ఆత్మను ఖండఖండాలుగా చేయజాలింది యేదో. రాత్రిపూట మైదానంలోకి దూరంగా పోయేవాడు లోయ్‌కొ. ఉదయందాకా అతని ఫిడేలు రోదన చేసేది, లోయ్‌కొ స్వేచ్ఛ మరణించి నందుకు అది రోదన చేసేది. మేము వింటూ పండుకొని ఆలోచించేవాళ్లం: యేం చెయ్యాలి? రెండు గుండ్లు ఒకదానిమీది కొకటి దొర్లుతూ వస్తుంటే, వాటిమధ్యకు పోవడం లాభం లేదు — నీవు నలిగిపోతావు. అలాంటి పరిస్థితి అది.

"సరే, ఒకసారి అందరమూ కూర్చొని వున్నాం, యేవో విషయాలు మాట్లాడు కుంటూ. వాతావరణం నిరుత్సాహంగా తయారైంది. అప్పుడు దనీలొ లోయ్‌కొను అడిగినాడు: 'యేదైనా పాట పాడు లోయ్‌కొ, ఆత్మకు కాస్త ఉల్లాసం కలిగించేది!' అల్లంత దూరాన ఆకాశంవైపు ముఖం తిప్పి పండుకొని వున్న రాద్దావైపు ఒక చూపు విసరినాడు ఆ కుర్రవాడు, ఫిడేలు తంతెలమీద కమాను వేసి లాగినాడు. నిజంగా కన్నెపిల్ల హృదయంలా పలికింది ఫిడేలు. లోయ్‌కొ పాడినాడు:

"హై — హో! హృదయం అగ్నిని జ్వలింపజేసెడు,
అపార విస్తర మీ మైదానం!
వాయువేగి నా ధీర తురంగం
బాహు బలాన్వితు డాశ్వికుడూ!"

"రాద్దా తల తిప్పి, మోచేతిమీద లేచి, గాయకుని కన్నుల్లోకి అవహేళనగా చిరునవ్వు నవ్వింది. అతని ముఖం యెరుపెక్కింది, ఉదయ సూర్యునిలా.

"హై — హో — హై! లెమ్ము మిత్రమా లే!
ఉరుకుతు ముందుకు పోదాం పదపద!
గాఢ తమోవృత దిఙ్మండలమున
వేచియున్న దదె ఉషస్సు కౌగిలి
హై — హూ ! యెగురుతు పోదాం దినకరు కెదురుగ
మైదానంపై ఆడుతు పోదాం!

పోయేటప్పుడు జాగర్తోహోయ్
సుందర మగు శశి తగలకు తలతో!''

"పాటా అది! ఆ మాదిరీ యిప్ప డెవ్వడూ పాడలేదు! రాద్దా యిలా అన్నది, ఒక్కొక్క మాటే జారవిడుస్తూ:

" 'నీవు అంత యెత్తు యెగర కూడదు, లోయ్‌కొ. బోర్లపడి బురదలో పడవచ్చు, మీసాలకు బురద ఔతుంది, జాగర్త.' లోయ్‌కొ భీషణంగా ఆమెవైపు చూసినాడు, కానీ యేమీ అనలేదు. కోపం దిగమింగి పాడసాగినాడు:

"హై — హో — హై! పదపద పదపద బాలార్కద్యుతి
నిద్రముఖాలను చూడకుండగా
లజ్జాభరమున శిరసులు వంగగ
లోకం నవ్వకముందే పదపద!''

" 'ఓహ్, యేమి పాట!' అన్నాడు దనీలొ, 'యిలాంటిది నా జన్మలో యెప్పుడూ వినలేదు. నా మాట అబద్ధ మైతే సైతాను నా శరీరంతో సైపు చేసుకుంటాడు గాక!'

"ముసలి నూర్ మీసాలు యెగరేసి, భుజాలు కుదించినాడు, ప్రతి వొకరికీ ఉల్లాసంగా వుంది జొబార్ పాడిన ధీర గానానికి. రాద్దాకు మాత్రమే యిష్టంలేదు అది.

" 'ఒకసారి ఒక కందరీగ అలాగే జుమ్మని మ్రోగింది, రాబందు కూతను అనుకరించాలని,' అన్నది ఆమె. మా ఉత్సాహంమీద మంచు చల్లినట్లైంది.

"దనీలొ లేవబోతూ అన్నాడు: 'కొరడా రుచిచూడాలని వుందా, రాద్దా?' కానీ జొబార్ టోపీ తీసి నేలమీద పారేసి మట్టిముద్దలాగా నల్లగా మాడిన ముఖంతో యిలా అన్నాడు:

" 'వుందు, దనీలొ. అణగని గుర్రానికి ఉక్కుకళ్లెం కావాలి! నీ కూతురును నాకిచ్చి పెండ్లి చెయ్!'

" 'యిప్పుడు అడుగుతున్నా వన్నమాట'! అన్నాడు దనీలొ, చిరునవ్వుతో. 'చేసుకో, చేతనైతే!'

" 'సరే!' అంటూ లోయ్‌కొ రాద్దాతో యిలా అన్నాడు:

" 'చూడు, అమ్మాయీ, నా మాట కాస్త విను, డంబాలు విడిచిపెట్టి! నా జీవితంలో నీలాటి ఆడకూతుర్లను చాలామందిని చూసినాను, చాలామందినే చూసినాను! కానీ నీలాగ యెవరూ నా హృదయాన్ని కదిలించలేదు. ఆఁ, రాద్దా, నీవు నా ఆత్మకు

ఉచ్చువేసినావు! సరేనా? జరగాల్సింది జరక్క తప్పదు, మరి... తననుండి తాను తప్పించుకో దలచినవానికి యే గుర్రమూ లాభంలేదు!... దేవుని యెదుట, నా అంతరాత్మ యెదుట, మీ తండ్రి యెదుట, యీ పెద్ద లందరి యెదుటా నిన్ను భార్యగా స్వీకరిస్తాను. కానీ, గుర్తుపెట్టుకో, నీవు నా యిష్టానికి యెదురు చెప్పకూడదు. నేను స్వేచ్ఛగలవాణ్ని, నా యిష్టం వచ్చిన పద్ధతిలో జీవిస్తాను!' తరువాత అతను ఆమె దగ్గరకు పోయినాడు, బిగబట్టిన పళ్లతో, మెరిసే కన్నులతో. ఆమెవైపు అతను చేయి సాచడం మేము చూసినాం. చూసి అనుకున్నాం, యిప్పుడు మైదానపు గుర్రానికి రాద్దా కళ్లెం వేసింది! హఠాత్తుగా అతను చేయి పైకెత్తి కింద పడినాడు, తల వెనుకభాగం దభామని నేలకు కొట్టుకుంది!...

"చిత్రం! ఆ కుర్రవాని గుండెలో తుపాకిగుండు దూరినట్లు! జరిగిందేమిటంటే, రాద్దా కొరడా ఝుళిపించి, అతని కాళ్లకు తగిలించి లాగింది, అతన్ని కింద పడవేస్తూ.

"రాద్దా మళ్లీ వెలకిల పండుకొంది, నిశ్చలంగా, ముఖంమీద అపహాస్యపు చిరునవ్వుతో. తరువాత యేమి జరుగుతుందో అని మేము కాచుకొని వున్నాం. లోయ్‌కొ నేలమీద కూర్చున్నాడు, చేతులతో తల అణగ పట్టుకొని, తల ప్రేలిపోతుందేమో అని భయపడినట్లు. తరువాత అతను మెల్లగా లేచి, యెవరివైపూ చూడకుండా వెళ్లిపోయినాడు మైదానంలోకి. నూర్ నాచెవిలో చెప్పినాడు: 'అతనిమీద ఒక కన్ను వుంచు!' నేను జొబార్‌వెంట నక్కుతూ పోయినాను మైదానపు చీకట్లోకి. అదీ విషయం, బాబూ!"

మకార్ పైపులోనుండి బూడిద రాల్చి, మళ్లీ పైపు నింపుకోవడం ప్రారంభించినాడు. నేను కోటు యింకా చుట్టూ బిగదీసుకొని, యెండకూ గాలికీ వాడిపోయిన అతని ముసలి ముఖంవైపు చూస్తూ వున్నాను. అతను తనలో తాను గొణుక్కుంటున్నాడు, కటువుగా తల ఆడిస్తూ; అతని తెల్ల మీసాలు కిందికీ పైకీ ఆడుతున్నాయి, తలమీది వెంట్రుకలు గాలికి కదలుతున్నాయి. పిడుగుదెబ్బకు కమలిపోయిన పాత ఓకు చెట్టులా, కానీ యింకా బలంగా, భద్రంగా, తన బలానికి తాను గర్విస్తున్నదానిలా, వున్నాడు అతను. సముద్రం యింకా తీరంతో తన గుసగుస సంభాషణ సాగిస్తున్నది, ఆ గుసగుసలను గాలి యింకా మైదానంలోకి మోసుకపోతున్నది. నోన్కా పాట ఆపింది. ఆకాశంలో కూడిన మేఘాలు ఆ శరద్రాత్రిని యింకా చీకటిగా చేసినాయి.

"లోయ్‌కొ భారంగా కాళ్లీడ్చుకుంటూ పోయినాడు, తల వంచుకొని; అతని చేతులు యెముకలేని తోలుచేతుల్లా వ్రేలాడుతున్నాయి. యేటిపక్కన వున్న లోయలో అతను ఒక బండమీద కూర్చొని, బరువుగా మూలిగినాడు. ఆ మూలుగుకు నా గుండె జాలితో నీరైంది. కానీ నేను అతని దగ్గరికి పోలేదు. దుఃఖానికి మాటలు వూరట కలిగించలేవుగా? అదంతే! అతను ఒక గంట సేపు కూర్చున్నాడు, మరొక గంట, యింకొక గంట, వూరక కూర్చున్నాడు చలనంలేకుండా.

“నేను దగ్గరలో నేలమీద పండుకొని వున్నాను. రాత్రి కాంతివంతంగా వుంది; మైదాన మంతా వెండి వెన్నెలలో మునిగి వుంది, చాలా దూరానికి చూపు పారుతున్నది.

“హఠాత్తుగా నాకు రాద్దా కనపడింది, మకాంనుండి మావైపు వడివడిగా వస్తున్నది.

“నాకు ఉత్సాహం కలిగింది! ‘హో, అమోఘం! గుండెలుగల పిల్ల, రాద్దా!’ అనుకున్నాను. ఆమె దగ్గరికి వచ్చింది. కానీ ఆమె రావడం అతను వినలేదు. ఆమె అతని భుజంమీద చేయి వేసింది. లోయ్‌కొ ఉలిక్కిపడినాడు; చేతులు జారవిడిచి తల యెత్తినాడు. క్షణంలో లేచి నిలబడి, కత్తి పట్టుకున్నాడు. ‘ఓ, పిల్లను పొడిచేస్తాడు,’ అనుకున్నాను. మకంలోని వాళ్లకు వినపడేటట్లు కేకవేసి, వాళ్లవద్దకు పరుగెత్తుదా మనుకునే లోపలనే మాటలు వినపడినాయి.

“‘కింద పడేయ్! నీ తల బ్రద్దలు చేస్తాను!’ నేను చూసినాను — రాద్దా చేతిలో పిస్టల్ పట్టుకుంది, జొబార్ తలకు గురిపెట్టింది. సివంగి అంటే అదీ! నేననుకున్నాను, యిప్పుడు యిద్దరూ బలంలో సరితూగుతారు, తరువాత యే మౌతుందో మరి?

“‘యిటు చూడు!’ — రాద్దా పిస్టల్ నడుములో జొనిపింది — ‘నేను వచ్చింది నిన్ను చంపడానికి కాదు, రాజీ చేసుకోడానికి — కత్తి కింద పడేయ్!’ అతను కత్తి కింద పడవేసి, పొడిచే యెద్దులాగా ఆమె కన్నుల్లోకి చూసినాడు! అది చూడవలసిన దృశ్యం తమ్ముడూ! యిద్దరు వ్యక్తులు పోట్లాటకు తలపడే జంతువుల్లాగా ఒకరివైపు ఒకరు బిర్రుగా చూస్తూ వున్నారు, మరి యిద్దరూ అంత మంచి, ధైర్యంగల వ్యక్తులు. పైన చందమామా, కింద నేనూ చూస్తున్నాం, అంతే.

“‘విను, లోయ్‌కొ. నేను నిన్ను ప్రేమిస్తున్నాను!’ అన్నది రాద్దా. అతను కేవలం భుజాలు కుదించినాడు, కాళ్లూ చేతులూ కట్టివేసినట్లు.

“‘నేను ధైర్యంగల యువకులను చూసినాను. కానీ నీ ముఖంలోనూ, ఆత్మలోనూ నీవు వాళ్లకంటె ధైర్యం గలవానివి, మేలైనవానివి. నేను కేవలం కన్ను గీటితే చాలు, వాళ్లలో యెవరైనా మీసాలు గొరిగించుకునేవాళ్లు. నేను కోరితే వాళ్లందరూ నా పాదాల వద్ద వాలేవాళ్లు. కానీ, యేం లాభం? వాళ్లు ముందుగానే అంత ధైర్యస్తులుకాదు, వాళ్లందరినీ నేను ఆడంగి వాళ్లను చేసేదాన్ని. యీనాటి ప్రపంచంలో ధైర్యంగల జిప్సీలు కొద్ది మందే వున్నారు, చాలా కొద్దిమందే వున్నారు లోయ్‌కొ. నేను యెప్పుడూ యెవరినీ ప్రేమించలేదు, లోయ్‌కొ. కానీ, నిన్ను ప్రేమిస్తున్నాను. కానీ నేను స్వేచ్ఛను కూడా ప్రేమిస్తున్నాను! నిన్ను ప్రేమిస్తున్నంతకంటె యెక్కువగా స్వేచ్ఛను ప్రేమిస్తున్నాను, లోయ్‌కొ. కానీ, నీవు లేకుండా బతకలేను. నీవూ నేను లేకుండా బతకలేవు. అందుకని నీవు నావానివి కావాలని కోరుతున్నాను, నీ శరీరమూ, నీ ఆత్మా, సర్వమూ. వింటున్నావా?’ అతను వంకర చిరునవ్వు నవ్వినాడు.

" 'వింటున్నాను! నీ వాక్యాలు వింటుంటే హృదయానికి ఉత్సాహం కలుగుతున్నది! యింకా చెప్పు!'

" 'యింకొకటి చెప్పాలి, లోయ్‌కొ: నీవు యెంత గింజుకున్నా సరే, నా యిష్టప్రకారమే నేను నీతో వ్యవహరిస్తాను, నీవు నావాని వౌతావు. కనుక కాలయాపన చేయవద్దు — నా ముద్దులూ, ఆలింగనాలూ నీకోసం కాచుకొని వున్నాయి, నిన్ను తియ్యగా ముద్దు పెట్టుకుంటాను, లోయ్‌కొ! నా ముద్దుల మధ్య నీ సాహస జీవితం మరిచిపోతావు.... జిప్సీ కుర్రవాళ్లను అంత ఆనందపరిచే నీ ఉల్లాసపు పాటలు యీ మైదానంలో యిక వినపడవు — నీవు యితర పాటలు పాడుతావు, నా కొరకు, రాద్దా కొరకు, సుతిమెత్తని ప్రేమ పాటలు పాడుతావు.... కాలయాపన చేయవద్దు యిక — నేను చెప్పేది ముగిసింది, కనుక పెద్దవాళ్లు చెప్పినట్లు నడుచుకునే యువకునిలాగా రేపు నేను చెప్పినట్లు నడుచుకో. జిప్సీ మకాంలోని వాళ్లందరి యెదుటా నీవు నా ముందర మోకాలు వంచి నా కుడి చేయి ముద్దుపెట్టుకో — అప్పుడు నీ భార్యనౌతాను.'

"అదన్న మాట ఆమె కోరేది, మతిచెడిన పిల్ల! కని విని యెరగనిది! అది యెప్పుడో మాంటినెగ్రిన్లలో ఆచారంగా వుండేదని ముసలివాళ్లు చెప్పేవాళ్ళు, కానీ జిప్సీలలో యెప్పుడూ లేదు. చూడు బాబూ, యింతకంటె విడ్డూరమైనది నీవు ఊహించగలవా? యేడాదిపాటు నీ తల బద్దలు చేసుకున్నా ఊహించలేవు!

"లోయ్‌కొ దిమ్మెరపోయినాడు, అతను వేసిన కేక మైదానంలో మార్మోగింది, యెదురు రొమ్మున కత్తి దిగబడిన మనిషి కేకలా. రాద్దా చలించింది, కానీ బయట పడలేదు.

" 'సరే, సెలవు రేపటిదాకా, రేపు నేను చెప్పినట్లు చెయ్. విన్నావా లోయ్‌కొ?'

" 'విన్నాను. నీవు చెప్పినట్లే చేస్తాను,' బరువుగా మూలిగినాడు జొబార్. ఆమెవైపు చేతులు సాచినాడు. ఆమె తలకూడా తిప్పకుండా వెళ్లిపోయింది. తుఫానుకు వేర్లు కదలబారిన చెట్టులా అతను ఊగి నేలకు రాలినాడు, యేడుస్తూ, నవ్వుతూ.

"పాపిష్టి రాద్దా అంత పని చేసింది ఆ కుర్రవానికి. అతన్ని స్పృహలోకి తేవడం నాకు కష్టమైంది.

"ఔరా! మనుషులకు యింత దుర్గతి యెందుకు కలగాల్నో భగవంతునికే తెలియాలి. బాధతో, వేదనతో కుమిలిపోయే మానవ హృదయాన్ని చూడాలని యెవరి కుంటుంది? నీకు చేతనైతే యీ ముడి విప్పు!...

"నేను మకాంకు పోయి జరిగిందంతా పెద్దలకు చెప్పినాను. వాళ్లు ఆలోచించి నిర్ణయానికి వచ్చినారు, యేమి జరుగుతుందో వేచి చూడాలని. మరి జరిగిం దేమిటంటే, యిది. మరుదినం సాయంత్రం మేమందరమూ నెగడు చుట్టూ గుమికూడినప్పుడు లోయ్‌కొ వచ్చి మాతో చేరినాడు. అతని ముఖం ముడుచుకొని వుంది. ఒక రాత్రికే మనిషంతా రూపు

మారి తడిసిన దూడలా అయినాడు. కండ్లు లోతుకు పోయినాయి. దించిన కండ్లు యెత్తకుండా మాతో యిలా అన్నాడు అతను:

" 'సోదరులారా, మీ కొక విషయం చెప్పాలనుకున్నాను. రాత్రి నేను నా హృదయంలోకి చూసుకున్నాను. అందులో యెక్కడా నా పాత బేజవాబుదారీ జీవితానికి తావు కనిపించలేదు. రాద్దా ఒక్కతే అక్కడ విహరిస్తున్నది – అంతే! అక్కడ వుంది ఆమె, అందమైన రాద్దా, రాణీలాగ చిరునవ్వు నవ్వుతూ! ఆమె నాకంటె యెక్కువగా తన స్వేచ్ఛను ప్రేమిస్తున్నది. మరి నేను, నా స్వేచ్ఛ కంటె యెక్కువగా ఆమెను ప్రేమిస్తున్నాను. కనుక, ఆమె ఆజ్ఞప్రకారం నేను ఆమె ముందర నా మోకాలు వంచుతాను – ఆమెను చూసిందాకా నీటి కొంగలతో రాబందు ఆడుకున్నట్లు ఆడ పిల్లలతో ఆడుకున్న వీరుడు లోయ్‌కొ జొబార్‌ను ఆమె అందం జయించిందని మీరందరూ చూడగలరు. తరువాత ఆమె నా భార్య ఔతుంది, నన్ను ముద్దుపెట్టుకుంటుంది, నన్ను లాలిస్తుంది. ఆ తరువాత, మీ కొరకు పాటలు పాడాలని నాకిక యెంత మాత్రమూ కోరిక వుండదు, నా స్వేచ్ఛ పోయినందుకు విచారం వుండదు! సరేనా రాద్దా?' అతను కన్ను లెత్తి ఆమెవైపు తీవ్రంగా చూసినాడు. ఆమె మౌనంగా కఠినంగా తల వూపి, తన పాదాలవైపు చేయి చూపించింది. మేము చూస్తూ వున్నాం, యేమీ అర్థంకాలేదు. పక్కకు పోదా మని కూడా అనిపించింది మాకు, ఒక ఆడపిల్లముందు లోయ్‌కొ జొబార్ సాష్టాంగపడడం చూడలేక, ఆ పిల్ల రాద్దాయే అయిన ప్పటికీ. మాకు యెలా వుందంటే—అవమానమూ, విచారమూ, దుఃఖమూ పెనవేసుకొన్నట్లు వుంది.

" 'కానీ!' రాద్దా బిగ్గరగా అన్నది జొబార్‌తో.

" 'ఆహా, తొందరపడకు, కాలం దండిగా వుంది, నీకు కావలసినంత కంటె యెక్కువగా వుంది....' అతను వడ్డించినాడు, నవ్వుతూ. ఆ నవ్వులో ఉక్కుమోత వినిపించింది.

" 'నేను చెప్పాలనుకున్న దంతా యిదే సోదరులారా! తర్వాత యేమిటి? తర్వాత పరీక్ష చేయవలసి వుంది, నాదగ్గర చూపించినంత గట్టి గుండె రాద్దాకు వుందా అని. పరీక్ష చేస్తాను – మన్నించండి సోదరులారా!'

"యీ మాటల లోతు మాకు అర్థంకాకముందే నేలమీద బోర్లి పడివుంది రాద్దా, ఆమె రొమ్మున పిడిదాకా దిగబడివుంది వంకర బాకు. మేము భయకంపితుల మైనాం.

"రాద్దా బాకు వూడబెరికింది, పక్కకు విసరివేసింది, తన నల్లని కురులు గాయానికి హత్తుకొని చిరునవ్వుతో బిగ్గరగా, స్పష్టంగా అన్నది:

" 'సెలవు లోయ్‌కొ! నాకు తెలుసు నీవిది చేస్తావని!...' అంతే, ఆమె ప్రాణం విడిచింది.

"ఆ పిల్ల యెలాంటిదో గ్రహించినావా, బాబూ? సైతాన్‌లాంటి పిల్ల! అబద్ధమైతే నాకు సకల పాపాలూ చుట్టుకుంటాయి గాక!

"'ఓ! యిప్పుడు నీ పాదాలవద్ద మోకరిల్లుతాను, తీవిగల రాణీ!' అన్న లోయ్‌కో కేక మైదానమంతా ప్రతిధ్వనించింది. అతను నేలమీద పడి, చచ్చిన రాద్దా పాదాలకు తన పెదవులు హత్తి, నిశ్చలంగా పండుకున్నాడు.

"మేము టోపీలు తీసి మౌనంగా నిలబడినాం.

"దీని కేమంటావు బాబూ? ఔను, అంతే అది! నూర్ అన్నాడు: 'మనం యితన్ని కట్టివేయాలి!...' లోయ్‌కో జొబార్‌ను కట్టివేయడానికి యెవరి చెయ్యీ లేవదు, నూర్‌కు తెలుసు యిది. అతను చేయి వూపి, పక్కకు తిరిగినాడు. రాద్దా పక్కకు విసరిన బాకును దనీలో తీసుకొని, చాలాసేపు దానివైపు నిలజూసినాడు, అప్పుడు అతని మీసాలు యెగిరి పడుతూ వుండినాయి. అంత వంకరగా, అంత వాడిగా వున్న ఆ బాకు వాదర రాద్దా రక్తంతో యింకా తడిగా వుంది. తరువాత దనీలో జొబార్ వద్దకు పోయి అతని వీపున, గుండెకు సరిగా, బాకు దించినాడు. అతను రాద్దా తండ్రి గదా, ముసలి సిపాయి దనీలో!

"'భేష్!' అన్నాడు లోయ్‌కో స్పష్టమైన కంఠంతో, దనీలోవైపు తిరిగి. వెంటనే వెళ్లిపోయినాడు రాద్దా అడుగుజాడల్లో.

"మేము చూస్తూ నిలుచున్నాం. రాద్దా అక్కడ పడి వుంది, ఒక పాయ నల్లని కురులు రొమ్ముకు హత్తుకొని, మూతవడని కన్నులు నీలాకాశంలోకి తెరిచూస్తున్నాయి. ఆమె పాదాల వద్ద సాగిపడివున్నాడు వీరుడు లోయ్‌కో జొబార్. అతని ముఖాన్ని జుట్టు కప్పేసింది, ముఖం కనపడకుండా.

"మేము ఆలోచనలో మునిగిపోయి నిలబడి వున్నాం. ముసలి దనీలో మీసాలు వణకుతున్నాయి, దట్టమైన కనుబొమలు ముడివడివున్నాయి. అతను ఆకాశంవైపు గుడ్లు అప్పగించి చూస్తున్నాడు, ఒక్క పలుకు లేకుండా. నూర్, తల నెరిసిన ముసలి నూర్, బోర్లపడి ముఖం నేల కానించి యేడుస్తున్నాడు, వెక్కిళ్లతో అతని ముసలి శరీరం విలవిల లాడుతున్నది.

"యేడవ వలసిన సమయమే కదా అది బాబూ!

"... అయితే నీవు దేశాటనంమీద పోతున్నా వన్న మాట — సరే, నీ యిష్టం వచ్చినట్లు పో, దారి వదలి పక్కకు మళ్లవద్దు. ముక్కుకు సూటిగా పో. బహుశా నీవు భ్రష్టుపట్ట వనుకుంటాను. అంతే బాబూ!"

మకార్ మౌనం వహించినాడు, పైపు తీసి తిత్తిలో పెట్టినాడు, రొమ్ముమీద కోటు కప్పుకున్నాడు. వాన తుంపర పడసాగింది, గాలి యెక్కువౌతున్నది, సముద్రం కోపంతో గర్జిస్తూ, ఘుర్ఘురిస్తూ వుంది. గుర్రాలు ఒకటొకటే ఆరిపోతున్న నెగడువద్దకు వచ్చినాయి, తమ తెలివైన పెద్ద కన్నులతో మమ్మల్ని గమనిస్తూ నిశ్చలంగా నిలిచినాయి, మా చుట్టూ దట్టమైన వలయంగా యేర్పడుతూ.

"హే, హే, హో!" మకార్ దయగా కేకవేసినాడు. తనకు యిష్టమైన నల్ల గుర్రాన్ని మెడమీద తట్టుతూ, నావైపు తిరిగి అన్నాడు: "నిద్రపొద్దు అయింది!" ఆ మాట అని అతను కోటు తలమీదికి లాక్కొని, తన పొడుగాటి శరీర మంతా నేలమీద సాచి, మౌనంగా పండుకున్నాడు.

నాకు నిద్రపోవా లనిపించలేదు. నేను మైదానపు చీకటిలోకి నిలజూస్తున్నాను. నా కన్నులముందు తేలుతూ వుంది ఠీవిగా వున్న రాద్దా రాణివాసపు మనోహరాకారం. రొమ్మున వున్న గాయానికి ఒక పాయ తలవెండ్రుకలు హత్తుకున్నది. ఆమె సుతారపు రాగిరంగు వేళ్ల సందున రక్తం కారుతూ చుక్కచుక్కే నేలమీద పడుతున్నది, చిన్ని జ్వాలారుణ నక్షత్రాలలా.

ఆమె వెనుకనే వీరుడైన జిప్సీ కుర్రవాడు లోయ్‌కొ జొబార్ ఆకారం తేలుతూ పోతున్నది. అతని ముఖాన్ని దట్టమైన నల్లని వెండ్రుకలు కప్పినాయి. ఆ వెండ్రుకల చాటుననుండి చల్లని పెద్ద కన్నీటిబొట్లు ధారగా పడుతున్నాయి....

వర్షం యెక్కువైంది. సముద్రం విషాదగంభీర సంగీతం ఆలపిస్తున్నది అభిమాన సంపన్నులైన జిప్సీ ప్రేమికుల జంటకు — లోయ్‌కొ జొబార్‌కూ, ముసలి సిపాయి దనీలొ కూతురు రాద్దాకూ.

వాళ్లిద్దరూ నిశ్శబ్దంగా ఆడుతున్నారు దట్టమైన చీకటిలో. జంకులేని లోయ్‌కొ యెంత ప్రయత్నించినా ఠీవిగల రాద్దాను అందుకోలేకపోతున్నాడు.

1892

# డేగపాటు

అనంతమైన సముద్రం. తీరరేఖను తీరికగా రాచుకుంటూ, దూరాన నిశ్చలంగా నిద్రిస్తూ, యింద్రనీలపు వెన్నెల కాంతిలో మునిగిపోయి వుంది సముద్రం. మెత్తగా, వెండిలాగా మెరిసిపోయే సముద్రం దిఙ్మండలంవద్ద దక్షిణాకాశపు నీలిమలో లీనమైపోయి గాఢంగా నిద్రిస్తున్నది. ఆకాశంలో తనలాగే నిశ్చలంగా నిలిచి, నక్షత్రాల బంగారు ముగ్గుకు అరచాటు ముసుగు వేస్తున్న పల్చని దూది పింజల మేఘాల వలిపాన్ని ప్రతిబింబిస్తున్నది సముద్రం. విశ్రాంతి యెరగని తరంగాలు అలవోకగా ఒడ్డును తాకుతూ చెప్పే గుసగుసలను వినడానికి ఆకాశం సముద్రంమీదికి వంగినట్లుంది.

గాలికి వంకరపోయిన చెట్లతో ఆచ్ఛాదితమైన పర్వతాలు తమ శిలా విషమ శిఖరాలను పైన ఆకాశపు మరుభూమిలోకి నిటారుగా చాచుకొని వున్నాయి. దక్షిణాది నిశాంధకారపు వెచ్చని ఆలింగనంలో పర్వత శిఖరాల విషమతలాలు తమ కరకుదనం కోల్పోయి సమతల రూపం సమకూర్చుకున్నాయి.

పర్వతాలు గంభీర ధ్యానముద్రలో వున్నాయి. వాటి నల్లని నీడలు తోసుకొని వచ్చే ఆకుపచ్చ తరంగాలను బంధించే వస్త్రాల లాగున్నాయి, సముద్రపు పోటును నిలువరించ దలచుకొన్నట్లు, నిరంతరమైన నీటి గలగలనూ, నురుగు నిట్టూర్పునూ నోరు మూయించ దలచుకొన్నట్లు — ఆ ధ్వనులన్నీ భంగపరుస్తున్నాయి ఆ ప్రకృతిని ముంచేసిన అసంవేద్య నిశ్శబ్దాన్ని; పర్వత శిఖరాల వెనుకనుండి యింకా బయటికి రాని చంద్రుని యింద్రనీలపు తళతళలు కూడా అలాగే ఆ ప్రకృతిని ముంచేసినాయి.

"అల్లా అక్బర్!" నిట్టూర్పు మెత్తగా వెలువడింది వృద్ధ క్రైమియన్ గొర్రెలకాపరి నదీర్ రహీంబగ్లీ నోటినుండి. అతను దక్షిణాది యెండలకు కమలిన శరీరం గల వృద్ధ జ్ఞానసంపన్నుడు, తెల్లని వెంట్రుకలతో, సన్నగా, పొడవుగా.

అతనూ, నేనూ యిసుకలో పండుకొని వున్నాము, ఒక పెద్ద శిలపక్కన. ఆ శిల, నీడల ముసుగు కప్పుకొని, దట్టంగా పాచి పట్టింది. మాతృ పర్వతంనుండి విడిపోయి దిగులుగా, విచారంగా వున్న శిల అది. దానికి ఒక పక్క సముద్రపు మొక్కలూ, నీటి మొక్కలూ అల్లుకున్నాయి, సముద్రానికీ, పర్వతాలకూ మధ్య వున్న చిన్న యిసుక పీకకు

ఆ శిలను కట్టివేస్తున్నట్లు. మరొక పక్కను మా నెగడు జ్వాలలు వెలిగించినాయి. జ్వాలలు కదిలినప్పుడు నీడలు అటూ యిటూ నృత్యం చేస్తున్నాయి, అనేక లోతైన నెర్రెల గాయాలు గల దాని పురాతన శరీరంమీద.

రహీమూ, నేనూ అప్పుడే పట్టుకొన్న చేపలు ఉడకబెట్టుకుంటున్నాము. ప్రతిదాన్నీ విస్పష్టంగా, సజీవంగా, బుద్ధికి అందేటట్లుగా చేసే మనస్థితిలో వున్నాము మేమిద్దరమూ. మా హృదయాలు తేలికగా, అమాయకంగా వున్నాయి. యిక్కడ పండుకొని ధ్యానం చేయడం తప్ప మా కింకే పనీ చేయాలని లేదు.

సముద్ర తీరాన్ని స్పృశించే అలల చప్పుడు యెంత మెత్తగా వుందంటే, అవి మా నెగడువద్ద చలి కాచుకుంటా మని ప్రాధేయపడుతున్నట్లుంది. సముద్రం చేసే సమమైన మర్మరధ్వనిని మించి ఒకోసారి మరింత బిగ్గరగా, మరింత ఉల్లాసమైన ధ్వని వినపడుతుంది: మా పాదాల దాకా ప్రాకి వచ్చిన అల అది, మరీ ధైర్యం గలది.

రహీం సముద్రంవైపు తిరిగి పండుకున్నాడు. అతని మోచేతులు యిసుకలో దిగబడినాయి. చేతులలో తల పెట్టుకొని అతను నీడలు నిండిన దూరంలోకి సాలోచనగా నిలజూస్తున్నాడు. అతని గొర్రెబొచ్చు టోపీ తల వెనుక భాగానికి జారిపోయింది. సూక్ష్మ రేఖలు నిండిన అతని విశాల ఫాలభాగాన్ని సముద్రంమీదనుండి అప్పుడే వచ్చిన మంద పవనం చల్లగా స్పృశిస్తున్నది. అతను తాత్విక ప్రవచనాలు చెప్తున్నాడు, నేను వినేదీ లేనిదీ లక్ష్య పెట్టకుండా, తాను సముద్రానికి చెప్తున్నట్లు.

"భగవంతుని భక్తితో సేవించినవాడు స్వర్గానికి పోతాడు. మరి, భగవంతునిగానీ, ప్రవక్తనుగానీ సేవించనివాడో? బహుశా వాడు అక్కడ వుండవచ్చు — ఆ నురుగులో. వాడేనేమో నీళ్లమీది ఆ తెల్లని మచ్చలు, యేమో, యెవరికి తెలుసు?"

పైకీ, కిందికీ ఊగే నల్లని సముద్రం మరింత కాంతివంతమైంది. దాని ఉపరి తలంమీద వెన్నెల పొడలు అడ్డదిడ్డంగా వెదజల్లబడినాయి. మొరటు పర్వత శిఖరాల వెనుకనుండి చంద్రుడు బయటికి జారుకొని యిప్పుడు పరధ్యానంగా వెన్నెలసోన కురుస్తున్నాడు సముద్రతీరంమీదా, మేము పండుకొన్న చోట పక్కన వున్న శిలమీదా, తన్ను అందుకోడానికి చిట్టి నిట్టూర్పుతో ముందుకు వచ్చిన సముద్రంమీదా.

"రహీం, యేదైనా కథ చెప్పు," అన్నాను నేను వృద్ధునితో.

"యెందుకు?" అన్నాడు అతను, తల తిప్పకుండానే.

"ఓ — నీ కథ లంటే నాకు యిష్టం గనుకనే."

"అన్నీ నీకు చెప్పినవే. నాకు యింకేవీ రావు."

అతన్ని బుజ్జగించడం అవసరం. బుజ్జగించినాను.

"కావాలంటే ఒక పాట చెప్తాను," అని అతను అంగీకరించినాడు.

అతని పాత పాటలు వినడం నాకు ఇష్టం. అతను రాగధాటిలో గొంతు సారించి చెప్ప సాగినాడు, ఆ ప్రాచీన గేయపు లయకు అనుగుణంగా.

# I

"పైన యెత్తైన పర్వతంమీద ఒక పాము సరసర ప్రాకుతూ వచ్చింది. పొగమంచుతో నిండిన కోనలో చుట్టచుట్టుకొని ఆగింది అది, సముద్రంవైపు చూస్తూ.

"పైన ఆకాశంలో వెలుగుతున్నాడు సూర్యుడు. వెచ్చగా, వేడిగా లేస్తున్నది ఆకాశంలోకి పర్వతాల ఊర్పు. కింద పర్వత శిలలమీద బిగ్గరగా బద్దలౌతున్నాయి సముద్ర తరంగాలు.

"కోనగుండా ప్రవహిస్తున్నది సెలయేరు వేగంగా — చీకటినీ, పొగమంచునూ చీల్చుకొంటూ — సముద్రంవైపు పరుగులిడుతూ — అడ్డుపడిన రాళ్లను గలగలా అతలకుతలం చేస్తూ.

"నురుగు కిరీటంతో, తెల్లగా, బలంగా పర్వతాన్ని ఛేదించుకుంటూ అది సముద్రంవైపు దుముకుతున్నది — కోపంతో గర్జిస్తూ.

"ఉట్టిపాటుగా ఊడిపడింది ఆకాశంలోనుంచి ఒక డేగ — రొమ్మున గాయంతో, నెత్తురుమరకల రెక్కలతో — పాము చుట్టచుట్టుకొని పండుకొని వున్న లోయలోకి.

"భూమిమీద పడిన పాటుకు అది కెవ్వున కేక వేసింది — చేతగాని కోపంతో రొమ్ము రాళ్లకు కొట్టుకుంటూ పడుకుంది.

"పాము భయంతో పక్కకు దూసింది — అంతలో గమనించింది పక్షికి కాలం తీరిందని — అది యీ క్షణమో, మరుక్షణమో మరణిస్తుందని.

"వెనక్కి ప్రాకింది పాము, గాయపడిన డేగవద్దకు — దాని ముఖంలోకి అవహేళనగా బుసకొట్టింది:

" 'నీవు చస్తా వన్నమాట?'

" 'ఔను — చస్తా నన్నమాటే,' అన్నది డేగ నిట్టూరుస్తూ. 'ఐనా — ఓ — నేను యెలా బతికినా నని! నేను ఆనందం రుచిచూసినాను, గొప్ప పోరాటాలు చేసినాను! నేను ఆకాశంలో విహరించినాను! పాపం నీవు — యెప్పుడూ ఆకాశాన్ని నాలాగా చూడలేవుగా!'

" 'ఆకాశమా? యేమిటది? ఆఁ — శూన్యం. ఆకాశంలో ప్రాకవచ్చునా నేను? యీ కోన యెంతో మేలు — యింత వెచ్చగా, యింత చిత్తడిగా.'

"అలా అన్నది పాము స్వేచ్ఛాప్రియుడైన డేగతో. డేగ ధీర వచనాలకు అది నవ్వుకుంది తన మనసులో.

"అది తనలో యిలా అనుకుంది: 'యెగిరితే యేముంది, ప్రాకితే యేముంది? అందరూ భూమిలోనే చేరుతారు — అందరూ మట్టిలోనే కలిసిపోతారు.'

"హఠాత్తుగా తల యెగనెత్తింది డేగ — బాధా దృక్కులతో చీకటి కోనను కలయజూసింది.

"కొండ పగ్రెలలోనుండి నీరు వూరుతున్నది. కోనలోని గాలి కుళ్లు వాసన వేస్తున్నది — మృత్యువు వాసన వేస్తున్నది.

"శరీరంలోని శక్తినంతా కూడగట్టుకొని గొంతెత్తి అరిచింది డేగ, దుఃఖంతో, కాంక్షా పరిపీడనతో:

" 'ఓ — ఆకాశంలోకి యెగరగలిగితే — మరొకసారి యెగరగలిగితే!... శత్రువును పట్టుకుంటాను.... వాని తలను నా రొమ్మున అదుముతాను.... నా నెత్తురుతో వానికి వూపిరాడకుండా చేస్తాను.... ఓ — పోరాటం యెంత ఆనందం!'

"పాము అనుకొంది: 'డేగకంఠంలో అంత బాధ ఒలుకుతున్న దంటే, ఆకాశంలో జీవించడం యెంతో హాయిగా వుండాలి!'

"అది స్వేచ్ఛాప్రియుడైన డేగతో అన్నది యిలా: 'కొండకొమ్ము అంచు దాకా ప్రాకుతూ పోయి, కిందికి దూకు. బహుశా నీ రెక్కలు నిన్ను తేల్చవచ్చు — మళ్లీ నీవు ఆకాశంలో విహరించవచ్చు.'

"ఒళ్లు జలదరించింది డేగకు. సగర్వంగా కూతవేసి అది కొండకొమ్ముమీద ప్రాకుతూ పోయింది, పాచిమీద పట్టు సంపాయించుకుంటూ.

"అంచుకు చేరి అది పూర్తిగా రెక్కలు సాచింది — రొమ్మునిండా వూపిరి తీసుకొని — మెరుపు చూపుతో, కిందికి దూకింది.

"వేగంగా — రాయిలాగ పడిపోయింది డేగ. పతనవేగానికి యీకలు రాలి పడినాయి — రెక్కలు కోసుకపోయినాయి.

"ఒక అల చేతు లెత్తి పట్టుకొంది డేగను — దాని నెత్తురు కడిగింది — నురుగు పొత్తిళ్లలో చుట్టింది — సముద్రగర్భంలోకి మోసుకపోయింది.

"కొండ దరికి కొట్టుకొని ముక్కలయ్యే అలల కంఠంలో విషాదం పలికింది. పోయింది పక్షి కంటికి కనపడకుండా — అపార విస్తార సముద్రంలో అదృశ్యమై."

## II

"చాలాసేపు చుట్టచుట్టుకొని కోనలో అలాగే వుంది పాము — పక్షి మరణాన్ని గురించి యోచిస్తూ — దాని ఆకాశ ప్రియత్వాన్ని గురించి యోచిస్తూ.

"పైకి చూసింది పాము — అసంతృప్త హృదయాలకు ఆనందం కనిపించే ఆకాశంలోకి.

" 'యేమి కనపడింది దానికి, ఆ దురదృష్టపు డేగకు, యీ శూన్యంలో — యీ అంతులేని ఖాళీ స్థలంలో? యిలాంటివాళ్లు తమ ఆకాశ విహార కాంక్షతో యితరుల మనశ్శాంతికి యెందుకు భంగం కలిగించాలి? ఆకాశంలో తెలియ వచ్చే దేమిటి? యిదంతా నేను ఒక్క యెగురులో తెలుసుకోగలను — అది యెంత చిన్న యెగురైనా సరే.'

"యిలా అనుకొని అది, యింకా గట్టిగా చుట్టచుట్టుకొని యెగిరి దూకింది — నల్లని చారలాగా యెండలో మెరిసింది.

"ప్రాకే జీవులు యెన్నడూ ఆడలేవు ఆకాశంలో. పాము అది మరచిపోయింది, రాళ్లమీద పడింది. కానీ — ఆ పాటుకు అది చావలేదు. నవ్వి యిలా అన్నది అది:

" 'యిదన్న మాట ఆడడంలోని ఆనందం: కింద పడడంలోని ఆనందం! తెలివిలేని పక్షులు! యీ భూమి వాటికి తెలియదు — యిక్కడ సుఖపడలేక ఆకాశమెక్కి, ఆ ప్రకంపమాన విశాలావధుల్లో జీవించాలంటాయి. ఆకాశమంటే శూన్యం కాక మరేమిటి? వెలుగు పుష్కలంగా వుంటుంది. కానీ శరీరానికి ఆధారం యేదీ లేదు. మరి యెందుకింత గర్వం? యెందుకింత యేవగింపు? తమ ఉన్మాదపు కాంక్షలనూ, జీవిత వ్యవహారంతో సరితూగలేని తమ అశక్తతనూ లోకానికి తెలియకుండా మూసిపెట్టుకోడానికా? అపహాస్యకరమైన పక్షులు! మీ మాటలు యిక యెప్పుడూ నన్ను మోసగించలేవు. నా కిప్పుడు అంతా తెలుసు — ఆకాశం చూసినాను. ఆకాశంలోకి పోయి పరిశోధన చేసినాను. అక్కడనుండి కింద పడినాను — ఆ పాటుకు చావలేదు గానీ. నా ఆత్మవిశ్వాసం యిప్పుడు మరీ బలపడింది. యీ భూమిని ప్రేమించలేని వాళ్ల భ్రమలతో జీవించనీ. నేను సత్యం తెలుసుకున్నాను. పక్షుల సవాలును యిక యెప్పుడూ లక్ష్య పెట్టను. భూమిలో పుట్టిన నేను భూజీవిని.'

"అలా అంటూ పాము ఒక రాయిమీద చుట్టచుట్టుకొంది — ఒళ్లంతా గర్వంతో.

"సముద్రం తళతళ మెరుస్తున్నది — కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతితో. తరంగాలు భీకరంగా ఒడ్డును కొడుతున్నాయి.

"వాటి సింహగర్జనలో ప్రమోగింది డేగపాట. వణికినాయి శిలలు సముద్రపు దెబ్బలకు. వణికింది ఆకాశం పాట స్వరాలకు:

"సాహసపు ఉన్మాదాన్ని మేము గానంచేస్తాము!

"సాహసపు ఉన్మాదమే జీవితపు విజ్ఞత! ఓ వెరపెరుగని డేగ! శత్రువుతో పోరాటంలో నీవు కార్చినావు నీ రక్త మంతా. కానీ నీ రక్త బిందువులు జీవితాంధకారంలో మిణుగురుల్లాగా వెలిగి, ధీర హృదయాలను స్వేచ్ఛా ప్రియత్వంతోనూ, కాంతితోనూ వెలిగించే కాలం వస్తుంది.

"నీవు మరణించినావు, నిజమే! కానీ ధీరుల పాటల్లో నీవు జీవిస్తూనే వుంటావు — స్వేచ్ఛ కొరకూ, కాంతి కొరకూ పోరాటం చేయమని సగర్వంగా సవాలుచేస్తూ!

"సాహసపు ఉన్మాదాన్ని మేము గానంచేస్తాము!"

... నిశ్శబ్దంగా వుంది యింద్రనీల ఫలకంలాంటి సముద్రం. మంద్రంగా ఆలాపన చేస్తున్నాయి ఒడ్డును ఒరసుకునే తరంగాలు. నేను కూడా మౌనంగా వున్నాను — దూరంలోకి నిలజూస్తూ. నీళ్లమీద యిప్పుడు వెన్నెల వెండి పొడలు యింకా యెక్కువైనాయి.... మా కెటిల్ మెల్లగా మూలుగుతున్నది.

ఒక అల తన సోదర తరంగాలను దాటివచ్చి, రహీం తలను తాకడానికి ముందు కెగురుతూ, పరిహాసంగా చిన్న కేక వేసింది.

"పో వెనక్కి! యెక్కడ పోదామనుకుంటున్నావు?" అరిచినాడు రహీం, చేయి వూపుతూ. బుద్ధిగా వెనక్కి మళ్లింది అల.

అలను రహీం సచేతనంగా చూడడంలో నాకు వినోదంగానీ, విడ్డూరంగానీ కనిపించ లేదు. మా చుట్టూ వున్న ప్రతిదీ అసాధారణమైనంత సజీవంగా, మృదువుగా, మనశ్శాంతి కలిగించేదిగా వుంది. సముద్రం ప్రశాంతంగా వుంది. పగటి వేడిమిని యింకా కోల్పోని పర్వత శిఖరాలవైపు సముద్రం ఊదే చల్లని నిశ్వాసాలలో శక్తి అనుభూతవౌతున్నది. ఆకాశపు నీలి యవనికమీద నక్షత్రాలు సువర్ణాక్షరాలతో యేదో గంభీరమైన సందేశం లిఖించినాయి — ఆత్మను సమ్మోహితం చేస్తూ — విశ్వరహస్యం తెలియబోతున్న దనే మధురమైన నిరీక్షణతో మనస్సును సంచలింపజేస్తూ.

సమస్తమూ మత్తుగా వుంది — నిద్రతో కాదు, వ్యగ్రమైన స్పృహతో — మరుక్షణంలో సకల వస్తువులూ తమ నిద్రను పారదోలి, గొంతు లెత్తి వర్ణనాతీతమైన మహా మధుర బృందగానం పాడుతాయేమో అన్నట్లు. యీ సంగీతం జీవిత రహస్యాలను గురించి చెపుతుంది, వాటిని మనస్సుకు వివరిస్తుంది, ఆ తరువాత దీపకళికను ఆర్పివేసినట్లు మనస్సును ఆర్పివేసి ఆత్మను నిశీధి నీలి అవధులలోకి యెత్తుకపోతుంది — అక్కడ నక్షత్రాల సుతారపు ముగ్గు అదే విశ్వరహస్యపు దివ్య సంగీతం పాడుతుంది....

1895

# చెల్కాష్*

దక్షిణాది నీలాకాశం ధూళితో కప్పబడి మసకగా కనపడుతున్నది. పల్చని బూడిదరంగు తెరవెనుకనుండి చూసినట్లు వేడి సూర్యుడు పచ్చదాటు సముద్రంవైపు కిందికి చూస్తున్నాడు. సూర్య కిరణాలు నీళ్లలో ఇంచుమించు ప్రతిఫలించడమే లేదు — తెడ్ల దెబ్బలతోనూ, స్టీమర్ల ప్రొపెల్లర్లతోనూ, టర్కిష్ ఫెలుకాల వాడి ముందు భాగాలతోనూ, సంకీర్ణమైన రేవులో దిక్కుదిక్కులా నీళ్లను చీల్చుకుంటూ పోయే యితర నౌకలతోనూ నీరు అల్లకల్లోలంగా వుంది. సముద్ర తరంగాలు, తమ వీపులమీద జారే అపారమైన బరువులకింద రేవు రాతి గోడల మధ్య అణగిపోయి, ఒడ్డుమీదా, ఓడల పార్శ్వాలమీదా యెగిరి దుముకుతున్నాయి — ఫీంకరిస్తూ, నురుగు కక్కుతూ యెగిరి దుముకుతున్నాయి, రకరకాల చెత్తా చెదారమూ రెండు పక్కలా నింపుకొని.

లంగరు గొలుసుల గలగల ధ్వనీ, గూడ్సు వాగెన్ల బఫర్లు ఢీకొన్న చప్పుడూ, చప్టా రాళ్లమీద దిగవేసే యినప రేకుల ఖంగుఖంగు మూలుగూ, కలప మొద్దుమీద మొద్దుపడే దబదబ నాదమూ, బండ్ల లొడలొడ రొదా, రోదనతో మొదలై గావుకేకగా మారే స్టీమర్ల కూతలూ, కళాసులూ, సరంగులూ, కస్టమ్స్ భటులూ వేసే కేకలూ — అన్నీ కలిసి రేవుమీది ఆకాశంలో ధిక్కారంగా ఉబుకుతూ, చెవులు దిమ్మెక్కించే పనిదినపు సంగీతమైనాయి. దానికి యెదురుకోలుగా యిటు కింద భూమినుండి కొత్త శబ్ద తరంగాలు పైకి లేస్తూనే వున్నాయి — ఒకో సారి భూమిని దద్దరిల్లజేసే ఉరుములాంటి ధ్వనీ, ఒకో సారి ఉమ్మలపు గాలిని చీల్చుకొని వచ్చే ఢాంకారమూ.

నల్లరాయీ, ఉక్కూ, కలపా, చప్టా రాళ్లూ, ఓడలూ, మనుషులూ — అన్నిటినీ ఆవరించినాయి పారవశ్యంతో పాడే యీ మెర్క్యూరీ** కీర్తిగానపు ఉత్తాల ధ్వనులు. యీ

---

*చెల్కాష్‌కు మూలమైన ఒదేస్స దేశద్రిమ్మరిని నికొలాయెవ్ నగరంలోని ఒక ఆస్పత్రిలో గోర్కీ కలుసుకున్నాడు. అదే వార్డులో రోగిగా వుండిన ఆ ద్రిమ్మరి గోర్కీకి చెప్పింది యీ "చెల్కాష్" కథలోని ఘటన. — సం.

** మెర్క్యూరీ — రోమన్ పురాణాలలో వాణిజ్య దేవుడు. — సం.

సార్వత్రిక బృందగానంలో మానవ కంఠాలను గుర్తుపట్టడం అసాధ్యం; అవి అంత దుర్బలంగా వున్నాయి, అంత అపహాస్యకరంగా కూడా వున్నాయి. యిక ఆ మనుషులు — యెవరి కృషివల్ల యీ శబ్ద మంతా ఉత్పన్నమైందో ఆ మనుషులు — అపహాస్యకరంగా, దయనీయంగా వున్నారు. ఆ దుమ్ములో, ఆ వేడిలో, ఆ రొదలో అటూ యిటూ ఉరుకుతున్న ఆ మనుషుల చింపిరిపాతల మడ్డి దేహాలు వీపులమీది బరువులతో నేలకు వంగినాయి. ఆ ఉక్కు భూతాలతో, ఆ సరుకుల కొండలతో, ఆ గలగలల రైలుపెట్టెలతో, ఆ మనుషులే సృష్టించిన ఆ వస్తువు లన్నిటితో పోలిస్తే వాళ్లు తృణప్రాయులు. వాళ్లే సృష్టించిన ఆ వస్తువులు వాళ్లను బానిసలను చేసినాయి, వాళ్ల వ్యక్తిత్వాన్ని దోచుకున్నాయి.

ఇంజన్లు ఆడుతూ నిలబడి వున్న బ్రహ్మాండమైన స్టీమర్లు కూతవేస్తూ, బుస కొట్టుతూ, పెద్ద నిట్టూర్పులు నిట్టూరుస్తూ వున్నాయి. అవి వెలిగక్కే ప్రతి శబ్దంలోనూ అవహేళనతో కూడిన యేవగింపు వుంది; తమ దాస్య శ్రమతో తయారుచేసిన సరుకులను ఈ ఓడల కడుపులో నింపడానికి వాటి డెక్కులమీద ప్రాకుతూ పోతున్న ఆ దుమ్ము నిండిన క్షుద్రజీవుల పట్ల ఆ యేవగింపు. తమ కడుపులకు నాలుగు రొట్టె ముక్కలు సంపాయించు కోడానికి గాను, వేల బస్తాల ధాన్యాన్ని తమ వీపులమీద మోసుకొని పోయి ఓడల యినప కడుపుల్లో వుంచుతున్న యీ కూలీల దీర్ఘ శ్రేణులను చూస్తే కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వు వస్తుంది. వేడితో, రొదతో, ప్రాణం కడబెట్టించే శ్రమతో దిమ్మరపోయిన యీ చింపిరి బట్టల, చెమట కారే మనుషులకూ, యీ మనుషులచేతనే సృష్టింపబడి యెండలో తళతళ లక్ష్మీకళ చిందుతూ నిలబడి వున్న యీ శక్తివంతమైన యంత్రాలకూ మధ్య వున్న భేదం గమనిస్తే, ఆ భేదంలో ఒక హృదయ నిర్భేదక వ్యంగ్య కావ్యం ధ్వనిస్తుంది; యెన్ని చెప్పినా, చివరకు, యీ యంత్రాలు నడిచేది ఆవిరితో కాదు, వాటిని తయారుచేసిన మానవుల రక్త మాంసాలతో.

రొద వేసరిక కలిగిస్తున్నది; ధూళి కండ్లలో దూరుతున్నది, ముక్కులలో నస కలిగిస్తున్నది; వేడి శరీరాన్ని మాడ్చేసి ప్రాణం తోడేస్తున్నది; ప్రతిదీ వ్యగ్రంగా వున్నట్లు కనపడుతున్నది, ఓర్పు తుదముట్టి యేదో ఉత్పాతం సంభవించబోతున్నట్లు — మనుషులు స్వేచ్ఛగా, సుఖంగా ఊపిరి పీల్చుకునేటట్లు గాలిని శుభ్రంచేసే ఒక ప్రచండమైన ప్రేలుడు సంభవించబోతున్నట్లు. ఆ తర్వాత ప్రపంచంమీదికి ప్రశాంతి దిగివస్తుంది; చెవులు దిమ్మెక్కించి, మనుషులను రొష్టుపెట్టి మతి పోగొట్టే ధూళీ, అలజడీ యిక యెంత మాత్రమూ వుండవు; పట్టణంలో, సముద్రంలో, ఆకాశంలో గాలి శుభ్రంగా, స్వచ్ఛంగా, అందంగా వుంటుంది....

గంట పన్రెండు సార్లు సమంగా మ్రోగింది. యిత్తడి ఘంటా నాదపు చివరి తరంగాలు మాసిపోయిన తర్వాత శరీర కష్టపు ఆటవిక సంగీతం అణగిపోయి వుంది. మరొక నిముషంలో అది వట్టి అసంతృప్తి సణుగుడుగా మారింది. యిప్పుడు మానవ కంఠాలూ, సముద్రపు మర్మర ధ్వనీ మరింత స్పష్టంగా వినపడుతున్నాయి.

# I

రేవు కూలీలు పని నిలిపి, బిగ్గరగా మాట్లాడుకుంటూ గుంపులు గుంపులుగా చెదరిపోయినారు, తిండి పదార్థాలు అమ్మేవాళ్లవద్ద యేదైనా కొని పేవుమెంటుమీద నీడగల మూలల కూర్చొని భోజనం చేయడానికి. అప్పుడు ప్రత్యక్షమైనాడు గ్రీష్కా చెల్కాష్. రేవు కూలీల కందరికీ అతను బాగా తెలుసు. ఆరితేరిన తాగుబోతు అతను, ధైర్యమూ, తెలివీ గల దొంగ. అతను వుత్త కాళ్లతో, వుత్త తలతో వున్నాడు, పాత డ్రిల్లు షరాయీ మడ్డి వోడే నూలు చొక్కా వేసుకున్నాడు; చొక్కా కాలరు చినిగిపోయి యెముకల రొమ్మూ, గోధుమరంగు చర్మమూ కనపడుతున్నాయి. అతని యినుమురంగు వెంట్రుకలు చిందర వందరగా వుండడమూ, గద్ద ముఖం నలిగిపోయి వుండడమూ అతను యిప్పుడే నిద్రలేచినాడని తెలుపుతున్నాయి. ఒక యెండు గడ్డి ముక్క అతని మీసాలలో యిరుక్కుంది, మరొకటి యెడమ చెంపన మాసిన గడ్డంలో యిరుక్కుంది. చెవి సందున నిమ్మ ఆకు చెక్కుకున్నాడు. జెండా కట్టెలాగ పొడవుగా వుండి, కాస్త వంచుకపోయిన ఆ మనిషి చప్టా వీధివెంట మెల్లగా తీరికగా అడుగులు వేసుకుంటూ వచ్చినాడు, తన వంకర ముక్కు ఆ వైపుకూ, యీ వైపుకూ తిప్పుతూ, రేవు కూలీల మధ్య యెవరి కోసమో మిలమిల మెరిసే కన్నులతో వెదకుతూ. అతని పొడుగాటి నల్లని మీసాలు పిల్లి మీసాలలాగ చలిస్తున్నాయి. వీపు వెనుక చేతులు పెట్టుకొని రుద్దుకుంటూ, నేర్పుగల వంకర వేళ్లను నలుపుకుంటూ వున్నాడు అతను. ఆకాశంలో ఆడే గద్దలాగే, ప్రశాంత బాహ్యాకారం చాటున ఒళ్లంతా కండ్లుగల వ్యగ్రమైన జాగ్రత్తను మూసిపెట్టే క్రూరజంతుసహజమైన సన్నని సలాకలాంటి దేహమూ, ఒక లక్ష్యంతో నడిచే నడకా అతనికి గద్దతో గల పోలికను వ్యక్తం చేస్తున్నాయి; అందువలన వందల కొలది మొరటు మానవులున్న యిక్కడ కూడా అతను వెంటనే దృష్టి నాకర్షిస్తున్నాడు.

ఒక బొగ్గు గంపల గుట్ట నీడన కూర్చొని వున్న ఒక కూలీల గుంపువద్దకు అతను రాగానే మచ్చలు గల పాలిపోయిన ముఖమూ, యింతకు ముందుగానే జరిగిన కొట్లాటను సూచించే మెడమీది రక్కులూ గల ఒక దిట్టమైన పొట్టి యువకుడు లేచి అతన్ని సమీపించినాడు. అతను చెల్కాష్ పక్కన్నే నడుస్తూ, అతి మెల్లగా అన్నాడు:

“రెండు బేళ్ల బట్టలు పోయినాయని గడంగు కాపలాదార్లు కనుక్కున్నారు.... వాళ్ళు వెదకుతున్నారు.”

“అయితే యేం?” అన్నాడు చెల్కాష్, ప్రశాంతంగా పొట్టివాణ్ని యెగాదిగా చూస్తూ.

“‘అయితే యే’ మంటే యే మర్థం? వెదకుతున్నారని చెప్పలేదూ?”

“వాళ్లతో కలిసి నన్నూ వెదకమం టారా?”

చెల్కాష్ చిరునవ్వు నవ్వి, గడంగువైపు ఒక చూపు విసరినాడు.

“యేట్లో పడి చావు!”

పొట్టివాడు వెనుదిరిగినాడు.

“వుండు! మెడమీద ఆ అందాలగుర్తులు యెవ రిచ్చినారు? నీ దుకాణం తలవాకిట అలా గలీజు కావడం అన్యాయం.... మిష్కను చూసినావా?”

“చాలా కాలమైంది,” అని పొట్టివాడు అరిచినాడు, తన మిత్రులతో చేరుతూ.

చెల్కాష్‌ను కలిసిన ప్రతివాడూ అతన్ని పాత పరిచయస్తునిలాగ పలకరించినారు. కానీ, మామూలుగా యెంతో ఉత్సాహంగా, వేళాకోళా లాడుతూ వుండే అతను యీ దినం చిరాకుగా వుండాలి, అతని జవాబులు కటువుగా, ముక్తసరిగా వున్నాయి.

ఒక సరుకుల గుట్ట వెనుకనుండి హఠాత్తుగా ఒక కస్టమ్స్ భటుడు ప్రత్యక్షమైనాడు — ముదురు పచ్చ దుస్తులతో, దుమ్ముతో నిండి, భీకరమైనంత నిటారుగా వున్నవాడు. అతను చెల్కాష్ కెదురుగా సవాల్ చేసే ధోరణిలో అడ్డం నిలబడినాడు, యెడమ చెయ్యి కత్తి పిడిమీద పెట్టుకొని, కుడిది చెల్కాష్ కాలర్ కోసం చాచుతూ.

“ఆగు! యెక్కడ నీ ప్రయాణం?”

చెల్కాష్ ఒక అడుగు వెనక్కి వేసి, భటుని యెర్రని ముఖంవైపు కండ్లెత్తి, ప్రశాంతంగా చిరునవ్వు నవ్వినాడు.

ఆ ముఖం, జిత్తులమారిదే కానీ మంచి స్వభావం కలది, భయంకరమైన భంగిమ ధరించడానికి ప్రయత్నం చేసింది: బుగ్గలు తెగ వుబ్బి వూదారంగు తాల్చినాయి, కనుబొమలు ముడివడినాయి, కండ్లు చక్రాల్లాగా తిరుగుతున్నాయి, అన్నీ కలిసి ఫలితం మహా తమాషాగా తయారైంది.

“నీ కొకసారి చెప్పినాను, యీ రేవుకు దూరంగా వుండకపోతే నీ బరియెముకలు విరగ్గొడతా నని. మళ్లీ యిక్కడ ప్రత్యక్షమైనావు!” అని అతను గర్జించినాడు.

“బాగున్నావా, సెమ్యోనొవిచ్! చాలా కాలమైంది నిన్ను చూడక,” అన్నాడు కొండలు మీదపడినా చలించని చెల్కాష్, అతనివైపు చేయి చాచుతూ.

“యీ జన్మంతా నిన్ను చూడకపోయినా నాకు యేడుపు రాదు. వెళ్ళు, వెళ్ళు.” కానీ చాచిన చేయి అందుకొని కరచాలనం చేసినాడు.

"నిన్ను అడగా లనుకున్న దేమిటంటే," చెప్పుకుపోయినాడు చెల్కాష్, తన నేర్పుగల వ్రేళ్లతో భటుని చేయి పట్టుకొని ఆప్యాయంగా వూపుతూ. "మీష్క యెక్కడైనా కనిపించినాడా?"

"యే మీష్క? మీష్క యెవరూ నాకు తెలియదు. వెళ్లవోయ్, లేకపోతే గడంగు కాపలాదారుడు నిన్ను చూస్తే, ఆ తరువాత —"

"పోయిన సారి 'క్రొస్త్రామా' పడవలో నాతో కలిసి పనిచేసినాడే ఆ యెర్ర బొచ్చువాడు," పట్టుదల వదలకుండా అన్నాడు చెల్కాష్.

"కలిసి దొంగతనం చేసినవాడను. అతన్ని ఆస్పత్రిలో పెట్టినారు, నీ మీష్కను — యేదో యినపదానికింద పడి కాలు పచ్చడైంది. వెళ్లు యిక్కడనుండి, చెప్తున్నాను, వెళ్ల కపోతే నీ మెడతోలు పట్టుకొని యెత్తి పారేస్తాను."

"చూడు చూడు! మీష్క యెవరూ తెలియదన్నావు? బాగా తెలుసు అన్నమాట! యీ రోజు యింత అధ్వాన్నంగా యెందుకు తయారైనావు సెమ్యోనొవిచ్?"

"మాటలు కట్టిపెట్టు! దాటు బయటికి!"

భటునికి కోపం వస్తూ వుంది. అతను పక్కచూపులు చూసి, చేయి వదలించుకోడానికి ప్రయత్నించినాడు. కానీ చెల్కాష్ అతని చేయి వదలకుండా, తన దట్టమైన కనుబొమలకిందనుండి అతనివైపు ప్రశాంతంగా చూస్తూ మాటలు సాగించినాడు:

"యేం తొందర? నాతో కాస్త కులాసాగా మాట్లాడాలని లేదూ నీకు? క్షేమంగా వున్నావా? మీ ఆవిడా, పిల్లలూ యెలా వున్నారు? బాగున్నారా?" అతని కండ్లు మిలమిల లాడినాయి, పళ్లు మెరిసినాయి, వెటకారపు నవ్వుతో యిలా అనేటప్పుడు: "యెన్నాళ్లనుండో అనుకుంటున్నాను, మీ యింటి కొకసారి రావాలని. కానీ వీలు పడడం లేదు. తాగుడువల్ల—"

"చాలించు, చెప్తున్నాను! నీ హాస్యాలు కట్టిపెట్టు, జెండాకట్టె వెధవా. వెళ్ల మన్నానంటే వెళ్లమనే అర్థం. మరి నీవు కన్నాలు వేస్తున్నావేమో, లేక వీధిలో మనుషులను దోచుకుంటున్నావేమో?"

"యే మవసర మొచ్చింది? ఒక జన్మంతా నీకూ, నాకూ చేతినిండా పని వుంది యిక్కడ. నిజంగా సెమ్యోనొవిచ్. మరి నీవు మళ్లీ రెండు బేళ్ల బట్టలు కొట్టేసినావని అంటున్నారు. జాగ్రత్త, యెప్పుడో ఒకసారి యిరుక్కుంటావు!"

సెమ్యోనొవిచ్ ఆగ్రహంతో వణికిపోయినాడు. అతను మాట్లాడబోతే నోటివెంట తుంపర పడింది. చెల్కాష్ అతని చేయి వదలిపెట్టి ప్రశాంతంగా తన పొడుగాటి కాళ్లతో రేవు గేట్లవైపు అంగలు వేసుకుంటూ పోయినాడు. భటుడు అతని మడమలు తొక్కుతూ అనుసరించినాడు, నోరార తిడుతూ.

చెల్కాష్ యిప్పుడు హుషారుగా వున్నాడు. పండ్ల సందున ఈల వేసుకుంటూ,

చేతులు జేబుల్లో పెట్టుకొని అతను అడుగుల వేగం తగ్గించినాడు, చమత్కార బాణాలు కుడి యెడమలకు గురిగా వదలుతూ పోతున్నాడు. అలాంటి బాణాలే అతనికి యెదురు వచ్చినాయి.

"అధికార్లు నిన్ను యెంత జాగ్రత్తగా చూసుకుంటున్నారో చూడు గ్రీష్కా!" అన్నాడు భోజనానంతరం విశ్రాంతి తీసుకుంటున్న మిత్రులతో కలిసి నేలమీద ఒళ్లు వాల్చిన ఒక రేవు కూలీ.

"నాకు వుత్త కాళ్లలో యెక్కడా చీలలు దిగబడకుండా చూస్తున్నాడు సెమ్యోనొవిచ్," అన్నాడు చెల్కాష్.

వాళ్లిద్దరూ గేట్ల వద్దకు చేరినారు. యిద్దరు సిపాయిలు చెల్కాష్ దుస్తులు తడిమి చూసి, అతన్ని వీధిలోకి తోసినారు.

అతను రోడ్డు దాటి, ఒక హోటలు కెదురుగా వున్న దిమ్మెమీద కూర్చున్నాడు. ఒక వరుస సరుకుల బండ్లు బడబడ మ్రోగుతూ రేవు గేట్లగుండా బయటికి వచ్చినాయి. మరొక వరుస ఖాళీ బండ్లు లోపలికి పోయినాయి, బండ్లతోలే మనుషులను కిందికీ పైకీ యెగరేస్తూ. రేవు గర్జా ధ్వనులనూ, ఒళ్లుకు అంటుకపోతున్న ధూళినీ త్రేన్చింది.

యీ తలతిక్క రణగొణ ధ్వనిలో చెల్కాష్‌కు స్వస్థత చిక్కింది. ఆ రాత్రికి బాగా తన పంట పండుతుందని అతను యెదురుచూస్తున్నాడు — శ్రమలేని పంట, కానీ దానికి యెంతో నేర్పు అవసరం. తన కున్న నేర్పు చాల దనే అనుమానం లేదు అతనికి. మరుదినం ప్రొద్దున తన బాంకి నోట్లన్నీ యెలా ఖర్చుపెట్ట బోయేదీ ఊహించుకుంటూ అతను ఆనందంతో గుడ్లు తేలవేసినాడు.... తన సహచరుడు మీష్కా జ్ఞాపకం వచ్చినాడు. అతనితో యీ రాత్రి మహ చెడ్డ అవసరం యేర్పడింది. సరిగ్గా యిప్పుడే అతను పోయి కాలు విరగ్గొట్టుకొని కూర్చున్నాడు. చెల్కాష్ లోలోపలనే తిట్టుకున్నాడు, తాను ఒక్కడూ పని నెరవేర్చలేనెమో నని భయం తగిలి. వాతావరణం యెలా వుంటుందో? అతను తల యెత్తి ఆకాశంవైపు చూసినాడు, తలదించి వీధివెంట చూసినాడు.

అయిదా రడుగుల దూరంలో పేవుమెంటుమీద ఒక వయసు కుఱ్ఱవాడు కూర్చొని వున్నాడు, బండ్లు కట్టివేసే ఒక స్తంభానికి వీపు ఆనించి; అతను నీలి ముతక చొక్కా, షరాయీ వేసుకున్నాడు, కాళ్లకు తాట చెప్పులూ, తలమీద చినిగిపోయిన గోధుమరంగు టోపీ వున్నాయి. అతని పక్కన ఒక చిన్న మూటా, గడ్డిలో చుట్టి చక్కగా దారంతో కట్టిన ఒక పిడిలేని కొడవలీ వున్నాయి. కుఱ్ఱవాడు భద్రంగా వున్నాడు, విశాలమైన భుజాలతో, లేత గోధుమరంగు జుట్టుతో; గాలికీ యెండకూ ముఖం కప్పవేసుకపోయింది; అతని పెద్ద నీలి కన్నులు చెల్కాష్‌వైపు మిత్రభావంతో నిలజూస్తున్నాయి.

చెల్కాష్ పళ్ళు తెరిచి, నాలుక బయటకు వెళ్లబెట్టి, జడిపించే ముఖ భంగిమతో, గుడ్లు మిటకరించి అతనివైపు చూపులు నిలిపినాడు.

కుఱ్ఱవాడు మొదట అచ్చెరువుతో రెప్ప లార్చినాడు; తరువాత పగలబడి నవ్వుతూ, నవ్వుల మధ్య "పిచ్చి చేష్టలు!" అని కేకలు వేసినాడు. లేవకుండానే అతను చెల్కాష్ కూర్చున్నచోటికి జరుగుతూ వచ్చినాడు, మూట దుమ్ములో యీడ్చుకుంటూ, కొడవలి కొనతో చప్టా రాళ్లమీద ఖంగు ఖంగు చప్పుడు చేస్తూ.

"చుక్క వేసుకున్నావు కదూ?" అన్నాడు అతను చెల్కాష్‌తో, అతని షరాయి పట్టి లాగుతూ.

"ఔను, పసిముఖమా, నీవు చెప్పేది నిజం," చెల్కాష్ ఒప్పుకున్నాడు చిరునవ్వుతో. పసిపిల్లలలాంటి స్వచ్ఛమైన కన్నులతో, మచ్చలేని సౌజన్యం గల యీ కుఱ్ఱవానిచేత చెల్కాష్ హృదయం ఆకర్షింపబడింది. "గడ్డి కోస్తున్నావా?"

"ఔను. కోసినాను గానీ డబ్బు లేదు. రోజులు బాగా లేవు. యింతమంది జనం యెప్పుడూ లేరు! కరువు జిల్లాలనుండి అటు తిరిగి యిటు తిరిగి అందరూ యిక్కడ చేరుతున్నారు. యీ కూలికి పనిచేయడం దండగ. కుబాన్ ప్రాంతంలో అరవై కొపెక్కులు — యేమైనా అర్థ ముందా! మునుపు మూడు నాలుగు రూబుళ్లు యిచ్చేవాళ్లట, అయిదు రూబుళ్లు కూడా."

"మునుపు! మునుపు మూడు రూబుళ్లు యిచ్చేవాళ్లు వూరక రష్యావాని ముఖం చూడడానికి! పదేండ్ల నాడు నేను ఆ సంపాదనతోనే బతికినాను. ఒక కోస్సక్ గ్రామానికి పోయి, 'యిటు చూడండి బాబుల్లారా, నేను నూటికి నూరు పాళ్లూ రష్యావాణ్ని,' అనేవాణ్ని. వాళ్లు నాచుట్టూ మూగి, నన్ను యెగాదిగా చూసి, నన్ను చేతులతో గుచ్చి, వేళ్లతో గిచ్చి, ఓహ్, ఆహ్ అని, మూడు రూబుళ్లు యిచ్చేవాళ్లు. పైగా తిననూ, తాగనూ యిచ్చేవాళ్లు, నా యిష్టం వచ్చినన్నాళ్లు వుండమనేవాళ్లు."

మొదట కుఱ్ఱవాడు పెద్దగా నోరు తెరచినాడు, తన గుండ్రని ముఖంమీద ఆశ్చర్యపు మెచ్చుకోలు ముద్రతో. కానీ చెల్కాష్ కల్పన చేస్తున్నాడని గ్రహించిన వెంటనే అతను ఠకీమని నోరు మూసుకొని, మళ్లీ పగలబడి నవ్వినాడు. చెల్కాష్ ముఖం గంభీరంగా పెట్టుకున్నాడు, చిరునవ్వును మీసాలలో దాచుకుంటూ.

"చిత్రమైన మనిషివి, పచ్చి నిజంలాగ నీవు చెపుతూ వుంటే, నేను నోరు తెరచి వింటున్నాను. కానీ దేవుని తోడు, మునుపు అలా —"

"నే నన్నది అదే కాదూ? మునుపు అలా —"

"ఆఁ, పో!" అన్నాడు కుఱ్ఱవాడు, చేయి అలా వూపుతూ. "నీ వేం పని చేస్తావు, చెప్పులు కుడతావా, బట్టలు కుడతావా, యేం చేస్తావు?"

"నేనా?" చెల్కాష్ ఒక క్షణం యోచించి యిలా అన్నాడు: "నేను జాలరివాణ్ని."

"జాలరి? భలే! నీవు చేపలు పడతా వన్న మాట, కదూ?"

"చేప లెందుకూ? యిక్కడ జాలరివాళ్లు చేపలు మాత్రమే పట్టరు. యెక్కువగా శవాలూ, పాత లంగర్లూ, మునిగిపోయిన పడవలూ. అలాంటివాటికి ప్రత్యేకమైన గాలాలు వున్నాయి."

"మళ్లీ అబద్ధమే. బహుశా నీవు యీ పాట పాడతారే అలాంటి జాలరివానివేమో:

'వలలు విసరుతాం
తీరంమీదా,
సంతలోని అంగళ్లల్లో, తెరచి వుంచినా వాకిళ్లల్లో.' "

"అలాంటి జాలరివాళ్లను యెప్పుడైనా చూసినావా?" అడిగినాడు చెల్కాష్, కుర్రవానివైపు పరీక్షగా చూస్తూ, పళ్లు యిగిలించి.

"లేదు. కానీ వాళ్లను గురించి విన్నాను."

"విషయం బాగుందా?"

"అలాంటివాళ్ల విషయమా? యెందుకు బాగుండదు? కనీసం వాళ్లకు స్వేచ్ఛ వుంది; తమ యిష్టమొచ్చిన పని చెయ్యొచ్చు."

"నీ కేమిటి స్వేచ్ఛ? స్వేచ్ఛ కావాలని ఉబలాటంగా వుందా?"

"యెందు కుండదు? యెవరి అదుపులోనూ లేకుండా, యిష్ట మొచ్చిన చోటికి పోవడం, యిష్ట మొచ్చిన పని చేయడం, అంతకంటె బాగుండే దేముంటుంది? తప్పుదారి పట్టకుండా, మెడకు గుది బండలు తగులుకోకుండా మాత్రం చూసుకోవాలి. ఆ పైన వెనక్కి తిరిగి చూడకుండా హాయిగా బతకొచ్చు, దేవునికీ, నీ అంతరాత్మకూ తప్ప దేనికీ భయపడకుండా."

చెల్కాష్ యేవగింపుతో వుమ్మేసి పక్కకు తిరిగినాడు.

"నా యిబ్బంది విను," అంటూ కుర్రవాడు చెప్పుకుపోయినాడు. "మా నాన్న దాదాపు యేమీ వదలిపెట్టకుండా పోయినాడు. మా అమ్మ ముసల్ది. పొలం బీదవడిపోయింది. నేనేం చెయ్యా లని? నేను బతకాలి. కానీ యెలా? దేవునికి తెలియాలి. నా కొక మంచి సంబంధం వచ్చే అవకాశం వుంది. పిల్లకు వాళ్లు ఆమె భాగం పంచి యిస్తే సరిపోతుంది. కానీ వాళ్లు యివ్వరు. ఆ ముసలివాడు ఆమెకు ఒక అంగుళం భూమి కూడా యివ్వడు. కనుక నేను అతనివద్ద పనిచేయాలి. చాలా కాలం పనిచేయాలి. యేండ్ల తరబడి. అదీ విషయం. ఒక నూటా యాభై రూబుళ్లు గనుక దొరికితే ఆ పిల్ల తండ్రి కెదురుగా నిలబడి యిలా చెప్పగలను: 'మీ మార్ఫాను నేను పెండ్లి చేసుకోవాలని వుందా నీకు? ఆమెకు భూమి యిస్తున్నావా? యివ్వవా? అలాగే కానీ; యీ వూర్లో ఆమె ఒక్కతే కాదు ఆడపిల్ల,

దేవుని దయవల్ల.' నేను స్వతంత్రంగా వుంటాను, చూసినావా? నా యిష్టం మొచ్చినట్లు చేయొచ్చు.'' కుర్రవాడు నిట్టూర్పు విడిచినాడు. ''కానీ యిప్పుడు చూస్తే, పోయి అతని అల్లునిగా అతనివద్ద వూడిగం చేయడం తప్ప మార్గం వున్నట్లు లేదు. కుబాన్ ప్రాంతంనుండి రెండు వందల రూబుళ్లు పట్టుకపోవచ్చు నని అనుకున్నాను. ఆः, అదీ నేను కోరేది! అప్పుడు గౌరవస్తునిగా చలామణి ఔతాను. కానీ నేను ఒక గడ్డి పరక సంపాయించలేదు. ఒకరి కింద జీతగాడుగా వుండక తప్పడం లేదు. నా సొంత పొలం యెందుకూ పనికిరాదు. అదీ విషయం.''

ఆ మనిషికి వూడిగం చేసే పరిస్థితిని తలుచుకొని కుర్రవాడు కంపించినాడు, ముఖం వ్రేలబడింది.

''యిప్పుడు యెక్కడ పోతావ్?'' చెల్కాష్ అడిగినాడు.

''యింటికి. మరెక్కడికి?''

''నాకెలా తెలుస్తుంది? నీవు టర్కీకి పోతూ వుండవచ్చు గదా?''

''టర్కీ?'' కుర్రవానికి ఆశ్చర్యం కలిగింది. ''మంచి క్రైస్తవు డెక్కడైనా టర్కీకి పోతాడా? భలే మాటన్నావ్!''

''నీవు శుద్ధ మొద్దువు,'' గొణిగినాడు చెల్కాష్, మళ్లీ పక్కకు తిరుగుతూ. కానీ యీ శుభ్రమైన పల్లెటూరి కుర్రవాడు అతని అంతరాంతరంలో దేన్నో కదిలించినాడు. అస్పష్టమైన ఒక అసంతృప్తి భావం అతనిలో నిదానంగా యేర్పడుతూ వుంది; అది అడ్డుపడుతూ వుంది ఆ రాత్రి కర్తవ్యంమీద అతను కేంద్రీకరించకుండా.

చెల్కాష్ మాటలు కుర్రవానికి గుచ్చుకున్నాయి. అతను తనలో తాను గొణుక్కొని, చెల్కాష్‌వైపు ఓర చూపులు చూసినాడు. అతని బుగ్గలు హాస్యాస్పదంగా ఉబ్బినాయి, మూతి ముడుచుకొని పెదవులు ముందుకు వచ్చినాయి, కండ్లు చిన్నవై వడివడిగా రెప్పలార్చినాయి. యీ మీసాల దుష్టునితో తన సంభాషణ యింత హఠాత్తుగా, యింత అసంతృప్తికరంగా అంతమౌతుందని అతను అనుకోలేదు; అది అతని ముఖంలో వ్యక్తమైంది.

కానీ ఆ ద్రిమ్మరి యితన్ని పట్టించుకోలేదు. ఆ దిమ్మెమీద కూర్చొని తనలో తాను యీల వేసుకుంటూ, తన మడ్డి బొటనవ్రేలితో లయవేస్తున్న అతని మనస్సు మరొకదానిమీద వుంది. కుర్రవాడు అతనికి లొంగిపోకూడదని అనుకున్నాడు.

'ఓయ్, జాలరీ! నీవు తరుచుగా తాగుతుంటావా?'' అని అతను మొదలుపెట్టినాడు. కానీ అదే క్షణంలో జాలరివాడు హఠాత్తుగా వచ్చిన ఆలోచనతో అతనివైపు తిరిగి యిలా అన్నాడు:

''చూడు, పసిముఖమా, యీ రాత్రికి నా కొక పనిలో సాయంగా రావడం నీ కిష్టమేనా? నిర్ణయం చేసుకో, త్వరగా!''

"యెలాంటి పని?" కుర్రవాడు అనుమానంగా అడిగినాడు.

" 'యెలాంటిది?' నేను యెలాంటి దిస్తే అది. చేపలు పట్టను పోదాం. నీవు తెడ్డు వేయాలి."

"ఓ, నాకు అభ్యంతరం లేదు. పనంటే నాకు భయం లేదు. కానీ — నీవు నన్నెక్కడైనా యిరికిస్తే యెలా? నీవు విడ్డూరపు మనిషివి. నీలోపల యేముందో యెవరికి తెలుసు?"

చెల్కాష్‌కు కడుపులో వాతలు పెట్టినట్లు అనిపించింది.

"నోరు పారేసుకో వద్దు," అన్నాడు అతను తీవ్రమైన శత్రుభావంతో. "బహుశా నెత్తిమీద ఒకటి గట్టిగా తగిలిస్తే నీకు బుద్ధి వస్తుంది."

అతను యెగిరి నిలబడినాడు, కన్నులు మెరుస్తున్నాయి, యెడమ చేయి మీసాలు పట్టి లాగుతున్నది, కుడి చేయి గట్టి పిడికిలిగా బిగిసింది.

కుర్రవానికి భయమైంది. క్షణంలో చుట్టూ చూసి అతను కూడా యెగిరి నిలబడినాడు, ఆందోళనతో రెప్ప లారుస్తూ. యిద్దరూ మౌనంగా నిలబడినారు, ఒకరి నొకరు కన్నులతో తూకంవేసుకుంటూ.

"ఊఁ?" అన్నాడు చెల్కాష్ కటువుగా. అతను లోపల ఉడికిపోతున్నాడు, యీ కుర్రకుంక చేసిన అవమానానికి ఒళ్లంతా వణికిపోతున్నాడు. యీ కుర్రకుంకను యింత వరకు అతను యెంతో యేవగింపుతో చూసినాడు, యిప్పుడు అతన్ని సర్వాత్మనా ద్వేషిస్తున్నాడు; యెందుకంటే అతనికి అంత స్వచ్ఛమైన నీలి కన్నులు వున్నాయి, అంత ఆరోగ్యంతో నిండిన కప్పువేసిన ముఖం వుంది, అంత చిన్న దిట్టమైన చేతులు వున్నాయి; యెందుకంటే అతనికి ఒక సొంత వూరు వుంది, అక్కడ ఒక యిల్లు వుంది, ఒక ధనిక రైతుకు అల్లుడు కావడానికి ఆహ్వానం వుంది. ఆ కుర్రవాడు గతంలో జీవించిన విధానానికీ, భవిష్యత్తులో జీవించబోయే విధానానికీ అతన్ని అతను ద్వేషించినాడు. కానీ అన్నిటికంటె యెక్కువగా అతను ద్వేషించింది యెందుకంటే, చెల్కాష్‌తో పోలిస్తే అర్భకుడైన ఆ కుర్రవాడు స్వేచ్ఛ కావాలని ఉబలాటపడుతున్నాడు, తాను విలువ గ్రహించలేని, తనకు అవసరంలేని స్వేచ్ఛ కావాలని. నీకంటె తక్కువవా డనుకున్న మనిషి నీవు ప్రేమించినవాటినే ప్రేమించి, నీవు ద్వేషించినవాటినే ద్వేషించి, తద్వారా నీతో ఒక పోలిక వున్నట్లు రుజువుచేసినాడని తెలిసిరావడం యెప్పుడైనా మనస్సుకు కష్టంగా వుంటుంది.

కుర్రవాడు చెల్కాష్‌వైపు చూస్తూ, అతనిలో తన యజమానిని గుర్తించినాడు.

"నాకు నిజంగా — మరి — అభ్యంతరం లేదు," అన్నాడు అతను. "యేమైనా నేను పని కోసం చూస్తున్నాను. నీకింద పనిచేసినా, మరొకరికింద పనిచేసినా యేం భేదం వుంది? ఆ మాట యెందు కన్నానంటే — మరి — నీవు కార్మికునిలాగా అంతగా కనిపించవు. నీవు

అంత — మరీ — అధోగతిలో వున్నావు. అది యెవరికైనా జరగవచ్చులే, నాకు తెలుసు. దేవుని తోడు, నేను యింతకు ముందు తాగినవాళ్లను చూడలేదా? యెంతోమందిని చూసినాను, నీకంటె అధ్వాన్నమైనవాళ్లను కూడా చూసినాను.''

''సరే, సరే. నీకు యిష్టమే నన్నమాట?'' అన్నాడు చెల్కాష్, కొంత మెత్తబడిన కంఠంతో.

''సంతోషంగా. నీ ధర యెంతో చెప్పు.''

''పనిని బట్టి ధర వుంటుంది. మనకు దొరికేదాన్ని బట్టి. నీకు అయిదు రూబుళ్లు రావచ్చు. సరేనా?''

యిప్పుడు డబ్బును గురించిన మాటగనుక, కచ్చితంగా వుండా లనుకున్నాడు రైతు; తన్ను కూలికి పెట్టుకునే మనిషినుండి కూడా అదే కచ్చితం కోరినాడు. మళ్లీ అతనికి అనుమానాలూ, సందేహాలూ వచ్చినాయి.

''అది కుదరదు, భాయీ.''

చెల్కాష్ తన పాత్రను సక్రమంగా నిర్వహించినాడు:

''దాన్నిగురించి యిప్పుడు మాట్లాడవద్దులే. హోటల్‌కు పోదాంరా.''

యిద్దరూ ఒకరి పక్కన ఒకరు నడుస్తూ వీధివెంట పోయినారు, చెల్కాష్ యజమాని ధీమాతో మీసాలు మెలివేస్తూ — కుర్రవాడు భయపడుతూ, సందేహిస్తూ, కానీ చెప్పినట్లు వినడానికి అంగీకరిస్తూ.

''నీ పేరేమి?'' అడిగినాడు చెల్కాష్.

''గవ్రీల,'' అన్నాడు కుర్రవాడు.

పొగచూరిన అపరిశుభ్రపు హోటల్ ప్రవేశిస్తూనే చెల్కాష్ కౌంటర్ వద్దకు పోయి నిత్య పరిచితునిలాగ ఉపోద్ఘాతంలేని ధోరణిలో ఒక వోద్కా సీసా, కాబేజి సూపూ, వేపుడు బీఫూ, టీ ఆర్డ రిచ్చినాడు. పట్టీ మరొక సారి పేర్కొని అతను ప్రశాంతమైన కంఠంతో ''డబ్బు తర్వాత యిస్తాను'' అన్నాడు. దానికి సమాధానంగా సర్వరు మౌనంగా తల వూపినాడు. యిది చూసి గవ్రీలకు తక్షణమే తన యజమాని పట్ల గౌరవం కలిగింది. అతని ఆకారం అప్రతిష్ఠాకరంగా వున్నా, అందరూ అతన్ని యెరుగుదురనీ, అందరూ అతన్ని నమ్ముతున్నారనీ కనపడుతూనే వుంది.

''యిప్పుడు కడుపుకు కాస్త వేసుకొని, వ్యవహారాలు మాట్లాడుకుందాం. యిక్కడ కూర్చో నేను వచ్చిందాకా. క్షణంలో వచ్చేస్తాను.''

ఆ మాటతో అతను బయటికి పోయినాడు. గవ్రీల చుట్టూ చూసినాడు. హోటల్ బేస్‌మెంటులో* వుంది. అది చీకటిగా, చెమ్మగా వుంది; కుళ్లు వోద్కా, సిగరెట్ల పొగా,

---

*బేస్‌మెంట్ — యింటిలో భూమి మట్టానికి కింద వుండే అంతస్తు. — సం.

తారూ, అలాంటిదే యేదో ఘాటైన మరొక వస్తువూ, వీటి వాసన వూపిరాడనీయనంత బరువుగా వుంది. కైపెక్కిన యెర్ర గడ్డం నావికు డొకడు, ఒళ్లంతా తారు, బొగ్గు మరకలతో, గ్రవీల కెదురుగా వున్న టేబుల్‌వద్ద కూర్చున్నాడు. వెక్కిళ్ల మధ్య యేదో పాట అతని గొంతులో గురగుర మంటున్నది; ఆ పాటలోని మాటలు ఒక నిముషం అన్నీ ఊష్మాలుగా వెలువడుతాయి, మరు నిముషం అన్నీ కంఠ్యాలైతాయి. అతను రష్యన్ కాదని తెలుస్తున్నది.

అతని వెనుక యిద్దరు మోల్దావియా స్త్రీలు వున్నారు. రాగిరంగు శరీరాలతో, నల్లని వెంట్రుకలతో, చినిగిన బట్టలతో, వాళ్లు కూడా కైపులో యేదో పాట బుసకొడు తున్నారు.

నీడలలోనుండి యితర ఆకారాలు బయటపడుతున్నాయి, అన్నీ గోలచేస్తూ, అలజడిగా, చిందరవందరగా, కైపెక్కి....

గ్రవీలకు భయం పట్టుకుంది. తన యజమాని తిరిగివస్తే చాలు! హోటల్‌లోని ధ్వనులన్నీ ఏక కంఠంగా మిళితమైనాయి; యీ రాతి గుంతలోనుండి తప్పించుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ, అనేక నాల్కలు గల పెనుమెకం యేదో గర్జిస్తున్నట్లుంది. గ్రవీలకు ఉత్సాహం నశింపజేసే మత్తు నిదానంగా యెక్కుతున్నట్లు అనిపించింది — అతని తల తిరగసాగింది, భయంతో కూడిన కుతూహలంతో హోటల్ కలయజూసే కన్నులు మబ్బుగ్రమ్మినాయి.

యెట్టకేలకు చెల్కాష్ వచ్చినాడు. యిద్దరూ తినడం, తాగడం, మాట్లాడుకోవడం ప్రారంభించినారు. మూడవ గ్లాసు వోద్కాతో గ్రవీలకు కైపైంది. అతనికి హుషారెక్కింది, యీ రాజాలాంటి మనిషితో యేదైనా ఒక మంచి మాట అనాలని ఉబలాటం కలిగింది. కానీ గొంతులో పొంగి వచ్చే మాటలు నాలుక దాటి రావడం లేదు, అక్కడ అవి మంద మెక్కి ముద్ద అవుతున్నాయి.

చెల్కాష్ ఔదార్యపు చిరునవ్వుతో చూసినాడు అతనివైపు.

"అప్పడే మెత్తబడినావా? హుఁ — చద్ది బట్ట ముఖం! ఐదు గుటకలకే. రాత్రి కెలా పనిచేస్తావ్?"

"ఓ, పెద్దన్నా!" గ్రవీల తడబడినాడు. "భయపడాకు. చేసి చూపిస్తాను. ముద్దుపెట్టుకో — ఊఁ."

"సరేలే. యిదో, యింకో చుక్క వేసుకో."

గ్రవీల తాగుతూనే వున్నాడు. చివరకు అతనికి చుట్టూ వున్న సమస్తమూ లయబద్ధమైన అలలుగా కిందికీ పైకీ కదలుతున్నట్లుంది. యిది అతనికి మనసుకు కష్టంగా వుండి, వెగటు కలిగించింది. అతని ముఖం మూర్ఖపు గంభీర ముద్ర ధరించి, గొర్రె

ముఖంలాగుంది. అతను యేదైనా చెప్పదలచుకున్నప్పుడల్లా పెదవులు హాస్యాస్పదంగా శకీమని మూసుకపోయి, వాటిగుండా కలబిసికిన ధ్వనులు వస్తున్నాయి. చెల్కాష్ దేనిమీదనో మనసు లగ్నంచేసి, పరధ్యానంగా అతనివైపు నిలజూస్తూ, మీసాలు వడబెట్టుతూ, ముడుచుకపోయిన ముఖంతో చిరునవ్వు నవ్వుతున్నాడు.

హోటల్ యధాతథంగా కైపుతో గర్జిస్తూనే వుంది. యెర్ర బొచ్చు నావికుడు టేబుల్‌మీద చేతులు ముడుచుకొని గాఢంగా నిద్రపోతున్నాడు.

"యిక పోదాం," అంటూ చెల్కాష్ లేచినాడు.

గ్రవీల కూడా లేవడానికి ప్రయత్నించినాడు, కానీ సాధ్యం కాలేదు. ఒక తిట్టు తిట్టి, మూర్ఖపు నవ్వు నవ్వినాడు అతను, తాగుబోతు లందరిలాగే.

"పనికి మాలిన వెధవ!" గొణుగుతూ చెల్కాష్ మళ్లీ కూర్చున్నాడు.

గ్రవీల నవ్వుతూనే వున్నాడు, తన యజమానివైపు మసకలైన కన్నులతో చూస్తూనే వున్నాడు. చెల్కాష్ అతనివైపు పరిశీలనగా, సాలోచనగా చూస్తున్నాడు. తన ముందు కూర్చున్న మనిషి భవితవ్యం తన తోడేలు పంజాలాంటి చేతిలో వుంది. అతన్ని తాను యేమైనా చేయవచ్చునని చెల్కాష్ గ్రహించినాడు. అతన్ని పేకముక్కలాగ తన చేతిలో నలిపివెయ్యవచ్చు, లేదా అతని స్థిరమైన రైతు జీవితానికి అతను తిరిగి పోవడానికి తాను తోడ్పడవచ్చు. అతనిమీద తనకు గల శక్తిని గుర్తించి చెల్కాష్ అనుకున్నాడు, తన నొసట రాసిన బతుకులాంటి బతుకు బతకవలసిన అవసరం యీ కుర్రవానికి యెప్పుడూ వుండదని. కుర్రవానిమీద అతనికి అసూయ కలిగింది, జాలి కలిగింది. కుర్రవాణ్ని అతను హీనంగా చూసినాడు, కానీ కుర్రవాడు తనలాంటి యెవరి చేతుల్లోనైనా పడతాడేమో నని అతనికి విచారం కలిగింది. చివరకు చెల్కాష్‌లోని వివిధ అనుభూతులన్నీ మిళితమై ఒకే అనుభూతిగా రూపుదాల్చినాయి; అది పితృవాత్సల్యంగానూ వుంది, కార్యశీలంగానూ వుంది. కుర్రవానిమీద అతనికి జాలి వుంది, కుర్రవానితో అవసరమూ వుంది అతనికి. అందువలన అతను గ్రవీల చంకలకింద చేతులు వేసి యెత్తి నిలబెట్టి, మోకాలితో మెల్లగా తోస్తూ బయటికి హోటల్ ఆవరణలోకి అతన్ని నడిపించుకపోయినాడు. అక్కడ ఒక కట్టెల గుట్ట చాటున అతన్ని పండబెట్టి, అతని పక్కన పైపు తాగుతూ కూర్చున్నాడు చెల్కాష్. గ్రవీల కాసేపు అటూ యిటూ మసిలి, నాలుగైదు సార్లు మూలిగి, నిద్రపోయినాడు.

## II

"పోదామా?" చెల్కాష్ గుసగుస అడిగినాడు తెడ్లతో తంటాలు పడుతున్న గ్రవీలను.

"ఒక నిముషం. తెడ్డు ఉంగరం వదులుగా వుంది. తెడ్డుతో ఒక దెబ్బ వేయనా?"

"వద్దు! చప్పుడు గానీయకు! చేతులతో తొయ్యి. సరిపోతుంది."

యిద్దరూ నిశ్శబ్దంగా పడవ పనిలో మునిగిపోయినారు. ఓకు వంపులతో నింపిన సరుకు పడవలూ, తాటి మొద్దులూ, చందనం కొయ్యా, లావు సైప్రస్ మొద్దులూ మోసుకపోయే టర్కిష్ ఫెలుకాలూ వున్నచోట అందులో ఒకదాని వెనుక భాగానికి కట్టివేయబడి వుండిన పడవ అది.

రాత్రి చీకటిగా వుంది. మేఘ ఖండాలు గుంపులు గుంపులుగా ఆకాశంలో పరుగెత్తుతున్నాయి. సముద్రం నిశ్చలంగా, నల్లగా, నూనెలాగ బరువుగా వుంది. అది తడి ఉప్పు వాసన వేస్తూ, ఒడ్డునూ, ఓడల పార్శ్వాలనూ ఒరసేటప్పుడు మృదువైన చిన్న ధ్వనులు చేస్తూ, చెల్కాష్ పడవను మెల్లగా ఊపుతున్నది. ఒడ్డుకు కొంత దూరాన ఆకాశాని కడ్డంగా ఓడల నల్లని బాహ్యాకారాలు కనపడుతున్నాయి, వాటి స్తంభాల కొనన రంగురంగుల దీపాలు వున్నాయి. యీ దీపాలు సముద్రంలో ప్రతిఫలించి, నల్లని మొహమల్ మీద అల్లాడుతూ మహా అందంగా కనిపించే అసంఖ్యాకమైన పసుపు మచ్చలు వెదజల్లబడినట్లు వున్నాయి. పగలంతా పనిచేసి సొమ్మసిల్లిన కార్మికునిలాగా సముద్రం గాఢంగా నిద్రిస్తున్నది.

"పోదాం," అన్నాడు గవ్రీల, ఒక తెడ్డు నీటిలోకి దించుతూ.

"పోదాం." చెల్కాష్ చుక్కాని తెడ్డుతో గట్టిగా తోసి, పడవను ఫెలుకాల మధ్య సందులలోకి పోయేటట్లు చేసినాడు. అది నీళ్లమీద వేగంగా జారుతూ పోయింది. తెడ్లు తగిలినచోటల్లా నీళ్లు నీలపు మిలమిల కాంతి వెలిజిమ్ముతున్నాయి, పడవ వెనుక ఒక కాంతి ప్రవాహాన్ని సృష్టిస్తూ.

"నీ తల యెలా వుంది? నొప్పా?" అడిగినాడు చెల్కాష్, అనునయంగా.

"యేదో ఘోరంగా వుంది. సీసంలాగ భారంగా వుంది. యిదో, తడుపుకుంటాను."

"యెందుకు? కడుపు తడుపుకో; త్వరగా బాగుంటావు," అన్నాడు చెల్కాష్, ఒక సీసా అందిస్తూ.

"ఆ — దేవుని దయ."

గుటగుట శబ్ద మయింది.

"హేయ్! చాలు!" చెల్కాష్ అడ్డం చెప్పినాడు.

మళ్లీ పడవ ముందు కురికింది, యితర నౌకల మధ్య వేగంగా, నిశ్శబ్దంగా దారి చేసుకుంటూ. యింతలో అది వాటిని దాటిపోయింది. సముద్రం — మహాశక్తి గల, అపారమైన సముద్రం — వ్యాపించి వుంది అనంత దూరంలోకి సాంద్ర నీల దిగంతం దాకా; అక్కడనుండి లేస్తున్నాయి దొంతరలు దొంతరలు మేఘాలు: పసుపు నురుగు అంచులతో బూడిదరంగూ, వూదారంగూ కలిసినట్లున్న మేఘాలూ, సముద్ర జలంలాగ పచ్చదాటుగా వున్న మేఘాలూ, సీసంరంగు మేఘాలూ, నల్లని, విషాదకరమైన నీడలు సృష్టిస్తూ. మెల్లగా ఆకాశంలో

కదలుతున్నాయి మేఘాలు, ఒకదాని నొకటి అందుకుంటూ, రంగులో, రూపంలో ఒకదానితో ఒకటి కలిసిపోతూ, కరిగిపోతూ, భీకర మనోజ్ఞమైన కొత్త రూపాలలో మళ్లీ అవతరిస్తూ. యీ అచేతన రూపాల మంద గమనంలో యేదో ఉపద్రవకరమైంది వుంది. సముద్రపు అంచున అవి అసంఖ్యాకంగా వున్నట్లుంది, ఆకాశంమీద అనంతంగా ప్రాకుతూ వుండేటట్లుంది — సజీవంగా, విచార దీప్తివంతంగా వ్రేలాడుతూ, తమ స్వచ్ఛ కాంతిని అమూల్యంగా యెంచే మానవ హృదయాలలో ఉన్నత ఆశయాలను రగిలించే కోటానుకోట్ల బంగారు గుండ్లు అనే రంగురంగుల నక్షత్రాలు గల ఆకాశం, కింద నిద్రించే సముద్రంమీదికి చూడకుండా అడ్డుపడాలనే విషపు కోరిక వున్నట్లుంది ఆ మేఘాలకు.

"బాగుంది, సముద్రం, కదూ?" చెల్కాష్ అడిగినాడు.

"బాగున్నట్లే వుంది, కానీ నాకు భయం కలిగిస్తున్నది," అన్నాడు గవ్రీల, తెడ్లు బలంగా సమంగా లాగుతూ. తెడ్లు తగిలినప్పుడు నీళ్లు అస్పష్టంగా ధ్వనిస్తూ చెదిరిపోతు న్నాయి, యింకా ఆ నీలపు మిలమిల కాంతిని వెలిజిమ్ముతూ.

"భయం! నీ వొక మొద్దువు," గునిసినాడు చెల్కాష్.

అతను దొంగ, అతనికి సముద్రంమీద ప్రేమ. అతని అశాంత, నిత్యాందోళిత స్వభావం నిరంతరం కొత్త అనుభవాల కొరకు ఆరాటపడుతూ, అంత స్వతంత్రమైన, అంత శక్తివంతమైన, అంత అపారమైన ఆ సముద్రపు నల్లని విస్తీర్ణాలను యెంత మననం చేసుకున్నా తృప్తిపడదు. తాను ప్రేమించినదాని సౌందర్యంగురించి తాను అడిగిన ప్రశ్నకు అంత నిరుత్సాహపు సమాధానం రావడం అతను నిరసించినాడు. పడవ వెనుకభాగంలో కూర్చొని, చుక్కాని తెడ్డును నీటిమధ్య కోసుకపోనిస్తూ, ప్రశాంతంగా ముందుకు చూస్తూ వుండగా, అతని మనసంతా ఒకేఒక కోర్కెతో నిండిపోయింది — ఆ మొహమల్ సముద్రోప రితలంమీద సాధ్యమైనంతదూరం, సాధ్యమైనంత సేపు ప్రయాణం చేయాలని.

సముద్రంమీద వున్నప్పుడల్లా అతని కొక వెచ్చని ఉత్సాహం కలుగుతుంది. అది అతని జీవనాడు లన్నిటా నిండి నిత్యజీవితపు కల్మషాన్ని కడిగేస్తుంది. యిది అతని కొక సంతృప్తి నిస్తుంది; నిత్య జీవితపు టాలోచనలు తమ పదును కోల్పోయి, జీవితమే తన విలువను కోల్పోయే యీ సముద్ర తరంగాల మధ్య, యీ ఆరుబయట తాను ఉత్తమ మానవుడు కావడం అతనికి సంతోషం కలిగిస్తుంది. రాత్రిపూట నిద్రించే సముద్రపు మెత్తని ఊపిరి నీళ్లమీద మృదువుగా తేలుతూ పోతుంది, ఆ శబ్దం మానవ హృదయాన్ని ప్రశాంతితో నింపి, హృదయంలోని చెడు కోర్కెలన్నిటినీ తరిమేసి, మహత్తరమైన స్వప్నాలను సృష్టిస్తుంది....

"చేపల వల యేదీ?" హఠాత్తుగా గవ్రీల అడిగినాడు, ఆందోళనగా పడవంతా కలయజూస్తూ.

చెల్కాష్ ఉలికిపడినాడు.

"వల? యిక్కడుంది వెనక."

యీ భోళా యువకునికి అబద్ధం చెప్పవలసిరావడం అతని కిష్టం లేదు. తన ఆలోచనలూ, అనుభూతులూ యిలా హఠాత్తుగా చెదిరిపోవడం అతనికి కష్టం కలిగించింది, అతనికి కోపం తెప్పించింది. అతనికి మళ్లీ గొంతులోనూ, రొమ్ములోనూ మంటలాంటిది కలిగింది. అతను కఠినంగా గద్దించినాడు:

"విను, నీవు అక్కడే కూర్చొని నీపని చూసుకో. నిన్ను తెడ్డువేయడానికి కూలికి పిల్చుకున్నాను, కనుక తెడ్డు వెయ్. నోరు మెదిలించినావా, నీ అంతు తేలుస్తాను. అర్థమైందా?"

పడవ చిన్న కుదుపు యిచ్చి ఆగింది. తెడ్లు యీడిగిలబడుతూ, నీళ్లను గిలకొట్టినాయి. గవ్రీల అస్తిమితంగా తన స్థానంలో నుసిగినాడు.

"తెడ్డు వెయ్!"

ఒక భీకరమైన తిట్టు గాలిని కంపింపజేసింది. గవ్రీల తెడ్లు యెత్తినాడు, పడవ భయపడినట్లు ఆందోళనగా వడివడి లంఘనాలతో ముందు కురికింది, దానితో నీళ్లు గలగల లాడినాయి.

"నిబ్బరంగా పోనీ!"

చెల్కాష్ చుక్కాని వదలకుండా సగం లేచి, పాలిపోయిన గవ్రీల ముఖంమీద తీక్ష్ణ దృక్కులు నిలిపినాడు. ముందుకు వంగి నిలుచున్న అతని భంగిమ లంఘించబోయే పిల్లిలాగుంది. అతను పండ్లు కొరకడం వినపడుతున్నది, గవ్రీల కీళ్లు పటపట లాడడం కూడా వినపడుతున్నది.

"యెవరక్కడ అరుస్తున్నది?" సముద్రమీదనుండి కటువుగా కేక వచ్చింది.

"తెడ్డు వెయ్, లంజకొడకా! తెడ్డు వెయ్! ష్ ! చంపేస్తాను, చర్మం వొలిచేస్తాను! తెడ్డు వెయ్యమంటున్నాను! ఒకటి, రెండు! నోరెత్తినావా, జాగ్రత్త! కండలు తరిగేస్తాను!" చెల్కాష్ బుసకొట్టినాడు.

"తండ్రీ, భగవంతుడా!" గొణుక్కున్నాడు గవ్రీల, భయంతోనూ, ఆయాసంతోనూ వణికిపోతూ.

పడవ సుడి తిరిగి వెనక్కి రేవులోకి పోయింది, ఓడల లాంపులు రంగురంగుల దీపగుచ్ఛాలుగా యేర్పడివున్న చోటికి, ఓడల స్తంభాలు స్పష్టంగా కనిపిస్తున్న చోటికి.

"హో! యెవరు అరుస్తున్నది?" కేక మళ్లీ వచ్చింది.

కానీ యీసారి దూరాననుండి వచ్చింది. చెల్కాష్‌కు మనసు కుదుటబడింది.

"నీవే అరుస్తున్నది!" అన్నాడు అతను జవాబుగా. తరువాత అతను యింకా భగవంతుని స్మరించుకుంటున్న గవ్రీలవైపు తిరిగినాడు. "యీ సారి నీ అదృష్టం బాగుంది, అబ్బాయీ. ఆ భూతాలు మనల్ని తరిమివుంటే నీపని ముగిసి వుండేది. మొట్టమొదట నిన్ను చేపలకు ఆహారంగా వేసేవాణ్ని."

చెల్కాష్ శాంతించి, హుషారైన మనస్థితిలో వుండడం గమనించి, వణుకుతున్న గవ్రీల అతన్ని ప్రాధేయపడినాడు:

"నన్ను పోనీ! నీకు పుణ్య ముంటుంది, నన్ను పోనీ! యెక్కడో ఒక చోట నన్ను దింపెయ్! ఓఓఓ, నేను మోసపోయినాను. నీకు దేవుడూ దయ్యమూ లేరా, నన్ను పోనీ! నాతో యేం కావాలి నీకు? నే నీపని చేయలేను. యిలాంటి వ్యవహారంలో నేనెప్పుడూ దిగలేదు! యిది మొదటి సారి.... దేవుడా, నా పని అయిపోయింది! నన్ను యెలా వొప్పించినావ్? యిది పాపం. దీనికి నీవు పరలోకంలో అనుభవిస్తావ్. ఓ, యేమి వ్యవహారం!"

"వ్యవహారం?" చెల్కాష్ తీవ్రంగా అడిగినాడు. "యేం వ్యవహారం?"

కుర్రవాని భీతాహం చూసి అతనికి వినోదం కలిగింది; దాన్ని మననం చేసుకోవడంలోనూ, తాను యెంత భయంకరమైన మనిషి అయిందీ ఆలోచించడంలోనూ అతనికి ఆనందం కలిగింది.

"చెడ్డ వ్యవహారం అన్నయ్యా.... నన్ను పోనీ, నీకు పుణ్య ముంటుంది. నాతో యేం కావాలి నీకు? నీవు మంచివానివి —"

"నోరు మూసుకో! నీతో అవసరం లేకపోతే నిన్ను తీసుకొచ్చేవాణ్ని కాదు, తెలుసా? యిక నోరు ముయ్!"

"భగవంతుడా!" గొణిగినాడు గవ్రీల.

"నీ అంగలార్పు కట్టిపెట్టు!" చెల్కాష్ తీవ్రంగా కసరుకున్నాడు.

కానీ గవ్రీల యిక యెంత మాత్రమూ నిగ్రహించుకోలేకపోయినాడు; అతను సన్నగా కుసిలించినాడు, దగ్గినాడు, యెగజీదినాడు, గింజుకున్నాడు, కానీ నిరాశచే కలిగిన బలంతో తెడ్డువేస్తున్నాడు. పడవ ముందుకు దూసుకపోయింది. మరొకసారి వాళ్ళ ఓడల నల్లని ఆకారాల మధ్యకు వచ్చినారు. నీళ్ల యిరుకు సందులగుండా వాళ్ల పడవ అటూ యిటూ మళ్ళుతూ, వడదిరుగుతూ, ఆ నల్లని ఆకారాలలో కలిసిపోయింది.

"విను, యిక! నిన్నెవరైనా ప్రశ్న అడిగితే, నోరు మూసుకొని పడివుండు, ప్రాణంమీద తీపి వుంటే, తెలిసిందా?"

"దేవుడా!" నిశ్వసించినాడు గవ్రీల, వెంటనే బాధతో "నా పని అయిపోయింది," అన్నాడు.

"అంగలార్పు కట్టిపెట్టు," చెల్కాష్ మళ్లీ గుసగుసలాడినాడు.

యీ గుసగుస గ్రవీల మానసిక శక్తిని హరించింది. యేదో మహోత్పాతం జరుగబోతున్నదనే భయదాయకమైన సూచనతో అతని మనసు జడమైపోయింది. పూనకంలో వున్నవాని మాదిరీ అతను చూపులు తన తాట చెప్పలమీద నిశ్చలంగా నిలిపి, తెడ్లు నీళ్లలో వేస్తూ, వాటిని లాగేటప్పుడు వెనక్కి వాలుతూ, వాటిని యెత్తి మళ్లీ నీళ్లలో వేస్తున్నాడు.

అలల నిద్రమత్తు సంచలనం విషాదకరంగా, భయంకరంగా వుంది. వాళ్లు యిప్పుడు రేవులో వున్నారు.... గోడ అవతలివైపునుండి మానవ కంఠాలు, పాడుతున్నవీ, యీలవేస్తున్నవీ, వినపడుతున్నాయి, నీటి గలగల కూడా వినపడుతున్నది.

"ఆగు," గుసగుస అన్నాడు చెల్కాష్. "తెడ్లు కింద పెట్టు. గోడమీద చేతులు వేసి తొయ్. ష్, చావు పీనుగా!"

పాచి పట్టిన గోడమీద చేతులు వేసి గ్రవీల గోడవెంబడి పడవ నడిపించినాడు. పడవ నిశ్శబ్దంగా కదిలింది, పడవ గోడకు తగిలిన చప్పుడును పాచి తినేస్తున్నది.

"ఆగు!... తెడ్లు నా చేతి కియ్యి! ఇయ్యి నా చేతి కన్నాను. నీ పాస్‌పోర్టు యేదీ? మూటలో వుందా? యిలా తే. త్వరగా. యిది నీవు పారిపోకుండా వుండడానికి, భయ్యా. యిప్పడిక ఆ భయంలేదు. తెడ్లు లేకున్నా పారిపోతావేమో కాని, పాస్‌పోర్టు లేకుండా పారిపోవు. యిక్కడ కాచుకొని వుండు. మరి, గుర్తుపెట్టుకో, కయ్‌కుయ్‌మన్నావా, సముద్రం అడుగున దాక్కున్నా నిన్ను వదలను!"

వెంటనే, చేతుల మోపున పైకి ప్రాకి చెల్కాష్ గోడ అవతలికి అదృశ్యమైనాడు.

గ్రవీల ఉలికిపడినాడు; ఇదంతా అంత శీఘ్రంగా జరిగింది. అతని హృదయంలోని భారమూ, ఆసన్నుని, మీసాల దొంగ కలిగించిన భయమూ అతనిమీదనుండి తొలగిపోయినాయి, పైమీది బట్ట జారి పడినట్లు. యిక తాను పారిపోవచ్చు!... స్వేచ్ఛగా ఊపిరి తీసుకొని అతను చుట్టూ కలయ జూసినాడు. అతనికి యెడమపక్క ఒక నల్లని ఓడ శరీరం కిందనుండి పైకి నిటారుగా వుంది, స్తంభంలేకుండా, బ్రహ్మాండమైన శవపేటికలాగా, ఖాళీగా, పనికి రాక వదలిపెట్టబడింది.... అలలు దానికి తగిలినప్పుడల్లా, అది ఒక బోలు శబ్దం వెలిగక్కుతున్నది, అది మూలుగుతున్న దేమో అన్నట్లు. కుడి పక్కన పాచిపట్టిన గోడ వుంది, నీటిమీద పండుకున్న భారమైన సర్పంలాగా. అతనివెనుక యితర నల్లని ఆకారాలు వున్నాయి. ముందర, గోడకూ శవపేటికకూ మధ్యవున్న జాగాలో సముద్రం అతని కంటబడింది. నిశ్శబ్దంగా ఎడారిలాగా వున్న దానిపైన దొంతరలు దొంతరలుగా వున్న నల్లని మేఘాలు ఆడుతున్నాయి. భారంగా, విస్తారంగా, ఆ మేఘాలు ఆకాశంలో మెల్లగా కదలుతున్నాయి, చీకటిలో భీతి కలిగిస్తూ, తమ గొప్ప బరువుతో మానవులను నలిపివేయడానికి పూనుకుంటున్నట్లు. ప్రతిదీ కరుకుగా, నల్లగా, క్రూరంగా వుంది. గ్రవీల

భయపడినాడు. అతని ప్రస్తుత భయం చెల్కాష్‌వలన కలిగిన భయంకంటె యెక్కువగా వుంది. అది అతని రొమ్ముచుట్టూ బిగిసింది, అతనిలోని ప్రతిఘటన నంతటినీ పిండేసింది, అతన్ని కూర్చున్నచోటనే కట్టేసింది.

అంతా నిశ్శబ్దం. సముద్రపు నిట్టూర్పు తప్ప ఒక్క చప్పుడు కూడా లేదు. మేఘాలు యెప్పటిలాగే నిదానంగా, భారంగా సాగిపోతున్నాయి. అవి సముద్రంలోనుండి యెన్ని ఉత్పన్నమౌతున్నాయంటే, ఆకాశం సముద్రంలాగే వుంది, యీ నున్నని నిద్రించే సముద్రం పైన తలకిందులుగా వున్న ఘూర్ణిత సముద్రంలాగ. మేఘాలు అలలలాగున్నాయి, నురుగు కిరీటాలతో భూమిమీది కురుకుతున్న అలలలాగ, తాము యెక్కడ ఉద్భవించినాయో ఆగుహల్లోకి తిరిగి ఉరుకుతున్న అలలలాగ, అప్పుడే పుట్టి యింకా కసాయి ఆగ్రహపు పచ్చ నురుగును పొందని పసి అలలమీదికి ఉరుకుతున్న అలలలాగ.

తన చుట్టూ వున్న యీ కఠోరమైన నిశ్శబ్దమూ, సౌందర్యమూ గవ్రీలను అణగదొక్కినాయి. తన యజమాని తిరిగిరావాలని ఆరాటం కలిగింది అతనికి. చెల్కాష్ రాకపోతే యెలా? కాలం నిదానంగా కాళ్లీడుస్తున్నది — ఆకాశంలోని మేఘాలకంటె నిదానంగా. ఆలస్య మయ్యేకొద్దీ ఆ నిశ్శబ్దం మరింత ఉత్పాతకరంగా పెరుగుతున్నది. యెట్టకేలకు గోడ అవతలినుండి నీటి గలగల శబ్దమూ, ఒక రవరవ శబ్దమూ, ఒక గుసగుసలాంటి ధ్వనీ వినపడినాయి. గవ్రీలకు తన చావు సమీపించినట్లు అనిపించింది.

"ఏయ్! నిద్రపోతున్నావా? యిదో, యిది పట్టుకో! జాగర్త," చెల్కాష్ గొంతు బిగబట్టి అన్న మాటలు వినవచ్చినాయి.

బరువైన చదరపు వస్తువేదో పైనుండి విడువబడింది. గవ్రీల అది పడవలో పెట్టినాడు. అలాంటి మూటె మరొకటి వచ్చింది. తరువాత జండా కట్టెలాంటి చెల్కాష్ ఆకారం కిందికి దిగింది, తెడ్లు కనిపించినాయి, గవ్రీల మూటె అతని కాళ్లవద్ద పడింది. చెల్కాష్ గసపెడుతూ పడవ వెనుకభాగంలో తన స్థానంలో కూర్చున్నాడు.

గవ్రీల జంకుతూ సంతోషపు చిరునవ్వు నవ్వినాడు.

"అలసిపోయినావా?" అతను అడిగినాడు.

"ఆ — కొద్దిగా! సరే, తెడ్లు తగిలించు. నీ బల మంతా చూపించాలి! నీకూ ఒక చిన్న గట్టి మొత్తం వస్తుందిలే. యిక చేయవలసిం దల్లా ఆ లంజకొడుకులను దాటుకొని పోవడం — తరువాత నీ భాగం తీసుకొని నీవు యింటికి పోవచ్చు నీ ప్రియురాలివద్దకు. నీ కొక ప్రియురాలు వుందనుకుంటాను, కదూ?"

"లే — దు." గవ్రీల తన శక్తినంతా తెడ్లమీద చూపిస్తున్నాడు, ఊపిరితిత్తులు కొలిమి తిత్తులలాగ పని చేస్తున్నాయి, చేతులు ఉక్కు స్ప్రింగులలాగ పనిచేస్తున్నాయి. పడవకింద నీళ్లు గళగరిస్తున్నాయి, పడవ వెనుక నీలి మిలమిల కాంతి జాలు యింకా

వెడల్పైంది. గవ్రీల చెమటతో తడిసి ముద్ద అయినాడు, కానీ తన పనిని యేమాత్రమూ సడలించలేదు. ఆరాత్రి రెండు సార్లు అతనికి మహా భీతి కలిగింది; మూడవ సారి అది మళ్లీ కలగడం అతనికి యిష్టం లేదు. అతను కోరే దల్లా యీ పాపిష్టి పని వీలైనంత త్వరగా ముగించుకొని, వట్టి గడ్డమీద అడుగు పెట్టి, ప్రాణంతో వుండగానే, జైలులో పడక ముందే, యీ మనిషినుండి తప్పించుకోవడం. అతను గట్టిగా తీర్మానించుకున్నాడు — యితనితో మాట్లాడకూడదు, యితన్ని ఒక మాటకూడా వ్యతిరేకించకూడదు, యితను చెప్పిన పనల్లా చేయాలి, క్షేమంగా బయట పడగలిగితే ప్రొద్దున్నే అఘటనాఘటన మహత్తు గల సెంట్ నీకొలస్‌కు పూజచెయ్యాలి. ఒక భక్తిపూరితమైన ప్రార్థన అతని నాలుకమీదికి వచ్చింది, కానీ అతను దాన్ని దిగమింగుకున్నాడు, రైలింజనులాగ బుసపెడుతూ, ముడివడిన కనుబొమల కిందనుండి చెల్కాష్‌ను యెగజూస్తూ.

చెల్కాష్ పొడుగ్గా, సన్నగా, యెగరడానికి సిద్ధపడుతున్న పక్షిలాగా వంగి వున్నాడు; అతని గద్ద కన్నులు ముందరి చీకటిని చీల్చి చూస్తున్నాయి, అతని గద్ద ముక్కు గాలిని మూచూస్తున్నట్లు యెగబీలుస్తున్నది, ఒక చేయి చుక్కానిని పట్టుకొని నడుపుతున్నది, మరొక చేయి మీసాలు మెలివేస్తున్నది, అతని పల్చని పెదవులు చిరునవ్వుతో విస్తరించినప్పుడు ఆ మీసాలు అల్లాడుతున్నాయి. చెల్కాష్ తృప్తిగా వున్నాడు, తనకు దొరికినదానితో, తనతో, జడిపించి తన బానిసగా చేసుకున్న యువకునితోనూ. శ్రమపడుతున్న గవ్రీలను చూస్తూ అతనికి అతనిపట్ల విచారం కలిగి, ఒక ప్రోత్సాహ వాక్యం యిద్దా మనుకున్నాడు.

"అహా !" మెల్లగా నవ్వుతూ అతను మృదువుగా అన్నాడు, "బాగా జడుసుకున్నావు, కదూ?"

"యేదో లే," గవ్రీల ముక్కినాడు.

"యిక శ్రమ పడాకు. ప్రమాదం దాటిపోయింది. యిక ఒక చోటమాత్రం మనం తప్పించుకోవాలి. కాస్త విశ్రాంతి తీసుకో."

గవ్రీల వినయంగా తెడ్లు వేయడం మాని, చొక్కాతో ముఖంమీది చెమట తుడుచుకొని, తెడ్లు నీళ్లలో వదిలినాడు.

కాసే పున్న తరువాత చెల్కాష్ అన్నాడు:

"యిక మెత్తగ నడుపు. నీళ్లను నోరెత్తనీ వద్దు. యిక ఒక గేటు దాటుకోవాలి. ష్! అక్కడున్నవాళ్లకు మంచీ చెడ్డా యేమీ తెలియదు. యెప్పుడూ తుపాకులు బారుచేసుకొని వుంటారు. నీకు అర్థమయ్యేలోపలనే గుండు నీతలలో దూరుతుంది."

యిప్పుడు పడవ దాదాపు నిశ్శబ్దంగా నీళ్లలో జారుతూ పోతున్నది. తెడ్లమీదనుండి జారిపడే నీటి బిందువుల నీలి తళతళా, ఆ బిందువులు సముద్రంమీద పడినప్పుడు యేర్పడే నీలి నిగనిగలూ తప్ప పడవ కదలుతున్న సూచనే లేదు. రాత్రి మరింత చీకటయింది,

మరింత ప్రశాంత మయింది. ఆకాశం యిప్పుడు ఘూర్ణిత సముద్రంలాగ లేదు — మేఘాలు నలుదిక్కులా విస్తరించి కిందికి వాలి, నిశ్చలంగా, నీటిమీద కప్పిన బరువైన కంబళిలాగ వున్నాయి. సముద్రం అంతకంటె ప్రశాంతంగా, అంతకంటె నల్లగా వుంది; దాని వెచ్చని ఉప్పు వాసన మరింత ఘాటుగా వుంది, అది యిప్పుడు అంత అపారంగా కనిపించడం లేదు.

"వర్షం వస్తే యెంత బాగుండు!" చెల్కాష్ గొణుక్కున్నాడు. "ముసుగు లాగ మనల్ని కప్పేస్తుంది."

పడవకు కుడి యెడమల పెద్ద ఆకారాలు నీళ్లలోనుండి పైకి నిలువుగా వున్నాయి. అవి నౌకలు — నల్లగా, విషాదకరంగా, నిశ్చలంగా. ఒకదానిమీద వెలుతురు కదులుతూ కనిపించింది: యెవరో లాంపు చేతబట్టుకొని తిరుగుతున్నారు. సముద్రం నౌకల గోడలు తట్టుతూ చిన్న ప్రాధేయపూర్వక ధ్వనులు చేస్తున్నది; అవి బెట్టుగా, బోలు జవాబులు యిస్తున్నాయి, తమను కోరిన కోరికలు తీర్చడానికి యిష్టంలేనట్లు.

"గస్తీ!" చెల్కాష్ వినపడీ వినపడనట్లు అన్నాడు.

మెత్తగ నడపమని అతను చెప్పినప్పటినుండి గవ్రీలకు మళ్లీ భయం పట్టుకుంది. కండ్లు చిట్లించి చీకటిలోకి చూస్తున్న అతనికి తాను పెరుగుతున్నట్లు అనిపించింది — యెముకలూ, కండరాలూ సాగుతున్నట్లు నొప్పిపెడుతున్నాయి, తల నొప్పిస్తున్నది, ఒకే ఒక ఆలోచనతో నిండిపోయి. అతని వీపుమీది చర్మం వణికింది, పాదాలలో సూదులు గుచ్చిన ట్లుంది. చీకటిలోకి అంత తీవ్రంగా కండ్లు చిట్లించి చూడడంవలన కండ్లు పగిలిపోతా యేమో అన్నట్లుంది, ఆ చీకటిలోనుంచి యే క్షణంలోనైనా యెవరో లేచి, "ఆగండి, దొంగలు!" అని అరుస్తారేమో అనిపించింది అతనికి.

చెల్కాష్ "గస్తీ" అన్న మాట చెవుల బడుతూనే గవ్రీల వణికిపోయినాడు. ఒక భయంకరమైన ఆలోచన అతని మెదడులో మెరుపులా మెరిసి, అతని బిగిసిన నరాలమీద తాటించింది: సహాయం కొరకు కేకవేయాలనే ఆలోచన. అతను నోరుకూడా తెరిచినాడు, కొద్దిగా లేచి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు, కానీ యింతలో కొరడా దెబ్బ తిన్నట్లు హఠాత్తుగా భయ విహ్వలుడై కండ్లు మూసుకొని, తాను కూర్చున్న స్థానంనుండి జారి పడినాడు.

వాళ్ల యెదుట దూరాన దిజ్మండలంవద్ద నల్లని నీళ్లలోనుండి మండుతున్న నీలి కాంతి ఖడ్గం ఒకటి పైకి లేచింది; లేచి అది రాత్రి చీకటిని రెండుగా చీల్చింది, ఆకాశంలోని మేఘాలను కోసుకొని పోయింది, తరువాత ఒక విశాలమైన నీలి కాంతి జాలుగా సముద్రం రొమ్ముమీద విశ్రమించింది. అక్కడ అది పండుకొని వుంది, దాని కిరణాలు యింతవరకు కనిపించని ఓడల ఆకారాలను చీకటిలో వెదకి పట్టుకుంటున్నాయి — నిశాంధకారపు ముసుగులో వున్న నల్లని నిశ్శబ్ద ఆకారాలను. యీ ఓడలు ఝంఝూ ప్రభంజన శక్తులచేత సముద్రపు

అడుగుకు తోయబడి, చాలా కాలంగా అక్కడ వుండి, యిప్పుడు సముద్రంనుండి ఉద్భవించిన యీ జ్వాలా ఖడ్గంయొక్క సంకల్పంచేత, ఆకాశాన్నీ, నీళ్లకు పైన వుండే సమస్త వస్తువులనూ చూడడానికి, పైకి లేవనెత్తబడినట్లున్నాయి. ఓడల స్తంభాలకు వున్న తాళ్లు సముద్రపు నాచులాగున్నాయి — సముద్రపు అడుగున యీ బ్రహ్మాండమైన నల్లని ఆకారాలను వలలోలాగ బంధించి, యిప్పుడు వీటితో పాటు పైకి వచ్చిన నాచులాగున్నాయి. తరువాత మళ్లీ యీ భయప్రదమైన నీలి ఖడ్గం సముద్రం రొమ్ముమీదనుండి మెరుస్తూ లేచింది, మరొకసారి రాత్రిని రెండుగా చీల్చి మళ్లీ నీళ్లమీద పండుకుంది, యీసారి మరొక చోట. మళ్లీ, యింతకుముందు కనిపించని ఓడల ఆకారాలు దాని వెలుతురులో కనిపించినాయి.

చెల్కాష్ పడవ ఆగి నీళ్లలో ఊగుతున్నది — యేం చేద్దామా అని యోచిస్తున్నట్లు. గ్రవీల పడవ అడుగున పడి వున్నాడు, చేతులు ముఖంమీద పెట్టుకొని. చెల్కాష్ అతన్ని కాలితో పొడిచి, క్రూరంగా గుసగుసలాడినాడు:

"వెధవా, అది కస్టమ్స్ నౌక! అది సర్చిలైటు. లెయ్. యింకో క్షణంలో మనల్ని కనుక్కుంటారు. నీవలన నీవూ నేనూ యిద్దరమూ సర్వనాశన మౌతాం. మొద్దువెధవా, లెయ్!"

బలమైన కాలితన్ను ఒకటి వీపున పడడంతో గ్రవీల లేచి కూర్చున్నాడు. కండ్లు తెరవడాని కతని కింకా భయంగానే వుంది; అతను కూర్చొని, చేతులతో తడిమి తెడ్లు పట్టుకొని, పడవ నడపసాగినాడు.

"మెల్లగ! మెల్లగరా, పీనుగా! యెందుకురా అంత భయం, పంది ముఖమా? అది లాంపు — అంతే. తెడ్లు మెల్లగ — మెల్లగరా, నిన్ను తగలెయ్యా! వాళ్లు దొంగవర్తకుల కోసం వెదకుతున్నారు. మనం కనపడంలే, వాళ్లు చాలా దూరాన వున్నారు. ఓహ్, మనం కనపడంలే. యిప్పుడు మనం —" చెల్కాష్ విజయోత్సాహంతో చుట్టూ చూసినాడు, — "మనం ప్రమాదం దాటినాం. హోయ్! మరే, నీవు అదృష్ట పీనుగవురా, మొద్దువెధవవైనా."

గ్రవీల పడవ నడుపుతూనే వున్నాడు, యేమీ అనకుండా, బరువుగా ఊపిరి తీసుకుంటూ, పైకీ కిందికీ లేస్తూ పడుతూ వున్న జ్వాలా ఖడ్గంవైపు పక్కచూపులు చూస్తూ. చెల్కాష్ అది లాంపు మాత్రమే అన్నాడు, కానీ తనకు నమ్మకంలేదు. సముద్రాని కొక తెల్లని నిగనిగను యిస్తూ, చీకటిని చీలుస్తున్న యీ ముష్కర నీల కాంతిలో యేదో అతీంద్రియ మైనది వుంది. గ్రవీలను మళ్లీ భయం గుప్పిట పట్టుకుంది. అతను యాంత్రికంగా పడవ నడుపుతున్నాడు, అతని కండరాలన్నీ బిగుసుకపోయినాయి, పైనుండి దెబ్బ పడుతుందని యెదురుచూస్తున్నట్లు. అతని కిప్పు డేకోరికా లేదు; మనిషి అంతా లొట్ట అయినాడు, జడపదార్థం అయినాడు. ఆ రాత్రి కలిగిన అనుభవాల ఉద్వేగం అతనిలోని మానవ సంబంధ మైనదా న్నంతటినీ తోడేసింది.

కానీ చెల్కాష్ ఉల్లాసంగా వున్నాడు: ఆందోళనకు అలవాటుపడిన అతని నరాలు త్వరగా నిమ్మళించినాయి. అతని మీసాలు సంతృప్తిచే మిడిసిపడుతున్నాయి, కండ్లు మెరుస్తున్నాయి. అతని మనస్సు హాయిగా వుంది; అతను పండ్ల సందునుండి యీలవేసినాడు, సముద్రపు తడి గాలిని రొమ్ములనిండా పీల్చుకున్నాడు, చుట్టూ కలయజూసినాడు, హార్దికంగా చిరునవ్వు నవ్వినాడు, అప్పుడు అతని చూపులు గవ్రీలమీద నిలిచినాయి.

గాలి లేచింది, సముద్రాన్ని కదుపుతూ, నీళ్లమీద చిన్న చిన్న తరగలు సృష్టిస్తూ. మేఘాలు పలుచబడి, నలుపు తగ్గినాయి, కానీ యింకా ఆకాశ మంతటా వున్నాయి. గాలి సముద్రంమీద అటు యిటూ మెల్లగా పరుగెత్తుతున్నది, కానీ మేఘాలు నిశ్చలంగా ఆకాశానికి అంటుకొని వున్నాయి, పస లేని చిల్లర ఆలోచనలలో దీర్ఘంగా మునిగిపోయినట్లు.

"యిక కాస్త కుదుటబడు, తమ్ముడూ. యెవరో నీ ప్రాణం తోడేసినట్లున్నావు — వట్టి యెముకల గూడులా వున్నావు. అంతా అయిపోయింది లే."

గవ్రీలకు సంతోషం కలిగింది, మానవ కంఠం వినబడినందుకు, అది చెల్కాష్‌దే అయినా.

"సరే సరే," గొణిగినాడు గవ్రీల.

"యేమిటి సరేసరే! కళేబరంలా వున్నావు. యిదుగో, చుక్కాని పట్టుకో, నేను తెడ్లు వేస్తాను. నీవు అలసిపోయినావు."

గవ్రీల యాంత్రికంగా లేచి స్థానం మారినాడు. మారేటప్పుడు చెల్కాష్ అతని పాలిపోయిన ముఖం చూసినాడు, అతని మోకాళ్లు వణుకుతుండడం గమనించినాడు, అవి అతన్ని నిటారుగా వుంచలేకున్నాయి. చెల్కాష్‌కు అతనిమీద యెప్పుడూ కలగనంత సానుభూతి కలిగింది, అతని భుజం తట్టి యిలా అన్నాడు:

"యిదుగో, ముఖ మెత్తు! పని చక్కగా చేసినావు. నీకు మంచి బహుమతి యిస్తాను. యిరవై అయిదు రూబుళ్లు యిస్తాను, సరేనా?"

"నాకేమీ వద్దు. ఒడ్డు చేరితే చాలు."

చెల్కాష్ చేయి అలా విసరి, ఉమ్మేసి, పడవ నడపడం ప్రారంభించినాడు, తన పొడుగాటి చేతులతో తెడ్లు బాగా వెనక్కి లాగుతూ.

సముద్రం యిప్పుడు బాగా నిద్రమేల్కొంది. అది ఆట్లాడుకొంటున్నది, చిన్న చిన్న అలలు చేస్తూ, వాటికి నురుగు నగిషీలు పెడుతూ, వాటిని ఒకదానితో ఒకటి ఢీకొట్టి నీటి తుంపురులు సృష్టిస్తూ. నురుగు బుసకొడుతూ, నిట్టూరుస్తూ కరిగిపోతున్నది; గాలి శ్రావ్యమైన ధ్వనులతో నిండింది. చీకటి కూడా మేల్కొన్నట్లుంది.

చెల్కాష్ అన్నాడు,

"అయితే మరి, మీ పల్లెకు పోతావన్న మాట. పోయి, పెండ్లి చేసుకుంటావు,

వ్యవసాయం చేస్తావు, పంటలు పండిస్తావు, నీ పెండ్లాం పిల్లల కంటుంది, తినడానికి తక్కువ వొస్తుంది, జన్మంతా యెముకలు కుళ్లేటట్లు పనిచేస్తావు. యేమి సుఖముంది అందులో?''

''యేమీ లేదు,'' గ్రవీల అస్పష్టంగా జవాబిచ్చినాడు, కొంచెంగా వణుకుతూ.

అక్కడక్కడా గాలి మేఘాలను చించి నీలాకాశపు ముక్కలను వ్యక్తం చేస్తున్నది, ఒకటి రెండు నక్షత్రాలతో సహా. యీ నక్షత్రాల ప్రతిబింబాలు నీళ్లలో నాట్యమాడుతున్నాయి, ఒకసారి అదృశ్యమౌతూ, యింతలో మళ్లీ మిలమిల మంటూ.

''కుడిపక్కకు పోనీ,'' అన్నాడు చెల్కాష్. ''దాదాపు వచ్చేసినాం. హుఁ, పని అయిపోయింది. మంచి పని. చూడు, ఒక్క రాత్రికి అయిదు వందల రూబుళ్లు!''

''ఐదు వందలు?'' అచ్చెరువుతో మాటలు గ్రవీల నోటివెంట వెలువడినాయి. ఆ మాటలు అతనికి భయం పుట్టించినాయి; ఆ మూటలను మెల్లగ కాలితో తంతూ అన్నాడు, ''యేముంది వాటిలో?''

''చాలా ఖరీదైన వస్తువు లున్నాయి. వాటికి సరైన ధర వస్తే, వెయ్యి రూబుళ్లు వస్తాయి, కానీ ఆ బాదరబందీ పడలేను. ఉపాయమే, కదూ?''

''హారి దేవుడా!'' నమ్మలేని కంఠంతో అన్నాడు గ్రవీల. ''నాకే అంత వుంటేనా!'' నిట్టూర్చి అతను తలపోసుకొన్నాడు, తన పల్లెటూరినీ, దరిద్రపు పొలాన్నీ, తల్లినీ, వేటికోసం తాను పని వెదక్కుంటూ బయలుదేరినాడో ఆ దూరపు ప్రియతమ వస్తువులనూ; వేటి కోసం ఆ రాత్రి నరక యాతన లన్నిటినీ అనుభవించినాడో వాటిని. తలపోతల ఉప్పెనలో ఉక్కిరిబిక్కి రైనాడు అతను – కొండ నానుకొని పైనుండి నదిదాకా విస్తరించిన తన వూరూ, నదికి యెగువన వున్న అడవిలో బర్చ్ చెట్లూ, విల్లో చెట్లూ, రొవాన్ చెట్లూ, చెర్రీ చెట్లూ. ''నాకుంటే యెంత బాగుండు!'' దీనంగా నిట్టూర్చినాడు అతను.

''నిజమే. వెంటనే రైలెక్కి యింటికి వుడాయిస్తా వనుకుంటాను. మీ వూర్లో ఆడపిల్ల లందరూ నీవెంటే పడతారు! నీవు కోరిన పిల్లను యేరుకోవచ్చు. కొత్త యిల్లు కూడా కట్టించుకుంటావు, యిల్లు కట్టడానికి యీ మొత్తం చాల దనుకో.''

''ఊహూఁ, యిల్లు కాదు. మా పక్క కలప చాలా ఖరీదు.''

''పాత యిల్లైనా బాగు చేయించుకుంటావు. మరి, గుర్రం మాటేమిటి? గుర్రముందా?''

''వుంది – ముసలి బక్క గుర్రం.''

''అయితే కొత్త గుర్రం కొనాల్సిందే. మంచి ఒకటో రకం గుర్రం. యిక ఆవూ... కొద్దిగా గొర్రెలూ... కోళ్లు కూడా, యేం?''

''ఓ, ఓ యిక చెప్ప వద్దు! అన్నీ మహరాజులా అమరుతాయి.''

"అమరుతాయి తమ్ముడూ. జీవితం కేళీ విలాసంగా వుంటుంది. యీ విషయాలు నాకూ కాస్తో కూస్తో తెలుసు. నాకూ ఒకప్పుడు సొంత కొంప వుండేది. మావూర్లో మానాయన పెద్ద షావుకారు."

చెల్కాష్ శ్రద్ధగా తెద్లు వేయడమే లేదు. అలలు చిలిపిగా పడవను తట్టుతూ, ఊయెల ఊపినట్లు ఊపుతున్నాయి. పడవ ముందుకు సాగినట్లే లేదు, ఆ నల్లని నీళ్లలో, క్షణక్షణమూ చిలిపితనం యెక్కువౌతున్న ఆ నీళ్లలో. ఆ యిద్దరు మనుషులూ పడవలో ఊగుతూ, చుట్టూ కలయ జూస్తూ కూర్చున్నారు, యెవరి కలలలో వాళ్లు లీనమైపోయి. గవ్రీలను శాంతపరిచి, ఉత్సాహపరచాలనే ఉద్దేశంతో, అతని పల్లెటూరిని చెల్కాష్ జ్ఞాపకం చేసినాడు. ఆ పని చేయడంలో మొదట చెల్కాష్ నటన చేసినాడు. కానీ, యేనాటినుండో తాను విలువ యివ్వని గ్రామజీవిత ఆనందాలను గురించి, యీ క్షణం వరకు తాను సంపూర్తిగా మరిచిపోయిన వాటిని గురించి, జ్ఞాపకం చేస్తూ తన సహచరుని యెత్తిపొడుస్తున్న చెల్కాష్ క్రమంగా తన మాటలకు తానే మైమరిచి, ఆ కుర్రవాణ్ని అతని గ్రామం గురించీ, అతని వ్యవహారాలను గురించీ ప్రశ్నించడానికి బదులు, తానే ఆ విషయంమీద ఉపన్యాసం సాగించినాడు.

"రైతు జీవితంలో అన్నిటికంటె ప్రశస్తమైన దేమిటంటే, మనిషి స్వతంత్రుడు, స్వయంరాజా స్వయంమంత్రీ అన్నట్లు. బీద కొంప అయినా మనిషికి సొంత యిల్లు అనేది వుంటుంది. సొంత పొలం వుంటుంది — జానెడు పీకే కావచ్చు, అయినా అది తన సొంతం. మహరాజా అనుకో, సొంత పొలం వున్నవాడు. తన వూర్లో అత నొక మనిషిగా వుంటాడు. అందరి దగ్గరా అతనికి గౌరవం వుంటుంది, వుంటుంది కదూ?" అంటూ అతను ఉత్సాహంతో ముగించినాడు.

అతన్ని గవ్రీల చిత్రంగా చూసి, తాను కూడా ఉత్సాహం పొందినాడు. తమ సంభాషణలో చెల్కాష్ యెవరైందీ అతను మరిచిపోయినాడు; అతనూ తనలాంటి రైతులాగే కనిపించినాడు అతనికి, తరతరాల పూర్వీకుల చెమటచేత పొలానికి అంటగరుచుకపోయిన రైతు, బాల్యస్మృతులచేత దానికి బంధింపబడిన రైతు, పొలంతోనూ, పొలం పనితోనూ స్వబుద్ధిగా సంబంధాలు తెంచుకొని, దానికి తగిన శాస్తి పొందిన రైతు.

"నిజం అన్నయ్యా. అక్షరాలా నిజం! నీవే వున్నావు చూడు; పొలం లేకుండా నీ విలువ యేముంది? పొలం వుందే, అది తల్లి లాంటిది అన్నయ్యా; దాన్ని యెన్నటికీ మరిచిపోలేం."

చెల్కాష్ మన లోకంలోకి వచ్చినాడు. మళ్లీ అతనికి గుండెలో జ్వాలలు రేగినాయి, తన అహంకారం — జడుపెరుగని గుండెలు తీసిన బంటు కుండే అహంకారం — దెబ్బతిన్నప్పుడు, ముఖ్యంగా తన దృష్టిలో అనామకుడైనవానిచేత దెబ్బతిన్నప్పుడు, రేగే జ్వాలలు.

"మళ్లీ (ప్రేలుతున్నావ్!" అన్నాడు అతను భీకరంగా. "నే నన్న దంతా నిజమను కున్నావా? నీ యోగ్య తేమిటో తెలుసుకో, కుక్కిన పీనుగా!"

"నేను నిన్నుగురించి అనలేదు," అన్నాడు గ్రవీల, తన మొదటి పిరికితనానికి మళ్లీ లోబడి. "నీలాంటివాళ్లు చాలామంది వున్నారు. భగవంతుడా, ప్రపంచంలో యెంతమంది దౌర్భాగ్యులు వున్నారో! దిక్కులేని దేశద్రిమ్మరులు...."

"యిదో, యీ తెడ్లు తీసుకో," చీదరించినాడు చెల్కాష్, నాలుకదాకా వచ్చిన తిట్ల ప్రవాహాన్ని దిగమింగుతూ.

మళ్లీ వాళ్లు స్థలాలు మారినారు. మూటలమీద యెక్కేటప్పుడు చెల్కాష్‌కు అణచుకోలేనంత కోరిక కలిగింది, గ్రవీలను నీళ్లలోకి ఒక్క తోపు తోయాలని.

వాళ్లమధ్య మళ్లీ సంభాషణ సాగలేదు, కానీ గ్రవీల మౌనంగా వున్న అతని చుట్టూ పల్లెటూరి వాతావరణం ఉత్పన్నమౌతున్నది.... చెల్కాష్ తన గతస్మృతులలో గాఢంగా లీనమైపోయి, పడవ నడపడం మరిచిపోయినాడు. పడవ గాలికి దారితప్పి సముద్రంలోకి మళ్లింది. పడవకు సరంగు లేడని అలలు గ్రహించినట్లుంది, అవి దానితో ఉల్లాసంగా ఆడుకుంటున్నాయి, దాన్ని తమ మూపులమీద యెగరేస్తూ, తెడ్లవద్ద చిన్న నీలి జ్వాలలుగా పైకెగురుతూ. చెల్కాష్ తన మనోనేత్రంలో గత కాలపు రంగురంగుల బొమ్మలు చూస్తున్నాడు, సుదూర గతకాలపువి, పదకొండేండ్ల దేశాటన జీవితపు అఖాతానికి ఆవలి వొడ్డున వున్నవి. అతనికి తన చిన్నతనం కనిపించింది, తన స్వగ్రామం కనిపించింది, తన తల్లి కనిపించింది — యెర్రని చెక్కిళ్లతో, చల్లని, బూడిదరంగు కన్నులు గల లావుపాటి స్త్రీ, తన తండ్రి కనిపించినాడు — కరుకైన ముఖం గల యెర్ర గడ్డపు ఆజానుబాహువు. అతనికి తన పెండ్లికొడుకు వేషం కనిపించింది, తన పెండ్లికూతురు కనిపించింది — నల్లని కన్నులతో, వీపున బారెడు జడతో, మెత్తని నిత్య సంతోష స్వభావంతో, బొద్దుగా వుండే అన్ఫీసా. మళ్లీ అతనికి తన రూపమే కనిపించింది, యీసారి అందమైన సిపాయిగా; మళ్లీ తన తండ్రి కనిపించినాడు, యీసారి పండిన తలతో, శ్రమ భారంతో వంగి; మళ్లీ తన తల్లి కనిపించింది, యీసారి ముడుతలు పడిన దేహంతో, నేలకు వాలిన నడుముతో. తన సైనిక కొలువు ముగించుకొని యింటికి వచ్చినప్పుడు, తన గ్రామం తనకు యిచ్చిన స్వాగతం కనిపించింది; తన తండ్రి యీ అందమైన, ఆరోగ్యవంతమైన, మీసాల సిపాయి కొడుకును యిరుగు పొరుగులకు చూపించి యెంత గర్వించిందీ కనిపించింది. జ్ఞాపకశక్తి అదృష్టం చెడినవాళ్లకు యమదూతలాంటిది; అది గత కాలపు రాళ్లకు కూడా ప్రాణం పోస్తుంది, యేనాడో తాగిన విషంలో కూడా ఒక తేనె బొట్టు కలుపుతుంది.

తన స్వగ్రామపు గాలి మృదువుగా వచ్చి చెల్కాష్‌కు సోకుతున్నట్లుంది; అది తన తల్లి మెత్తని మాటలనూ, తన తండ్రి రైతు నిజాయితీ మాటలనూ, యింకా అనేక

యితర విస్మృత శబ్దాలనూ తెచ్చి చెల్కాష్ చెవిలో వేస్తున్నట్లుంది; మంచు కరిగినప్పుడూ, పొలం దున్నినప్పుడూ, మొలకపైరు పచ్చ శాలువా కప్పుకున్నప్పుడూ భూమాత వెదజల్లే పరిమళాలను మోసుకొనివచ్చి అది చెల్కాష్ ముక్కులకు అందిస్తున్నట్లుంది.... ఒంటరి వాడైనట్లు, పుట్టిన గడ్డనుండి పెకలించివేయబడినట్లు, తన శరీరంలోని రక్తాన్ని ఉత్పత్తి చేసిన జీవిత విధానంనుండి శాశ్వతంగా వెలివేయబడినట్లు అనిపించింది అతనికి.

"ఓయ్, యెటు పోతున్నాం మనం?" కేక వేసినాడు గ్రవీల.

చెల్కాష్ ఉలికిపడి చుట్టూ చూసినాడు, వేటాడే పక్షికి సహజమైన జాగరూకతతో.

"దారి తప్పినాం, ఛీ వెధవది. కాస్త గట్టిగా తెడ్లు వెయ్."

"పగటి కలలు కంటున్నావా?" గ్రవీల చిరునవ్వుతో అన్నాడు.

"అలసిపోయినాను."

"యీ సరుకుతో పట్టుబడం గదా?" గ్రవీల అడిగినాడు, మూటలను మెల్లగా కాలితో తంతూ.

"ఆ భయం లేదులే. వాటిని యిప్పుడు యిచ్చేసి డబ్బు తెచ్చుకుంటాను."

"అయిదు వందలు?"

"కనీసం."

"తండ్రీ, యెంత డబ్బో! నాకే వుంటే! దానితో మంచి పాట పాడగలను!"

"జానపదమా?"

"మరేమిటి? నేను...."

గ్రవీల ఊహా పక్షాలమీద యెగిరిపోయినాడు. చెల్కాష్ యేమీ అనలేదు. అతని మీసాలు వాలిపోయినాయి, అతని కుడిపక్క ఒక అలతో తడిసిపోయింది, కండ్లు లోతుకు పోయి, కాంతిహీనంగా వున్నాయి. అతనిలోని డేగతన మంతా పోయింది, అంతా పిండివేయ బడింది, లజ్జాకరమైన అంతశ్శోధనచేత, లోపలినుండి అతని మురికి చొక్కా మడతల గుండా కూడా చూసే అంతశ్శోధనచేత.

అతను పడవను తటాలున వెనక్కి తిప్పి, నీళ్లలో నిటారుగా వున్న ఒక నల్లని ఆకారంవైపు నడిపినాడు.

ఆకాశం మళ్లీ మేఘాల ముసుగు కప్పుకుంది, సన్నని, వెచ్చని వర్షం ప్రారంభమైంది, చినుకులు నీటిమీద పడినప్పుడు ఉల్లాసకరమైన సరసర చప్పుడు చేస్తూ.

"ఆగు! ఆపు!" చెల్కాష్ ఆజ్ఞాపించినాడు.

పడవ ముక్కు ఒక నౌక పార్శ్వానికి ఢీకొట్టింది.

"నిద్రపోతున్నారా యేమిటి, ముండాకొడుకులు?" చీదరించుకుంటూ చెల్కాష్ పడవ కొక్కెం నౌకపక్కన వేలాడుతున్న తాళ్లకు తగిలించినాడు. "నిచ్చెన దించండి! వర్షం సరిగ్గా యిప్పుడే తగలబడాలి! హేయ్, దద్దమ్మల్లారా! హేయ్!"

"సెల్కాష్?" డెక్కుమీదనుండి యెవరో రాగం తీసినారు.

'నిచ్చెన యేదీ?"

"కలిమెరా,* సెల్కాష్."

"నిచ్చెనరా, చావుపీనుగా!"

"ఓ, యీపూట యేం చిటపట లాడుతున్నాడు! యిదుగో!"

"యెక్కు గవ్రీల," అన్నాడు చెల్కాష్ తన సహచరునితో.

మరు నిముషం వాళ్లు డెక్కుమీద చేరినారు. అక్కడ ముగ్గురు రాగిరంగు, గడ్డం మనుషులు తమ నౌక అంచుమీదుగా చెల్కాష్ పడవలోకి చూస్తూ, ఉద్విగ్నంగా, నత్తిగా మాట్లాడుకుంటున్నారు. పొడుగాటి వదులు కోటు తొడుక్కున్న నాల్గవవాడు చెల్కాష్ వద్దకు పోయి, మాటలేకుండా కరచాలనం చేసి, తరువాత గవ్రీల వైపు ప్రశ్నార్థకపు చూపు విసరినాడు.

"ప్రొద్దుటికి డబ్బు సిద్ధంచెయ్," అన్నాడు చెల్కాష్ ముక్తసరిగా. "నేను కునుకు తీస్తాను. రా, గవ్రీల. ఆక లౌతున్నదా?"

"నాకు నిద్ర వస్తున్నది," అన్నాడు గవ్రీల. మరో ఐదు నిముషాల్లో అతను బిగ్గరగా గురక తీస్తున్నాడు; చెల్కాష్ అతని పక్కన కూర్చొని, యెవరివో బూట్లు యెక్కించుకుంటున్నాడు, ఒక పక్కకు ఉమ్మేస్తూ, పండ్లసందున విషాదకరమైన రాగం యీలవేస్తూ. కాసేపున్నతరువాత అతను గవ్రీల పక్కన పండుకున్నాడు, తలకింద చేతులు పెట్టుకొని, యెగిరెగిరి పడుతున్న మీసాలతో.

నౌక అలలమీద ఊగుతున్నది, ఒక చెక్క జాలిగా కిర్రుమన్నది, వర్షం డెక్కుమీద టపటపమంటున్నది, అలలు నౌక గోడలను బాదుతున్నాయి. అన్నీ కలిసి చాలా విషాద పూరితంగా వున్నాయి, తన బిడ్డ సుఖపడుతుందనే ఆశ లేని తల్లి పాడే జోలపాటలాగ.

చెల్కాష్ పండ్లు యికిలించి, తల యెత్తి, చుట్టూ చూసి, తనలో తానేదో గొణుక్కొని, మళ్లీ పండుకున్నాడు.... కాళ్లు దూరదూరంగా పారజాపుకొని, బ్రహ్మాండమైన కత్తెరలాగా కనపడుతూ.

## III

అతను ముందు నిద్రలేచినాడు, ఆందోళనగా చుట్టూ చూసి, వెంటనే కుదుటబడి, గవ్రీల వైపు చూసినాడు. గవ్రీల హాయిగా గురక తీస్తున్నాడు, తన ఆరోగ్యవంతమైన, యెండకు కమలిన, కుర్రతనపు ముఖమంతా విస్తరించిన చిరునవ్వుతో. చెల్కాష్

---

*కలిమెరా – గ్రీక్ భాషలో నమస్తే. – సం.

నిట్టూర్పు విడిచి, ఒక యిరుకైన తాటినిచ్చెనగుండా పైకెక్కినాడు. ఒక ముక్క సీసంరంగు ఆకాశం గవాక్షంగుండా తొంగిచూసింది. వెలుతురుగా వుంది కానీ, పగలు మందకొడిగా, కాంతిహీనంగా వుంది, వర్షాకాలంలో తరుచుగా వుండేటట్లు.

చెల్కాష్ రెండు గంటల్లో తిరిగి వచ్చినాడు. అతని ముఖం యెర్రగా వుంది, మీసాలు సగర్వంగా పైకి వడదిరిగినాయి. అతను వేటకానిలాగా కనబడుతున్నాడు. యెత్తు బూట్లూ, తోలు కోటూ, తోలు షరాయీ వేసుకుని, దుస్తులు కొత్తవి గాకపోయినా, మంచి స్థితిలో వున్నాయి. ఆ దుస్తుల్లో అతను అందంగా వున్నాడు — అవి అతని ఆకారానికి నిండుదనం యిచ్చి, కొసదేలిన అంచులను నునుపుచేసి, అతని కొక విధమైన యోధుని రూపం యిచ్చినాయి.

అతను గవ్రీలను మెల్లగ కాలితో తోస్తూ, "లెయ్, పిల్ల వెధవా," అన్నాడు.

గవ్రీల యెగిరి కూర్చున్నాడు, సగం మెలకువగా, సగం నిద్రగా. అతను భయం నిండిన కన్నులతో చెల్కాష్‌వైపు నిలజూస్తున్నాడు, అతన్ని గుర్తుపట్టలేక. చెల్కాష్ విరగబడి నవ్వినాడు.

"ఓ, అద్భుతంగా వున్నావ్!" అన్నాడు గవ్రీల చివరకు, చిక్కగ నవ్వుతూ. "గొప్పవాళ్ల లాగున్నావ్!"

"యిది యెంతో కాలం వుండదులే. మరి, నీవేమో వట్టి పిరికి పందవు. రాత్రి యెన్ని సార్లు ప్రాణం పోయేవానిలాగ వున్నావో తెలుసా?"

"నన్నంటే యేంలాభం? యిలాంటి పని యింతకుముందెప్పుడూ నేను చేయలేదు. బహుశా నా అంతరాత్మను చంపుకున్నానేమో."

"యీ పని మళ్లీ చేస్తావా?"

"మళ్లీనా? యేమో, చెప్పలేను. చేస్తే యెంత వస్తుంది?"

"రెండు పచ్చనోట్లు వస్తాయనుకో?"

"రెండు వందల రూబుళ్లా? అయితే, ఒప్పుకోవచ్చు."

"మరి, అంతరాత్మ యేమౌతుంది?"

"అంతరాత్మకు యేమీ కాకపోవచ్చులే," అన్నాడు గవ్రీల యిగిలిస్తూ.

"నా అంతరాత్మ చావక పోవచ్చు, మరి నేను జన్మంతా సుఖపడవచ్చు."

చెల్కాష్ ఉల్లాసంగా నవ్వినాడు.

"హాస్యాలు చాలులే. యిక వొడ్డు చేరుకుందాం, రా."

మళ్లీ వాళ్లు పడవలో కూర్చున్నారు, చెల్కాష్ చుక్కాని వద్దా, గవ్రీల తెడ్ల దగ్గరా. వాళ్ల తలలపైన బూడిదరంగు మేఘాల చిక్కని చాందినీ వుంది; సముద్రం కాంతిలేని పచ్చరంగుతో, పడవతో హాయిగా ఆడుకుంటున్నది, యింకా పెద్దవికాని అలలమీద

దాన్ని యెగిరేస్తూ, దాని గోడలమీద తెల్లని తుంపురులను దోసిళ్లతో చల్లుతూ. ముందర యెక్కడో దూరాన పసుపురంగు యిసుక పీక కనిపిస్తున్నది, వాళ్ల వెనుక విస్తారమైన సముద్రం వుంది, గుంపులు గుంపులు తెల్లని తలపాగాలుగా కల్లోలితం చేయబడి. వాళ్ల వెనుక ఓడలు కూడా వున్నాయి — యెడమ పక్క ఓడ స్తంభాల అరణ్యమే ఒకటి వుంది, రేవులోని తెల్లని కట్టడాలు పూర్వరంగంలా గున్నాయి. రేవునుండి వచ్చే మంద్ర దణదణ నాదం అలల గర్జాధ్వనితో కలిసి యింపైన, బలమైన సంగీతం ఔతున్నది. అన్నింటిమీదా పల్చని మంచుతెర కప్పుకొని, ప్రతిదీ యెంతో దూరాన వున్నట్లు కనిపిస్తున్నది.

"ఓహ్, సాయంత్రానికల్లా యేమో అయ్యేటట్లుంది!" అన్నాడు చెల్కాష్, సముద్రం వైపు తల ఊపుతూ.

"తుఫానా?" అడిగినాడు గవ్రీల, బలమంతా ఉపయోగించి తెడ్లతో సముద్రాన్ని దున్నుతూ. గాలికి వచ్చిన తుంపురులచేత అతని బట్టలు తడిసిపోయినాయి.

"ఆఁ," అన్నాడు చెల్కాష్.

గవ్రీల అతనివైపు ప్రశ్నార్థకంగా చూసినాడు.

చెల్కాష్ ఆ విషయం యెత్తేటట్లు లేడని గమనించి అతను చివరకు అడిగినాడు, "వాళ్ల యెంత యిచ్చినారు నీకు?"

"చూడు," చెల్కాష్ జేబులోనుండి యేదో తీసి చూపించినాడు.

కరకరలాడే కొత్త నోట్లు అన్ని చూసేటప్పటికి గవ్రీల కండ్లు చెదిరిపోయినాయి.

"నీవు అబద్ధ మాడినావని అనుకుంటూ కూర్చున్నాను నేను! యెంత అది?"

"ఐదు వందలా నలబై."

"ఆహ్!" అని నోరు తెరిచినాడు గవ్రీల, మళ్లీ చెల్కాష్ జేబులోకి పోతున్న నోట్లవైపు దురాశతో చూస్తూ. "తండ్రీ! నాకే అంత డబ్బు వుంటేనా!" అంటూ అతను విషాదపూరితంగా నిట్టూర్చినాడు.

"నీవూ నేనూ కలిసి మజా చేసుకుందాం తమ్ముడూ," ఆనందంతో అరిచినాడు చెల్కాష్. "స్వర్గం రుచిచూద్దాం. నీ భాగం నీకు వస్తుందిలే, భయపడాకు. నీ కొక నలబై యిస్తాను. చాలా? కావాలంటే యిప్పుడే యిచ్చేస్తాను."

"సరే. నీవేమీ అనుకోకపోతే, చేయి చాచుతాను."

ఆతురతతో వణికిపోతున్నాడు గవ్రీల.

"హుఁ, పిరికి వెధవా! 'చేయి చాచుతాను!' యిదుగో, ఊఁ, తీసుకో. తీసుకొని యేడువు. యింత డబ్బు యేం చేసుకోవాల్నో తోచక చచ్చిపోతున్నాను. యిదుగో, కాస్త తీసుకొని నాకు ఉపకారం చెయ్."

చెల్కాష్ కొన్ని నోట్లు అందించినాడు. గవ్రీల తెడ్లు వదిలిపెట్టి, వణికే చేతులతో

నోట్లు అణగబట్టుకొని చొక్కాకింద దోపుకున్నాడు, కండ్లు చిట్లించి, గొంతు చల్లార్చుకుంటు న్నట్లు దీర్ఘ ఉచ్ఛ్వాసాలు తీసుకుంటూ. అపహాస్యపు చిరునవ్వుతో చెల్కాష్ అతన్ని గమనిస్తున్నాడు. గవ్రీల మళ్లీ తెడ్లు వేయసాగినాడు, ఆందోళనగా, తొందర తొందరగా, భయపడినవానిలాగా కండ్లు కిందికి వాల్చి. అతని భుజాలూ, చెవులూ అతని ప్రమేయం లేకుండానే యెగిరిపడుతున్నాయి.

"నీవు మరీ ఆశపోతువు. అంత మంచిదిగాదు. అయినా నీకు దురాశ సహజమే లే — రైతు బిడ్డవు గదా!" అన్నాడు చెల్కాష్ సాలోచనగా.

"డబ్బుంటే యేమైనా చెయ్యొచ్చు!" అన్నాడు గవ్రీల హఠా దుద్వేగంతో. తరువాత అతను తొందర తొందరగా, గందరగోళంగా, పారిపోతున్న ఆలోచనలను తరిమి పట్టుకుంటు న్నట్లు, యెగిరిపోతున్న మాటలను పొంచి పట్టుకుంటున్నట్లు, పల్లెటూరిలో డబ్బు లేని జీవితానికీ, డబ్బున్న జీవితానికీ గల భేదాన్ని వర్ణించినాడు. "గౌరవం, సుఖం, సంతోషం!"

చెల్కాష్ శ్రద్ధగా విన్నాడు, ముఖం గంభీరంగా పెట్టి, కండ్లు సాలోచనగా చిట్లించి, అప్పుడప్పుడు సంతృప్తిగా చిరునవ్వు నవ్వుతూ.

"వచ్చేసినాం!" అన్నాడు అతను, గవ్రీల వాక్ప్రవాహానికి అడ్డుపడుతూ.

ఒక అల పడవను పైకెత్తి యిసుకలోకి తోసింది.

"ఆఁ — పని ముగిసింది. పడవను కాస్త పైకి లాగుదాం, కొట్టుకపోకుండా. దీని కోసం యెవరో వస్తారులే. మరి యిక సెలవు. పట్నం సుమారు యెనిమిది మైళ్ల దూరం వుంది. మళ్లీ పట్నంలోకే పోతున్నావా?"

చెల్కాష్ ముఖం తెలివిమీరిన సుహృద్భావపు చిరునవ్వుతో వికసించింది, తనకు రాబోయే సుఖం గురించీ, గవ్రీల యెదురుచూడని దాన్ని గురించీ ఊహించుకుంటున్నట్లు. అతను జేబులో చేయిపెట్టి నోట్లు కరకర లాడించినాడు.

"ఊహూఁ — పట్నంలోకి పోను. నేను — నేను —" నత్తినత్తిగా అన్నాడు గవ్రీల.

చెల్కాష్ అతనివైపు చూసినాడు.

"యేమిటి నిన్ను తొలుస్తున్నది?" అన్నాడు అతను.

"యేమీ లేదు." గవ్రీల ముఖం కందగడ్డ అయింది, తరువాత పాలిపోయింది; అతను కాళ్లు మార్చుకుంటున్నాడు, చెల్కాష్‌మీద పడబోతున్నాడో, లేక మరేదైనా మహా దుష్కర కార్యం చేయబోతున్నాడో అన్నట్లు.

కుర్రవాని ఆందోళన చూసి చెల్కాష్ దిగ్భ్రాంతి చెందినాడు. యేమి జరగబోతుందో అని అతను కాచుకున్నాడు.

గవ్రీల పగలబడి నవ్వినాడు. అది నవ్వుకంటె యెక్కువగా యేడుపులా గుంది. అతని తల కిందికి వాలింది; అతని ముఖంలోని భావం యేమైందీ చెల్కాష్‌కు కనిపించలేదు, కానీ అతని చెవులు రక్తవర్ణంనుండి తెలుపు దిరగడం చెల్కాష్ చూడగలిగినాడు.

"పో, వెధవా," అన్నాడు చెల్కాష్, అసహ్యంతో చేయి విసరుతూ. "నామీద మోహం పుట్టిందా యేమిటి? ఆడపిల్ల లాగ వంకర్లు పోతున్నావు. లేక, నన్ను వదలిపోవడం బాధగా వుందా? చెప్పు, చచ్చు వెధవా, చెప్పు. లేకపోతే నేను వెళ్లిపోతాను."

"వెళ్లిపోతావా?" కేరుమన్నాడు గ్రవీల.

ఆ కేకకు నిర్జనమైన బీచి దద్దరిల్లింది; అలల తాకిడితో తెరలు తెరలుగా యేర్పడిన పసుపురంగు యిసుక పైకి పొంగినట్లయింది. చెల్కాష్ కూడా ఉలికిపడినాడు. హఠాత్తుగా గ్రవీల ముందు కురికి చెల్కాష్ కాళ్లమీద పడినాడు, అతని మోకాళ్లు పెనవేసుకొని గుంజినాడు. చెల్కాష్ ఊగి, యిసుకలో దబామని కూలబడినాడు; అతను పండ్లు యీలకరిచి, పిడికిలి బిగించి, తన పొడుగాటి చేయి పైకెత్తినాడు. కానీ గుసగుస కంఠంతో గ్రవీల పలికిన దీనాలాపాలు ఆ పిడికిటి గుద్దును ఆపినాయి:

"ఆ డబ్బు నాకిచ్చెయ్! నీవు మంచివానివి! నీకు పుణ్య ముంటుంది నా కిచ్చెయ్. నీ కెందుకు అది? చూడు, నీవు ఒక రాత్రిలో — ఒకే ఒక రాత్రిలో... నాకు యేండ్లూ పూండ్లూ పడుతుంది... నాకిచ్చెయ్. నీ కొరకు పూజ చేస్తాను! జన్మంతా చేస్తాను! మూడు చర్చీలలో చేస్తాను. నీకు పుణ్యం రావాలని. నీవా డబ్బు గాలికి వదిలేస్తావు. నేనైతేనా? భూమిమీద పెడతాను. నా కిచ్చెయ్! నీ కెంత అది? నీకు సులభంగా వస్తుంది. ఒక్క రాత్రిలో నీవు షావుకారు వైపోతావు. నీ జీవితంలో ఒక్కసారి మంచి కార్యం చెయ్! యెంతైనా నీవు చెడిపోయినవానివి. నీకు భవిష్యత్తులో యేమీ లేదు. నేనైతే — ఓ, ఆ డబ్బుతో యేమైనా చేస్తాను! నా కిచ్చెయ్!"

చెల్కాష్ — భయంతో, నివ్వెరపాటుతో, ఆగ్రహంతో — యిసుకలో కూర్చొనివున్నాడు, చేతులమీద బిర్రుగా వెనక్కి వాలి; తన మోకాళ్లకు తల ఆనించి, గసపెడుతూ అభ్యర్థనలు చేస్తున్న యీ కుర్రవాణ్ని చూపులతో పొడుస్తూ కూర్చొని వున్నాడు. యెట్టకేలకు చెల్కాష్ యెగిరి కాళ్లమీద నిలబడి, జేబులో చేయి పెట్టి నోట్లు తీసి గ్రవీలమీద విసరికొట్టినాడు.

"యిదో, తిను!" అరిచినాడు అతను, ఉద్వేగంతో వణుకుతూ, దురాశాపరుడైన యీ బానిసపట్ల జాలితోనూ, యేవగింపుతోనూ. నోట్లు విసరికొట్టినప్పుడు తాను వీరుడైనట్లు అనిపించింది అతనికి.

"యెలాగైనా నీకు మరికొంత డబ్బు యివ్వాలనుకొన్నాను. రాత్రి మావూరిని గురించి ఆలోచిస్తుంటే నా హృదయం మెత్తబడింది. యీ కుర్రవానికి సాయం చేద్దాం, అని అనుకున్నాను. కానీ, నీవు అడుగుతావేమో చూద్దామని ఆగినాను. అడిగినావు, పిరికి వెధవవు, ముష్టివెధవవు... డబ్బు కోసం అంతగా తన్నుకులాడుతావా? మూర్ఖపు వెధవవు. దురాశా భూతాలు! ఆత్మగౌరవం అనేది లేదు. ఐదు కోపెక్కులకు అమ్ముడుపోతారు."

"భగవంతుడు నిన్ను కాపాడుతాడు! యిప్పుడు నేను – యిప్పుడు నేను యేమైనానో తెలుసునా? యిప్పుడు నేను షావుకారును!" కీచుమని అరిచినాడు గ్రవీల, తన్మయత్వంతో నిలువునా వణుకుతూ, డబ్బు చొక్కాలోపల దాచుకుంటూ. "నా మిత్రునికి పుణ్యం వస్తుంది. నేను నిన్నెప్పటికీ మరిచిపోను. యెప్పటికీ. నా భార్యాపిల్లలతో కూడా నీ కొరకు పూజలు చేయిస్తాను."

చెల్కాష్ అతని ఆనందపూరితమైన కేకలు వింటూ, సంతోషంతో వికసించిన అతని ముఖం దురాశా పక్షవాతంతో వికృతం కావడం చూసి గుర్తించినాడు, తాను దొంగ అయినా, తాగుబోతు అయినా, యింతగా యెన్నడూ దిగజారిపోడు, యింతగా యెన్నడూ దురాశకు లోబడడు, యింతగా యెన్నడూ ఆత్మగౌరవం కోల్పోడు. యెన్నడూ, యెన్నడూ! యీ ఆలోచనా, యీ అనుభూతీ తాను స్వేచ్ఛాజీవిననే గుర్తింపును అతనిలో కలిగించి, అతను మరికొంతసేపు ఆ సముద్రం వొడ్డున గ్రవీల పక్కన వుండేటట్లు చేసినాయి.

"నీ వలన నేను హాయిగా బతుకుతాను," అరిచినాడు గ్రవీల, చెల్కాష్ చేయి పట్టుకొని తన ముఖానికి హత్తుకుంటూ.

చెల్కాష్ తోడేలులాగా పండ్లు వెళ్లబెట్టినాడు, కానీ యేమీ అనలేదు.

"నేను యేం చెయ్యా లనుకున్నదీ తలచుకుంటే ఆశ్చర్యమౌతుంది!" అంటూ గ్రవీల చెప్పసాగినాడు. "యిక్కడికి వచ్చేటప్పుడు అనుకున్నాను – అతన్ని – అంటే నిన్ను – తలమీద ఒక్క దెబ్బ కొడతాను తెడ్డుతో – ధణా మని! డబ్బు తీసుకుంటాను – నీళ్లలోకి తోసేస్తాను – అతన్ని – అంటే నిన్ను. యెవరికి తెలుస్తుంది? శవం కనపడినా, యెవరు చేసిందీ, యెలా చేసిందీ యెవరూ పట్టించుకోరు. పట్టించుకోవాల్సినంత మనిషి కాదు యితను. యెవరికి కావాలి యితను? యితన్ని గురించి యెవరు ఆలోచిస్తారు?"

"డబ్బు యిలాతే!" గర్జించినాడు చెల్కాష్, గ్రవీల గొంతు పట్టుకొని.

గ్రవీల ఒకసారి, రెండుసార్లు వూడగుంజుకున్నాడు, కానీ చెల్కాష్ చేయి అతన్ని సర్పంలాగ పెనవేసుకుంది, చొక్కా పర్రుమన్న ధ్వని అయింది – గ్రవీల యిసుకలో వెలకిలబడి వున్నాడు. గుడ్లు వెళ్లబెట్టి, చేతులతో ఆకాశాన్ని పట్టుకుంటూ, అసహాయంగా కాళ్లు తన్నుకుంటూ. చెల్కాష్ అతని పక్కన నిలబడి వున్నాడు, సన్నగా, నిటారుగా, గద్దలాగా, వికటాట్టహాసంలో పండ్లు వెళ్లబెట్టి, బొమెముకల ముఖంమీద మీసాలు అస్థిమితంగా యెగిరిపడుతూ. అతను తన జన్మలో యెప్పుడూ యింతగా అవమానపడ లేదు, యెప్పుడూ యింతగా ఆగ్రహోద్రుడు కాలేదు.

"ఆఁ, యిప్పుడు హాయిగా వున్నావా?" నవ్వుతూ అన్నాడు అతను; తర్వాత వెనుదిరిగి పట్నంవైపు బయలుదేరినాడు. అతను ఐదారడుగులు వేసేలోపలనే గ్రవీల పిల్లిలాగా వంగి, యెగిరినిలబడి, చేయి సాచి పెద్ద రాయి అతనివైపు విసరినాడు.

''చావు!''

చెల్కాష్ మూల్గి, చేతులతో తల పట్టుకొని, ముందుకు తూలి, గ్రవీలవైపు వెనక్కి తిరిగి, యిసుకలో బోర్లపడినాడు. గ్రవీల భయంతో మ్రాన్పడిపోయినాడు. చెల్కాష్ ఒక కాలు కదిలించినాడు, తల యెత్తడానికి ప్రయత్నించినాడు, సాగి పడిపోయినాడు, బిగదీసిన తంతెలాగ వణకుతూ. అప్పుడు గ్రవీల కన్నూ మిన్నూ కనపడకుండా పరుగెత్తినాడు, పొగమంచు ఆవరించిన మైదానంలో నల్లని చింపిరి మేఘం ఒకటి వేలాడుతున్న చోటికి పరుగెత్తినాడు. అలలు యిసుకమీదికి యెగబ్రాకుతూ, యిసుకలోకి దిగుతూ, గలగల శబ్దం చేస్తున్నాయి. నురుగు బుసకొడుతున్నది, గాలి నీటి తుంపురులచేత నిండింది.

వాన పడసాగింది. మొదట చిటపట చినుకులుగా ప్రారంభమై అది త్వరలోనే ధారాపాతంగా దుముకసాగింది. వర్ష ధారలు నీటి దారాల వలలాగా అల్లుకొని మొత్తం మైదానాన్నీ, మొత్తం సముద్రాన్నీ కప్పేసినాయి. ఆ వల గ్రవీలను మింగేసింది. చాలాసేపు వర్షమూ, సముద్రపు అంచున యిసుకలో పడి వున్న పొడుగాటి మనిషి ఆకారమూ తప్ప యేమీ కనిపించలేదు. తరువాత చీకటిలోనుండి దిగే పక్షిలాగ గ్రవీల ఉరుకుతూ వచ్చినాడు. అతను చెల్కాష్ దగ్గరకు వచ్చి, అతని పక్కన మోకాళ్లమీద పడి, అతన్ని యెత్తడానికి ప్రయత్నించినాడు. అతని చేతికి యేదో వెచ్చగా, యెర్రగా, జిగటగా తగిలింది. అతను కంపించి, వెనక్కి తూలినాడు, చావుభయంతో ముఖమంతా పాలిపోయి.

''లెయ్, అన్నయ్యా, లెయ్!'' అతను చెల్కాష్ చెవిలో గుసగుస చెప్పినాడు, వాన చప్పుడు మధ్య.

చెల్కాష్ కండ్లు తెరిచి, గ్రవీలను పక్కకు తోసినాడు.

''వెళ్లిపో,'' క్షీణస్వరంతో కసిరినాడు అతను.

''అన్నయ్యా! నన్ను క్షమించు! అది సైతాను చేసిన పని,'' గుసగుస అన్నాడు గ్రవీల, వణుకుతూ చెల్కాష్ చేయి ముద్దుపెట్టుకుంటూ.

''వెళ్లిపో! నన్నొదులు.''

''నా పాపం కడిగెయ్. నన్ను క్షమించు అన్నయ్యా.''

''పో! వెళ్లిపో! యెక్కడైనా చావు!'' హఠాత్తుగా అరుస్తూ చెల్కాష్ లేచి యిసుకలో కూర్చున్నాడు. అతని ముఖం తెల్లగా, కోప ఘూర్ణితమై వుంది, కండ్లు మసక గమ్మి, నిద్ర వచ్చేవాని లాగ మూతలు పడుతున్నాయి. ''యింకా యేం కావాలి నీకు? చేయాలనుకున్నది చేసినావు. వెళ్లిపో, వెళ్లు అవతలికి!'' దుఃఖతప్తుడైన గ్రవీలను అతను కాలితో తన్నబోయినాడు, కానీ తన్నలేకపోయినాడు, ఆ ప్రయత్నంలో మళ్లీ కింద పడిపోయేవాడే, అతని భుజాలమీద చేయి వేసి గ్రవీల పట్టుకోకపోతే. చెల్కాష్ ముఖం గ్రవీల ముఖం పక్కనే వుంది. రెండూ పాలిపోయి, చూడడానికి భీకరంగా వున్నాయి.

"నీచపు వెధవ!" చెల్కాష్ తుపుక్కున ఉమ్మేసినాడు, గుడ్లు అప్పగించి చూస్తున్న గవ్రీల కండ్లలోకి.

గవ్రీల వినయంగా చొక్కా చేయిమీద ముఖం తుడుచుకున్నాడు.

"నన్ను యేమైనా చెయ్," అతను గొణిగినాడు. "నేను బదులు చెప్పను. క్షమించు, నీకు పుణ్యముంటుంది క్షమించు."

"నీచపు వెధవ. తప్పుడు పని చేసేటప్పుడు కూడా మగవానిలాగా చేయలేవు," అసహ్యంతో అరుస్తూ, చెల్కాష్ కోటులోపల చేయి పెట్టి, చొక్కాలో ఒక పేలిక చింపి, ఆ పేలికతో మౌనంగా తలకు కట్టు కట్టుకున్నాడు, మధ్య మధ్య పండ్లు కొరుకుతూ. "డబ్బు తీసుకున్నావా?" అడిగినాడు అతను, పండ్లు బిగపట్టి.

"లేదు అన్నయ్యా. తీసుకోను. నాకా డబ్బు వద్దు. దానితో దురదృష్టం తప్ప యేమీ రాదు."

చెల్కాష్ తన కోటు జేబులోకి చేయి దూర్చి, పిడికెడు నోట్లు బయటికి లాగి, ఒక నూరు రూబుళ్ల నోటు పక్కకు తీసి జేబులో మళ్లీ పెట్టి, తక్కినవి గవ్రీలమీద విసరికొట్టినాడు.

"తీసుకొని, వెళ్లిపో."

"తీసుకోను అన్నయ్యా. తీసుకోలేను. నేను చేసిందానికి క్షమించు."

"తీసుకో, ఊఁ," గర్జించినాడు చెల్కాష్, భీకరంగా గుడ్లు తిప్పుతూ.

"నన్ను క్షమించు. క్షమించకపోతే డబ్బు తీసుకోలేను," అన్నాడు గవ్రీల వినయంగా, వానతో తడిసి ముద్ద అయిన యిసుకలో చెల్కాష్ పాదాలవద్ద పడుతూ.

"అబద్ధం. తీసుకుంటావు, నీచపు వెధవా," అన్నాడు చెల్కాష్, గట్టి నమ్మకంతో. గవ్రీల జుట్టు పట్టి లాగుతూ, డబ్బు అతని మూతివద్ద పెట్టినాడు చెల్కాష్.

"తీసుకో! తీసుకో! యిది నీవు కష్టంచేసిన డబ్బు. భయం లేదులే, తీసుకో! ఒక మనిషిని దాదాపు చంపినందుకు సిగ్గు పడాకు. నాలాంటివాణ్ని చంపినందుకు నిన్ను యెవరూ వెంటబడి పట్టుకోరు. తెలిస్తే నీకు కృతజ్ఞత తెల్పుతారు కూడా. యిదో, తీసుకో."

చెల్కాష్ హాస్యమాడుతుండడం చూసి గవ్రీలకు మనసు కుదుటబడింది. అతను డబ్బు పిడికిట బట్టుకున్నాడు.

"మరి, క్షమించినావా అన్నయ్యా? నిజంగా చెప్పు," అతను కన్నీళ్లు కారుస్తూ అడిగినాడు.

"నా ప్రియమైన మిత్రమా," అంటూ చెల్కాష్ వెక్కిరింపు కంఠంతో జవాబిచ్చినాడు, లేచి నిలబడి, ముందుకూ వెనక్కూ తూలుతూ. "క్షమించడాని కేముంది? యేమీ లేదు. యీ రోజు నీకు నేను దొరికినాను; రేపు నాకు నీవు దొరుకుతావు."

"ఓ, అన్నయ్యా, అన్నయ్యా," గ్రవీల దుఃఖ భారంతో నిట్టూర్చినాడు, తల ఊపుతూ.

చెల్కాష్ అతని ముందు నిలబడి వున్నాడు, ముఖంమీద ఒక వింత చిరునవ్వుతో. తలకు కట్టిన బట్ట పేలిక క్రమంగా యెర్రబడి, టర్కిష్ ఫెజ్‌టోపీలా గుంది.

వర్షం కుంభవృష్టి అయింది. సముద్రం మంద్రంగా గర్జిస్తున్నది, అలలు ఆటవిక కోపంతో వచ్చి ఒడ్డును ఢీకొంటున్నాయి.

యిద్దరూ మౌనంగా వున్నారు.

"సరే, సెలవు," అన్నాడు చెల్కాష్ వెక్కిరింతగా, బయలుదేరుతూ.

అతను తూలినాడు, కాళ్ళు వణుకుతున్నాయి, తల వింతగా పెట్టుకున్నాడు, అది పడిపోతుందేమో అని భయపడినట్లు.

"క్షమించు అన్నయ్యా," గ్రవీల మరొకసారి ప్రార్థించినాడు.

"దానికేంలే," ముక్తసరిగా అంటూ చెల్కాష్ బయలుదేరినాడు.

తడబడుతూ పోయినాడు అతను, యెడమ చేత్తో తల పట్టుకొని, కుడి చేత్తో మీసాలు మెలిపెట్టుకుంటూ.

గ్రవీల అతనివైపు చూస్తూవున్నాడు, అతను వర్షంలో అదృశ్యమైందాకా. వర్షం ధారాపాతంగా పడుతూనే వుంది, మైదానాన్ని దుర్భేద్యమైన ఉక్కురంగు చీకటి ముసుగుతో కప్పుతూ.

తరువాత గ్రవీల తలమీదనుండి తడిసిన టోపీ తీసి, దేవుని స్మరించుకొని, చేతిలోని డబ్బువైపు చూసి, పెద్దనిట్టూర్పు విడిచినాడు; డబ్బు చొక్కాలో దోపుకొని, మరొకదారి బట్టి ఒడ్డువెంట దృఢంగా అడుగులు వేస్తూ నడిచినాడు.

సముద్రం ఫీంకరిస్తూ, బ్రహ్మాండమైన భారమైన అలలను యిసుకమీద విసరి కొడుతూ, వాటిని నురుగుగా, తుంపురులుగా చితకగొడుతూ వుంది. వర్షం నీళ్లమీదా, భూమిమీదా మోదుతున్నది. గాలి గుయ్ అని గీపెడుతున్నది. వాతావరణం గర్జలతో, రోదనతో, మూలుగుతో నిండి వుంది. వర్షం వలన సముద్రమూ, ఆకాశమూ కనిపించడంలేదు.

త్వరలోనే వర్షమూ, తుంపురులూ కలిసి చెల్కాష్ పడినచోట యిసుకలో వున్న యెర్రని మరకను తుడిచేసినాయి, చెల్కాష్ అడుగు జాడలను తుడిచేసినాయి, తీరంలో నడుస్తూ పోయిన ఆ యువకుని అడుగు జాడలను తుడిచేసినాయి. యీ యిద్దరు మనుషుల మధ్య జరిగిన సంఘర్షణ గురించి సాక్ష్యం చెప్పడానికి యీ నిర్జన సముద్రతీరంలో ఒక్క గుర్తుకూడా మిగల్లేదు.

1895

# ముసలి ఇజెర్గీల్

## I

యీ కథలు నేను బెస్సరేబియాలో, ఆక్కెర్మన్‌వద్ద సముద్ర తీరంలో విన్నాను.

ఒక సాయంత్రం, ఆ రోజుకు ద్రాక్ష కోసే పని ముగిసిన తర్వాత, నాతో కలిసి పనిచేస్తూవుండిన మోల్దేవియనుల బృందం సముద్రతీరానికి బయలుదేరింది. నేనూ, ఇజెర్గీల్ అనే ముసలామే మిగిలినాం. మేము దట్టమైన ద్రాక్ష పందిళ్ల నీడలో పండుకొని, తీరంవైపు పోతున్నవాళ్ల నీడలు రాత్రి నీలి చీకట్లలో కలిసిపోవడం గమనిస్తున్నాం.

వాళ్లు నవ్వుతూ, పాడుతూ పోతున్నారు. మగవాళ్లు యెండకు గోధుమరంగు తిరిగినవాళ్లు; వాళ్లకు నల్లని ఒత్తు మీసాలూ, భుజాలదాకా వేలాడే ఉంగరాల వెంట్రుకలూ వున్నాయి; వాళ్లు పొట్టి కోట్లూ, మడమలవద్ద బిరుగా వున్న వదులు షరాయిలూ వేసుకున్నారు. స్త్రీలూ, ఆడపిల్లలూ ఉల్లాసంగా వున్నారు, ముదురు నీలి కన్నులతో, సవిలాసమైన దేహాలతో; వాళ్ల శరీరాలు కూడా, మగవాళ్ల లాగే, గోధుమరంగు తిరిగినాయి. వాళ్ల పట్టు కుచ్చుల లాంటి నల్లని కురులు వదులుగా వేలాడుతున్నాయి; వెచ్చని మందమారుతం వాటితో ఆడుకుంటూ, అలంకారానికి వాటిలో అల్లిన నాణ్యాలను గలగల మనిపిస్తున్నది. గాలి విస్తారమైన ప్రవాహంగా సమంగా మామీద వీస్తున్నది; కానీ అప్పుడప్పుడు యేదో అడ్డం వచ్చినట్లు ఆగి, వెంటనే బస్సున దూకుతూ వచ్చేది, ఆడవాళ్ల వెంట్రుకలను పైకి లేపి, వాళ్ల తలలచుట్టూ విడ్డూరపు జూలులాగా ఆడిస్తూ. అప్పుడు వాళ్లు యెక్కడో పురాణ కథల్లోని వింతజీవుల్లాగా కనిపించేవాళ్లు. వాళ్లు దూరమయ్యేకొద్దీ, రాత్రి చీకటీ, నా ఊహాశక్తీ వాళ్లకు మరింత సౌందర్యం యిస్తున్నాయి.

యెవరో ఫిడేలు వాయిస్తున్నారు, ఒక ఆడపిల్ల సన్నని గొంతుతో పాడుతున్నది, గలగల నవ్వులు వినబడుతున్నాయి....

సముద్రపు వాసనతోనూ, చీకటిపడకముందు పడిన వర్షంతో తడిసిన భూమినుండి వస్తున్న ఆవిరితోనూ గాలి బరువుగా వుంది. యిప్పటికీ యింకా వర్షమేఘాల ముక్కలు వింత రూపాలలో, వింత రంగులలో ఆకాశంలో తేలుతూ పోతున్నాయి — యిక్కడ అస్పష్టంగా, ధూమమాలికల్లాగా, బూడిదరంగుతోనూ, లేత నీలిరంగుతోనూ; అక్కడ నలుపు, గోధుమరంగు మచ్చలతో, శిలాఖండాలలాగ మొనదేలిన అంచులతో. ఆ మేఘాలమధ్య

బంగారు నక్షత్రాలు పొదిగిన సుకుమారపు నీలాకాశం తళుక్కు మంటున్నది. యిదంతా — శబ్దాలూ, వాసనలూ, మేఘాలూ, మనుషులూ — యిదంతా విషాదకరంగా, మనోహరంగా వుంది, ఒక అద్భుత గాథకు ఉపోద్ఘాతంలాగా. ప్రతిదీ పెరుగుదల ఆగి, మృత్యు ముఖంలో వున్నట్లుంది. వాళ్ళు దూర మయ్యేకొద్దీ వాళ్ల కంఠధ్వనులు మాసిపోయి, దుఃఖ భారపు నిట్టూర్పులుగా మాత్రం నిలిచినాయి.

"నీవు వాళ్లతో కలిసి యెందుకు పోలేదు?" ముసలి ఇజెర్గిల్ అడిగింది, సముద్రం దిశగా తల ఆడిస్తూ.

ఆమె నడుము వయోభారంచే వంగింది. ఆమె కండ్లు, ఒకప్పుడు నల్లగ నిగనిగలాడేవి, యిప్పుడు మబ్బుగా, మసకగా వున్నాయి. యిక, ఆమె కంఠం వింతగా వుంది — కరకరలాడే యెముకతో ఆమె నాలుక చేసినట్లు కంఠం ధ్వనిస్తున్నది.

"నాకు యిష్టం లేదు," అన్నాను జవాబుగా.

"మీ రష్యన్లు పుట్టుకతోనే ముసలివాళ్లు. మీ రందరూ ప్రేతాలలాగా దిగులుగా వుంటారు.... మా ఆడపిల్లలకు మీ రంటే భయం.... కానీ, అబ్బాయీ, నీవు వయసులో వున్నావు, దృఢంగా వున్నావు."

చంద్రుడు ఉదయించినాడు. పెద్దగా, గుండ్రంగా, రక్త వర్ణంతో ఉదయించిన చంద్రుడు మానవ రక్త మాంసాలను అంతగా దిగమింగిన ఆ మైదానం కడుపులోనుండి వచ్చినట్లుంది; అందుకే, బహుశా, అది అంత సంపన్నంగా, అంత సారవంతంగా వుంది. ముసలామే, నేనూ ఆకుల లేసు నీడలో చిక్కుకున్నాము, వలలో లాగ. మా యెడమ పక్కన విస్తరించివున్న మైదానంలో మేఘాల నీడలు పరుగెత్తుతున్నాయి, నీలి వెన్నెలచేత పాలిపోయి, పలుచబడి.

"అదుగో, లార్ర పోతున్నాడు!"

ముసలామె వణుకుతున్న వంకర వ్రేలు చూపించిన వైపు తిరిగినాను నేను. కదిలే నీడలు కనిపించినాయి. అవి చాలా వున్నాయి. అందులో ఒకటి, మిగతవాటికంటె దట్టంగా వున్నది, మిగతవాటికంటె వేగంగా పోతున్నది — భూమికి దగ్గరగా తన తోబుట్టువులకంటె వేగంగా పరుగెత్తుతున్న దట్టమైన మేఘ శకలం నీడ అది.

"అక్కడ యెవరూ లేరే," అన్నాను.

"నేను ముసలిదాన్ని అయినా, నాకంటె గుడ్డివానివి నీవు. చూడు. అదుగో, మైదానంలో నల్లగా పరుగెత్తడం కనిపించలేదూ?"

నేను మళ్లీ చూసినాను. మళ్లీ నాకు నీడలు తప్ప యేమీ కనిపించలేదు.

"అది నీడ! దాన్ని లార్ర అని యెందు కంటావు?"

"ఒదే లార్ర గనుక. లార్రలో మిగిలిందల్లా ఆ నీడే. అందులో విడ్డూర మేముం

దిలే — యెన్నో వేల యేండ్లుగా అతను జీవిస్తున్నాడు. అతని మాంసమూ, రక్తమూ, యెముకలూ యెండకు యెండినాయి; గాలివాటెని దుమ్ములాగ దిక్కులకు వెదజల్లింది. అహంకారం వున్నందుకు మనిషిని భగవంతుడు యెలా శిక్షిస్తాడో చూడు!''

''ఆ కథ యేమిటో చెప్పు,'' అన్నాను ముసలామెతో, మైదానంలో పుట్టే ఆహ్లాదకరమైన కథ ఒకటి వినవచ్చునని ఉవ్విళ్లూరుతూ.

ఆమె కథ చెప్పింది.

''యిది జరిగి యెన్నో వేల యేండ్లయింది. సముద్రానికి అవతల చాలా దూరాన, సూర్యుడు పుట్టే దేశంలో ఒక పెద్ద నది వుంది. ఆ దేశంలో ప్రతి ఆకూ, ప్రతి గడ్డి పరకా యెంత పెద్ద దంటే, ఒకొకటే ఒక మనిషికి కావలసినంత నీడ యిస్తుంది, యెండ కడ్డంగా; ఆ యెండ మహా దారుణంగా వుంటుంది.

''ఆ దేశంలో భూమాత అంత ఉదారంగా వుంటుంది.

''ఒకప్పుడు అక్కడ శక్తివంతమైన ఒక తెగ జనులు వుండేవాళ్లు. వాళ్లు తమ మందలు మేపుకుంటూ, అడవి జంతువులను వేటాడడంలో గొప్ప బలమూ, సాహసమూ ప్రదర్శించేవాళ్లు. వేట ముగిసిన తర్వాత వాళ్లు విందు చేసుకునేవాళ్లు, పాటలు పాడుకుంటూ, పడుచుపిల్లలతో సరసాలాడుకుంటూ.

''ఒక రోజు, అలాంటి విందులో, ఆకాశంనుండి హఠాత్తుగా ఒక భేరుండ పక్షి దిగివచ్చి ఒక నల్లని కురుల పడుచు పిల్లను యెత్తుక పోయింది, నిశీధిని కంటె మనోహరమైన దాన్ని. పక్షిమీదికి వాళ్లు విడిచిన బాణాలు వ్యర్థంగా మళ్లీ భూమిమీద పడినాయి. వాళ్లు ఆ పిల్లను వెదకుతూ బయలుదేరినారు, కానీ యెక్కడా దొరకలేదు. కొంత కాలానికి ఆ పిల్లను మరిచిపోయినారు, యీ భూమిమీద అన్నిటినీ మరిచిపోయినట్లే.''

ముసలామె దీర్ఘంగా నిట్టూర్చి మౌనం వహించింది. ఆ జీరగొంతుతో ఆమె మాట్లాడుతుంటే, ఆమె రొమ్ములో గూడుకట్టుకున్న విస్మృత యుగాల జ్ఞాపకాల నీడలను ఆమె వెలిబుచ్చుతున్నట్లుంటుంది. యీ పురాతన గాథ — బహుశా యీ సముద్ర తీరంలోనే పుట్టివుండవచ్చు యిది — దీని నాందీవాచకాన్ని సముద్రం మృదువుగా ప్రతిధ్వనించింది.

''కానీ, యిరవై యేండ్లకు ఆమె తిరిగి వచ్చింది, మనిషంతా నలిగిపోయి, నల్లబారి. ఆమెవెంట ఒక యువకుడూ వుండినాడు, యిరవై యేండ్ల క్రితం ఆమె వున్నట్లే బలంగా, అందంగా. యిన్నాళ్లు యెక్కడున్నావని ఆమెను అడిగినారు. భేరుండపక్షి తన్ను పర్వతాల్లోకి యెత్తుకపోయిందనీ, అక్కడ ఆ పక్షితో తాను కాపురం చేసినా ననీ ఆమె చెప్పింది. ఆ కుర్రవాడు తమ కొడుకు. తండ్రి యిప్పుడు లేదు. పక్షి, తన శక్తి

సన్నగిల్లినట్లు గ్రహించినప్పుడు, చివరిసారి అంతరాళంలోకి మహోన్నతంగా యెగిరి, రెక్కలు ముడిచి, పర్వత సానువుల కఠిన శిలలమీదికి దుమికి మరణించింది....

"అందరూ ఆ భేరుండ కుమారునివైపు అచ్చెరువుతో చూసినారు. అతను యే విధంగానూ వాళ్లకంటె గొప్పవాడు కాడు. కండ్లలో మాత్రం పక్షిరాజుకు సహజమైన ఆ కరకు అహంకార రేఖ మెరుస్తున్నది. వాళ్లు అతనితో మాట్లాడినప్పుడు ఒకోసారి అతను నిర్లక్ష్యంగా మౌనం వహించినాడు. ఆ తెగ పెద్దలు అతన్ని సమీపించినప్పుడు, వాళ్లతో అతను సరిసమానస్తుని లాగ మాట్లాడినాడు. వాళ్లు దీన్ని అపచారంగా భావించినారు; పిల్లకాకి కేమి తెలుసు ఉండేలు దెబ్బ, అన్నారు. తనలాంటివాళ్లు వేలమంది, తనంత రెండింతలు వయసు గల వాళ్లు వేలమంది తమను గౌరవించి, తమ ఆజ్ఞలను శిరసావహిస్తారని అన్నారు వాళ్లు. అతను వాళ్ల ముఖంలోకి నిర్భయంగా చూసి అన్నాడు, తనలాంటివాళ్లు యెవరూ లేరనీ, యితర్లు వాళ్లను గౌరవించినా, తన కా ఉద్దేశం లేదనీ. ఓ, అప్పుడు పెద్దలకు నిజంగా ఆగ్రహం వచ్చింది, ఆగ్రహంతో వాళ్లు యిలా అన్నారు:

"'యితను మనలో వుండతగడు. యితను తన యిష్టం వచ్చిన చోటికి పోవచ్చు.'

"అతను నవ్వి, తన యిష్టం వచ్చిన చోటికి పోయినాడు—తన్ను శ్రద్ధగా చూస్తున్న ఒక అందమైన పడుచుపిల్ల వద్దకు పోయినాడు, పోయి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. మరి, ఆమె అతన్ని దూషించిన తెగపెద్దల్లో ఒకని కుమార్తె. అతను చాలా అందగాడైనా, అతన్ని ఆమె తోసివేసింది—ఆమెకు తన తండ్రంటే భయంగనుక. అతన్ని తోసివేసి ఆమె పక్కకు వెళ్లబోయింది. అతను చేతికొద్దీ ఆమెను కొట్టినాడు, ఆమె కింద పడుతూనే ఆమె రొమ్ముమీద కాలు పెట్టి తొక్కినాడు, ఆమె నోట కక్కిన రక్తం ఆకాశంలోకి యెగిరేటట్లు. ఆమె ఊపిరాడక నోరు తెరిచి, పాములాగ తన్నుకులాడి, ప్రాణం విడిచింది.

"యిది చూసినవాళ్లు భయంతో కొయ్యబారిపోయినారు; ఒక స్త్రీని యింత దారుణంగా చంపడం వాళ్లెప్పుడూ చూడలేదు. చాలాసేపు వాళ్లు అక్కడ మౌనంగా నిలబడినారు, తెరచిన కన్నులతో, నెత్తుటి మరకల నోటితో అక్కడ పడివున్న ఆమెవైపు చూస్తూ, ఆమె పక్కన, ఒంటరిగా, అందరికీ యెడంగా, మహా గర్వంగా నిలబడివున్న అతనివైపు చూస్తూ—శిక్షను ఆహ్వానిస్తున్నట్లు అతను తల పైకెత్తుకొని వున్నాడు కూడా. చివరకు వాళ్లు ఆశ్చర్యంనుండి తేరుకొని, అతన్ని పట్టుకొని కట్టేసి, అక్కడే వదలిపెట్టి పోయినారు; అతన్ని అప్పడే చంపివేయడం చాలా సులభమైన పని అనీ, అది తమ కేమాత్రమూ తృప్తి యివ్వదనీ వాళ్లు అనుకున్నారు."

రాత్రి యింకా చీకటై వింత వింత చిన్న శబ్దాలతో నిండింది. మైదానంలో ఉడుతలు దుఃఖభారంతో కీచుకీచు మన్నాయి, ద్రాక్షతీగల్లో మిడతలు చిటచిట మన్నాయి,

ఆకులు నిట్టూరుస్తూ ఒకదానితో ఒకటి గుసగుసలాడినాయి, చంద్రబింబం, అప్పుడు రక్తారుణంగా వుండింది, యిప్పుడు పాలిపోయి, భూమికి దూరంగా జరిగి, మైదానంమీద పుష్కలంగా తన నీలి వెన్నెలను కురుస్తున్నది.

"తరువాత పెద్దలు సమావేశమై, అలాంటి నేరానికి తగిన శిక్ష నిర్ణయించడానికి పూనుకున్నారు.... మొదట, గుర్రాలకు కట్టి చీల్చించాలని అనుకున్నారు వాళ్ళు, కానీ అది చాలా చిన్న శిక్షగా కనిపించింది, అతని శరీరంలోకి తలా ఒక బాణం వేయాలని అనుకున్నారు, యిదికూడా వద్దనుకున్నారు. సజీవంగా మంటలో కాల్చాలని అనుకున్నారు, కానీ అతని బాధ పొగలో తమకు కనపడ దని అనుకున్నారు. అనేక సూచనలు వచ్చినాయి, కానీ యేదీ అందరికీ తృప్తి యివ్వలేదు. అంత సేపూ అతని తల్లి వాళ్ల కెదురుగా మోకాళ్లమీద వంగి మౌనంగా కూర్చొని వుంది, వాళ్ల హృదయాలను కరిగించగల మాటలూ, కన్నీళ్లూ చేతగాక. చాలాసేపు మాట్లాడుకున్న తర్వాత, వాళ్లలో ఒక జ్ఞానసంపన్నుడు, దీర్ఘంగా యోచించి, అన్నాడు:

"'యీపని యెందుకు చేసినాడో అతన్ని అడుగుదాం.'

"వాళ్ళు అడిగినారు.

"'కట్లు విప్పండి,' అన్నాడు అతను. 'కట్లు విప్పిందాకా ఒక మాటకూడా మాట్లాడను.'

"కట్లు విప్పిన తర్వాత అతను యిలా అన్నాడు:

"'యేమిటి మీరు కోరేది?'—అతని ధోరణి బానిసలతో యజమాని మాట్లాడి నట్లుంది.

"'విన్నావుగా,' అన్నాడు జ్ఞానసంపన్నుడు.

"'నా చర్యలు మీ కెందుకు వివరించాలి?'

"'మేము అర్థం చేసుకోడానికి. విను గర్విష్ఠీ: నీవు చావడం నిశ్చయం; మరి నీ వెందుకు అలాంటి పని చేసినావో మాకు అర్థ మయ్యేటట్లు చెయ్యి. మేము యింకా బతకబోయేవాళ్లం, మా జ్ఞానం వృద్ధి చేసుకోవడం అవసరం....'

"'సరే, చెప్తాను, నేనాపని యెందుకు చేసిందీ బహుశా నాకే పూర్తిగా తెలియక పోయినా. నా కనిపించే దేమిటంటే, ఆమె నన్ను తోసి పుచ్చింది గనుక ఆమెను చంపినాను. మరి నేనామెను కోరినాను.'

"'ఆమె నీది కాదు గదా,' అన్నారు వాళ్ళు.

"'మీ వస్తువులు మాత్రమే మీరు వాడుకుంటున్నారా? ప్రతి వొకనికీ చేతులూ, కాళ్ళూ, మాట్లాడడాని కొక నాలుకా తప్ప యేమీ లేవు గదా. మరి ప్రతివానికీ పశువులూ, ఆడవాళ్ళూ, భూమీ, యింకా అనేక వస్తువులూ వున్నాయిగదా?'

''దీనికి వాళ్ళు జవాబుచెప్పినారు, మనిషి తాను తీసుకునే ప్రతిదానికీ ఖరీదు చెల్లించాలి — బుద్ధితో, బలంతో, లేదా ప్రాణంతోనైనా. తనకు ఖరీదు చెల్లించే ఉద్దేశం లేదని అతను అన్నాడు.

''అతనితో కొంతసేపు మాట్లాడిన తర్వాత వాళ్లకు అర్థమైంది, అతను అందరికంటె గొప్పవాణ్ణని అనుకుంటున్నాడు, తన్ను గురించి తప్ప యెవర్నిగురించీ అతనికి ఆలోచనే లేదు. అతను సర్వ ప్రపంచంనుండీ యేకాకి అయినాడని గుర్తించి వాళ్లు నివ్వెరపోయినారు. అతనికి తెగ లేదు, తల్లి లేదు, పశువులు లేవు, భార్య లేదు; యిందులో యేదైనా కావాలనికూడా అతనికి కోరిక లేదు.

''యిది గ్రహించి వాళ్లు మళ్లీ చర్చించినారు, అతనికి యెలాంటి శిక్ష సరిపోతుందని. కాసేపట్లోనే ఆ జ్ఞానసంపన్నుడు, యింతవరకూ చర్చలో పాల్గొనకుండా వుండినవాడు, యిలా అన్నాడు:

'' 'ఆగండి. శిక్ష కనుక్కున్నాను. మహా భయంకరమైనది! వెయ్యేండ్లున్నా మీరు యిలాంటి శిక్ష కనుక్కోలేరు. అతని శిక్ష అతనిలోనే వుంది! కట్లు విప్పి అతన్ని స్వేచ్ఛగా పోనివ్వండి. అదే అతని శిక్ష!'

''అప్పు డొక అద్భుతం జరిగింది. మేఘంలేని ఆకాశంనుండి పెద్ద ఉరుము ఉరిమింది. యీ విధంగా ఆ జ్ఞానసంపన్నుని నిర్ణయాన్ని ఆకాశవాణి ధ్రువపరిచింది. అందరూ దాన్ని అంగీకరించినారు, ఆ తరువాత వాళ్లు వెళ్లిపోయినారు. ఆ యువకుడు — యిప్పు డతనికి లార్ర అని పేరు వచ్చింది, అనగా వెలివేయబడినవా డని అర్థం — ఆ యువకుడు తన్ను పరిత్యజించినవాళ్లను చూసి నవ్వినాడు, తాను ఒంటరిగా, తన తండ్రిలాగే స్వేచ్ఛగా వుండడం చూసి బిగ్గరగా నవ్వినాడు. కానీ, తన తండ్రి మనిషి కాదు, తానేమో మనిషి. అయినా అతను పక్షిలాగ స్వేచ్ఛగా బతక సాగినాడు. అతను పశువులను దొంగిలించినాడు, పడుచులను దొంగిలించినాడు, తాను కోరిందల్లా ఆటవిక తెగలనుండి దొంగిలించినాడు. వాళ్లు అతనిమీద బాణాలు వేసినారు, కానీ అవి అతని శరీరంలో దిగబడలేదు. అతని కిచ్చిన అత్యున్నత శిక్ష అదృశ్య కవచమై అతన్ని కాపాడుతున్నది. అతను చాకచక్యంగా, దురాశగా, బలంగా, క్రూరంగా వుండినాడు. అతను యెప్పుడూ మనుషులకు ముఖాముఖి కాలేదు. వాళ్లు అతన్ని దూరంనుండి మాత్రమే చూసేవాళ్లు. యీ విధంగా అతను చాలా కాలం మానవ సమాజాల అంచులో తిరుగుతూ వుండినాడు — చాలా చాలా కాలం. తరువాత ఒకనాడు అతను ఒక జనావాసానికి దగ్గరగా వచ్చినాడు. అక్కడివాళ్లు అతనిమీద దాడిచేయడానికి పరుగెత్తుకుంటూ వచ్చినారు. అతను వున్నచోటనే నిలబడి, ఆత్మరక్షణ చేసుకోడానికి ప్రయత్నం చేయలేదు. అప్పుడు వాళ్లలో ఒకడు అతని ఉద్దేశం గ్రహించి అరిచినాడు:

"'అతన్ని తాకవద్దు! అతను చావు కోరుతున్నాడు!'

"జనం ఆగినారు, తమకు అంత అపచారం చేసినవాణ్ని చంపి, తద్వారా అతనికి ఉపశమనం కలిగించడం యిష్టం లేక. వాళ్లు ఆగి, అతన్ని చూసి నవ్వినారు. వాళ్ల నవ్వు చూసి అతను భయకంపితుడై వ్రేళ్లతో తన రొమ్ము గట్టిగా పట్టుకున్నాడు, అక్కడ దేనికోసమో వెదకుతున్నట్లు. హఠాత్తుగా అతను వాళ్లమీద పడినాడు, చేత ఒక రాయి పట్టుకొని. వాళ్లు అతని దెబ్బలు తప్పించుకున్నారు గానీ, అతన్ని తిరిగి కొట్ట లేదు. చివరకు అతను అలసిపోయి, విహ్వలంగా కేకవేసి, నేలమీద పడినప్పుడు, వాళ్లు దూరంగా వైదొలగి చూస్తూ నిలబడినారు. అతను కష్టంతో మళ్లీ లేచి, పోరాటంలో కింద పడివున్న ఒక కత్తిని తీసుకొని, దానితో రొమ్మున పొడుచుకున్నాడు. కానీ కత్తి రెండు ముక్కలైంది, రాతిమీద పొడిచినట్లు. మళ్లీ అతను నేలమీద పడి, తల నేలకు బాదుకున్నాడు. కానీ భూమి కూడా వెనక్కి వైదొలగినట్లుంది, తల తగిలిన చోట గుంతలు యేర్పడినాయి.

"'అతనికి చావు రాదు!' జనం ఆనందంతో కేకలు వేసినారు.

"తరువాత వాళ్లు వెళ్లిపోయినారు, అతన్ని వదలిపెట్టి. అతను వెలకిల పండుకున్నాడు ఆకాశంలోకి గుడ్లప్పగించి చూస్తూ. ఆకాశంలో పైన, యెంతో పైన, మహా యెత్తున యెగిరే మహా శక్తివంతమైన భేరుండపక్షులు నల్లని చుక్కల్లాగ కనిపించినాయి అతనికి. యావత్ ప్రపంచాన్నీ దుఃఖమగ్నం చేయగలిగినంత విషాదం నిండింది అతని కన్నుల్లో. ఆనాటినుండి యీనాటివరకు అతను ఒంటరిగా వున్నాడు, ఒక చోట నిలువకుండా, మృత్యువుకోసం కాచుకొని. యీ భూమండల మంతా తిరగడమే అతని పని. అతను నీడలాగా యెలా వున్నదీ నీవు చూసినావు, నీడలాగే వుంటాడు కాలావధి దాకా. అతనికి యేమీ అర్థం కాదు, మానవుల మాటలు కానీ, మానవుల చర్యలు గానీ; వూరక అలా తిరుగుతూ వుంటాడు, నిరంతరం, దేనికోసమో వెదకుతూ. అతను బతుకుతున్నాడని అనలేం, కానీ అతనికి చ వురాదు. అతనికి మానవుల మధ్య స్థానం లేదు.... అహంకారం మనిషిని యే గతి పట్టించిందో చూడు!"

ముసలామె నిట్టూర్పు విడిచింది, రొమ్మున వాలిన తలను ఒకటి రెండు సార్లు వింతగా అల్లాడించింది.

నేను ఆమెవైపు చూసినాను. ఆమెకు నిద్ర ముంచుకొని వస్తున్నట్లుంది. యెందుకో నాకు ఆమెను చూసి పాప మనిపించింది. ఆమె ఉదాత్త ఉపదేశాత్మక ధోరణిలో కథ ముగించినా, అందులో నాకు భయమూ, బానిస భావమూ కనిపించినాయి.

దూరాన సముద్రం దగ్గర వున్న మనుషులు పాడుతున్నారు, ఒక అసాధారణమైన పద్ధతిలో పాడుతున్నారు. ఒక సన్నని ఆడ గొంతు పాట ప్రారంభించి, రెండు మూడు

స్వరాలు పాడిన తర్వాత, ఆ గొంతు అలా పాడుతూ వుండగానే, మరొక గొంతు అదే పాటను మొదటినుంచి ప్రారంభించింది. తరువాత యిలాగే మూడవ కంఠం, నాల్గవ కంఠం, అయిదవ కంఠం వాటితో కలిసినాయి. యింతలో హఠాత్తుగా పురుష కంఠాల బృందం అదే పాట ప్రారంభించింది.

స్త్రీల కంఠాలు ప్రతివొకటీ విడివిడిగా వినపడుతున్నాయి. అవి రంగురంగుల కొండ వాగుల్లాగ శిలలమీదనుండి దుముకుతూ, యెగురుతూ నురుగుతో మిలమిలలాడుతూ, కిందనుండి పైకి పొంగి వచ్చే పురుష కంఠాలను కలుసుకోడానికి ఉరికి, వాటిలో మునిగిపోయి, యింతలో వాటినుండి పక్కకెగిరి, వాటిని తమలో లీనం చేసుకొని, మళ్లీ ఒక టొకటే తమకంటె భారమైన ప్రవాహంనుండి విడివడి, స్పష్టంగా, దృఢంగా పైకి లేస్తున్నాయి.

వాళ్ల పాటమూలంగా సముద్రం చేసే శబ్దం వినపడడం లేదు.

## II

"అలా పాడడం యెప్పుడైనా విన్నావా?" అడిగింది ఇజెర్గిల్, తలయెత్తి, బోసినోటి చిరునవ్వుతో.

"లేదు, వినలేదు. యెక్కడా వినలేదు."

"యికముందు కూడా నీ వెప్పుడూ వినవు. పాటంటే మాకు ప్రాణం. అందమైన జాతి మాత్రమే బాగా పాడగలదు – జీవితాన్ని ప్రేమించే అందమైన జాతి మాత్రమే. మేము అలాంటి జాతి. చూడు, ఆ పాడేవాళ్లు పగలంతా పనిచేసి అలసిపోలే దనుకున్నావా? పొద్దు పొడిచింది మొదలు పొద్దు గూకిందాకా వాళ్లు కష్టంచేసినారు, కానీ నెల పొడుస్తూనే పాడుతున్నారు. జీవితంమీద ఆసక్తి లేనివాళ్లు నిద్రపోతారు; కానీ జీవిత మాధుర్యం తెలిసినవాళ్లు పాడుతున్నారు."

"మరి వాళ్ల ఆరోగ్యం – "అని నేను చెప్పిబోయినాను.

"ఒక జన్మకు సరిపడే ఆరోగ్యం యెప్పుడూ వుంటుంది, యెవరికైనా. ఆరోగ్యం! నీదగ్గర డబ్బుంటే ఖర్చుపెట్టవూ? ఆరోగ్యం బంగారంలాంటిదే. నా యవ్వనం యెలా గడిపినానో తెలుసునా? వేకువనుండి సందెవేళదాకా రగ్గులు నేసే దాన్ని, వంచిన నడుము యెత్తకుండా. సూర్య కిరణంలాగ జీవశక్తితో నిండిన నేను రాయిలాగ నిశ్చలంగా కూర్చోవలసి వచ్చేది. అంతసేపు కూర్చోవడంతో నా యెముకలే నొప్పిపెట్టేవి. కానీ సాయంత్ర మౌతూనే పరుగెత్తిపోయేదాన్ని, నేను ప్రేమించినవాణ్ణి కౌగిలించుకోడానికి. ఆ

ప్రేమ మూడు మాసాలు వుండింది; ఆ మూడు మాసాలూ అతనివద్దకు పరుగెత్తిపోయి, రాత్రులన్నీ అతనితో గడిపినాను. అయినా చూడు, యెంత వయస్సుదాకా నేను బతికివున్నానో! నా దేహంలో తగినంత రక్తం వుండిం దనుకుంటాను. యెన్నిసార్లు ప్రేమలో పడినానో! యెన్ని ముద్దులు యిచ్చి పుచ్చుకున్నానో!''

నేను ఆమె ముఖంలోకి చూసినాను. ఆమె నల్లని కండ్లు యింకా మబ్బుగా వున్నాయి. ఆమె జ్ఞాపకాలుకూడా వాటికి పాత కాంతిని యివ్వలేకపోయినాయి. వెన్నెల పడుతున్నది ఆమె యెండిన, పగిలిన పెదవులమీదా, నెరసిన వెంట్రుకలు కలిగి మొనదేలిన గడ్డంమీదా, గూబ ముక్కులాగ వంపు దిరిగి ముడుతలు పడిన ముక్కుమీదా. ఆమె చెంపలు మబ్బు గుంతలైనాయి; తలకు చుట్టుకున్న యెర్ర గుడ్డకిందనుండి తప్పించుకొని వచ్చిన తెల్ల వెంట్రుకల పాయ ఒకటి ఒక గుంతలో పడివుంది. ఆమె ముఖంనిండా, మెడనిండా, చేతులనిండా ముడుతలు వలనూదిరీ వున్నాయి. ఆమె కదలినప్పుడల్లా ఆ యెండిన చర్మం పగిలి ముక్కలు ముక్కలుగా రాలిపడి, ఆ కాంతిహీనమైన నల్లని కండ్లతో వట్టి యెముకల గూడు మిగులుతుందేమో అనిపించేది.

మళ్లీ ఆమె తన జీరగొంతుతో మాట్లాడసాగింది:

''నేను మా అమ్మతో కలిసి ఫాల్మీ దగ్గర, బిర్లాత్ నది వొడ్డున వుండినాను. అతను మా పాలానికి వచ్చినప్పుడు నాకు పద్దైదేండ్లు. అతను పొడవుగా, గోధుమరంగుతో, విలాసంగా, యెంతో ఉల్లాసంగా వుండినాడు. మా కిటికీకింద పడవ నిలిపి అతను కంచు కంఠంతో కేకవేసినాడు: 'హలో! యిక్కడ తినడాని కేమైనా యింత తిండీ, కాస్త వైనూ దొరుకుతాయా?' నేను కిటికీ గుండా చూసినాను. ఆష్ చెట్టు కొమ్మలసందున నది అంతా నీలంగా వుంది వెన్నెలలో; అతను తెల్ల చొక్కా వేసుకొని, నడుముకు వెడల్పైన శాష్ కట్టుకొని అక్కడ నిలబడి వున్నాడు, ఒక కాలు పడవలోనూ, ఒక కాలు ఒడ్డుమీదా పెట్టుకొని. అతను పడవను ఊపుతూ, పాడుతూ వున్నాడు. నన్ను చూస్తూనే యిలా అన్నాడు అతను: 'అరే, యెంత అందమైన పడుచు వుంది యిక్కడ, నాకు తెలియనే లేదు!' — ప్రపంచంలోని యితర అందమైన పడుచు లందరూ అతనికి తెలిసినట్లు. అతనికి కాస్త వైనూ, కాస్త మాంసమూ యిచ్చినాను, నాలుగు రోజుల తర్వాత నా శరీరం యిచ్చినాను. ప్రతి రాత్రీ అతనూ నేనూ పడవ షికారు వెళ్లేవాళ్లం. అతను వచ్చి మృదువుగా యీలవేసేవాడు, ఉడతలాగ, నేను చేపలాగ కిటికీగుండా నది ఒడ్డుమీదికి దూకేదాన్ని. అలాగే యిద్దరమూ వెళ్లేవాళ్లం. అతను ప్రూత్‌నుండి వచ్చిన జాలరివాడు. తరువాత మా అమ్మ మా విషయం కనుక్కున్నప్పుడు నన్ను కొట్టింది. అతను నన్ను తనతో వచ్చెయ్య మన్నాడు, డ్రొబ్రూజకు పారిపోదా మన్నాడు, యింకా ఆవలికి, డేన్యూబ్ ఉపనదులమీదికి పోదా మన్నాడు. కానీ అప్పటికే నాకు అత నంటే ముఖం మొత్తింది —

అతను యెప్పుడూ పాటలు పాడడం, కామం తీర్చుకోవడం తప్ప మరేమీ చేసేవాడు కాదు. అది నాకు విసు గనిపించింది. సరిగ్గా అప్పుడు ఒక గుంపు గుత్సూల్‌లు ఆ ప్రాంతాలకు వచ్చినారు. అక్కడ వాళ్లకు ప్రేయసులు దొరికినారు. ఆ పడుచులకు మంచి మజా అయిన కాలంలే అది! ఒకోసారి ఆ ప్రియులలో ఒకడు అదృశ్య మయ్యేవాడు, అతని ప్రేయసి విరహ బాధ అనుభవించేది — అతను జైల్లోనైనా పడి వుంటాడు, లేదా కొట్లాటలో చచ్చిపోయైనా వుంటా డనే నమ్మకంతో. యింతలో అతను ఆకాశంనుండి వూడిపడినట్టు వచ్చేవాడు, ఒంటిగానో, లేక యిద్దరు ముగ్గురు మిత్రులతోనో, విలువైన బహుమతులతో సహా — డబ్బు సులభంగా వచ్చేదిలే వాళ్లకు. ఆమెతో కలిసి అతను విందు చేసుకునేవాడు, ఆమెను వర్ణించి వర్ణించి పొగిడేవాడు తన మిత్రుల వద్ద. యిది ఆమెకు ఆహ్లాదకరంగా వుండేది. అలాంటి ప్రేమికుడున్న ఒక అమ్మాయిని ఒకసారి అడిగినాను, నన్ను గుత్సూల్లకు పరిచయం చేయమని. వుండు, ఆ అమ్మాయి పేరేమిటి? మరిచిపోయినాను. జ్ఞాపకశక్తి తగ్గిపోతున్నది. మరి యెంతో కాలమైందిగదా, యెవరైనా మరిచిపోతారు. ఆ అమ్మాయి ద్వారా ఒక గుత్సూల్ యువకుని కలుసుకున్నాను. అతను అందమైన వాడు. యెర్ర జుట్టు వాడు. యెర్ర జుట్టూ, యెర్ర మీసాలూ. తళతళలాడే యెరుపు. ఒకోసారి అతను దిగులుగా వుండేవాడు, ఒకోసారి యెంతో మార్దవంగా వుండేవాడు, యింకా ఒకోసారి అడవి మృగంలాగ గర్జిస్తూ పోట్లాడేవాడు. ఒకసారి నన్ను చెంపమీద కొట్టినాడు. నేను పిల్లి లాగ అతని రొమ్ముమీదికి యెగిరి, అతని చెంప కొరికినాను. అప్పటినుండి అతనికి చెంపమీద గుంత యేర్పడింది. ఆ గుంతమీద నేను ముద్దుపెట్టుకోవడం అతనికి చాలా యిష్టం.''

''మరి ఆ జాలరివా డేమైనాడు?'' నేను అడిగినాను.

''జాలరివాడా? అతను అక్కడే వుండినాడు. అతను ఆ బృందంలో కలిసినాడు, గుత్సూల్లతో. మొదట అతను నన్ను ప్రాథేయపడినాడు, మళ్లీ తనవద్దకు రమ్మని; రాకుంటే నన్ను నదిలో తోసేస్తా నని బెదిరించినాడు. అతను ఆ బృందంలో కలిసి మరొక ప్రేయసిని సంపాయించుకున్నాడు. వాళ్లిద్దరినీ ఒకేసారి ఉరితీసినారు — జాలరివాణ్ణీ, నా గుత్సూల్ ప్రియుణ్ణీ. వాళ్లను ఉరితీసేది నేను పోయి చూసినాను ద్రొబాజలో. జాలరివాడు శవంలాగ పాలిపోయి, యేడుస్తూ పోయినాడు ఉరికొయ్యవద్దకు. గుత్సూల్ పైపు కాలుస్తూ వుండినాడు. అతను నేరుగా ముందుకు నడిచినాడు, పైపు కాలుస్తూ, చేతులు జేబుల్లో పెట్టుకొని; ఒక మీసం భుజంమీదా, మరొకటి రొమ్ముమీదా నాట్యం చేస్తున్నాయి. అతను నన్ను చూసినప్పుడు, నోట్లోనుండి పైపు తీసి, 'సెలవు!' అని కేకవేసినాడు. ఒక యేడాది పొడుగునా అతని కోసం యేడ్చినాను. సరిగ్గా వాళ్ల సొంత కొండల్లోకి పోడానికి వాళ్ళు సిద్ధంగా వున్నప్పుడు పట్టుబడినారు. ఒక రూమేనియన్

యింట్లో వాళ్లు వీడ్కోలు విందు జరుపుకుంటూ వుండగా పట్టుబడినారు. వాళ్లిద్దరే. కొందరు అక్కడే హతులైనారు, తక్కిన వాళ్లు తప్పించుకున్నారు.... అయినా ఆ రూమేనియన్‌కు శాస్తి చేసినారులే.... అతని పొలమూ, మిల్లూ, ధాన్యపు మిద్దెలూ కాల్చి బూడిద చేసినారు. అతను బిచ్చగాడైనాడు.''

''నీవు చేసినావా అది?'' ఊహించి అడిగినాను నేను.

''గుత్సూల్లకు చాలామంది స్నేహితులు వుండినారు — నేనొక దాన్నే కాదు. వాళ్ల ఆప్త మిత్రు లందరూ యీపని చేసినారు, వాళ్ల జ్ఞాపకార్థం....''

సముద్రం ఒడ్డున సంగీతం ఆగిపోయింది యిప్పటికి. అలల మర్మరధ్వని తప్ప ముసలామె కథకు శ్రుతి కలిపే శబ్దమేదీ లేదు. అశాంతిగా, విచారకరంగా వున్న ఆ మర్మరధ్వని యీ అశాంత జీవితపు కథకు యోగ్యమైన శ్రుతిగా వుంది. రాత్రి పలుచబడింది, వెన్నెల నీలిమ దట్టమైంది, అదృశ్య నిశాసంచారుల అస్పష్ట ధ్వనులు కరుకుదనం కోల్పోయినాయి — గాలి తీవ్రమైనందున సముద్ర గర్జారావం పెరిగి ఆ ధ్వనులను మింగేసింది.

''తరువాత నేనొక టర్కీవాణ్ని ప్రేమించినాను. స్కుతారీలో అతని జనానాలో వుండినాను. ఒక వార మంతా అక్కడ వుండినాను, కష్ట మనిపించలేదు.... కానీ తరువాత విసుగేసింది ఆ జీవితం. యెక్కడ జూసినా ఆడవాళ్లే. అతనికి యెనిమిదిమంది ఆడవాళ్లు. రోజంతా వాళ్లు తినడం, నిద్రపోవడం, చెత్త మాట్లాడడం. లేదా కొట్లాడుకోవడం, కోడిపెట్టలు కేరుకేరు మన్నట్లు కొట్లాడుకునేవాళ్లు. ఆ టర్కీవాడు వయసులో వున్నవాడు కాదు. అతని జుట్టు దాదాపు తెల్లబడింది. అతను చాలా ఐశ్వర్యవంతుడు, గొప్పవాడు. చక్రవర్తిలాగ మాట్లాడేవాడు. అతని కండ్లు నల్లగా వుండేవి, నేరుగా చూసేవి — అంటే నీ ఆత్మలోకి నేరుగా చూసేవి. అతనెప్పుడూ ప్రార్థనలు చేసేవాడు. అతన్ని నేను బుకరెస్టులో చూసినాను. బజారులో రాజులాగ తిరుగుతూ వుండినాడు, యెంతో గొప్పవాని మాదిరీ కనపడుతూ. నేను అతన్ని చూసి చిరునవ్వు నవ్వినాను. ఆ సాయంత్రమే నన్ను వీధిలో పట్టుకొని అతనివద్దకు యెత్తుకపోయినారు. అతను చందనమూ, ఖర్జూరపు కొయ్యా వర్తకం చేసేవాడు. యేవో సరుకులు కొనడానికి బుకరెస్టుకు వచ్చినాడు. 'నాతో వస్తావా?' అని అడిగినాడు అతను. 'నిరభ్యంతరంగా వస్తాను', అన్నాను. 'సరే,' అన్నాడు అతను. అలా అతనితో వెళ్లిపోయినాను. అతను చాలా ఐశ్వర్యవంతుడు. అతని కొక కొడుకు వుండినాడు, సన్నగా, నల్లని జుట్టు గల పదారేండ్ల కుర్రవాడు. అతనితోనే నేను లేచిపోయింది, టర్కీవాణ్ని వదిలి బల్గేరియాకు, లోమ్‌పలంకాకు పారిపోయినాము. అక్కడొక బల్గేరియా స్త్రీ నన్ను రొమ్మున కత్తితో పొడిచింది, తన మగుని గురించో, ప్రియుని గురించో, యెవరో గుర్తు రావడం లేదు.

"ఆ తర్వాత చాలా రోజులు ఒక ఘోషా మఠంలో జబ్బుపడి వుండినాను. ఒక పోలిష్ అమ్మాయి, సన్యాసిని, నన్ను చూస్తూ వుండింది. ఆమె అన్న, అర్ట్జర్ పలంకా దగ్గర ఒక మఠంలో సన్యాసి, ఆమెను చూడడానికి వచ్చేవాడు. అతను నాముందర వానపాములాగ మెలికలు తిరిగేవాడు. జబ్బు బాగైనతర్వాత నేను అతనితో పోలెండుకు వెళ్లిపోయినాను."

"ఆగు — ఆ టర్కీ కుర్రవా డేమైనాడు?"

"ఓ, అతనా? అతను చచ్చిపోయినాడు. అతను యింటిమీద గాలితో కృశించిపోయినాడు, లేక ప్రేమేమో అది. యెండ యెక్కువైన మొక్కలాగా వాడిపోసాగినాడు, అతను. అలా యెండిపోయినాడు.... నా కిప్పటికీ గుర్తు వస్తున్నది, అతను మంచుగడ్డలాగ నీలంగా, యీవలావలకు కనిపిస్తూ పండుకొని వుండేవాడు, కానీ ప్రేమ జ్వాలలు మండుతూ వుండేవి అతనిలో. వంగి ముద్దుపెట్టుకొమ్మని యెప్పుడూ అడుగుతూ వుండేవాడు నన్ను. నాకు అతనిమీద యెంతో ప్రేమ, యెంతగానో ముద్దుపెట్టుకొనేదాన్ని అతన్ని. కొంచెం కొంచెమే కదలలేనంత బలహీనంగా అయినాడు అతను. వూరక అలా పండుకొని నన్ను ప్రాధేయపడేవాడు, బిచ్చం పెట్టమని అడుక్కున్నట్టు, తన పక్కన పండుకొని తన దేహాన్ని వెచ్చ జెయ్య మని. అలాగే చేసేదాన్ని. నేను అతని పక్కలో పండుకున్న మరుక్షణమే ప్రజ్వలించేవాడు. ఒక రోజు నేను నిద్రలేచి చూసేటప్పటికి అతని శరీరం చల్లగా వుంది. అతను చచ్చిపోయినాడు. నేను అతనిమీద పడి యేడ్చినాను. యెవరికి తెలుసు? అతన్ని చంపింది నేనే నేమో. వయసులో నేను రెండింతలు పెద్దదాన్ని, బలంగా, దృఢంగా వుండినాను. మరి అతనో? — వట్టి పసివాడు."

ఆమె నిట్టూర్చి, దేవునికి దండం పెట్టుకుంది — యింతవరకు ఆమె చేయని పని అది. మూడు సార్లు దండం పెట్టుకుంది, యెండిన పెదవులతో యేదో గొణుగుతూ.

"'పోలెండుకు వెళ్లిపోయినా వన్నమాట —' నేను అందించినాను.

"ఔను, ఆ చిన్న పోలిష్‌వానితో. అతను పశువు, వట్టి అసంబద్ధపు మనిషి. తనకు ఆడది కావాలన్నప్పుడు పోతుపిల్లిలాగ వచ్చి నన్ను ఆనుకొని, ఒళ్లు రాచుకునేవాడు, మాటల్లో తేనె ఒలికిస్తూ. తన కోరిక తీరిన తర్వాత కొరడా దెబ్బల్లాంటి మాటలతో నన్ను వేపుకతినేవాడు. ఒక రోజున మేము నది ఒడ్డున నడుస్తూ వుండినాము. అప్పుడతను యేదో అన్నాడు అహంకారంగా, అవమానకరంగా. నాకు చెడ్డ కోపం వచ్చింది. మండిపోయినాను. అతన్ని పసి బిడ్డను పట్టుకొన్నట్టు పట్టుకొని — చిన్న మనిషిలే — పిసికినాను, నల్లగ ముఖంలో నెత్తురు గూడుకట్టేదాకా. తరువాత అతన్ని ఊచి తోసేసినాను నదిలోకి. అతను ఆవురుమని అరిచినాడు — తమాషాగా వుండింది ఆ అరుపు. అతను నీళ్లలో కొట్టుకోవడం పైనుండి చూసినాను, తరువాత వెళ్లిపోయినాను, మళ్లీ అతన్ని యెప్పుడూ చూడలేదు.

ఆ విషయంలో నేను అదృష్టవంతురాలినే: నేను వదిలేసిన తర్వాత పాత్రప్రియులు మళ్లీ యెప్పుడూ కనపడరు. వాళ్లను చూడడం బాగుండదు — చచ్చినవాళ్లను చూసినట్లు."

ముసలామె మౌనం వహించింది. ఆమె కథలో ప్రాణం పోసుకున్న వ్యక్తులు నా మనోనేత్రం ముందర కనపడినారు. తళతళలాడే యెర్ర జుట్టూ, మీసాలూ గల ఆమె గుత్సూల్ ప్రియుడు ప్రశాంతంగా పైపు కాలుస్తూ మృత్యువు నెదుర్కోవడం కనిపించింది. అతని కండ్లు నిశిత నీలంగా కనిపించినాయి నాకు, చూపులు దృఢంగా, తీవ్రంగా కనిపించినాయి. అతని పక్కన ప్రూత్‌నుండి వచ్చిన నల్ల మీసాల జాలరివాడు నడుస్తున్నాడు. చావడానికి యిష్టం లేక అతను యేడుస్తున్నాడు; ఒకప్పుడు ఉల్లాసంగా వుండిన కన్నులు మబ్బుగా తేరిచూస్తున్నాయి, మృత్యు భీతితో పాలిపోయిన తెల్లని ముఖంలోనుండి; కన్నీళ్లతో తడిసిన మీసాలు వంకర తిరిగిన నోటి మూలలనుండి దిగులుగా వ్రేలాడుతున్నాయి. గొప్పవాడుగా కనిపించే ముసలి టర్కీవాడు, విధిమీద నమ్మకం గల నియంత, కనిపించినాడు. అతని పక్కన అతని కొడుకు కనిపించినాడు, ప్రాచ్య ప్రపంచపు పాలిపోయిన సుకుమార పుష్పంలాంటి వాడు, ముద్దుల విషం యెక్కినవాడు. దురహంకారపు పోలిష్‌వాడు వినయంగా, క్రూరంగా — ఉద్విగ్నంగా, కటువుగా, కనిపించినాడు. వాళ్లందరూ యిప్పుడు మాసిపోయిన నీడలైనారు; వాళ్ల అంత గాఢంగా ముద్దులు పెట్టుకున్న యీమె నా పక్కన కూర్చొని వుంది, యింకా సజీవంగా, కానీ వయసుతో యెండిపోయి — రక్తం లేకుండా, మాంసం లేకుండా, హృదయంలో కోరిక అనేది లేకుండా, కన్నుల్లో కాంతి లేకుండా — వాళ్ల లాగే దాదాపు నీడలాగుంది.

ఆమె చెప్పసాగింది:

"పోలెండులో జీవితం నాకు కష్టంగా వుండింది. అక్కడివాళ్లు బూటకం మనుషులు, కుచ్చితులు. వాళ్ల పాముల భాష నాకు రాదు, బుసకొట్టే భాష. వాళ్ళు యెందుకు బుసకొడతారు? వాళ్ల అంత బూటకం మనుషులు గనుకనే దేవుడు వాళ్లకు పాముల భాష యిచ్చినాడు. అక్కడనుండి బయలుదేరినాను, యెక్కడికనీ లేకుండా. అప్పుడు పోలిష్‌వాళ్లు మీ రష్యన్ల మీదికి తిరుగుబాటు చేయడానికి సన్నాహాలు చేసుకుంటూ వుండినారు. బోహ్నీ పట్నం వచ్చినాను. ఒక యూదు నన్ను కొన్నాడు, తన కోసం కాదు, నా శరీరంతో వ్యాపారం చేయడానికి. నేను ఒప్పుకున్నాను. బతకడానికి యేదో ఒక పని చేయగలగాలి. నాకు యే పనీ చేతగాదు. కనుక నా శరీరంతో బతికినాను. కానీ, ఒక నిశ్చయం చేసుకున్నాను, బిర్లాత్‌నదిమీద మా సొంత పట్నం పోవడానికి కావలసినంత డబ్బు దొరికితే, యీ బంధనాలు యెంత గట్టిగా వున్నా తెంచుకోవాలని. ఆ జీవితం బాగానే వుండింది. డబ్బున్న పెద్దమనుషులు వచ్చేవాళ్లు, నాతో విందులు చేసుకునేవాళ్లు. ఆ విందులకు చాలా డబ్బు ఖర్చయేది. వాళ్లు నాకోసం ఒకరితో ఒకరు కొట్లాడుకొని నాశన మయ్యేవాళ్లు. వాళ్లలో ఒకడు నా హృదయం చూరగొనడానికి చాలా కాలం ప్రయత్నం చేసినాడు; చివరకు

యేమి చేసినా డంటే, ఒక పెద్ద సంచితో తన నౌకరును వెంటబెట్టుకొని వచ్చినాడు, వచ్చి ఆ సంచి నా తలమీద కుమ్మరించినాడు. బంగారు నాణ్యాల వర్షం కురిసింది నామీద, అవి నేలమీద పడి చేసిన గలగల శబ్దం నా హృదయానికి ఆనందం కలిగించింది. అయినా అతన్ని తరిమేసినాను. యింత లావు జిడ్డు ముఖం అతనిది, పొట్ట దిండులాగ మెత్తగా వుండేది. బలిసిన పందిలా గుండేవాడు. అవును, అతన్ని తరిమేసినాను, నాకోసం ఆ బంగారు తేవడానికి తన పొలమూ, యిల్లూ, గుర్రాలూ అమ్మినానని అతను చెప్పినప్పటికీ. అప్పటికి నేను కత్తి గంట్ల ముఖం గల ఒక యోగ్యుడైన పెద్దమనిషిని ప్రేమించినాను. టర్కిష్ ఖడ్గాల గాయాలతో అతని ముఖమంతా కాట్లు కాట్లుగా వుంది. గ్రీకులకు సహాయంగా టర్కీవాళ్లతో యుద్ధం చేసి అప్పుడప్పుడే తిరిగి వచ్చినాడు అతను. మనిషంటే అతను! తాను పోలిష్‌వాడు, గ్రీకులు యెవరు తనకు? అయినా పోయి వాళ్లకు యుద్ధంలో తోడ్పడినాడు. టర్కీవాళ్లు క్రూరంగా గాయపరిచినారు అతన్ని — వాళ్ల దెబ్బలతో అతనికి ఒక కన్నూ, యెడమ చేతిని రెండు వ్రేళ్లూ పోయినాయి. అతను పోలిష్‌వాడు, గ్రీకులు యెవరు తనకు? అయినా అతను వాళ్ల తరపున యుద్ధం చేసినాడు. యెందుకు చేసినాడంటే సాహస కృత్యాలు చేయాలని అతనికి ఉబలాటం. ఆ ఉబలాటం వున్నవానికి యెప్పుడైనా అవకాశం దొరుకుతుంది. జీవితంనిండా అలాంటి అవకాశాలు వున్నాయి. యెవనికైనా అవకాశాలు దొరకలేదంటే, వాడు సోమరిపోతు ఐనందువల్ల, లేదా పిరికివాడైనందువల్ల, లేదా వానికి జీవితం అర్థం కానందువల్ల. జీవితం అర్థమైతే వాడు తన నీడ తనవెనుక వదలిపెట్టి పోవాలని తప్పక కోరుకుంటాడు. ప్రతి వొకడూ యిలా కోరుకుంటే, జీవితం మనుషులను దిగమింగదు, మట్టు లేకుండా.... చాలా ఉత్తమమైన మనిషి అతను, ఆ కత్తి గంట్ల మనిషి. ఒక మంచి పని చేయడానికి అతను దేనికైనా వెనుదీసేవాడు కాదు. తిరుగుబాటులో అతన్ని మీవాళ్లు చంపినా రనుకుంటాను. మగ్యార్లతో మీ రెందుకు యుద్ధం చేసినారు? వద్దు, యేమీ చెప్పవద్దు, ఊరుకో."

నన్ను వూరుకొమ్మని ముసలి ఇజెర్గిల్ తానే మౌనంగా ఆలోచనలో మునిగిపోయింది.

"నా కొక మగ్యార్ పరిచయం. అతను ఒకరోజు మా యింటినుండి పోయినాడు. మంచి చలికాలం అది. మళ్లీ వసంత రుతువులో, మంచు కరిగిన తర్వాత, అతని శరీరం కనపడింది, తలలో తుపాకి గుండుతో. ప్లేగుతో యెంతమంది చస్తారో, ప్రేమతోనూ అంతమంది చస్తారు — యేమీ తక్కువ వుండరు, యెంచుకుంటే. నేను చెప్పతున్న దేమిటి? ఆ, ఔను, పోలెండును గురించి. అక్కడే నేను నా చివరి నాటకం ఆడినాను. అక్కడొక పెద్దమనిషిని కలిసినాను. అతను చాలా అందంగా వుండినాడు, అతిలోకమైన అందం. కానీ అప్పటికి నేను ముసలిదాన్నైనాను. ఓహ్, యెంతో ముసలి దాన్ని! అప్పటికి నాకు నలభై యేండ్లు వుండాలి, కనీసం నలభై. అతను గర్విష్ఠి, ఆడవాళ్లు అతని తల

తిప్పేసినారు. అతనితో వ్యవహారం నన్ను చాలా కష్టపెట్టింది. ఊఁ అంటే నేను లోబడతానని అతను అనుకున్నాడు. కానీ నేను అంత సులభంగా లొంగలేదు. యెప్పుడూ యెవరికీ నేను బానిసను కాలేదు; అప్పటికి ఆ యూదుతో తెంచుకొని, పెద్ద మొత్తం యిచ్చి తిరిగి స్వేచ్ఛ పొందినాను. క్రాకొవ్‌లో వైభవంగా బతుకుతూ వుండినాను — గుర్రాలూ, బంగారూ, నౌకర్లూ, కోరిన వన్నీ వుండినాయి నాకు. అతను నన్ను చూడడానికి వచ్చేవాడు, ఆ గర్విష్ఠ భూతం; పూరక తన ఒడిలో వాలుతా ననుకున్నాడు. మా యిద్దరిమధ్య హోరాహోరి యుద్ధం సాగింది. ఆ బరువుతో నా రూపం మారిపోయింది, ఆ యుద్ధం చాలా కాలం సాగింది. కానీ చివరకు నేనే జయించినాను: అతను నా కాళ్లమీద పడినాడు. కానీ నేను లోబడిన వెంటనే నన్ను వదిలేసినాడు అతను. అప్పుడు తెలిసి వచ్చింది నాకు నేను ముసలిదాన్నైనానని. ఆ తెలివిడి బాధాకరంగా వుండింది. చాలా బాధాకరంగా వుండింది. అతనిమీద నాకు ప్రేమ, ఆ రాక్షసునిమీద, కానీ నేను యెదురైనప్పుడు నా ముఖాన్నే నవ్వేవాడు. అతను పశువు. యితర్ల దగ్గర నన్ను యెగతాళి చేసేవాడు, అది నాకు తెలిసేది. ఓహ్, యెంత బాధపడినా నని! కానీ అతను అక్కడే ఆ పట్నంలోనే వుండినాడు, యెంతైనా అతనంటే నాకు వెర్రి వ్యామోహం. తరువాత ఒకనాడు అతను వెళ్లిపోయినాడు, రష్యన్లతో యుద్ధానికి. నేను భరించలేకపోయినాను. నిగ్రహించుకోడానికి ప్రయత్నం చేసినాను. కానీ నా హృదయం నా వశంలో లేదు. అతనివద్దకు పోవడానికి నిశ్చయించుకున్నాను. వార్సా దగ్గర ఒక అడవిలో వుండింది వాళ్ల పటాలం.

"కానీ నేను అక్కడికి పోయినప్పుడు తెలిసింది, మీ సైన్యం వాళ్లను ఓడించి, అతన్ని ఖైదీగా పట్టుకున్నా రని. దగ్గరలోనే ఒక గ్రామంలో అతన్ని పెట్టినారు.

"'అనగా యింక అతన్ని చూడలే నన్నమాట!' అని అనుకున్నాను. కానీ యేమైనా అతన్ని చూడాలని వుంది. కనుక ఒక మార్గం ఆలోచించినాను.... బిచ్చగత్తె లాగ వేషం వేసుకున్నాను, కుంటి కాలు అభినయించినాను, ముఖానికి ముసుగు వేసుకొని, అతను ఖైదీగా వున్న గ్రామానికి బయలుదేరినాను. ఆ గ్రామం సైనికులతోనూ, కోసక్కులతోనూ నిండి వుంది.... అక్కడ నేను చాలామందిని తృప్తిపెట్టవలసి వచ్చింది. పోలులు యెక్కడ వున్నదీ తెలుసుకున్నప్పుడు అర్థమైంది నాకు, వాళ్లను చేరడం చాలా కష్టమని. కానీ చేరితీరాలి. కనుక ఒక రాత్రి బయలుదేరినాను. ఒక కూరగాయల తోటలో పాదుల్లో ప్రాకుతూ పోతూ వుండగా నా ముందర ఒక పహరా సైనికుడు నిలబడివుండడం చూసినాను. పోలులు బిగ్గరగా పాటలు పాడడమూ, మాట్లాడడమూ వినబడుతున్నది. వాళ్లు మేరీ మాతకు ప్రార్థనపాట పాడుతున్నారు, నా అర్కాడెక్ కూడా వాళ్లతో కలిసి పాడుతున్నాడు. నాకు గుండెలో పొడిచినట్లు గుర్తు వచ్చింది, ఒకప్పుడు మగవాళ్లు నేలమీద ప్రాకుతూ నావెంట బడినారు, యిప్పుడు నేను ఒక మగవాని వెంటబడి పురుగులాగ ప్రాకుతున్నాను, బహుశా

మృత్యు సన్నిధికి ప్రాకుతున్నాను. పహరా సైనికుడు చెవులు రిక్కించి, ముందుకు వంగినాడు. నేనేం చెయ్యాలి అప్పుడు? లేచి అతనివైపు వెళ్లినాను. నా దగ్గర కత్తిగానీ, యే ఆయుధంగానీ లేదు — నా చేతులూ, నోట్లో నాలుకా తప్ప యేమీ లేవు. వెంట కత్తి తీసుకపోనందుకు చింతించినాను. 'ఆగు' అన్నాను. పహరావాడు తుపాకి సన్నీ నా గొంతు కెదురుగా పెట్టినాడు. నేను గుసగుస అన్నాను: 'ఆగు! నేను చెప్పేది విని, నీలో హృదయం అనేది వుంటే నా ప్రాణం దక్కించు. నీ కివ్వడానికి నాదగ్గర యేమీ లేదు. కనికరించ మని ప్రార్థిస్తున్నాను.' అతను తుపాకి దించి, గుసగుస చెప్పినాడు: 'వెళ్లిపో, ముసలిదానా. వెళ్లిపో. యెందుకు వచ్చినావు?' నా కొడుకు అక్కడ ఖైదీగా వున్నాడని చెప్పినాను. 'నాకొడుకు, సిపాయీ, నా కొడుకు. కొడుకంటే యేమిటో నీకు అర్థ మౌతున్నదా? నీవు కూడా ఒక తల్లి కొడుకువే. కనుక నావైపు చూసి అర్థంచేసుకో, నాకు నీలాంటి కొడుకు వున్నాడు, వా డిక్కడ ఖైదులో వున్నాడు. వాణ్ని ఒక్కసారి చూడనీ. బహుశా వాడు త్వరలోనే చస్తాడు, బహుశా నీవు కూడా రేపు చావవచ్చు.... నీకోసం మీ అమ్మ కన్నీళ్లు కార్చదూ? మీ అమ్మను కడచూపు చూడకుండా చావడం బాధగా వుండదూ నీకు? నా కొడుక్కు కూడా అలాగే బాధగా వుంటుంది. కనుక నిన్ను నీవు కనికరించుకో, వాణ్ని కనికరించు, నన్ను కనికరించు, తల్లిని!'

''అతన్ని ఒప్పించడానికి ప్రయత్నిస్తూ యెంత సేపు అక్కడ నిలబడినానో! వర్షం కుండపోతగా కురుస్తున్నది, యిద్దరమూ తడిసిపోయినాము. గాలి పోసుకుంటున్నది, గీపెడుతూ; ఒకసారి వీపునా, ఒకసారి రొమ్మునా వూచి కొడుతున్నది నన్ను. ఆ రాతిగుండె సిపాయి ముందర వెనక్కీ ముందుకూ వూగుతూ నిలుచున్నాను. అతను 'కాదు' అనే మాటే చెప్తూ వున్నాడు. ఆ ముష్కరమైన మాట విన్నప్పుడల్లా, అర్కాడెక్‌ను చూడాలనే కాంక్ష నాలో యింకా ప్రజ్వలిస్తున్నది. అతనితో మాట్లాడుతూ మనసులో అతన్ని అంచనావేసుకు న్నాను — అతను చిన్న మనిషి, బక్కగా వున్నాడు, దగ్గుతున్నాడు. చిట్టచివరకు అతని ముందర నేలమీద పడినాను; యింకా ప్రాధేయపడుతూ, అతన్ని మోకాళ్ల చుట్టూ పెనవేసుకొని, కింద తోసినాను. అతను బురదలో పడినాడు. త్వరగా అతన్ని బోర్ల తిప్పి, తలను బురద గుంతలోకి అణగదోసినాను, అరవకుండా వుండడానికి. అతను అరవలేదు, కానీ తన వీపుమీదనుండి నన్ను పక్కకు తోయడానికి ప్రయత్నిస్తూ తన్నుకలాడినాడు. అతని తల రెండు చేతులతోను పట్టుకొని బురదలోకి యింకా లోతుగా తోసినాను. అతను వూపి రాడక చచ్చిపోయినాడు. అప్పుడు నేను పోలులు పాట పాడుతున్న ధాన్యాగారం వద్దకు పరుగెత్తినాను. గోడలో వున్న ఒక నెర్రెగుండా 'అర్కాడెక్!' అని మెల్లగా పిలిచినాను. ఆ పోలులు యుక్తిపరులు, నా మాట విని పాట పాడడం ఆపలేదు. కానీ హఠాత్తుగా అతని కండ్లు నాకెదురుగా కనిపించినాయి. 'బయటికి రాగలవా?' అని అడిగినాను. 'గోడకిందనుంచి

రావచ్చు', అన్నాడు. 'అయితే త్వరగా రా,' అన్నాను. ఆ ధాన్యాగారంలోనుండి వాళ్ళు నలుగురు ప్రాకుతూ బయటికి వచ్చినారు, నా అర్కాడెక్‌తో సహా. 'పహరా సైనికుడు యెక్కడ?' అని అర్కాడెక్ అడిగినాడు. 'అడుగో అక్కడ పడివున్నాడు,' అని చూపించినాను. అప్పుడు వాళ్ళు నేల తగిలేటట్లు వంగి, సాధ్యమైనంత నిశ్శబ్దంగా పోయినారు. వర్షం కుండపోతగా పడుతూనే వుంది, గాలి ఫీంకరిస్తూనే వుంది. మేము వూరు దాటి అడవిలో చాలాసేపు నడిచినాము, ఒక్క మాటకూడా మాట్లాడకుండా. వేగంగా నడిచినాము. అర్కాడెక్ నా చేయి పట్టుకున్నాడు. అతని చేయి వేడిగా, వణుకుతూ వుంది. అతను మాట్లాడకుండా వున్నంతసేపూ అతని పక్కన నడవడం యెంతో హాయిగా వుంది. అవి నా చివరి క్షణాలు —నా సుఖ లాలస జీవితంలో చివరి ఆనంద మయమైన క్షణాలు. చివరకు ఒక పచ్చిక బయలులోకి వచ్చినాం, అక్కడ ఆగినాం. వాళ్ళు నలుగురూ నేను చేసిన సహాయానికి కృతజ్ఞత తెల్పినారు. వాళ్ళు మాట్లాడుతూనే వున్నారు — వాళ్ళ నోర్లు యిక మూత పడవేమో అనుకున్నాను. వాళ్ళు మాట్లాడుతున్నంతసేపూ నా అర్కాడెక్‌ను తనివిదీర చూస్తూనే వున్నాను. అతనిప్పుడు నాతో యెలా వ్యవహరిస్తాడో? అతను నన్ను కౌగిలించుకొని చాలా ఆడంబరంగా యేదో అన్నాడు, యేమన్నాడో సరిగా గుర్తులేదు గానీ, ఖైదునుండి విడిపించినందుకు కృతజ్ఞతగా నన్ను ప్రేమిస్తా నన్నాడు; నా ముందర మోకాళ్ళమీద వంగి, చిరునవ్వుతో 'నా హృదయ రాణీ!' అన్నాడు. తప్పుడు కుక్క! కాలితో తన్నినాను. చెంపమీద ఒకటి వేస్తా మనుకున్నాను గానీ, అంతలో పక్కకు తప్పుకున్నాడు. అతను నా ముందర నిలబడి వున్నాడు, ముఖం పాలిపోయి, భీకరంగా చూస్తూ. తక్కిన ముగ్గురూ మూతులు ముడుచుకొని మౌనంగా వున్నారు. నేనూ వాళ్ళవైపు బిర్రుగా చూసినాను. యేదో తీవ్రమైన విసుగూ, ఉదాసీనతా నన్ను ఆవరించినాయి, నాకు బాగా జ్ఞాపకం. 'వెళ్ళి పొండి,' అన్నాను వాళ్ళతో. వాళ్ళు, ఆ కుక్కలు, నాతో యిలా అన్నారు: 'నీవు పోయి మళ్ళీ వాళ్ళతో చెప్తావా, మేము యే దారిన వెళ్ళిందీ?' ఆ పశువులు అన్న మాట అది. కానీ వాళ్ళు వెళ్ళిపోయినారు. నేనూ వెళ్ళిపోయినాను. మరుదినం మీ సైనికులు నన్ను పట్టుకున్నారు. కానీ చాలా రోజులు వుంచుకోలేదులే. అప్పుడు అనుకున్నాను, స్థిర జీవితం యేర్పరచుకోవలసిన సమయం వచ్చిందని — కోకిల జీవితం యిక చాలు. దేహం బరువెక్కింది, రెక్కలు బలం తగ్గినాయి, యీకల తళుకు పోయింది. ముసలిదాన్నైనాను, ముసలిదాన్నైనాను. అలా గలీషియాకు పోయినాను, అక్కడినుండి డొబ్రూజకు పోయినాను. యీ ముప్పై యేండ్లూ అక్కడే వున్నాను. పెండ్లి చేసుకున్నాను, ఒక మాల్దేవియా దేశస్థుణ్ణి; సుమారు యేడాది కిందట చచ్చిపోయినాడు. నేను జీవిస్తూనే వున్నాను. ఏకాకిగా. కాదు, ఏకాకిగా కాదు — వాళ్ళతో కలిసి — '' అంటూ ముసలామె సముద్రంవైపు చూపించింది.

అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. అప్పుడప్పుడు యేదో శబ్దంలాంటిది వినపడుతున్నది గానీ, అది వినపడీ వినపడముందే ఆగిపోతున్నది.

"వాళ్లకు నేనంటే ప్రేమ. వాళ్లకు యెన్నో కథలు చెప్తాను, వాళ్ల కని యిష్టం. వాళ్లు అంత యవ్వనంలో వున్నారు. వాళ్లమధ్య నాకు హాయిగా వుంటుంది. వాళ్ల వైపు చూస్తూ అనుకుంటాను: 'ఒకప్పుడు నేను వాళ్లలాగ వుండినాను. కానీ మా కాలంలో మనుషులకు యింకా యెక్కువ బలమూ, జీవశక్తీ వుండినాయి. అందుకే జీవితం యింతకంటె ఆనందంగా, సార్థకంగా వుండింది... అదీ సంగతి.' "

ఆమె మళ్లీ మౌనంలో పడిపోయింది. ఆమె పక్కన కూర్చున్న నాకు విషాదం కలిగింది. యింతలో ఆమె తూగుతూ వుంది, తల వూపుతూ, యేదో గొణుక్కుంటూ గొంతులో, ప్రార్థన కాబోలు.

ఒక నల్లని మేఘం, పర్వత పంక్తి లాంటి విషమ బాహ్య రేఖలతో, సముద్రంనుండి ఉద్భవించి, మైదానంవైపుకు వచ్చింది. దాని అత్యున్నత శిఖరంనుండి ముక్కలు తెగిపోయి ముందుకు వురుకుతున్నాయి, నక్షత్రాలను ఒకొకదాన్నే ఆర్పివేస్తూ సముద్రం మర్మరిస్తు న్నది. కాస్త దూరంలో వున్న ద్రాక్షతోటనుండి ముద్దులూ, గుసగుసలూ, నిట్టూర్పులూ వినపడుతున్నాయి. మైదానంలో కుక్క మొరుగుతున్నది. గాలిలో యేదో వింత వాసన నిండింది, ముక్కులకు ఘాటుగా తగులుతూ, నరాలకు జిలజిల మనిపిస్తూ. మేఘాల నీడలు భూమిమీద గుత్తులు గుత్తులుగా పడుతున్నాయి, ఒకోసారి మాసిపోతూ, ఒకోసారి దట్టమై స్పష్టంగా కనపడుతూ. చంద్రుడు అస్పష్టంగా, పాల రాయి కాంతిలాగ అయిపోయినాడు, అప్పుడప్పుడు మేఘ ఖండాల చాటున పూర్తిగా కనపడకుండా పోతూ. యిప్పుడు చీకటి గమ్మి, యేదో భయంకరమైనది అక్కడ పొంచుకొని వున్నట్లు ముష్కరంగా వున్న మైదానంలో యెక్కడో దూరాన చిన్న నీలి దీపాలు మినుకు మినుకు మంటున్నాయి. యెవరో మనుషులు మైదానంలో దేనికోసమో వెదకుతూ అగ్గిపుల్లలు గీస్తే, అవి వెలిగి వెంటనే గాలికి ఆరిపోయినట్లు, ఆ దీపాలు వున్నట్లుండి తళుక్కుమంటున్నాయి. అవి చిత్రంగా వున్నాయి, ఆ నీలి దీపాలు, దేవతాకథల్లోలాగా కనిపిస్తూ.

"అక్కడ దూరాన నీకు మిణుగురు లేమైనా కనిపిస్తున్నాయా?" అని అడిగింది ఇజెర్గిల్.

"ఆ నీలి దీపాలా?" అన్నాను నేను, మైదానంలోకి చేయి చూపుతూ.

"నీలి? అఁ, ఆ చిన్న దీపాలు. అవి యింకా కనపడుతున్నా యన్న మాట! నా కండ్లకు కనపడవులే. యిప్పుడు నాకు కనపడనివి చాలా వున్నాయి."

"అవి యెలా వచ్చినాయి?" అని అడిగినాను ముసలామెను.

వాటినిగురించి అప్పటికే నేను ఒక వివరణ విని వున్నాను; ఐనా, ముసలి ఇజెర్గిల్ యేమి చెప్తుందో విందా మనుకున్నాను.

"అవి మండే దాంకొ హృదయంనుండి వచ్చినవి. ఒకప్పుడు ఒక హృదయం మండింది. అందులో యిప్పుడు మిగిలినవి ఆ మిణుగురులు. ఆ కథ చెప్తాను. అది కూడా పాతదే. ప్రతిదీ పాతదే! పూర్వ కాలంలో యెన్ని మంచి విషయాలు వుండినాయో చూడు! యిప్పుడు యేమీ లేవు — మనుషులు లేరు, గొప్ప పనులు లేవు, కథలు లేవు — పూర్వకాలంనాటి వాటితో పోల్చ దగినవి యేమీ లేవు. యెందుకు? చెప్పమరి. ఆఁ, నీవు చెప్పలేవు. నీకేం తెలుసు? మీ యువకుల్లో యెవరికైతే యేం తెలుసు? గతాన్ని శోధిస్తే జీవిత సమస్యల కన్నిటికీ జవాబులు దొరుకుతాయి. కానీ మీ రాపని చేయరు, అందువలన మీ కేమీ తెలియదు. యేమి జరుగుతున్నదో నేను గమనించలే ననుకున్నావా? యెంతో బాగా గమనిస్తున్నాను, కండ్లు బలహీన మైనప్పటికీ. మనుషులు జీవించడానికి బదులు జీవితానికి సిద్ధం కావడంలో తమ ఆయుస్సంతా గడిపేస్తున్నారు. అలా కాల మంతా వ్యర్థం చేసి, అంతా పోగొట్టుకున్న తర్వాత, విధిని నిందిస్తారు. విధికేమి సంబంధం? ప్రతి వొకడూ యెవని విధి వాడే. యీ నాడు ప్రపంచంలో అనేక రకాల మనుషులు వున్నారు, కానీ బలంగలవాళ్లు లేరు. యేమైనారు వాళ్లు? యిక అందమైనవాళ్లు దినదినానికీ తగ్గిపోతున్నారు."

ముసలామె ఆగింది, బలంగలవాళ్లూ, అందమైన వాళ్లూ యేమైనారో యోచించడానికి; యోచిస్తూ ఆమె చీకటి మైదానంలోకి పారజూసింది, జవాబు కొరకు అక్కడ వెదకుతు న్నట్టు.

ఆమె కథ మొదలు పెట్టిందాకా మౌనంగా ఆగినాను, నే నేమన్నా ఆమె పక్కదారి పట్టుతుందేమో అనే భయంతో.

కాసేపట్లో ఆమె మొదలుపెట్టింది.

## III

"చాలా చాలా కాలం కిందట, మూడు పక్కల దుర్గమమైన అడవులూ, నాల్గవ పక్క మైదానమూ గల ఒక ప్రాంతంలో ఒక తెగ జనులు నివసిస్తూ వుండినారు. వాళ్లు బలమూ, ధైర్యమూ గలవాళ్లు, ఉల్లాసంగా బతికేవాళ్లు. కానీ వాళ్లకు చెడ్డ కాలం వచ్చింది. యితర తెగలు వాళ్లమీదికి దండెత్తి, వాళ్లను అడవి మధ్యకు తరిమేసినారు. ఆ అడవి చీకటిగా, బురదగా వుండింది; యెందుకంటే అది చాలా పురాతనమైన అడవి, ఆకాశం కనపడకుండా చెట్ల కొమ్మలు దట్టంగా అల్లుకున్నాయి, దట్టమైన ఆకుల సందునుండి సూర్య కిరణాలు బురదనేలకు చేరడం దుర్లభం. యెక్కడైనా సూర్య కిరణాలు కింద నీళ్లమీద పడిన చోట విషపూరితమైన ఆవిరి ఉద్భవించి, దానితో జనులు రోగం

వచ్చి చచ్చిపోయేవాళ్ళు. ఆ తెగలోని స్త్రీలూ, పిల్లలూ యేడవ సాగినారు. జరిగిన దాన్ని గురించి యోచిస్తూ మగవాళ్లు దిగులు పడినారు. అడవిలోనుండి బయటపడడం తప్ప గత్యంతరం లేదు. బయటపడడానికి రెండే మార్గాలు వున్నాయి: ఒకటి, వచ్చిన దారివెంట తిరిగి పోవడం, కానీ ఆ దారి చివరన బలవంతులూ, క్రూరులూ అయిన శత్రువులు వున్నారు; మరొకటి, అడవిగుండా ముందుకు పోవడం, కానీ యీ దారిలో బ్రహ్మాండమైన వృక్షాలు వున్నాయి, వాటి విస్తారమైన కొమ్మలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని వున్నాయి, వాటి ఊడలు వడదిరిగి బురద నేలలో లోతుగా పాతుకొని వున్నాయి. శిలలలాంటి యీ చెట్లు పగటిపూట మసక చీకటిలో మౌనంగా, నిశ్చలంగా నిలుచుకొని వుంటాయి; చీకటి పడినాక మనుషులు మంటలు వెలిగించినప్పుడు అవి వాళ్లమీదికి మూసుకొని వచ్చినట్లుంటాయి. మైదానపు స్వేచ్ఛలో పుట్టిన యీ జనులు వాళ్లను నలిపివేయడానికి కాచుకొని వున్నట్లున్న నీడల మధ్య బంధింపబడినారు. చెట్ల తలల మధ్య గాలి మూలుగుతూ పోయినప్పుడు అన్నిటికంటె భయంకరంగా వుండేది, అక్కడ బంధింపబడిన జనులకు అరణ్యమంతా విషాద గీతం పాడినట్లుండేది. వాళ్ళు ధైర్యంగల జనులని అన్నానుగా, తమను ఓడించిన శత్రువులతో చావుకు తెగించి పోరాడేవాళ్లే, యుద్ధంలో తమ జాతి నిర్మూలమౌతుం దనే భయం లేకపోతే: వాళ్లు తమ పూర్వీకుల సంప్రదాయాలను సంరక్షించుకోవలసి వుండింది, వాళ్లు నిర్మూలమైతే, ఆ సంప్రదాయాలు వాళ్లతో పాటు నశిస్తాయి. అందువలన వాళ్ళు దీర్ఘ రాత్రులలో తమ గతికి విచారిస్తూ కూర్చునేవాళ్ళు, ఆ విష వాయువుల మధ్య, అరణ్యం పాడే విషాద సంగీతం మధ్య. వాళ్లు అక్కడ కూర్చొని వుండగా, వాళ్లచుట్టూ మంటల నీడలు మౌన నృత్యం చేస్తూ గంతులు వేసేవి; అవి కేవలం నీడలు కానట్లూ, అడవి భూతాలూ, అడుసునేల భూతాలూ తమ విజయోత్సవం చేసుకుంటున్నట్లు వుండేది.... మనుషులు విచారిస్తూ కూర్చునేవాళ్లు. దిగులు మనుషులను నిర్వీర్యపరిచినట్లు యేదీ నిర్వీర్యపరచదు, పని గానీ, ఆడవాళ్లు గానీ. దిగులుతో వాళ్లు బలహీను లైనారు.... వాళ్ల హృదయాలలో భయం పుట్టింది, అది వాళ్ల బలమైన చేతులను కట్టివేసింది. విషవాయువులతో మరణించినవాళ్ల దేహాలమీద పడి యేడ్చే ఆడవాళ్లనూ, భయంతో నిస్సహాయులై జీవించేవాళ్ల దుర్గతికి శోకించే ఆడవాళ్లనూ చూస్తుంటే వాళ్లను భీతి ఆవరించింది. అడవిలో పిరికి మాటలు వినపడడం ప్రారంభమైంది — మొదట మెల్లగా, బెరికి బెరికిగా, కానీ కాలం గడిచేకొద్దీ అంత కంతకూ బిగ్గరగా. చివరకు ఆ జనులు అనుకున్నారు, శత్రువులవద్దకు పోయి తమ స్వేచ్ఛను వాళ్లకు అర్పించాలని. చచ్చిపోతామని వాళ్లు యెంతగా భయపడినా రంటే, బానిస బతుకు బతకడానికి వాళ్లలో ఒక్కడూ వెనుకాడలేదు. ఆ తరుణంలో దాంకొ ప్రత్యక్షమై ఆ దుర్గతినుండి వాళ్లను రక్షించినాడు.''

ముసలామె యీ దాంకొ మండే గుండె కథను చాలా సార్లు చెప్పినట్లుంది. ఆ కరకు జీర గొంతుతో ఆమె ఆ కథ చెప్తూవుంటే, దురదృష్టవంతులైన ఆ నిర్వాసితులు విషవాయువులచే మరణించే ఆ అడవిలోని శబ్దాలు నాకు వినిపిస్తున్నట్లే వుంది.

"దాంకొ ఆ తెగకు చెందినవాడు, అందమైన యువకుడు. అందమైనవాళ్లు యెప్పుడూ ధైర్యవంతులుగా వుంటారు. అతను తన సహచరులతో యిలా అన్నాడు:

" 'ఆలోచనలతో రాళ్లు పక్కకు పోవు. యేమీ చేయనివానికి యేమీ లభించదు. ఆలోచనతోనూ, విచారంతోనూ మన శక్తి సన్నగిల్ల జేయడం యెందుకు? లేవండి, అడవిలో ఆవలి కొన వచ్చిందాకా పోదాం. యేమైనా అడవికి అంతం అనేది వుండాలి— ప్రతిదానికీ అంతం వుంది. రండి, బయలుదేరుదాం.'

"వాళ్లు అతనివైపు చూసినారు, అతని కండ్లలో జీవమూ, బలమూ వెలుగుతున్నాయి, తమలో అతను ఉత్తమమైన వ్యక్తి అని వాళ్లు గ్రహించినారు.

" 'మమ్మల్ని నడిపించు,' అన్నారు వాళ్లు.

"అతను వాళ్లను నడిపించినాడు."

ముసలామె మాట్లాడడం ఆపి, మైదానంలోకి చూసింది. మైదానం అంతకంతకూ చీక టౌతున్నది. దూరాన దాంకొ మండే గుండెనుండి మిణుగురులు వెలుగుతున్నాయి, క్షణకాలంపాటు వికసించే అలౌకికమైన నీలి పుష్పాల లాగ.

"ఆ విధంగా దాంకొ వాళ్లను నడిపించినాడు. వాళ్లు అతన్ని బుద్ధిపూర్వకంగా అనుసరించినారు, అతన్ని నమ్మినారు గనుక. అది కష్టమైన దారి, చుట్టూ చీకటి; అడుగడుగునా అడుసు గుంతలు నోర్లు తెరిచి మనుషులను దిగమింగేవి; చెట్లు కోట గోడ లాగ దారి కడ్డం వుండేవి. చెట్ల కొమ్మలు అల్లిబిల్లిగా పెనవేసుకున్నాయి, చెట్ల ఊడలు పాముల్లాగా దిక్కుదిక్కులా వ్యాపించినాయి. ప్రతి అడుగుకూ వాళ్లు రక్తమూ, చెమటా ధారవోయవలసి వచ్చింది. చాలా రోజులు వాళ్లు నడిచినారు.... వాళ్లు ముందుకు నడిచే కొద్దీ అడవి దట్టమైంది, వాళ్ల కాళ్లలో శక్తి క్షీణించింది. అప్పుడు దాంకొకు వ్యతిరేకంగా గుసగుసలు ప్రారంభమైనాయి, అతను కుర్రవాడనీ, అనుభవం లేదనీ, తమను యిక్కడికి తీసుకరావడం అతని తప్పు అనీ అంటూ. కానీ అతను వాళ్ల అగ్రభాగాన నడుస్తూనే వున్నాడు, నిశ్చలమైన ధైర్యంతో, నిశ్చితమైన మనస్సుతో.

"కానీ ఒక రోజున అడవిలో తుఫాను చెలరేగింది. చెట్లు భీకరంగా గుసగుస లాడుకుంటున్నాయి. క్షణంలో అంతా గాఢాంధకార మైంది, ఆ అడవి పుట్టినప్పటినుండి యెన్నిరాత్రులు గడచినాయో, ఆ రాత్రులన్నీ యిక్కడ గుమికూడినట్లు. ఆ పెద్ద చెట్లకింద ఆ చిన్న మనుషులు తుఫాను గర్జల మధ్య నడుస్తూ వుండినారు. వాళ్లు నడుస్తూ వుండగా ఆ బ్రహ్మాండమైన చెట్లు కిటకిటలాడుతూ భీకర సంగీతం చేసినాయి;

చెట్ల కొనలపైన మెరుపు మెరుస్తూ, క్షణ కాలం ముష్కరమైన నీల కాంతి వెదజల్లి, అంతలోనే అదృశ్యమై, వాళ్ల హృదయాలను భయంతో బ్రద్దలు చేస్తున్నది. మెరుపుల ముష్కర కాంతిలో చెట్లు సజీవంగా వున్నట్లు కనపడుతున్నాయి, ఆ చీకటినుండి తప్పించుకొనిపోడానికి ప్రయత్నిస్తున్న ఆ మనుషులను పట్టుకోడానికి వడదిరిగిన తమ దీర్ఘ హస్తాలు చాచి వలలాగా అల్లుకుంటున్నట్లు. నల్లని చెట్ల ఆకుల గుండా యేదో ముష్కరంగా, నల్లగా, భీకరంగా వాళ్లవైపు తొంగిచూస్తున్నది. ఆ దారి కష్టమైనది, ఆ దారిలో బయలుదేరిన మనుషులు అలసిపోయి, ధైర్యం కోల్పోయినారు. కానీ తమ బలహీనతను ఒప్పుకోడానికి వాళ్లు సిగ్గుపడి, అందరికంటె ముందు నడుస్తున్న దాంకొమీద తమ కోపాన్నీ, తమ ద్వేషాన్నీ కక్కినారు. తమను నడిపించడానికి అతను అసమర్థుడని వాళ్లు అతన్ని నిందించసాగినారు.

''వాళ్లు ఆగి, అలసటతో, ఆగ్రహంతో, అతన్ని దూషించసాగినారు, ఆ ప్రకంపమాన గాఢంధకారంలో, ఆ తుఫాను విజయాట్టహాసాలమధ్య.

'' 'నీవు అసహ్యమైన దుష్ట మృగానివి, మమ్మల్ని యీ దుస్థితికి తెచ్చినావు,' అన్నారు వాళ్లు. 'యిక్కడికి నడిపించి మమ్మల్ని నిర్వీర్యులను చేసినావు, దీనికి నీవు మరణ శిక్ష అనుభవిస్తావు!'

''దాంకొ వాళ్లవైపు తిరిగి అన్నాడు: 'మీరు నడిపించ మన్నారు. నేను నడిపించినాను. మిమ్మల్ని నడిపించే ధైర్యం నాకుంది, అందుకే నడిపించడానికి పూనుకున్నాను. మరి మీరో? మీ కొరకు మీరు చేసిం దేమిటి? దీర్ఘ ప్రయాణానికి మీ శక్తిని కూడగట్టుకోకుండా మీరు నన్ను అనుసరించినారు, అంతకు తప్ప మీరేమీ చేయలేదు. మీరు గొర్రెల మంద మాదిరీ నన్ను అనుసరించినారు — అంతే.'

''అతని మాటలతో వాళ్ల కోపం యింకా మండిపోయింది.

'' 'నీవు చావాలి! నీవు చావాలి!' అని వాళ్లు కేకలు వేసినారు.

''అరణ్యం గర్జించి వాళ్ల కేకలను ప్రతిధ్వనించింది. చీకటిని మెరుపు ముక్కలు ముక్కలు చేసింది. యెవరికోసం తాను యీ మహాశ్రమకు పూనుకున్నాడో వాళ్ల వైపు చూసినాడు దాంకొ, వాళ్లు అడవి జంతువుల్లాగా వున్నారని గ్రహించినాడు. వాళ్లలో చాలామంది అతని చుట్టూ మూగినారు; వాళ్ల ముఖాలలో అతనికి మానవత్వపు చిహ్నాలు కనిపించలేదు, వాళ్లనుండి తనకు జాలి లభించదని అతను తెలుసుకున్నాడు. అప్పుడు వాళ్లమీద నిరసన పొంగింది అతని హృదయంలో, కానీ కనికరంచేత అణగిపోయింది. ఆ జనులమీద అతనికి ప్రేమ వుంది, తాను లేకుంటే వాళ్లు నశిస్తారని అతను భయపడినాడు. వాళ్లను సులభమైన మార్గంలోకి నడిపించి రక్షించాలనే మహా కాంక్ష అతని హృదయంలో నాల్కలు సాచుతూ మండింది. ఆ మహాగ్ని జ్వాలలు అతని కండ్లలో

ప్రతిఫలించినాయి.... అది చూసి, అతనికి కోపం వచ్చిందని వాళ్ల అనుకున్నారు, అందుకే అతని కండ్లు అలా మెరుస్తున్నాయని వాళ్ల అనుకున్నారు. వెంటనే వాళ్లు తోడేళ్ల లాగ జాగ్రత్త వహించినారు, అతను తమమీద పడతాడని యెదురుచూస్తూ. వాళ్ల అతనికి యింకా దగ్గరగా వచ్చినారు, అతన్ని పట్టుకొని చంపాలని. వాళ్ల ఉద్దేశం అతను గ్రహించినాడు, అతని గుండెలోని జ్వాలలు యింకా ప్రకాశవంతంగా ప్రజ్వలించినాయి, యెందుకంటే అతని కాంక్షా జ్వాలలకు సంతాప తైలం తోడైంది.

"అరణ్యం విషాద సంగీతం పాడుతూనే వుంది, ఉరుము గర్జిస్తూనే వుంది, వర్షం కుమ్మరిస్తూనే వుంది.

" 'మనుషుల కొరకు నేను యేం చేయాలి?!' ఉరుమును మించిన శబ్దంతో దాంకొ అరిచినాడు.

"హఠాత్తుగా అతను తన రొమ్ము పగల చీల్చి, గుండె వూడ బెరికి, తలపైన యెత్తుగా పట్టుకున్నాడు.

"అది సూర్యునిలాగ వెలిగింది, సూర్యునికంటె కూడా కాంతిగా వెలిగింది; అరణ్యం ఉద్ధతి తగ్గిపోయి, యీ దివిటీవలన, తన జనుల పట్ల గల యీ మహాప్రేమ దివిటీవలన, కాంతివంతమైంది; దీనిముందర అంధకారం తిరోగమించి, వణుకుతూ, అరణ్యమధ్యలో నోరు తెరుచుకొని వున్న అడుసు గుంతలో దుమికింది, ఆశ్చర్యంతో ఆ జనులు చేష్టలు దక్కి, శిలా విగ్రహాలలాగ అయిపోయినారు.

" 'రండి నావెంట,' అని అరిచి దాంకొ ముందు కురికినాడు, తన మండే గుండెను తలపైన యెత్తి పట్టుకొని, దాని వెలుగులో దారి చూపుతూ.

"వాళ్ల మంత్ర ముగ్ధులైనట్లు అతనివెంట నడిచినారు. అరణ్యం మళ్లీ గుసగుసలాడుతూ, ఆశ్చర్యంతో తన కొనకొమ్మలు ఊచసాగింది. కానీ దాని గుసగుసలు పరిగెత్తే మనుషుల పదధ్వనిలో అణిగిపోయినాయి. మండే గుండెయొక్క అద్భుతమైన దృశ్యంతో ఆకర్షింపబడి వాళ్ల ధైర్యంగా, వేగంగా ముందుకు నడిచినారు. అప్పుడుకూడా వాళ్లలో కొందరు నశించినారు, కానీ కన్నీళ్లూ, ఫిర్యాదులూ లేకుండా నశించినారు. అందరికీ అగ్రభాగాన దాంకొ నడుస్తూనే వున్నాడు, అతని హృదయం అంతకంతకూ దీప్తివంతంగా మండుతూ.

"హఠాత్తుగా వాళ్లముందర అడవి విడిపోయింది, విడిపోయి వాళ్లకు దారి యిచ్చి, వాళ్ల వెనుక మళ్లీ మూసుకపోయింది, మౌనంగా, దట్టంగా. దాంకొ, అతని అనుచరులూ సూర్యకాంతీ, వర్ష పరిశుద్ధమైన గాలీ సముద్రంలాగ విస్తరించుకొని వున్న ప్రదేశంలోకి హఠాత్తుగా ప్రవేశించినారు. తుఫాను వాళ్లవెనుక అడవిలో వుండిపోయింది; యిక్కడ యెండ కాస్తున్నది, మైదానం జీవంతో తొణికిసలాడుతున్నది, గడ్డి ముత్యాల వర్ష

బిందువులతో అలంకరించుకుంది, నది సువర్ణకాంతు లీనుతున్నది. అప్పుడు సాయంత్రమై వుంది, సూర్య కిరణాలు నదికి యెరుపురంగు పూసినాయి, దాంకొ రొమ్ముగాయంనుండి వెచ్చని ధారగా కారే పచ్చినెత్తురులాంటి యెరుపు.

"ధీరుడైన దాంకొ ఆ అనంతమైన మైదానాన్ని కలయ జూసి, ఆ స్వేచ్ఛా ప్రదేశాన్ని ఆనంద దృక్కులతో పారజూసి, సగర్వంగా నవ్వినాడు. అప్పు డతను నేలబడి మరణించినాడు.

"అతని అనుచరులు సంతోషంతో, ఆశతో నిండిపోయి, అతను మరణించిన విషయమూ, అతని మృత దేహం పక్కన అతని ధీర హృదయం యింకా మండుతున్న విషయమూ గమనించలేదు. కానీ ఒక పిరికిపంద గమనించి, కారణం తెలియకుండా భయపడి, ఆ మండే గుండెను కాలితో తొక్కినాడు. అది మిణుగురులుగా బద్దలై ఆరిపోయింది.

"అందుకే మైదానంలో, తుఫాను వచ్చే ముందు, నీలి మిణుగురులు యెప్పుడూ కనపడుతుంటాయి."

ముసలామె తన మనోహరమైన కథ ముగించేటప్పటికి మైదానం యెంతో నిశ్శబ్ద మైంది — తన సహచరుల కోసం తన గుండెనే మండించి, తనకు యే మాత్రమూ ప్రతిఫలం కోరకుండా మరణించిన ధీర దాంకొయొక్క బలం చూసి ఆశ్చర్యంతో ప్రమాన్పడినట్లు మైదానం యెంతో నిశ్శబ్దమైంది. ముసలామె నిద్రపోయింది. ఆమెవైపు చూస్తూ, ఆమె బుర్రలో యింకా యెన్ని కథలూ, యెన్ని స్మృతులూ వున్నాయో అని ఆశ్చర్యపడినాను. దాంకొ మండే గుండెను గురించీ, యిన్ని మనోహరమైన, ఉత్తేజకరమైన గాథలు సృష్టించిన మానవ ఊహా శక్తిని గురించీ యోచిస్తూ వుండినాను.

ముసలి ఇజెర్గీల్ గాథ నిద్రలో మునిగిపోయింది. గాలికి ఆమె యెండిన రొమ్ముమీది బట్టలు పక్కకు తొలగినాయి. ఆమె ముసలి శరీరంమీద బట్టలు కప్పి, ఆమె పక్కన నేలమీద పండుకున్నాను. మైదానం చీకటిగా, ప్రశాంతంగా వుంది. మేఘాలు నెమ్మదిగా, ఆయాసంగా కదలుతున్నాయి; సముద్రం మెత్తగా, విచారపూరితంగా గుసగుసలాడుతున్నది....

1895

# పొద్దు బోడానికి

దట్టమైన బూడిదరంగు పొగ మేఘాలు వెళ్ళగక్కే బ్రహ్మాండమైన సర్పంలాంటి పాసెంజర్ రైలు అపారమైన మైదానంలో, పసుపురంగు సముద్రంలాంటి గోధుమ పైరులో అదృశ్యమౌతున్నది. పొగ వేడిగాలిలో కరిగిపోయినట్లే, ఆ అపారమైన ఖాళీ మైదానంయొక్క నిర్లిప్త మౌనాన్ని కొద్ది క్షణాలపాటు భగ్నం చేసిన ఆగ్రహపూరిత మహాధ్వని సమూహం కూడా కరిగిపోయింది. ఆ అపారమైన మైదానం మధ్య ఒక చిన్న రైల్వే స్టేషను వుంది; దాని ఒంటరితనం మహా విషాదకరమైన అనుభూతులు కలిగిస్తుంది.

కటువుగా వున్నా, కనీసం సజీవంగా వున్న రైలు శబ్దం మాయమైపోయిన తర్వాత అదే విసుగు కలిగించే నిశ్శబ్దం స్టేషన్ను మళ్ళీ ఆవరించింది.

మైదానం స్వర్ణచ్ఛాయలో వుంది, ఆకాశం ఇంద్రనీలపు రంగులో వుంది. రెండూ హద్దులు లేనివి. అంత అపారమైన విస్తృతిలో చిన్న యిటుక రంగు స్టేషన్ భవనాలు యెలా వున్నాయంటే, ఊహా శక్తి లేని కళాకారుడు శ్రమపడి వేసిన విషాద చిత్రంమీద పొరపాటుగా కుంచె తగిలి దాని అందాన్ని చెడగొట్టుతున్న మరకలలా గున్నాయి.

ప్రతి దినమూ మధ్యాహ్నం పండ్రెండు గంటలకూ, సాయంత్రం నాలుగు గంటలకూ మైదానంలోనుండి రైళ్ళు వచ్చి స్టేషనువద్ద సరిగా రెండు నిముషాలు ఆగుతాయి. ఆ నాలుగు నిముషాలూ స్టేషన్‌కు ప్రధానమైన ఆటవిడుపు, నిజానికి ఒకే ఒక ఆటవిడుపు; యెందుకంటే అవి మాత్రమే అక్కడ పనిచేసేవాళ్లకు కొత్త అనుభవాలు తీసుకవచ్చేవి.

ప్రతి రైలులోనూ రకరకాల దుస్తులలో రకరకాల మనుషులు వుండేవాళ్ళు. వాళ్ళు క్షణకాలం మాత్రం ప్రత్యక్షమౌతారు: రైలు పెట్టెల కిటికీలవద్ద అలసిన, చిరాకుపడిన, అస్తవ్యస్తపు ముఖాల క్షణ భంగుర చిత్రం — ఆ తర్వాత ఒక గంట, ఒక ఈల, యింతలో దబదబ శబ్దంతో ఆ ముఖాలు యెగిరిపోతాయి, మైదానంలోకి, దూరంలోకి, జీవితం తొణికిసలాడుతూ పొంగులు వారుతూ వుండే నగరాలలోకి.

స్టేషన్ ఉద్యోగులు యీ ముఖాలను ఆసక్తితో తేరిచూసేవాళ్ళు; రైలు పోయిన తర్వాత వాళ్ళు ఒకరితో ఒకరు తమ మానసిక ముద్రలను చెప్పుకునేవాళ్ళు. వాళ్ళచుట్టూ సర్వత్రా మౌన మైదానం విస్తరించి వుంది, వాళ్ళమీద నిర్లిప్త ఆకాశం కమాను తిరిగి

వుంది, వాళ్ల హృదయాలలో ఈర్ష్య గూడుకట్టుకొని వుంది – జీవిత పరిధికి వెలిగా వున్నట్లున్న యీ యెడారిలో తమను ఖైదీలుగా వదలి, రోజూ తమకు తెలియని గమ్యాలవైపు శరవేగంతో పోయే ఆ మనుషులమీద ఈర్ష్య.

స్వర్ణ సముద్రంలాంటి గోధుమ పైరులో అదృశ్యమౌతున్న నల్ల రిబ్బనులాంటి పోయే రైలును గమనిస్తూ యిక్కడ వాళ్లు ప్లాట్‌ఫారంమీద నిలబడి వున్నారు. యీ క్షణిక జీవిత దృశ్యపు మనోముద్రలలో వాళ్లు గాఢంగా లీనమైపోయి, మౌనంగా వున్నారు.

దాదాపు అందరూ వున్నారు యిక్కడ: స్టేషన్ మాస్టరు వున్నాడు, లావుగా, గోధుమరంగు వెంద్రుకలతో, కోస్సక్‌లాగ పెంచిన పెద్ద మీసాలతో, సహృదయుడైన మనిషి; అతని అసిస్టెంటు వున్నాడు, పిల్లి గడ్డంతో, యెర్ర వెంద్రుకల యువకుడు; లుకా అనే స్టేషన్ గార్డు వున్నాడు, హుషారూ, యుక్తిగల చిన్న మనిషి; గోమొజొవ్ అనే ఒక స్విచ్‌మన్ వున్నాడు, మితభాషి, దట్టమైన గడ్డం గల దిట్టమైన మనిషి.

స్టేషన్ వాకిలి పంచన ఒక బెంచీమీద స్టేషన్ మాస్టరు భార్య కూర్చొని వుంది. పొట్టిగా వున్న బలిసిన మనిషి ఆమె, వేడికి చాలా బాధపడుతుంది. ఆమె ఒడిలో పసిబిడ్డ నిద్రపోతున్నది. బిడ్డ ముఖం తల్లి ముఖంలాగే గుండ్రంగా, యెర్రగా వుంది.

రైలు ఒక దిగుమారులో కిందికి పోయి అదృశ్యమౌతుంది, భూమి దాన్ని దిగ మింగిందా అన్నట్లు.

స్టేషను మాస్టరు తన భార్యవైపు తిరుగుతాడు.

"సమొవార్* సిద్ధమైందా, సోన్యా?"

"అయింది," జవాబిస్తుంది ఆమె మెల్లగా, నిరుత్సాహంగా.

"లుకా! యిక్కడంతా శుభ్రం చెయ్ – ప్లాట్‌ఫారమూ, రైలు కమ్మీలూ వూడ్చు. వాళ్లంతా యెంత చెత్త చేసి పోయినారో చూడు."

"నాకు తెలుసు, మత్వేయ్ యెగోరొవిచ్."

"ఆఁ, టీ తీసుకుందామా, నికొలాయ్ పెత్రోవిచ్?"

"మామూలే," అంటాడు అతని అసిస్టెంటు.

అప్పుడు పోయింది మధ్యాహ్నం రైలైతే, మత్వేయ్ యెగోరొవిచ్ తన భార్యతో యిలా అంటాడు:

"భోజనం సిద్ధమైందా, సోన్యా?"

---

* సమొవార్ – నీళ్లు మరిగించి, టీ తయారుచేసేందుకు రష్యా దేశ మంతటా వాడుకలో వుండిన పాత్ర. యిది పొయ్యిమీద పెట్టేది కాదు, దీనిలోనే పొయ్యిలాంటిది వుంటుంది – బాయిలర్‌లో లాగ. – సం.

తరువాత అతను లుకాకు యెప్పుడూ ఒకలాగే వుండే ఉత్తరువు యిచ్చి, తమ యింట్లోనే భోంచేసే తన అసిస్టెంటుతో అంటాడు:

"ఆఁ, భోజనం చేద్దామా?"

"చేద్దాం," అని జవాబిస్తాడు అసిస్టెంటు, తగిన వివేకంతో.

అప్పుడు వాళ్లు ప్లాట్‌ఫారం వదలి ఒక గదిలోకి పోతారు; అందులో యెన్నో మొక్కలూ, అతి తక్కువ ఫర్నిచరూ వుంది. ఆ గదిలో వంట వాసనలూ, పసిపిల్లల లంగోటీల వాసనలూ వస్తుంటాయి. భోజనాలవద్ద సంభాషణ యెప్పుడూ అప్పుడు తమను దాటవేసిపోయినదాన్ని గురించే.

"సెకండ్ క్లాసు పెట్టెలో పసుపురంగు దుస్తులు వేసుకున్న ఆ నల్లజుట్టు యువతిని చూసినారా, నికొలాయ్ పెత్రోవిచ్? నోట్లో నీళ్లూరే సరుకు, నన్నడిగితే!"

"పరవా లేదు, కానీ దుస్తులలో తగిన అభిరుచి లేదు," అని జవాబిస్తాడు అసిస్టెంటు.

అతని అభిప్రాయ ప్రకటనలు యెప్పుడూ సంక్షిప్తంగా, ఆత్మవిశ్వాసంతో కూడుకొని వుంటాయి, తన విద్యను గురించీ, అనుభవం గురించీ గర్వం గల మనిషి గనుక అతను. అతను హైస్కూలు చదువు ముగించినాడు. అతనివద్ద నల్ల అట్టల నోటుబుక్కు ఒకటి వుంది. తనకు తగిలిన పుస్తకాల్లోనూ, పత్రికల్లోనూ గొప్పగొప్పవాళ్లు చెప్పిన వాక్యాలు అందులో రాసుకుంటాడు అతను. తమ ఉద్యోగపు పనికి వెలుపల అన్ని విషయాలలోనూ స్టేషన్ మాస్టరు అతని జ్ఞానాన్ని అంగీకరిస్తాడు, అతను చెప్పే ప్రతిదాన్నీ శ్రద్ధగా వింటాడు. అతని నోటుబుక్కులోని విజ్ఞాన మణులతో స్టేషన్ మాస్టరు మరీ ముగ్ధుడై, వాటిని విన్నప్పుడు పసిపిల్లలలాగ పరవశం చెందుతాడు. నల్లజుట్టు యువతి దుస్తుల గురించి తన అసిస్టెంటు చేసిన అభిప్రాయ ప్రకటన అతని మనసులో సందేహాలు రేపుతుంది.

అతను అడుగుతాడు: "యేం? నల్లజుట్టువాళ్లు పసుపు దుస్తులు వేసుకోకూడదా?"

"నే నంటున్నది రంగు కాదు, శైలి," అని వివరిస్తాడు నికొలాయ్ పెత్రోవిచ్, గాజు గిన్నెలోనుంచి జాగ్రత్తగా కొంత జాం తన తట్టలోకి వేసుకుంటూ.

"శైలా? అదైతే సరే," అంగీకరిస్తాడు స్టేషన్ మాస్టరు.

అతని భార్య సంభాషణలో పాల్గొంటుంది, యెందుకంటే యీ విషయం ఆమె హృదయానికి సన్నిహిత మైంది, ఆమె బుద్ధికి అందుబాటులో వుండేది. వాళ్ల బుర్రలకు సున్నితత్వం అంతగా అంటలేదు గనుక, వాళ్ల సంభాషణ సచ్చుగా సాగేది, వాళ్ల అనుభూతులను యెప్పుడోగాని స్పృశించేది గాదు.

కిటికీలగుండా కనిపించేవి మౌనముద్ర ధరించిన మైదానమూ, ప్రశాంత నిస్సంగత్వంలో అద్భుతంగా వున్న ఆకాశమూ.

గంట కొకసారైనా గూడ్సుబండి పోతుంది. వాటిని నడిపేవా ళ్లందరూ పాత పరిచయస్తులు. గార్డులు తూగు ముఖాలవాళ్లు, మైదానంగుండా యెడతెగని ప్రయాణాలతో వాళ్ల జీవం హరించిపోయింది. నిజమే, ఒకోసారి వాళ్లు దారిలో జరిగిన ప్రమాదాలను గురించి చెప్తారు: ఫలానా చోట ఒక మనిషి హతుడైనాడు. లేదా వాళ్లు తమ పనిని గురించి కబుర్లు చెప్పుకుంటారు: ఫలానా మనిషికి జరిమానా పడింది, మరెవరికో బదిలీ అయింది. యీ చిటిపొటి విషయాలను వాళ్లు చర్చించరు, అపురూపమైన మిఠాయి దొరికిన తిండి పోతులాగ గబాలున దిగమింగుతారు.

నెమ్మదిగా మైదానపు అంచుమీదికి దిగుతాడు సూర్యుడు, భూమిని సమీపించే కొద్దీ రక్తవర్ణానికి మారుతూ. ప్రతిదానిమీదా యెర్రని నిగనిగ పడుతుంది; యిది యేదో బెంగనూ అస్పష్టమైన కాంక్షనూ రేకెత్తిస్తుంది – యెడారి కావల వున్న స్థలాల ఆకర్షణ. చిట్టచివరకు సూర్యుడు దిగంతాన్ని తాకుతాడు, దానిలోనో, దానివెనుకనో నిస్పృహతో పడిపోతాడు.

చాలా సేపు సూర్యాస్తమయపు ఉల్లాసపు స్వరాలు ఆకాశంలో సుతారపు సంగీతం పాడుతాయి. కానీ అది క్రమక్రమంగా క్షీణించి క్షీణించి, వెచ్చని నీరవ సంధ్య ప్రవేశిస్తుంది. చుక్కలు నిక్కబొడుస్తాయి, వొళ్లంతా వణుకుతూ, విసుగు కలిగించే భూమిని చూసి భయపడినట్లు.

సంధ్యలో మైదానం కుంచించుకపోయినట్లుంటుంది; నిశ్శబ్దంగా రాత్రి నీడలు అన్ని దిక్కులనుండీ స్టేషన్ను చుట్టుముట్టుతాయి. అప్పుడు సాక్షాత్తు రాత్రి వస్తుంది, నల్లగా, చీకటిగా.

స్టేషన్‌లో దీపాలు వెలిగిస్తారు. అన్నిటికంటె యెత్తున, అన్నిటికంటె కాంతిగా పచ్చని సిగ్నల్ దీపం వుంటుంది, అంధకారంతోనూ, నిశ్శబ్దంతోనూ ఆవరింపబడి.

అప్పుడప్పుడు గంట వాగుతుంది, రైలు రాబోతున్న దని చెప్పడానికి. ఆ హెచ్చరిక నాదం మైదానంలోకి పోతుంది, మైదానం దాన్ని మింగేస్తుంది.

గంట వాగిన కాసేపటికి ఒక యెర్ర దీపం చీకటి యెడారిలోనుండి మెరుస్తూ వస్తుంది; అంధకారపు ముసుగులో ఒంటరిగా వున్న స్టేషన్‌వైపు దారి చేసుకుంటూ వచ్చే రైలుబండి గర్జనతో మైదానపు నిశ్శబ్దం ప్రబద్దలౌతుంది.

యీ చిన్న స్టేషన్‌లో "కింది వర్గాల"వాళ్ల జీవితాలు ప్రభువర్గంవాళ్ల జీవితాలకంటె భిన్నంగా వుండేవి. స్టేషన్‌కు ఏడు మైళ్ల దూరంలో, తన భార్యా, తమ్ముడూ వున్న గ్రామానికి పరుగెత్తి పోవాలనే కోరికతో స్టేషన్ గార్డు లుకా నిరంతరం సంఘర్షణ పడేవాడు. అక్కడ అతని కొక "సంసారం" వుంది, అలా చెప్పేవాడు అతను గోమొజొవ్‌కు

మామూలుగా, తన బదులు "డ్యూటీ చెయ్య" మని నెమ్మదస్తుడూ, మితభాషీ అయిన ఆ స్విచ్‌మన్‌ను అతను అడిగేటప్పుడు.

"సంసారం" అన్నమాట విన్నప్పుడల్లా గోమొజొవ్ విధిగా నిట్టూర్చేవాడు.

"మంచిది, పోయిరా," అనేవాడు అతను. "సంసారం చూసుకోవాలి గదా, తప్పదు."

కానీ అఫనాసియ్ యాగొద్కా అనే మరో స్విచ్‌మన్ – తెల్లగ గడ్డం మాసిన గుండ్రని యెర్ర ముఖం గల ముసలి సిపాయి – యెత్తి పొడుపు స్వభావం గలవాడు; అతను లుకాను నమ్మడం లేదు.

"సంసారం!" అంటూ అతను వెక్కిరిస్తూ అపహాస్యం చేసేవాడు. "భార్య వుందను, కాస్త అర్థ ముంది. మరి నీ భార్య వుందే, ఆమె – వితంతువా? లేక, ఆమె మగడు సైన్యంలో వున్నాడా?"

"పోరా, పిట్టల దొరా!" అంటూ లుకా అసహ్యంతో కసిరేవాడు.

యాగొద్కాకు పక్షులమీద వ్యామోహం వుంది, అందుకని ఆ ముసలి సిపాయిని అతను "పిట్టల దొర" అనేవాడు. అతని చిన్న యింటినిండా, యింటి బయటా పంజరాలూ, పకుల ఊయెలలూ వ్రేలాడుతుంటాయి. రోజంతా అతని యింట్లోనూ, యింటి బయటా పకుల గోల వినిపించేది. ఆ సిపాయికి చిక్కిన క్వేల్ పక్షులు రోకటి పాటలాగ యెడతెగకుండా "చీవ్ చ్రీవ్" అంటూ కూసేవి, స్టార్లింగిలు పెద్ద ఉపన్యాసాలు యిచ్చేవి, వివిధ రంగుల చిన్న పక్షులు విశ్రాంతి యెరగకుండా కూతలు వేస్తూ, కేకలు వేస్తూ, పాటలు పాడుతూ వుండేవి, సిపాయి ఒంటరి జీవితానికి ఆనందం కలిగిస్తూ. అతను తన తీరిక సమయ మంతా వాటికి అర్పించినాడు. పకుల పట్ల అంత శ్రద్ధా తాత్పర్యాలు గల అతనికి స్టేషన్‌లోని తన సహచరుల పట్ల యేమాత్రమూ ఆసక్తి లేదు. అతను లుకాను పాము అనేవాడు, గోమొజొవ్‌ను రష్యన్ వెధవ అనేవాడు, వాళ్లు ఆడవాళ్లవెంట బడతారనీ, అందుకుగాను వాళ్లను బాగా తన్నాలనీ వాళ్ల ముఖాలమీదనే అనేవాడు.

మామూలుగా అతని నిందలు లుకా పట్టించకోడు, కానీ సిపాయి మితిమీరిపోతే, లుకా అతన్ని చాలా సేపు కసికొద్దీ చెడతిట్టేవాడు:

"కోటలో యెలకా, కొరికి పారేసిన పుల్లి పాయా! నీ వెందుకు పనికొస్తావ్? ఆఫీసర్ మేకకు మద్దెల వాయించేవానివి. నీవు చేసిందల్లా ఫిరంగుల కింద కప్పల తరమడం, పటాలం కూరగాయలకు కావలి కాయడం. యితర్లకు పేర్లు పెట్టడానికి యెవరు నీవు? చావుపోరా, పిట్టల దొరా!"

ఆ వాక్ప్రవాహం ప్రశాంతంగా విని, యాగొద్కా పోయి స్టేషన్ మాస్టర్‌కు ఫిర్యాదు చేసేవాడు. స్టేషన్ మాస్టరు తనకు అంతకంటె ముఖ్యమైన పనులు వున్నా యంటూ కేకలు వేసి అతన్ని తరిమేసేవాడు. తరువాత అతను లుకాను వెదకి పట్టుకొని తానే తిట్ల

వర్షం ప్రారంభించేవాడు — ప్రశాంతంగా, ఆవేశపడకుండా, పరమ బూతుల వాగ్జాలం ఉపయోగిస్తూ; అది విని లుకా పరుగెత్తిపోయేవాడు, అసహ్యంతో ఉమ్మేస్తూ.

గోమొజొవ్ లఘు మనస్తత్వాన్ని సిపాయి యెత్తి పొడిస్తే, గోమొజొవ్ నిట్టూర్చి ఆత్మ సమర్థన చేసుకోడానికి తంటాలు పడేవాడు.

"యేం జేస్తాం? అది వదిలేటట్లు లేదు. అది తప్పే ననుకో, నిజమే; కానీ సామెత చెప్పినట్లు, తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు."

ఒకరోజు సిపాయి దీనికి జవాబు చెప్పినాడు, మెల్లగా నవ్వుతూ:

"అన్ని రోగాలకూ ఒకటే మందేనా! 'తప్పు లెన్నువారు....' 'తప్పు లెన్నువారు....' ఒకరినొకరు తప్పులు బట్టుకోకపోతే మనుషులకు మాట్లాడడానికేమీ వుండదు!"

స్టేషన్ మాస్టరు భార్య గాక స్టేషన్‌లో మరొక స్త్రీ వుండింది. ఆమె వంటమనిషి అరీనా. ఆమెకు దాదాపు నలభై యేండ్లు వుంటాయి, మహా వికారంగా వుండేది — పొట్టిగా, బొద్దుగా, సాగి వ్రేలాడే రొమ్ములతో, యెప్పుడూ మురికిగా, అస్తవ్యస్తంగా. ఆమె నడక బాతు నడకలా గుండేది, ఆమె చీమల ముఖంలో బెదురు చూపుల యిరుకు కన్నులు తళతళ లాడేవి. ఆ వికారమైన ఆకారంలో భయపడిన మనిషి లాంటిది, బానిస లాంటిది యేదో వుండేది. ఆమె లావు పెదవులు యెప్పుడూ అదొక విధంగా వుండేవి, ఆమె ప్రతి వొక్కరినీ క్షమాభిక్ష అడగదలచుకొన్నట్లు—యితర్ల ముందర కాళ్లమీద పడాలనుకున్నట్లూ, యేడుపు వస్తుందేమో అని భయపడుతున్నట్లూ. ఆమెను ప్రత్యేకంగా గమనించకుండా యిప్పుడు యెనిమిది నెలలుగా గోమొజొవ్ స్టేషన్‌లో వున్నాడు. ఆమె యెదురైనప్పుడు అతను పోతూ పోతూ "హలో" అనేవాడు, ఆమె ప్రతినమస్కారం చేసేది, మాట్లాడితే ఒకటి రెండు మాటలు యాంత్రికంగా మాట్లాడుకునేవాళ్లు, తరువాత ఇద్దరూ తమ దారిన పోయేవాళ్లు. కానీ, ఒక రోజున గోమొజొవ్ స్టేషన్ మాస్టర్ వంటయింటిలోకి వచ్చి, తనకు చొక్కాలు కుట్టమని అరీనాను అడిగినాడు. ఆమె ఒప్పుకుంది, చొక్కాలు తయారైన తర్వాత వాటిని ఆమే అతని దగ్గరికి తీసుకొని పోయింది.

"థాంక్స్," అన్నాడు గోమొజొవ్. "ఒక్కొకటి పది కోపెక్కుల వంతున మూడు చొక్కాలు — ముప్పై కోపెక్కులు యివ్వాలి నీకు, కదూ?"

"ఔను," అన్నది అరీనా.

గోమొజొవ్ ఆలోచనలో పడినాడు.

"యే జిల్లా మీది?" అన్నాడు అతను చివరకు ఆమెతో. ఆమె కండ్లు యింతసేపూ అతని గడ్డంమీద వున్నాయి.

"ర్యజాన్," అన్నది ఆమె.

"చాలా దూరమే. యిక్కడి కసలు యెలా వచ్చినావు?"

"యేమో, నాకు తెలియదు. నేను ఒంటరిదాన్ని... నాకు యెవరూ లేరు."

"ఒంటరితనం యింకా దూరంగానైనా పోయేటట్లు చేస్తుంది," నిట్టూర్చినాడు గోమెజొవ్. యిద్దరూ మళ్లీ మౌనంలో పడిపోయినారు.

"నే నున్నాను చూడు. మాది నీజ్ని-నోవ్‌గొరొద్. సెర్గచేవ్ డిస్ట్రిక్ట్," అన్నాడు కాసేపుండి గోమెజొవ్. "నేనూ ఒంటరివాణ్నే. యెవరూ లేరు. కానీ ఒకప్పుడు యిల్లూ, భార్యా, పిల్లలూ వుండినారు.... యిద్దరు పిల్లలు. నా భార్య కలరాతో చచ్చిపోయింది, పిల్లలు దాంతోనూ, దీంతోనూ చచ్చిపోయినారు.... నేను — నేను శోకంతో సగమైనాను. తరువాత జీవితం మళ్లీ ప్రారంభించాలని ప్రయత్నించినాను, కానీ లాభం లేకపోయింది. కీ అయిపోయింది. మళ్లీ కీ యివ్వడం సాధ్యం కాదు. కనుక అలా వెళ్లిపోయినాను — వెళ్లగలిగినంత దూరం వెళ్లిపోయినాను. రెండేండ్లకు పైన అయింది, యిలా జీవిస్తున్నాను...."

"నా సొంతం అనే స్థలం లేకపోతే, కష్టంగా వుంటుంది," అన్నది అరీనా మెల్లగా.

"చాలా కష్టంగా వుంటుంది. నీవు వితంతువా?"

"కాదు, నేను కన్యను."

"పో, పో!" అన్నాడు గోమెజొవ్, తన అపనమ్మకాన్ని దాచుకోడానికి శ్రమపడకుండా.

"నిజం, దేవుని తోడు," అరీనా పట్టుదల చూపింది.

"నీ వెందుకు పెండ్లి చేసుకోలేదు?"

"యెవరు చేసుకుంటారు నన్ను? నా కేమీ లేదు. మగవాడు యేదో ఒకటి కావాలంటాడు.... యిక, నా ముఖం యెంతో వికారంగా వుంది."

"నిజమే," సాగదీసినాడు గోమెజొవ్, గడ్డం నిమురుకుంటూ, ఆమెను చిత్రంగా పరిశీలిస్తూ. ఆమె జీతం యెంత అని అడిగినాడు అతను.

"రెండున్నర."

"ఆహా. అయితే ముప్పై కోపెక్కులు యివ్వా లన్నమాట నీకు, ఆఁ? యిదుగో, యీ రాత్రికి వచ్చి తీసుకపో. పది గంటలకు, సరేనా? డబ్బు యిస్తాను, తరువాత టీ తాగుదాం, కబుర్లు చెప్పుకుందాం పొద్దుబోడానికి. మనం ఒంటరి ప్రాణులం, యిద్దరమూ. తప్పక రా."

"వస్తాను," అని ముక్తసరిగా చెప్పి వెళ్లిపోయింది.

సరిగా పది గంటలకు తిరిగి వచ్చింది ఆమె, తెల్లవారేముందు వెళ్లిపోయింది.

గోమెజొవ్ ఆమెను మళ్లీ రమ్మని ఆహ్వానించలేదు, ముప్పై కోపెక్కులు యివ్వనూ

లేదు. ఆమె తనంతకు తానే మళ్లీ వచ్చింది. గోవు లాగ, అణకువగా ఆమె మళ్లీ వచ్చింది, వచ్చి అతని ముందర మౌనంగా నిలబడింది. అతను మంచంమీద పండుకొన్న చోటనుండి ఆమెవైపు యెగజూసినాడు.

"కూర్చో," అన్నాడు కాసేపుండి, పక్కకు జరుగుతూ.

ఆమె కూర్చున్న తర్వాత అతను అన్నాడు,

"చూడు, యిది రహస్యంగా వుంచు. మూడో కంటివానికి తెలియనీ వద్దు, వింటున్నావా? తెలిస్తే నేను చిక్కులో పడతాను. నేను వయసులో లేను, నీవూ లేవు.... అర్థమైందా?"

ఆమె తల వూపింది.

ఆమెను సాగనంపేటప్పుడు అతను ఆమె చేతికి కొన్ని పాత గుడ్డలు యిచ్చినాడు, బాగు చేయడానికి.

"మూడో కంటివానికి తెలియనీ వద్దు," అతను మళ్లీ హెచ్చరించినాడు.

అలా వాళ్లు తమ సంబంధం యితర్లకు తెలియకుండా జాగ్రత్తగా దాచిపెట్టుకుంటూ, కలిసి జీవిస్తూ వుండినారు.

రాత్రిపూట అరీనా దొంగగా, దాదాపు మోకాళ్లమీద ప్రాకుతూ వచ్చేది అతని గదికి. అతను ఆమెను సాదరంగా స్వీకరించేవాడు, తాను ప్రభువూ, యజమానీ అన్న ధోరణిలో.

"యెలాంటి మూతి నీది!" అనేవాడు అతను ఒకోసారి.

ఆమె బలహీనంగా చిరునవ్వు మాత్రం నవ్వేది, క్షమాపణపూర్వకంగా; వెళ్లిపోయేటప్పుడు గుడ్డల మూట పట్టుకపోయేది, అతనికి బాగుచేసి పెట్టడానికి.

వాళ్లు తరుచుగా కలుసుకునేవాళ్లు కాదు. కానీ అప్పుడప్పుడు స్టేషన్ ఆవరణలో కలుసుకున్నప్పుడు, అతను రహస్యంగా చెప్పేవాడు:

"రాత్రికి వచ్చెయ్."

మాట జవదాటకుండా ఆమె వచ్చేది. ఆమే చీమల ముఖంలో యెలాంటి గంభీర ముద్ర వుండేదంటే, ఆమె యేదో కర్తవ్యం నిర్వహిస్తున్నట్లూ, దాని పవిత్ర ప్రాముఖ్యాన్ని ఆమె పూర్తిగా గ్రహించినట్లూ చూసేవాళ్లకు అనిపిస్తుంది.

కానీ యింటికి పోయిన వెంటనే ఆమెకు మళ్లీ నేరం చేసినదాని లాగ, భయపడు తున్నదాని లాగ పాత స్వభావం వచ్చేది.

యెప్పుడైనా ఒకసారి ఆమె యేకాంతపు మూలనో, చెట్టు చాటునో ఆగి మైదానంలోకి పారజూసేది. చీకటి రాజ్యం చేసేది అక్కడ. దాని కఠోర నిశ్శబ్దం చూసి ఆమె భయంతో గజగజ వణికేది.

ఒక రోజు సాయంత్రం రైలు పోయిన తర్వాత, స్టేషన్ మాస్టరు గదుల కిటికీల దగ్గర వున్న పాప్లర్ చెట్ల నీడలో స్టేషన్ ఉద్యోగులు టీ తాగడానికి కూర్చున్నారు.

వేడిగా వున్న రోజుల్లో వాళ్ళు తరుచుగా అక్కడ టీ తాగేవాళ్ళు — వాళ్ల రోకటిపాట జీవితాల్లో అది కొంత వైవిధ్యం ప్రవేశపెట్టేది.

వాళ్లు మౌనంగా టీ తాగుతున్నారు, అప్పుడు పోయిన రైలును గురించి మాట్లాడవలసిం దంతా మాట్లాడి.

"నిన్నటికంటె యీరోజు వేడిగా వుంది," అన్నాడు స్టేషన్ మాస్టరు, ఒక చేత్తో ఖాళీ గ్లాసు భార్యకు అందిస్తూ, మరొక చేత్తో నొసటిమీద చెమట తుడుచుకుంటూ.

"నీకు యేమీ తోచక వేడిగా వుంది, అంతే," అన్నది అతని భార్య, గ్లాసు తీసుకుంటూ.

"ఊఁ, నిజమే కావచ్చు. పేక ఆడినా బాగుండు. కానీ ముగ్గురమే వున్నాం."

అతని అసిస్టెంటు భుజాలు కుదించి, కనుబొమలు ముడివేసినాడు.

"షోపెన్‌హొవర్ ప్రకారం, పేకాటలు బుద్ధి దారిద్ర్యానికి నిదర్శనం," గంభీరంగా ఉద్ఘాటించినాడు అతను.

"అమోఘం," గలగల మన్నాడు స్టేషన్ మాస్టరు. "యేమిటి? బుద్ధి దారిద్ర్యం — హుఁ. యెవరా అన్నది?"

"షోపెన్‌హొవర్. జర్మన్ తత్వవేత్త."

"తత్వవేత్తా? హుఁ."

"యీ తత్వవేత్తలు — వీళ్ళు యేం చేస్తుంటారు? విశ్వవిద్యాలయాల్లో పనిచేస్తారా?" అడిగింది సోఫ్యా ఇవానొవ్నా.

"మీకు యెలా చెప్పడం? తత్వవేత్త కావడ మంటే ఒక ఉద్యోగం కాదు, అదొక సహజ ప్రతిభ అనవచ్చు. యెవడైనా తత్వవేత్త కావచ్చు.... ఆలోచించే స్వభావమూ, అన్నింటిలోనూ కార్య కారణ సంబంధం చూసే స్వభావమూ పుట్టుకతో వచ్చినవాడెవడైనా. తత్వవేత్తలు విశ్వవిద్యాలయాల్లో ఒకోసారి వుండే మాట నిజమే, కానీ వాళ్ళు యెక్కడైనా వుండవచ్చు — రైల్వే ఉద్యోగంలో కూడా వుండవచ్చు."

"వాళ్లకు డబ్బు చాలా వస్తుందా — విశ్వవిద్యాలయాల్లో వుండేవాళ్లకు?"

"అదంతా వాళ్ల శక్తి సామర్థ్యాలను బట్టి వుంటుంది."

"నాలుగో చేయి వుంటే రెండు గంటలు బాగా గడిపేవాళ్లం," నిట్టూర్చినాడు స్టేషన్ మాస్టరు.

సంభాషణ మళ్లీ తెగిపోయింది.

నీలాకాశంలో యెత్తున లార్కులు పాడుతున్నాయి, పాప్లర్ చెట్లమీద రాబిన్లు యీ

కొమ్మకూ ఆ కొమ్మకూ యెగురుతున్నాయి, మెల్లగ యీలవేస్తూ. యింట్లోనుండి పసిబిడ్డ యేడుపు వినవచ్చింది.

"అరీనా వుందా అక్కడ?" స్టేషన్ మాస్టరు అడిగినాడు.

"వుందిలే," అన్నది అతని భార్య.

"ఆమెలో యేదో చాలా అపురూపమైనది వుంది, నీవు గమనించినావా నికొలాయ్ పెత్రోవిచ్?"

"అపురూపత్వం సాదాతనానికి తల్లి," సాలోచనగా అన్నాడు నికొలాయ్ పెత్రోవిచ్, జ్ఞానిలాగా, గంభీరంగా.

"యేమిటీ?" స్టేషన్ మాస్టరు యెగిరి కూర్చున్నాడు.

ఆ మాట గంభీరమైన కంఠంతో మళ్లీ చెప్పిన తర్వాత, స్టేషన్ మాస్టరు అరమోడ్పు కన్నులతో ఆనంద పరవశుడైనాడు. అతని భార్య సుకుమారంగా యిలా అన్నది:

"మీరు చదివింది జ్ఞాపకం పెట్టుకోవడం కేవలం అద్భుతం! నే నంటే, యీ రోజు చదివింది రేపు మరిచిపోతాను. అంతెందుకూ, 'నీవా' వారపత్రికలో యెంతో ఆసక్తికరమైందీ, యెంతో వినోదకరమైందీ యేదో చదివినాను, కానీ గొంతు కోసినా అదేమిటో జ్ఞాపకం రాదు."

"అంతా అలవాటు," ముక్తసరిగా వివరించినాడు నికొలాయ్ పెత్రోవిచ్.

"యిది యింకా బాగుంది అతనికంటె — అత నెవరు? షోపెన్‌హౌవర్," అన్నాడు స్టేషన్ మాస్టర్ చిరునవ్వుతో. "అనగా, కొత్తది ప్రతిదీ పాతదవుతుం దన్నమాట."

"లేక తద్వ్యతిరేకమూ కావచ్చు. ఒక కవి అన్నట్లు 'వివేకవతి ఐన జీవితం పొదుపరి; యెప్పుడూ ఆమె పాతనుండి కొత్తను చేస్తుంది.' "

"భలే, యెక్కడ దొరుకుతాయి నీకివి? జల్లెడలోనుండి కారినట్లు కారుతున్నాయి నీ నోట్లోనుండి!"

స్టేషన్ మాస్టరు ఆనందంతో కిలకిల నవ్వినాడు. అతని భార్య తియ్యగా చిరునవ్వు నవ్వింది. నికొలాయ్ పెత్రోవిచ్ తన సంతృప్తిని మూసిపెట్టుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేసినాడు.

"సాదాతనం గురించి చెప్పింది యెవరు?"

"బరతీన్‌స్కీ అనే కవి."

"అదో?"

"కవే, ఫొఫొనొవ్."

"చురుకైనవాళ్లు," అన్నాడు స్టేషన్ మాస్టరు, కవులను మెచ్చుకుంటూ. అతను రాగధాటిలో ఆ వాక్యాన్ని పునశ్చరణ చేసినాడు, ముఖంమీద చిక్కని చిరునవ్వుతో.

పొద్దుబోకపోవడం అనేది వాళ్లతో ఒక విధమైన చెలగాటం ఆడుతూ వుంటుంది. అది క్షణకాలం పాటు తన పట్టునుండి వాళ్లను విడుదల చేస్తుంది, మళ్లీ మరింత గట్టిగా పట్టుకుంటుంది. అప్పుడు వాళ్లు మళ్లీ మౌనంలో పడిపోయి, వేడికి ఉసూరుమంటూ అలా కూర్చొని వుంటారు. టీ తాగడంతో ఆ వేడి యింకా యెక్కువౌతుంది.

మైదానంలో యెండ తప్ప యేమీ లేదు.

"అరీనాను గురించి చెప్తున్నాను గదూ," అంటూ స్టేషన్ మాస్టరు మళ్లీ యెత్తుకున్నాడు. "ఆమె వింత జీవి. ఆమెను తలచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది నాకు. యేదో పూనినట్లుంటుంది — ఒక నవ్వు లేదు, ఒక పాట లేదు, మాటే అరుదు. నేలలో మొద్దు మాదిరీ. కానీ పనిలో భేషైన మనిషి. యిక ల్యోల్యాను ఆమె చూసుకోవడం వుందే — ఆ పసిపిల్లకు యెంత చేసినా ఆమెకు తనివి తీరదు."

అతను గొంతు తగ్గించి మాట్లాడినాడు, అరీనాకు వినపడుతుందేమో అని. అతనికి బాగా తెలుసు, పనిమనుషులను మెచ్చుకోకూడదని — వాళ్లు చెడిపోతారు. అతని భార్య అతనికి అడ్డుపడి, అర్థ గర్భితంగా ముఖం మాడ్చింది:

"చాల్లే. ఆమెను గురించి నీకు తెలియనివి చాలా వున్నాయి," అన్నది ఆమె.

నికొలాయ్ పెత్రోవిచ్ మెల్లగా పాడడం ప్రారంభించినాడు, గరిటెతో టేబుల్‌మీద తాళం వేస్తూ:

"ప్రేమకు బానిస నైనానూ
నీతో యిక నే పోరాటం
చేయగలేనోయ్ సైతానూ."

"యేమిటి? యేమి టది?" అడ్డు వచ్చినాడు స్టేషన్ మాస్టరు. "ఆమా? మీరు నన్ను ఆడిస్తున్నారు, యిద్దరూ!"

అతను పగలబడి నవ్వినాడు. అతని చెంపలు అదిరినాయి, నొసటిమీదనుండి చెమట బిందువులు కారినాయి.

"హాస్యాలు కాదు," అన్నది అతని భార్య. "మొదటిది, పసిపిల్ల ఆమె అధీనంలో వుంది; రెండోది — యీ బ్రెడ్డు చూడు యెలా వుందో! మాడింది, పుల్లగా వుంది. యెందు కంటావ్?"

"నిజమే, బ్రెడ్డు సరిగా లేదు. దానికి నీ వామెను దండించాలి. కానీ, రామరామా, యిలాంటిది నే నెప్పుడూ ఊహించలేదు. ఐనా, యేమి టిదంతా, ఆమె అసలు మెతక, మైనపు ముద్ద! మరి వాడు! యెవడు వాడు? లుకానా? వెధవ, వాని పని పట్టిస్తాను. లేక యాగొద్కనా — ఆ మీసం లేని మూతిగాడు?"

"గోమెజొవ్," అన్నాడు నికొలాయ్ పెత్రోవిచ్, ముక్తసరిగా.

"వాడా? అంత గంభీరంగా వుండేవాడు? పోండి, మీరు కవి కడుతున్నారు!"

స్టేషన్ మాస్టరుకు యెంతో వినోదంగా వుంది యీ కొత్త జ్ఞానం. ఒక నిముషం అతను కన్నీళ్ల పర్యంతం నవ్వుతాడు, మరు నిముషం గంభీరంగా చెప్తాడు, ప్రేమికులకు కఠినమైన దండన యివ్వాలని; తరువాత వాళ్లిద్దరి మధ్యా సాగే సుకుమారమైన ప్రేమ సంభాషణ ఊహించుకొని మళ్లీ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుతాడు.

కట్ట కడపట అతను వివరాలు తెలుసుకోడానికి ప్రయత్నించినాడు. నికొలాయ్ పెత్రోవిచ్ గంభీర ముఖ భంగిమ ధరించినాడు, సోఫ్యా ఇవానొవ్నా మగణ్ని మందలించి నోరు మూయించింది.

"గండ్రంగి కోతులు! అలా వుండండి, వాళ్లను తమాషా పట్టిస్తాను! బలే వినోదంగా వుంది," అన్నాడు అణచరాని ఉల్లాసం గల స్టేషన్ మాస్టరు.

ఆ క్షణంలో లుకా వచ్చినాడు.

"టెలిగ్రాఫ్ లైను క్లిక్‌క్లిక్ మంటున్నది," అని అతను చెప్పినాడు.

"వస్తున్నాను. 42వ నంబరుకు సిగ్నలివ్వు."

కాసేపట్లో అతనూ, అతని అసిస్టెంటూ స్టేషన్‌లోకి పోయినారు; అక్కడ లుకా రైలుకు సిగ్నల్ గంట కొడుతున్నాడు. నికొలాయ్ పెత్రోవిచ్ 42వ నంబరు రైలును పంపడానికి అనుమతి కొరకు పక్క స్టేషన్‌కు టెలిగ్రాఫ్ చేసినాడు. స్టేషన్ మాస్టరు ఆఫీసులో అటూ యిటూ నడుస్తూ, తనలో తాను ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ యిలా అన్నాడు:

"మన మిద్దరమూ వాళ్లను తమాషా పట్టిద్దాం, యేమంటావ్? పొద్దుబోడానికి. కనీసం కాస్త నవ్వుకోవచ్చు."

"అది చేయవచ్చు" అన్నాడు నికొలాయ్ పెత్రోవిచ్, టెలిగ్రాఫ్ కీమీద పనిచేస్తూ. తత్వవేత్తలు మితంగా మాట్లాడాలని అతనికి తెలుసు.

అతి త్వరలోనే వాళ్లకు నవ్వుకోడానికి అవకాశం లభించింది.

ఒక రాత్రి గోమెజొవ్ అరీనా కోసం షెడ్డులోకి పోయినాడు; అక్కడ ఆమె అతని కోరికమీద, తన యజమానురాలి అనుమతితో, నానా రకాల పనికిరాని పాత సామానుల మధ్య తన పడక యేర్పాటు చేసుకుంది. షెడ్డు చలిగా, తడిగా వుంది; విరిగిపోయిన కుర్చీలూ, పారేసిన తొట్లూ, కొయ్య పలకలూ, పనికిరాని యితర వస్తువులూ చీకట్లో భయంకరమైన ఆకారాలు ధరిస్తాయి. అరీనా ఒంటరిగా వుంది, ఆమె భయ కంపితురాలై నిద్ర పట్టక, దైవ స్మరణ చేసుకుంటూ, నిలువు కండ్లతో గడ్డిలో పండుకొని వుంది.

గోమొజొవ్ వచ్చినాడు, ఒక మాట కూడా లేకుండా ఆమెను చాలా సేపు చెడ నలిపి, అలసిపోయి, నిద్రపోయినాడు. కానీ కొద్దిసేపు తరువాత అరీనా అతన్ని నిద్రలేపింది.

"తిమొఫేయ్ పెత్రోవిచ్! తిమొఫేయ్ పెత్రోవిచ్!" ఆమె భయంతో గుసగుస పిలిచింది.

"యేం?" అన్నాడు గోమొజొవ్, సగం నిద్రలో.

"మనల్ని లోపల పెట్టి తాళం వేసినారు."

"యేమిటీ?" అంటూ అతను యెగిరి పడినాడు.

"వాళ్లు తలుపు దగ్గరికి వచ్చి, బీగం వేసినారు."

"నీకు పిచ్చి!" భయంతోనూ, కోపంతోనూ అన్నాడు అతను, ఆమెను దూరంగా తోస్తూ.

"నీవే పోయి చూడు," అన్నది ఆమె వినయంగా.

అతను లేచి, ఆ పాత సామాన్లలో తొట్రుకుంటూ పోయి తలుపు తోసినాడు. ఒక క్షణం ఆగి అతను దిగులుగా అన్నాడు:

"యిదంతా ఆ సిపాయి చేసిన పనే."

వాకిలి బయటనుండి బిగ్గరగా నవ్వు వినపడింది.

"నన్ను బయటికి పోనీ!" అన్నాడు గోమొజొవ్.

"యేమిటీ?" అన్నది సిపాయి కంఠం.

"నన్ను బయటికి పోనీ."

"ప్రొద్దున," అన్నాడు సిపాయి, వెళ్లిపోబోతూ.

"నేను డ్యూటీకి పోవాలి, వెధవది!" గోమొజొవ్ కోపంగా చెప్పుకున్నాడు.

"నీబదులు నేను డ్యూటీ చేస్తాను. వున్నచోటనే వుండు నీవు."

సిపాయి వెళ్లిపోయినాడు.

"పోకిరీ వెధవ!" గొణుక్కున్నాడు స్విచ్‌మన్, దిగులుగా. "యిలా లోపల పెట్టి తాళం వేయడమే! స్టేషన్ మాస్టరు వున్నాడు. ఆయనతో యేమి చెప్తాడు? గోమొజొవ్ యేడీ అని స్టేషన్ మాస్టరు తప్పక అడుగుతాడు, అప్పుడు యేమి చెప్తాడు అతను?"

"స్టేషన్ మాస్టరే యిది చెయ్యమని చెప్పినట్లుంది," అన్నది అరీనా భారంగా.

"స్టేషన్ మాస్టరా?" అన్నాడు గోమొజొవ్ భయపడి. "ఆయనెందుకు చెయ్యాలి యిలాంటి పని?" అతను ఒక క్షణం ఆలోచించి బిగ్గరగా అరిచినాడు: "అబద్ధ మాడుతున్నావ్!"

గాఢమైన నిట్టూర్పు మాత్రమే విడిచింది ఆమె జవాబుగా.

"తండ్రీ, యిప్పు డేమౌతుంది?" అంటూ స్విచ్‌మన్ వాకిలి పంచన తొట్టిమీద కూర్చున్నాడు. "నాకు అవమానం జరిగింది. యిదంతా నీ తప్పే, పంది ముఖమా."

ఆమె ఊపిరి తీసుకునే శబ్దం వచ్చేవైపు అతను పిడికిలి ఆడించినాడు. ఆమె యేమీ అనలేదు.

వాళ్ల చుట్టూ బూడిదరంగు నీడలు వున్నాయి — నీడల నిండా బూజు వాసనా, ఊరగాయల వాసనా, ముక్కులు జిలజిల మనిపించే మరొక ఘాటు వాసనా వున్నాయి. తలుపు సందులనుండి పల్చని వెన్నెల చారలు వస్తున్నాయి. బయటనుండి గూడ్సురైలు స్టేషన్‌నుండి పోతున్న చప్పుడు వినవస్తున్నది.

"యేమీ మాట్లాడకుండా వున్నావ్, దిష్టి బొమ్మా!" అన్నాడు గోమొజొవ్, కోపంతోనూ, యేవగింపుతోనూ. "యేం చెయ్యాలి నేనిప్పుడు? నన్నీ చిక్కులోకి తెచ్చినావ్, యిప్పు డేమో పలక్కుండా వున్నావ్. యేదో ఒక దారి ఆలోచించు, పాపిష్టి ముఖమా! యింత అవమానం నే నెలా భరించాలి? భగవంతుడా! యిలాంటి జంతువుతో నే నెలా సంబంధం పెట్టుకున్నాను?"

"నన్ను క్షమించ మని వాళ్లను అడుగుతాను," అన్నది అరీనా మెల్లగా.

"ఆఁ?"

"వాళ్లు క్షమించవచ్చు."

"నాకేమి లాభం? సరే, వాళ్లు నిన్ను క్షమిస్తారు. ఐతే యేం? నాకు అవమానం జరిగిందా లేదా? యెలాగైనా నే నేమో నవ్వులపాలైనాను."

కాసేపట్లో అతను మళ్లీ ఆమెను తిట్టడం, శపించడం ప్రారంభించినాడు. కాలం దుర్భరంగా గడుస్తున్నది. చివర కామె కంపించే కంఠంతో అన్నది:

"నన్ను క్షమించు తిమొఫేయ్ పెత్రోవిచ్."

"గొడ్డలితో క్షమిస్తాను నిన్ను, అదే నేను చేసేది," గాండ్రించినాడు అతను.

మళ్లీ నిశ్శబ్దం ఆవరించింది, బరువుగా, బాధగా, ఆ చీకటిలో బంధింపబడిన ఆ యిద్దరికీ ఒళ్లు సలుపులాంటి విచారంతో.

"తండ్రీ! తెల్లవారితే చాలు!" అరీనా శోకించింది.

"నోరు మూసుకో! నీ బతుకు తెల్లవారుతుందిలే!" అని బెదిరిస్తూ గోమొజొవ్ ఆమెమీద మళ్లీ తిట్ల వర్షం కురిపించినాడు. తరువాత మళ్లీ నిశ్శబ్దపు యమయాతన. వేకువ సమీపించే కొద్దీ కాలం యింకా క్రూరంగా గడుస్తున్నట్లుంది, వాళ్లిద్దరి హాస్య సన్నివేశంలో వినోదం పొందుతూ ప్రతి నిముషమూ ఉద్దేశపూర్వకంగా తారాడుతున్నట్లుంది.

కొంతసేపున్న తర్వాత గోమొజొవ్ నిద్రపోయినాడు. షెడ్డు బయట కోడి కూతతో అతనికి మెలకువ వచ్చింది.

"ఏయ్, పంది ముఖమా, నిద్రపోతున్నావా?" అతను గుసగుస అడిగినాడు.

"లేదు," నిట్టూర్పుతో జవా బిచ్చింది అరీనా.

"యేం, నిద్ర రాలేదా?" అడిగినాడు అతను వ్యంగ్యంగా. "హుఁ!"

"తిమొఫేయ్ పెత్రోవిచ్!" యేడ్చింది అరీనా. "నామీద కోపగించుకో వద్దు. నన్ను కనికరించు. నీకు పుణ్య ముంటుంది, కనికరించు. నేను ఒంటరిదాన్ని, యీ ప్రపంచంలో నా అన్నవా ళ్లెవరూ లేరు. నీవు – నా కున్నదల్లా నీవే, యెంతైనా, మనం – "

"చాలించు మొరుగుడు! యెవరైనా వింటే నవ్వుతారు," గోమొజొవ్ కఠినంగా ఆమెకు అడ్డుపడి, పిచ్చిగా మాట్లాడే ఆమె గుసగుసలను ఆపినాడు. అయినా, ఆ గుసగుసలు అతన్ని కొంత మెత్తబరిచినాయి. "నోరు మూసుకో, మట్టి బుర్రా."

అలా వాళ్లు మాటలు లేకుండా, ప్రతి నిముషమూ యెప్పుడు అంతమౌతుందా అని కాచుకొని కూర్చున్నారు. కానీ నిముషాల అంతంతో వాళ్ల కేమీ ఒరగలేదు. కట్ట కడకు తలుపు సందుల గుండా పగటి వెలుతురు కిరణాలు వచ్చినాయి, చీకటిమీద మెరిసే దారంతో కుట్టుపోసినట్లు. బయట అడుగుల చప్పుడు వినపడింది. యెవరో వాకిలా దాకా వచ్చి, అక్కడొక క్షణం నిలిచి, వెళ్లిపోయినారు.

"రాక్షసులు!" గోమొజొవ్ గర్జించినాడు, అసహ్యంతో ఉమ్మేస్తూ. మళ్లీ వాళ్లు బాధాకర నిశ్శబ్దంలో కాచుకొని వున్నారు.

"తండ్రీ, భగవంతుడా, కనికరించు...." అరీనా గొణిగింది.

మెల్లగా అడుగులు వేసిన చప్పుడు వినపడినట్లైంది. హఠాత్తుగా తాళం తీసిన శబ్దమైంది, స్టేషన్ మాస్టరు గొంతు కఠినంగా వినపడింది.

"గోమొజొవ్!" అరిచినాడు అతను. "అరీనా చేయి పట్టుకొని బయటి రా! హుషారుగా నడవాలి!"

"యిలా రా, నువ్వే," గోమొజొవ్ గొణిగినాడు. అరీనా పోయి అతని పక్కన నిలబడింది, తల వంచుకొని.

తలుపు తెరుచుకుంది, యెదురుగా స్టేషన్ మాస్టరు నిలబడి వున్నాడు.

"కొత్త దంపతులకు శుభాకాంక్షలు!" అన్నాడు అతను, అరీనాకు వంగి నమస్కరిస్తూ. "కానీండి, బాండు వాయించండి!"

గోమొజొవ్ బయట అడుగుపెట్టినాడు, చెవులు చిల్లులు పడే శబ్దం విని ఆగిపోయినాడు. లుకా, యాగొద్క, నికొలాయ్ పెత్రోవిచ్ వాకిలి వద్ద నిలబడి వున్నారు.

లుకా ఒక బకెట్ అడుగు భాగాన పిడికిలితో గుద్దుతూ, కర్ణకఠోరంగా గొంతెత్తి అరుస్తున్నాడు, సిపాయి రేకు కొమ్ము వాయిస్తున్నాడు, నికొలాయ్ పెత్రోవిచ్ బుగ్గలు

బూరటించి, ఒక చేయి వూపుతూ, బాండుమేళం వాయించినట్లు పెదవుల సందున "పామ్! పామ్! పాంపాంపామ్!" అని వూదుతున్నాడు.

బకెట్ ఉరుము లాంటి శబ్దం చేసింది. కొమ్ము కీచుమంటూ, కేరుమంటూ కేకలు వేసింది. స్టేషన్ మాస్టరు నవ్వు పట్టలేక వంగి నవ్వుతున్నాడు. అతని అసిస్టెంటు కూడా పగలబడి నవ్వినాడు, కొయ్యబారి నిలిచిన గోమొజొవ్‌ను చూసి; గోమొజొవ్ ముఖం తెల్లగా పాలిపోయింది, అతని పెదవులు కంపిస్తూ దిక్కుతోచని చిరునవ్వుతో వంకర పోయినాయి. అతని వెనుక అరీనా నిలబడివుంది, రొమ్ము మీదికి తల వాల్చుకొని, శిలారూపం ధరించినట్లు నిశ్చలంగా.

లుకా భీకరమైన ముఖ భంగిమల్లో గోమొజొవ్‌ను వెక్కిరిస్తూ పాట పాడినాడు:

"అతని చెవిలో చెప్పిం దరీనా
వినగోరెడునది ప్రియు డెవడైనా."

సిపాయి గోమొజొవ్ దగ్గరికి పోయి అతని చెవిలో కొమ్ము పెట్టి వాయించినాడు.

"వచ్చెయ్యండి. రా, ఆమె చేయి పట్టుకో!" అరిచినాడు స్టేషన్ మాస్టరు, నవ్వుతో ఉక్కిరిబిక్కిరౌతూ.

"ఓ, ఓ, ఆపండి! నేను చచ్చిపోతాను!" అంటూ అరిచింది మాస్టరు భార్య, తన యింటి వాకిటి ముందర కూర్చొని నవ్వుతో వూగిపోతూ.

"క్షణకాలం ఆనందానికి యెన్నిటినైనా భరియించెదనూ," నికొలాయ్ పెత్రోవిచ్ పాడినాడు.

గోమొజొవ్ ఒక అడుగు ముందుకు వేస్తూనే స్టేషన్ మాస్టరు "నూతన వధూవరులకు విజయీభవ!" అని కేక వేసినాడు. నలుగురూ "విజయీభవ!" అని కేకలు వేసినారు; సిపాయి తన బొంగురు గొంతుతో గర్జించినాడు.

అరీనా గోమొజొవ్ అడుగుల వెంట నడిచింది. యిప్పుడామె తల యెత్తుకొని వుంది, నోరు తెరిచి వుంది, పక్కల చేతులు సచ్చుగా వ్రేలాడుతున్నాయి, కాంతిహీనమైన కన్నులు ముందుకు నిలజూస్తున్నాయి, కానీ వాటి కేమైనా కనపడుతున్న దనేది సందేహమే.

"యిద్దరూ ముద్దు పెట్టుకోవాలి, పెండ్లికొడుకా! హోహ్హోహ్హో!"

"ముద్దు, వధూవరులారా!" కేక వేసినాడు నికొలాయ్ పెత్రోవిచ్. ఆ మాటతో స్టేషన్ మాస్టరు కాళ్ళు యిక అతన్ని నిలబెట్టడానికి నిరాకరించినాయి, అతను సచ్చుగా ఒక చెట్టు బోదెకు చేరగిలబడినాడు. బకెట్ వాగుతూనే వుంది, కొమ్ము కేరింతలు కొడుతూనే వుంది, లుకా నాట్యం చేస్తూ పాట పాడినాడు:

"కాబేజి పులుసూ వండిం దరీనా
యెంత చిక్క గుందిరోయ్, భగవంతుడా!"

నికొలాయ్ పెత్రోవిచ్ మళ్లీ బుగ్గలు బూరటించినాడు:

"పాంపాంపామ్! టూట్టూట్టూట్! పాంపామ్! టూట్టూట్!"

గోమొజొవ్ బారకాసుల వాకిలి చేరుతూనే అదృశ్యమైనాడు. అరీనా లోగిట్లో నిలబడిపోయింది; ఆమెచుట్టూ చెలరేగిన మనుషులు కేకలు వేస్తూ, నవ్వుతూ, ఆమె చెవిలో యీలలు వేస్తూ, ఆనందోన్మాదంతో ఆమెచుట్టూ గంతులు వేస్తున్నారు. ఆమె అక్కడే నిలబడి వుంది, వాళ్ల మధ్య, కొయ్యబారిన ముఖంతో – మురికిగా, చిందరవందరగా, కరుణాజనకంగా, అసంభవంగా.

"పెండ్లికొడుకు వెళ్లిపోయినాడు, ఆమెను వెనుక వదలి," కేకవేసినాడు స్టేషన్ మాస్టరు తన భార్యకు, అరీనావైపు వ్రేలు చూపుతూ, విరగబడి నవ్వుతూ.

అరీనా అతనివైపు తల తిప్పింది, తరువాత వెళ్లిపోయింది బారకాసులు దాటి, అలా మైదానంలోకి. ఆమె పోకడను అరుపులూ, నవ్వులూ, పొలికేకలూ పరివేష్టించినాయి.

"చాలు! యిక వదిలేయండి ఆమెను!" అరిచింది సోఫ్యా ఇవానొవ్నా "తేరుకోడానికి అవకాశ మివ్వండి ఆమెకు. వంట వండాలి, మరిచిపోవద్దు."

అరీనా మైదానంలోకి వెళ్లిపోయింది అలా – స్టేషన్ హద్దులు దాటి, దట్టంగా గోధుమ పెరిగిన పొలంలోకి వెళ్లిపోయింది. ఆమె మెల్లగా నడుస్తూ వెళ్లిపోయింది, ఆలోచనలో మునిగిపోయినదాని లాగ.

"యెలా వుండింది?" స్టేషన్ మాస్టరు అడిగినాడు, ఆ చిన్న తమాషాలో పాల్గొన్నవాళ్లను. వాళ్లిప్పుడు ఆ నవ దంపతుల ప్రవర్తనలోని పసందైన వివరాలు ఒకరి కొకరు జ్ఞాపకం చేసుకుంటున్నారు. అందరూ పగలబడి నవ్వుతున్నారు. యిక్కడ కూడా తన విజ్ఞాన మణులలో ఒకదాన్ని దూర్చడానికి నికొలాయ్ పెత్రోవిచ్‌కు అవకాశం లభించింది:

"నవ్వడం తప్పు గాదు
నవ్వాల్సినదాన్ని జూసి."

యిది అతను సోఫ్యా ఇవానొవ్నాకు చెప్పినాడు, హెచ్చరిక జోడిస్తూ, "కానీ అతి నవ్వు హానికరం."

ఆ రోజు స్టేషన్‌లో నవ్వు చాలా వుండింది, కానీ భోజనం దరిద్రంగా వుండింది – అరీనా వంట చేయడానికి తిరిగి రాలేదు, ఆ భారం స్టేషన్ మాస్టరు భార్యమీద పడింది.

కానీ దరిద్రపు భోజనం కూడా వాళ్ల ఉత్సాహాన్ని అణచలేకపోయింది. గోమెజొవ్ డ్యూటీ సమయం దాకా బారకాసుల్లోనుండి బయటికి రాలేదు. అతను బయటికి వచ్చినప్పుడు అతన్ని స్టేషన్ మాస్టరు ఆఫీసుకు పిలిపించినాడు. అక్కడ, మత్వేయ్ యెగోరొవిచ్‌కీ, లుకాకూ అపారమైన వినోదం కలిగిస్తూ, అతన్ని నికొలాయ్ పెత్రోవిచ్ ప్రశ్నలు వేసినాడు. అతను తన సుందరాంగిని "వశపరచుకొన్న" వైనం గురించి.

"మానవుని ప్రలోభ పతనాల గురించి యింత అసాధారణమైన కథ నేనెప్పుడూ వినలేదు," అని చెప్పినాడు నికొలాయ్ పెత్రోవిచ్, స్టేషన్ మాస్టరుతో.

"చాలా పెద్ద పతనం కూడా," అన్నాడు నెమ్మదస్తుడైన గోమెజొవ్, పొడిగా చిరునవ్వు నవ్వుతూ. అరీనాను అపహాస్య స్థితిలో పెట్టి తమ కథను వివరిస్తే, తనమీద యెగతాళి తగ్గిపోతుందని అతను గుర్తించినాడు.

"మొదట వూరక కన్ను గీటుతూ వుండింది నావైపు," అన్నాడు అతను.

"కన్ను గీటుతూ? హోహోహో! ఊహించుకో, నికొలాయ్ పెత్రోవిచ్ – ఆమె కన్ను గీటడం! ఓ, అద్భుతం, పరమాద్భుతం!"

"వూరక కన్ను గీటుతూ వుండిం దన్నమాట. నేను మనసులోనే అనుకున్నాను, 'యిది మంచి పని కాదు అమ్మాయీ!' అని. తరువాత ఆమె నాతో అన్నది, 'నీకు కావాలంటే చొక్కాలు కుట్టిస్తాను,' అని."

"కానీ సూది కాదు ముఖ్యమైనది," నికొలాయ్ పెత్రోవిచ్ అభిప్రాయ ప్రకటన చేసినాడు, వివరణాత్మకంగా స్టేషన్ మాస్టర్‌తో చెపుతూ, "యిది నెక్రాసొవ్ కవిత్వంలోనిదిలే. కానీ గోమెజొవ్."

గోమెజొవ్ చెప్పకపోయినాడు, మొదట ప్రయత్నపూర్వకంగా, కానీ క్రమక్రమంగా తన అబద్ధాలతో తానే ఉత్తేజం పొంది – అవి తనకు బాగా ఉపయోగపడుతున్నా యని అతను గ్రహించినాడు.

యీలోగా, యెవర్ని గురించి అతను మాట్లాడుతున్నాడో ఆమె మైదానంలో పడివుంది. ఆమె చాలా దూరం నడిచింది గోధుమ సముద్రంలోకి; అక్కడ నేలమీద భారంగా పడిపోయి, చేష్టలు దక్కి పండుకుంది. యెండ వేడిమి వీపుమీద భరించలేనప్పుడు ఆమె యిటు దిరిగింది, భరించలేనంత స్వచ్ఛంగా వున్న ఆకాశమూ, భరించలేనంత కాంతిగా వున్న సూర్యుడూ కనిపించకుండా ముఖానికి చేతులు అడ్డం పెట్టుకుంది.

అవమాన భారంతో క్రుంగిపోయిన ఆమెచుట్టూ గోధుమ పైరు మృదువుగా సవసవ శబ్దం చేస్తున్నది, అసంఖ్యాకమైన మిడతలు యెడతెగకుండా ప్రాథేయపూర్వకంగా కీచుకీచు మంటున్నాయి. వాతావరణం వేడిగా వుంది. దైవ ప్రార్థన చేసుకుందామని ప్రయత్నించింది ఆమె, కానీ ఒక ప్రార్థన మాటలు కూడా జ్ఞాపకం రాలేదు. వెక్కిరించే

ముఖాలు ఆమె కండ్లముందర నృత్యం చేస్తున్నాయి. నవ్వుల శబ్దాలూ, కొమ్ము నాదమూ, లుకా కీచు కంఠధ్వనీ ఆమె చెవులలో గింగురు మంటున్నాయి. యీ శబ్దాలవల్లనో, లేక వేడివల్లనో ఆమెకు గుండె పట్టుకుంది; ఆమె జాకెట్టు విప్పి శరీరానికి యెండ తగలనిచ్చింది; వూపిరి పీల్చుకోవడం సులభ మౌతుందనే ఆశతో. యెండ శరీరాన్ని మాడ్చింది; యేదో వేడిగా ఆమె రొమ్ములో తొలుస్తున్నట్లుంది; వూపిరాడక ఆమె యెగబోసుకుంటున్నది.

"తండ్రీ, కనికరించు...." గొణుగుతున్నది ఆమె మాటిమాటికీ.

గోధుమ పైరు సవసవా, మిడతల కీచుకీచూ తప్ప ఆమెకు జవాబు లేదు. గోధుమ తరంగాల పైగా తల యెత్తి ఆమె వాటి బంగారు నిగనిగలు చూసింది, స్టేషను కావల గాలిలోకి నిటారుగా వుండే నీళ్ల టాంకిని చూసింది, స్టేషన్ భవనాల కప్పులను చూసింది. ఆకాశపు నీలి చాందినీ కింద వున్న ఆ అనంతమైన పసుపురంగు మైదానంలో అవి తప్ప మరేమీ లేవు. అరీనాకు అనిపించింది, యావత్ప్రపంచంలో తాను ఒంటరిగా వున్నట్లు, ఆ ప్రపంచంలో నట్టనడి మధ్య తాను పడివున్నట్లు, తన ఒంటరితనపు భారాన్ని తొలగించడానికి యెప్పుడూ యెవరూ రాబోనట్లు.... యెప్పుడూ.... యెవరూ....

సాయంత్రం ఆమెకు కేకలు వినిపించినాయి.

"అరీనా! అరీనా!"

అందులో ఒక గొంతు లుకాది, మరొకటి సిపాయిది. మూడవ గొంతు వినపడు తుందని ఆమెకు ఆశ వుండింది, కానీ అతను పిలువలేదు. అందువలన ఆమెకు కన్నీళ్లు కట్టలు తెంచుకొని వచ్చి, కనుమల చెంపలమీదనుండి రొమ్ముమీదికి ధారగా కారినాయి. అలా యేడుస్తూ ఆమె తన వుత్త రొమ్మును వెచ్చని పొడి నేలమీద రుద్దుకుంది, అంతకంతకూ మహా బాధాకరంగా తీవ్రమైన రొమ్ములోని మంటను అపుకోడానికి. ఆమె యేడ్చింది, తరువాత యేడుపు మానింది, వెక్కిళ్ల అణచుకుంటూ — యెవరో ఆమె యేడుపు విని, యేడుపును నిషేధిస్తా రని ఆమె భయపడినట్లు.

రాత్రి పడిన తర్వాత ఆమె లేచి మెల్లగా స్టేషనుకు దారి తీసింది.

స్టేషన్ భవనాలు చేరిన తర్వాత ఆమె షెడ్డు గోడకు ఆనుకొని చాలా సేపు నిలబడింది, దూరంగా మైదానంలోకి నిలజూస్తూ. ఒక గూడ్సురైలు వచ్చి వెళ్లింది, తన అవమాన గాథను సిపాయి రైలు కండక్టర్లకు చెప్పడమూ, వాళ్లు పగలబడి నవ్వడమూ ఆమెకు వినపడింది. వాళ్ల నవ్వు మైదానంలో చాలా దూరం ప్రాకింది, ఉడుతలు మెల్లగా కిచకిచ మంటున్న మైదానంలో.

"తండ్రీ, కనికరించు," నిట్టూర్చింది ఆమె, తన దేహాన్ని గోడకు నొక్కుతూ. కానీ ఆమె నిట్టూర్పులు ఆమె హృదయ భారాన్ని తగ్గించలేదు.

తెల్లవారేముందు ఆమె స్టేషన్‌లోని అటక యెక్కి, బట్టలు ఆరవేసుకునే తాడుతో ఉరివేసుకుంది.

రెండు రోజుల తర్వాత, శవం వాసన వచ్చినప్పుడు వాళ్ళు అరీనాను కనుక్కున్నారు. మొదట వాళ్లు భయపడిపోయినారు; తరువాత, ఆ నేరం యెవరిమీద పడవచ్చు నని చర్చ ప్రారంభించినారు. నేరస్థుడు గోమెజొవ్ అని నికొలాయ్ పెత్రోవిచ్ తిరుగులేకుండా రుజువు చేసినాడు. స్టేషన్ మాస్టరు స్విచ్‌మన్ దవడమీద ఒక దెబ్బ వేసి, నోరు మూసుకొని వుండమని హెచ్చరిక యిచ్చినాడు.

అధికార్లు వచ్చి దర్యాప్తు చేసినారు. అరీనాకు మానసిక వ్యాధి వుండినట్లు కనుక్కున్నారు. శవాన్ని మైదానంలోకి తీసుకపోయి పూడ్చేటట్లు కొంతమంది రైల్వే కార్మికులకు ఉత్తరువు లివ్వబడినాయి. అది జరిగిన తర్వాత స్టేషన్‌లో మళ్లీ శాంతీ, సువ్యవస్థా రాజ్యం చేసినాయి.

మళ్లీ అక్కడివాళ్లు రోజుకు నాలుగు నిముషాలు జీవించసాగినారు, ఒంటరితనంతోనూ, యేమీ తోచకపోవడంతోనూ, వేడితోనూ, నిష్క్రియాపరత్వంతోనూ కృశించిపోతూ, వాళ్లను వెనుకవేసి ముందుకు పరుగెత్తిపోయే రైళ్లవైపు ఈర్ష్యతో నిలజూస్తూ.

...యిక చలికాలంలో, మైదానంనుండి మంచు తుఫానులు హుంకరిస్తూ, ఫీంకరిస్తూ వచ్చి, ఆ చిన్న స్టేషన్‌మీద మంచునూ, భీకర నాదాలనూ కుమ్మరించినప్పుడు, జీవితం మరీ ఒంటరిగా వుండేది.

1897

# యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ*

(కా వ్య ం)

మేము యిరవై ఆరుమంది మనుషులం, చీకటి బొరియలాంటి బేస్‌మెంటులో బంధింపబడిన యిరవై ఆరు సజీవ యంత్రాలం. అక్కడ మేము ఉదయంనుండి రాత్రి దాకా పిండి పిసుకుతూ, ఉప్పు రొట్టెలూ, గట్టి రొట్టెలూ చేస్తూ వుండేవాళ్లం. మా బేస్‌మెంటు కిటికీలగుండా పచ్చగ పాచి పట్టిన యిటుక గోడల గుంత ఒకటి కనపడుతుంది. కిటికీలకు బయటివైపున ఇనప కడ్డీలు చిక్కగ బిగించినారు; కిటికీ గాజు తలుపులగుండా ఒక కిరణం యెండ కూడా రాదు, వాటికి పిండి మెత్తుకొని వుంది. మా యజమాని కిటికీలకు కంచె వేయించినాడు, తన రొట్టె యేదీ బిచ్చగాళ్లకు గానీ, మా సహచరులలో పని పోగొట్టుకొని పస్తులుండేవాళ్లకు గానీ అందకుండా చేయడానికి — మా యజమాని మమ్మల్ని దొంగల గుంపు అనేవాడు, మాకు భోజనానికి మాంసం బదులు కుళ్లిన పేగులు పెట్టేవాడు.

జనం నిండిన ఆ యిరుకు గదిలో, మసీ, సాలెగూళ్లూ నిండిన యెత్తులేని కప్పుకింద జీవితం భారంగా వుండింది. మట్టి మరకలూ, బూజూ నిండిన ఆ మందపు గోడలలో జీవితం కష్టంగా, రోతగా వుండింది. మేము ప్రొద్దున అయిదు గంటలకు నిద్రలేచేవాళ్లం, నిద్ర చాలక ఒళ్లు బరువుగా. ఆరు గంటలకు టేబుల్‌వద్ద కూర్చునేవాళ్లం, మేము నిద్రపోయేటప్పుడు మా సహచరులు తయారు చేసిన పిండి ముద్దలనుండి ఉప్పు రొట్టెలూ, గట్టి రొట్టెలూ చేయడానికి. రోజంతా వేకువనుండి రాత్రి పది దాకా మాలో కొంతమంది, తిమ్మిరి పట్టకుండా శరీరాలు వూపుతూ, గట్టిగా వున్న పిండి ముద్దతో రొట్టెల ఆకారాలు చేసేవాళ్లం, తక్కినవాళ్లు పిండీ నీళ్లూ పిసికేవాళ్లు. రోజంతా ఉప్పు రొట్టెలు ఉడకబెట్టే గోళంలో కాగే నీళ్లు విచారంగా, దుఃఖంగా కుతకుత మంటూ

---

*గోర్కీ తన జీవితంలోని కజాన్ దశలో వసీలియ్ సెమ్యోనొవ్ బేకరీలో పనిచేసినాడు. ఆ దశలోని ఒక ఘటనను వర్ణిస్తుంది యీ కథ. "నా విశ్వవిద్యాలయాలు" అన్న పుస్తకంలో గోర్కీ యిలా రాసినాడు: "నా జీవితంలోని యీ దశను 'యజమాని', 'కొనొవాలొవ్,' 'యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ,' అన్న కథల్లో స్థూలంగా చిత్రించినాను. దౌర్భాగ్యపు కాలం! అయినా జ్ఞానదాయకమైనది." — సం.

వుండేవి, బేకర్ సిబ్బి జారిపోయే ఉడికిన పిండి ముక్కలను కాలే యిటుకలమీదికి విసరివేస్తూ ఓవెన్‌గోడమీద కోపంగా వేగంగా కొట్టుకొనేది. ఉదయంనుండి రాత్రి దాకా ఓవెన్‌లో కట్టెలు మండుతూ వుండేవి, మంటల యెర్రని కాంతి బేకరీ గోడలమీద మినుకుమినుకు మనేది, నిశ్శబ్దంగా వెక్కిరిస్తున్నట్లు. ఆ బ్రహ్మాండమైన ఓవెన్ నేలలోనుండి పైకి వెళ్లబెట్టిన యేదో ఊహాతీతమైన రాక్షసియొక్క వికృతాకారపు తలలాగ వుండేది, దాని తెరచిన నోరు యెర్రని మంటతో జ్వలిస్తూ, మావైపు వేడిని నిశ్వసిస్తూ, తన నుదుటిమీద లోతుకుపోయిన రెండు గాలి రంధ్రాలగుండా మా యెడతెగని శ్రమను గమనిస్తూ. యీ రెండు రంధ్రాలూ కండ్లలా గుండేవి — జాలి లేని, కనికరం లేని బ్రహ్మరాక్షసి కండ్లలాగ; అవి మావైపు బాధాపూరిత దృక్కులతో తేరిచూసేవి, మానవ సహజమైన దేదీ ఆశించడానికి వీలులేని బానిసలను చూసి చూసి వేసట చెందినట్లు, తన జ్ఞాన శిఖరాల కఠోర ఆధిక్యంలో మమ్మల్ని యేవగించుకుంటున్నట్లు.

ప్రతిరోజూ, పిండి ధూళి మధ్య, బయటి ఆవరణలోనుండి మా కాళ్లకు అంటుకొని వచ్చిన బురద మధ్య, వేడి బేస్‌మెంటులోని వాసన కొట్టే ఉక్కలో, మేము పిండి ముద్దలు పిసికి రొట్టెలు చేసేవాళ్లం, వాటిమీద మా చెమట చినుకులు పడేవి; మా పనిని మేము తీవ్రంగా ద్వేషించేవాళ్లం, మా చేతులతో చేసినదాన్ని యెప్పుడూ తినేవాళ్లం కాదు, ఆ రొట్టెలకు బదులు రై బ్రెడ్డు కోరుకునేవాళ్లం. పొడుగాటి టేబుల్‌వద్ద యెదురెదురుగా కూర్చొని — ఒకొక పక్క తొమ్మిదిమంది — క్షణమొక యుగంగా గడిచే కాలంలో, మా చేతులూ, వేళ్లూ యాంత్రికంగా కదిలించేవాళ్లం, మా పనికి మేము పూర్తిగా అలవాటుపడి నందువల్ల మా పనిని కండ్లతో చూడనక్కర లేదు. యిక ఒకరి కొకరం మేము యెంతగా అలవాటుపడినా మంటే, మా తోటివాళ్ల ముఖాలలోని ప్రతి రేఖా మాలో ప్రతి ఒక్కనికీ తెలుసు. మాకు మాట్లాడడానికి యేమీ లేదు, దానికి మేము అలవాటుపడినాము, యెప్పుడూ మౌనంగా వుండేవాళ్లం — తిట్టేటప్పుడు తప్ప; తిట్టడానికి యెప్పుడూ యేదో ఒకటి వుంటుంది, యెవరినో ఒకరిని, ముఖ్యంగా తోటివాణ్ని. కానీ, యెప్పుడో తప్ప ఒకరి నొకరం తిట్టుకునేవాళ్లం కాదు — యెముకలు విరిచే శ్రమ భారంతో ఒక మనిషి సగం శవమైతే, రాతి విగ్రహంలాగ అయితే, అతని సర్వేంద్రియాలూ మొద్దుబారిపోతే, అది అతని తప్పా? చెప్పవలసిం దంతా చెప్పేసినవాళ్లకు మాత్రమే మౌనం భీకరంగా, యిబ్బందిగా వుంటుంది; కానీ మనసులోని దింకా చెప్పనివాళ్లకు మౌనం సహజంగా, సులభంగా వుంటుంది. ఒకోసారి మేము పాడేవాళ్లం, మా పాట యిలా ప్రారంభ మయేది: పని చేసేటప్పుడు యెవరో ఒకరు హఠాత్తుగా అలసిన గుర్రంలాగ నిట్టూర్పు విడిచి, తన సుకుమార విషాద మాధుర్యంతో పాడేవాని హృదయ భారాన్ని యెప్పుడూ తేలికపరిచే ఆ పెద్ద పాటల్లో ఒకటి మెల్లగా పాడడం ప్రారంభించేవాడు. ఒకడు పాడుతూ వుంటే తక్కినవాళ్లు ఆ ఒంటరితనపు

పాటను మౌనంగా వినేవాళ్ళు. ఆ బాధాకరమైన బేస్‌మెంటు కప్పు కింద అది నీరసించి మాసిపోయేది — బూడిదరంగు ఆకాశం భూమిపైన సీసపు కప్పులాగ వ్రేలాడే శరత్కాలపు చిత్తడి రాత్రిపూట మైదానంలోని చలిమంట జ్వాలలు నీరసించి అణగిపోయినట్లు. అప్పుడు వానితో మరొకడు కలిసేవాడు, ఆ రెండు కంఠధ్వనులూ మా జనసంకీర్ణపు గుహలోని బరువైన ఉక్కలో మెల్లగా, భారంగా తేలిపోయేవి. తరువాత హఠాత్తుగా, ఒకేసారి అనేక కంఠాలు కలిసేవి — పాట సముద్ర తరంగం లాగ యెగిరి దుమికేది, బలంగా బిగ్గరగా పెరుగుతూ, మా చెమ్మనిండిన, దిటవైన జైలు గోడలను పడగొట్టుతున్నట్లు.

ఒకోసారి యిరవై ఆరుమందిమీ పాడుతుంటాము. పెద్ద కంఠాలు దీర్ఘకాలపు అలవాటుచేత ఒక శ్రుతిలో కలిసి పాడుతూ, ఆ వర్కుషాపును నింపేసేవి. పాటకు జాగా తక్కువై యిరుక్కునేది. అది రాతి గోడలకు కొట్టుకునేది, యేడుస్తూ, శోకిస్తూ; మెత్తగ సూదులతో పొడిచినట్లు గుండెను కదిలించేది, పాత గాయాలను కెలుకుతూ, ఆత్మను యాతన పెడుతూ. పాటకాళ్ళు దీర్ఘంగా నిట్టూర్చేవాళ్ళు; అందులో ఒకడు హఠాత్తుగా పాడడం ఆపి చాలాసేపు తన సహచరుల పాటను వింటాడు, తరువాత మళ్ళీ అతని కంఠం సార్వజనిక బృందగానంలో కలుస్తుంది. మరొకడు విచారపూరితంగా "ఆ!" అని అరుస్తాడు, కండ్లు మూసుకొని పాడుతూ; బహుశా అతనికి ఆ విశాల ధ్వని ప్రవాహం యెక్కడో దూరానికి పోయే రోడ్డు లాగ కనపడుతుంది, ప్రదీప్త సూర్యకాంతిలో మునిగిన విశాలమైన రోడ్డు, ఆ రోడ్డుమీద స్వయంగా తానే నడుస్తూ....

ఓవెన్ మంటలు యింకా మండుతుంటాయి, బేకర్ సిబ్బి యింకా యిటుకను గోకుతూ వుంటుంది, గోళంలో నీళ్ళు యింకా మరుగుతూ, కుతకుత మంటుంటాయి, ఓవెన్ వెలుతురు యింకా గోడమీద అల్లాడుతూ వుంటుంది, నిశ్శబ్దంగా నవ్వుతూ. మేము ఉచ్చాటన చేస్తుంటాము, మావి కాని మాటల ద్వారా, మా లోపలి గుండె సలుపును, సూర్యకాంతికి నోచుకోని జీవద్వ్యక్తులను కొరుక్కు తినే వేదనను, బానిసల దుఃఖభారాన్ని. అలా మేము జీవిస్తూ వుండినాం, యిరవై ఆరుమంది మనుషులం, ఒక పెద్ద రాతి భవనంలోని బేస్‌మెంటులో. మా బతుకు భారం యెంత బరువుగా వుండిందంటే, ఆ భవనంయొక్క మూడు అంతస్తులూ మా భుజాలమీద కట్టినారా అన్నట్లుండేది.

మా పాటలు కాక మేము ప్రేమించి ఆరాధించేది మరొకటి వుండింది, బహుశా మాకు సూర్యుడు లేని కొరతను తీరుస్తూ వుండింది. మా భవనం మొదటి అంతస్తులో జరీ ఎంబ్రాయిడరీ వర్కుషాపు ఒకటి వుండింది. అందులో పనిచేసే అనేకమంది ఆడపిల్లలతో పాటు, పదారేండ్ల పనిమనిషి తాన్యా కూడా వుండింది. ప్రతిరోజూ ఉదయం ఉల్లాసపు నీలి కన్నులు గల ఒక గులాబిరంగు ముఖం వచ్చి మా వర్కుషాపు తలుపులో యేర్పరచిన చిన్న

కిటికీ గాజుతలుపుకు అనుకునేది, ఒక తియ్యని వీణా నాదం లాంటి కంఠం మమ్మల్ని పిలిచేది:

"ఓయ్! జైలు పక్షులు! కాసిని ఉప్పు రొట్టెలు పడేయండి!"

ఆ స్పష్టమైన కంఠధ్వని విని మేము అందరమూ తలలు అటు తిప్పేవాళ్లం, అంత తీయగా మావైపు చిరునవ్వు నవ్వే ఆ స్వచ్ఛమైన పసి ముఖంవైపు ఆదరంగా, ఆహ్లాదంగా చూసేవాళ్లం. గాజు తలుపుకు అనుకొని అణక్కుపోయిన ముక్కునూ, చిరునవ్వుతో విడిపోయిన గులాబి పెదవుల మధ్య తళతళ మెరిసే చిన్న తెల్లని పలువరుసనూ చూసి మేము మురిసిపోయేవాళ్లం. మేము ఒకరి నొకరు తోసుకుంటూ వెళ్లేవాళ్లం, ఆమె కోసం తలుపు తెరవడానికి; అక్కడ ఆమె వుండేది, కేరింత లాడే ఉత్సాహంతో, యెంతో మనోహరంగా, ఆప్రన్* యెత్తి పట్టుకొని — మా ముందర నిలబడి వుండేది, చిలిపిగా యెత్తిన తలతో, కళకళ లాడే ముఖంతో. యెండు గడ్డిరంగు వెంద్రుకల పొడుగాటి లావు జడ భుజంమీదనుండి ఆమె రొమ్ముమీదికి పడి వుండేది. మేము, మురికి, మొరటు, వికారపు మనుషులం, ఆమెవైపు యెగజూసేవాళ్లం — వాకిలి గడప మా గదినేలకు నాలుగు మెట్లు యెత్తున వుండేది — తల లెత్తి ఆమెవైపు యెగజూస్తూ పలకరించేవాళ్లం; మా శుభాకాంక్షలు తెల్పే ఆ పదాలు ప్రత్యేకమైన పదాలు, ఆమె కొరకు మాత్రమే యేర్పడినవి. ఆమెతో మాట్లాడేటప్పుడు మా గొంతులు మృదువుగా వుండేవి, మా హాస్యాలు తేలికగా వుండేవి. ఆమెకు మేమిచ్చే ప్రతిదీ ప్రత్యేకమే. బేకర్ ఓవెన్‌లోనుండి సిబ్బినిండా కరకర లాడే యెర్రని ఉప్పు రొట్టెలు తీసి తాన్యా ఆప్రన్‌లోకి చాకచక్యంగా విసిరేసేవాడు.

"యజమానికి దొరికేవు, జాగ్రత్త!" మేము హెచ్చరించేవాళ్లం. ఆమె చిలిపిగా నవ్వి, ఉల్లాసంగా అరిచేది:

"వస్తాను, జైలు పకులూ!" తరువాత చిన్న చిట్టెలుక లాగ రెప్పపాటులో అదృశ్యమయ్యేది.

అదేమో అంతే.... కానీ, ఆమె పోయిన తర్వాత చాలాసేపు మేము ఆమెను గురించి మాట్లాడుకునేవాళ్లం — నిన్న చెప్పిన విషయాలే, మొన్న చెప్పిన విషయాలే మళ్లీ చెప్పేవాళ్లం; యెందుకంటే ఆమే, మేమూ, మా చుట్టూ వున్న సమస్తమూ నిన్నా, మొన్నా వుండిన పాత విషయాలే గనుక.... జీవిస్తూ వుండి, తన చుట్టూ యేదీ మారకపోవడం మనిషికి చాలా బాధాకరంగా, కష్టంగా వుంటుంది. అతనిలోని ఆత్మను అది చంపకపోవచ్చు, కానీ అతను యెంత యెక్కువ కాలం బతికితే అంత బాధాకరంగా

*ఆప్రన్ — వంట, మొదలైన పనులు చేసేటప్పుడు బట్టలు మాయకుండా, కట్టుకునే గుడ్డ. — సం.

తయారౌతుంది అతని చుట్టూ వున్న వస్తువుల నిశ్చలత్వం.... మేము ఆడవాళ్లను గురించి యెప్పుడూ యెలా మాట్లాడుకునేవాళ్ల మంటే, ఒకోసారి మామీద మాకే అసహ్యం వేసేది, మా సిగ్గు విడిచిన రోత మాటలు మాకే అసహ్యం కలిగించేవి. అందులో ఆశ్చర్యం లేదు, యెందుకంటే మాకు తెలిసిన ఆడవాళ్లు బహుశా మరే విధంగానూ మాట్లాడడానికి అర్హులు కారు. కానీ తాన్యాను గురించి మేము యెప్పుడూ ఒక చెడ్డమాట కూడా అనలేదు. మే మెవ్వరమూ చేతితో ఆమెను తాకే సాహసం చేయలేదు, మాలో యెవరి నోటినుండీ ఆమె ఒక చిల్లర పరిహాసపు మాట వినలేదు. అది బహుశా ఆమె చాలాసేపు నిలవక పోవడంవల్ల కావచ్చు — ఆకాశంలోనుండి రాలిపడే నక్షత్రం లాగ ఆమె మా కనులముందు అలా మెరిసి, అంతలో మాయమయ్యేది. లేక బహుశా ఆమె చిన్న పిల్లగా, అంత మహా అందంగా వుండినందువల్ల కావచ్చు — అందంగా వున్న దేదైనా గౌరవాన్ని చూరగొంటుంది, మొరటు మానవులవద్ద కూడా. అంతేగాక, ఆ అసహ్యమైన శ్రమ మమ్మల్ని నోరులేని యెద్దులుగా మారుస్తున్నా, మే మింకా మనుషులంగానే వుండినాం, మనుషు లందరి లాగే యేదో ఒక ఆరాధ్య వస్తువు లేకుండా మేమూ బతకలేకపోయినాం. ఆమెకంటె మేలైన మనిషి మాచుట్టూ యెవరూ లేరు; ఆ భవనంలో అద్దెల కుండేవాళ్లు డజన్లకొద్దీ వున్నా, ఆమె తప్ప యెవరూ ఆ బేస్‌మెంటులో జీవించే మమ్మల్ని గుర్తించలేదు. చివరి కారణం — బహుశా యిదే ప్రధాన కారణ మేమో — ఆమెను మా మనిషిగా చూసేవాళ్లం, మా ఉప్పు రొట్టెలవల్లనే రూప మెత్తిన మనిషిగా చూసేవాళ్లం. ఆమెకు వేడివేడి ఉప్పు రొట్టెలు యివ్వడం మా కర్తవ్యంగా చేసుకున్నాం, అది మా దేవతకు మా నిత్య నైవేద్యం అయింది, దాదాపు ఒక పూజా విధి అయింది, తద్వారా ఆమె మాకు రోజు రోజుకూ మరింత ప్రియతమమైంది. ఉప్పు రొట్టెలకు తోడు మేము తాన్యాకు యెన్నో ఉపదేశాలు కూడా యిచ్చేవాళ్లం — ఒళ్లుకు చలి తగలకుండా బాగా బట్టలు వేసుకొమ్మనీ, మెట్లమీద మరీ ఆత్రంగా పరుగెత్త వద్దనీ, కట్టెల మోపులు బరువైనవి మోయవద్దనీ. మా ఉపదేశాలు ఆమె చిరునవ్వుతో విని, నవ్వుతో త్రుళ్లగొట్టి, యెప్పుడూ ఆచరణలో పెట్టేది గాదు, కానీ మేమేమీ అనుకునేవాళ్లం కాదు — ఆమెపట్ల మా ఆదరణ చూపించడంలో తృప్తి పడేవాళ్లం.

తరుచుగా ఆమె తన కేవైనా పనులు చేసిపెట్టమని మమ్మల్ని అడిగేది. ఉదాహరణకు బిర్రుగా బిగుసుకపోయిన సామాన్లగది తలుపు తెరవమనో, కట్టెలు కొట్టి యివ్వమనో అడిగేది; మేము యీ పనులే కాదు, ఆమె కోరిన యే పనులైనా సంతోషంతో చేసేవాళ్లం, ఒక విధమైన గర్వంతో చేసేవాళ్లం.

కానీ మాలో ఒకడు తన కున్న ఒకే ఒక చొక్కా చినిగిపోయిందని, దాన్ని కుట్టిపెట్టమన్నప్పుడు ఆమె యేవగింపుతో ముఖం చిట్లించి,

"కుట్టిపెట్టడమే! అయ్యే పని గాదు!" అన్నది.

ఆ పనికిమాలినవాణ్ని యెగతాళి చేస్తూ మేము బాగా నవ్వుకున్నాం, ఆ తర్వాత మే మెప్పుడూ ఆమెను యేదీ అడగలేదు. ఆమెమీద మాకు ప్రేమ — ఆ మాటలోనే అంతా వుంది. మనిషి యెవరిమీదనో ఒకరిమీద తన ప్రేమను నిలుపుకోవా లనుకుంటాడు, ఆ ప్రేమ తోటి ప్రాణిని తరుచుగా బాధించినప్పటికీ, ఒకోసారి నీచపరిచినప్పటికీ, ఆ ప్రాణి జీవితాన్నే విష కలుషితం చేసినప్పటికీ కూడా; యెందుకంటే మనిషి ప్రేమించడంలో ప్రేమింపబడిన వ్యక్తిపట్ల గౌరవం వుండదు. తాన్యాపట్ల మా ప్రేమ అగత్యమైనది, ప్రేమించడానికి మాకు మరెవరూ లేరు గనుక.

ఒకోసారి హఠాత్తుగా మాలో ఒకడు వాదం ప్రారంభిస్తాడు:

"ఆ అమ్మాయిని గురించి యేమిటీ ఆర్భాట మంతా? యింతకూ ఆమెలో యేముందని అంత అద్భుతమైంది?"

అలా మాట్లాడినవాణ్ని యెక్కువ మాటలు లేకుండా నోరు మూయించేవాళ్లం — మేము ప్రేమించగలిగింది యేదో ఒకటి మాకు అవసరం; అది మాకు దొరికింది, దాన్ని మేము ప్రేమించినాం, మేము యిరవై ఆరుమందిమీ ప్రేమించింది మాలో ప్రతి వొకరికీ వర్తించేది, అది మాకు పూజ్యాతి పూజ్యం, మాలో యెవడైనా యిందులో వ్యతిరేకిస్తే, వాడు మాకు శత్రువు. మేము ప్రేమించింది బహుశా నిజంగా మంచిది కాకపోవచ్చు, కానీ మేము యిరవై ఆరుమంది వుండినాం, కనుక మా ఆరాధ్య వస్తువును ప్రతి వొకడూ పూజ్యభావంతో చూడాలని మా కోరిక.

మా ప్రేమ మా ద్వేషంకంటె తక్కువ భారమైంది కాదు.... బహుశా అందుకేనేమో గొప్పవాళ్ల మనుకునేవాళ్లు కొందరు మా ప్రేమకంటె మా ద్వేషమే తమకు గౌరవప్రదంగా వుంటుందని అంటారు. అయితే మరి, వాళ్లు మాకు దూరంగా యెందు కుండరు?

ఉప్పు రొట్టెల బేకరీ గాక, మా యజమానికి ఒక బన్ బేకరీ కూడా వుండింది. అది అదే భవనంలోనే వుండింది, దానికీ మా గుహకూ ఒక గోడే అడ్డం. కానీ బన్ బేకర్లు — నలుగురు వుండినారు వాళ్లు — నలుగురూ మాకు దూరంగా వుండేవాళ్లు. తమ పని మా పనికంటె శుభ్రమైన దనీ, తాము మాకంటె మేలైనవాళ్ల మనీ వాళ్లు అనుకునేవాళ్లు. మా వర్కుషాపుకు వాళ్లు యెప్పుడూ వచ్చేవాళ్లు కాదు, ఆవరణలో మేము యెప్పుడు యెదురైనా వాళ్లు మమ్మల్ని వెక్కిరింపుతోనూ, అసహ్యంతోనూ చూసేవాళ్లు. మేము కూడా వాళ్లవద్దకు యెప్పుడూ పోవడం లేదు — అలాంటి రాకపోకలను మా యజమాని నిషేధించినాడు, మేము బన్నులు దొంగిలిస్తా మనే అనుమానంతో. బన్ బేకర్లమీద మాకు ద్వేషం, యెందుకంటే వాళ్లమీద మాకు అసూయ — వాళ్ల పని మా

పనికంటె సులభమైంది, వాళ్లకు మాకంటె యెక్కువ జీతం, మాకంటె మంచి తిండి, వాళ్లది బాగా గాలి వచ్చే విశాలమైన వర్కుషాపు, వాళ్లు యెంతో శుభ్రంగా, ఆరోగ్యంగా వుండేవాళ్లు, అందుకని మాకు అసహ్యం. యిక మేమంతా పసుపురంగు తిరిగి పాలిపోయిన ముఖాలవాళ్లం; మాలో ముగ్గురికి సుఖరోగాలు, కొందరికి గజ్జి, ఒకనికి కీళ్లవాతం. సెలవు రోజుల్లోనూ, ఆదివారాల నాడూ వాళ్లు సూట్లూ, కిర్రు బూట్లూ వేసుకొని ముస్తాబయ్యేవాళ్లు, వాళ్లలో యిద్దరికి అకార్డియన్లు వుండినాయి, అందరూ పార్కులోకి షికారు వెళ్లేవాళ్లు. యిక మేము మురికి పేలికలు వేసుకొని, కాళ్లకు తాట బూట్లు తొడుక్కునేవాళ్లం, మమ్మల్ని పోలీసులు పార్కులోకి వెళ్లనిచ్చేవాళ్లు కాదు — మరి, మాకు బన్ బేకర్లమీద ప్రేమ యెలా వుండగలదు?

ఒక రోజున మాకు తెలిసింది, హెడ్ బేకర్ తాగుడుకు అలవాటుపడినా డనీ, యజమాని అతన్ని బర్తరఫ్ చేసి, ఆ స్థానంలో మరొకణ్ని నియమించినా డనీ. కొత్తవాడు మాజీ సిపాయట, శాటిన్ వేస్టుకోటు వేసుకుంటాడట, బంగారు గొలుసు గల జేబు గడియారం వుందట. ఆ ముస్తాబురాయుణ్ని చూడాలని మాకు ఆతురతగా వుండింది, కనుక మేము ఒకరి తర్వాత ఒకరు ఆవరణలోకి పరుగెత్తిపోయి చూస్తూ వుండినాం, అతను కనపడతాడేమో అనే ఆశతో.

కానీ అతనే మా వర్కుషాపులోకి వచ్చినాడు. తలుపును కాలితో తన్ని తెరిచినాడు అతను; చిరునవ్వుతో వాకిట్లో నిలబడి మాతో అన్నాడు:

"యేమర్రా, బాగున్నారా కుర్రవాళ్లందరూ!"

పొగమేఘం లాగ వాకిలిగుండా లోపలికి దూరే మంచుగాలి అతని కాళ్లచుట్టూ సుడిగుండంలా తిరిగింది, అతను వాకిట్లో నిలబడి వున్నాడు మావైపు చూస్తూ, ధిక్కారపు లేత గోధుమరంగు మీసాల కింద అతని పెద్ద పసుపురంగు పండ్లు మిలమిల మెరుస్తున్నాయి. అతని వేస్టుకోటు నిజంగా అపూర్వంగా వుంది — నీలం రంగుది, ఎంబ్రాయిడరీ పూలు కుట్టింది, జిగేలు మని మెరుస్తున్నది, గుండీలు యేదో యెర్రరాయితో చేసినవి. గొలుసు కూడా వుంది.

అందమైనవాడు ఆ సిపాయి — యెత్తుగా, దృఢంగా, యెర్రని బుగ్గలూ, పెద్ద తేనెరంగు కండ్లూ, ఆ కండ్లలో మంచి చూపులూ — శుభ్రమైన, హార్దికమైన చూపులు. అతని తలమీద గంజితో నీలుక్కున్న తెల్ల టోపీ వుంది, మరక లేకుండా శుభ్రంగా వున్న ఆప్రన్ కిందనుండి బాగా పాలిష్ చేసిన ఫాషనబుల్ బూట్ల కొసదేలిన మొనలు తొంగి చూస్తున్నాయి.

తలుపు మూయమని మా హెడ్ బేకరు సగౌరవంగా అతనితో చెప్పినాడు. అతను తొందర పడకుండా తలుపు మూసి, యజమానిని గురించి మమ్మల్ని ప్రశ్నించినాడు. మేము

ఒకరిమీద ఒకరు పడుతూ సమాధానం చెప్పినాం, మా యజమాని పిసినిగొట్టు అనీ, మోసగాడు అనీ, బద్మాష్ అనీ, యమభటుడు అనీ — యజమానిని గురించి అతనితో మేము చెప్పిన వన్నీ రాతలో పెట్టడం సాధ్యం కాదు. సిపాయి విన్నాడు, మీసాలు అల్లాడిస్తూ, మమ్మల్ని ఆ శుభ్ర సౌమ్యమైన తన చూపులతో పరికించి చూస్తూ.

"యిక్కడ ఆడపిల్లలు చాలామంది వున్నారు," అన్నాడు అతను ఉన్నట్టుండి.

మాలో కొందరు సవినయంగా నవ్వినారు, కొందరు గుటకలు మింగుతూ పరవశులైనారు, ఒకడు అక్కడ మంచి ఆడ సరుకు వుందని చెప్పినాడు.

"సరుకు వాడుకుంటుంటారా?" అడిగినాడు సిపాయి, అన్నీ తెలిసినవానిలా కన్ను గీటుతూ.

మళ్లీ మేము నవ్వినాం, కాస్త అణగబట్టిన, దిక్కు తోచని నవ్వు. మేమూ తనలాగే ఉల్లాసపు సిసింద్రీల మని అతనికి నమ్మజెప్పడం మాలో చాలామందికి యిష్టమే. కానీ యెవరమూ చెప్పలేకపోయినాం. యెవరికీ చేతకాలేదు. యెవడో అంత మాటా ఒప్పేసుకున్నాడు, మెల్లగా:

"వాళ్లు మాకు కుదరరు...."

"ఔనౌను, మీరు ఆమడ దూరంలో వున్నారు," అన్నాడు సిపాయి తీర్మానంగా, మావైపు కండ్లు చిట్లించి చూస్తూ. "మీరు—మరి — గీటుకు రారు.... మీకు వ్యక్తిత్వం లేదు.... మీదగ్గర సరైన సరుకు, అంటే రూపం, లేదు. మగవానిలో ఆడది కోరేది రూపం. సరైన శరీరం కావాలి వాళ్లకు.... ప్రతిదీ సరిగ్గా అలా వుండాలి. తరువాత, చెప్పనక్కర లేదు, కాస్త కండలు కావాలి వాళ్లకు. చేయి చేయి లాగా వుండా లంటారు, యిదుగో యిలా."

సిపాయి పాంటు జేబులోనుండి కుడి చేయి బయటికి తీసి, చొక్కా మోచేయి దాకా వెనక్కు మడిచి, మాకు చూపించినాడు — బలమైన తెల్లని ముంజేయి, తళతళ లాడే బంగారు వెంట్రుకలతో కప్పబడింది.

"కాలూ, రొమ్మూ, ప్రతిదీ దృఢంగా వుండాలి. యిక దుస్తులు సరైనవి వుండాలి, తగిన వేషం అంటారే, అది. నే నున్నాను చూడండి — ఆడవాళ్లు అలా పడి చస్తారు. మీరే మనుకున్నారో, నేను వాళ్ల వెంటబడడం గానీ, వాళ్లను ప్రలోభపెట్టడం గానీ యేమీ లేదు —వూరక అలా ఒకొకసారి అయిదుమంది వచ్చి నా మెడకు తగులు కుంటారు."

అతను ఒక పిండి మూటమీద కూర్చొని వర్ణించి వర్ణించి చెప్పినాడు, ఆడవాళ్లు తన్ను యెలా ప్రేమించేదీ, వాళ్ల విషయంలో తాను యెంత హుందాగా ప్రవర్తించేదీ. తరువాత అతను సెలవు తీసుకొని వెళ్లిపోయినాడు. అతని వెనుక కిర్రు మంటూ తలుపు

మూసుకుంటూనే, మేము దీర్ఘ మౌనంలో పడిపోయినాం, అతన్ని గురించీ, అతని కథలను గురించీ ఆలోచిస్తూ. తరువాత ఉట్టిపాటుగా అందరూ ఒకేసారి మాట్లాడినారు; మా కందరికీ అతనిమీద అభిమానం యేర్పడినట్లు అర్థమైంది. అంత మంచి, నిరాడంబరమైన వాడు — ఆ వచ్చిన తీరూ, కూర్చోవడమూ, మాట్లాడడమూ. మమ్మల్ని చూడడానికి యెప్పుడూ యెవరూ రాలేదు, మాతో యెవరూ అలా మాట్లాడలేదు, స్నేహితుని లాగ. మేము అలా మాట్లాడుకుంటూనే వుండినాం అతన్ని గురించీ, కుట్టు పని చేసే ఆడవాళ్ల విషయంలో అతని భవిష్యత్ విజయం గురించీ. ఆ ఆడవాళ్ళు, ఆవరణలో మేము యెదురైనప్పుడు, మూతి ముడుచుకొని యెడంగా తప్పుకొని పోయే వాళ్ళు, లేదా అక్కడ మేము లేనేలేనట్లు నేరుగా మామీదికి వచ్చేవాళ్లు. వాళ్లను ఆవరణలోనో, లేక చలికాలంలో అయితే తమ అందమైన చిన్న హాట్లూ, ఫర్ కోట్లూ ధరించి, యెండకాలంలో అయితే పూల హాట్లూ, మెరిసే రంగుల గొడుగులూ ధరించి, మా కిటికీల ముందు పోయేటప్పుడో, మేము మెచ్చుకోవడం మాత్రమే చేసేవాళ్లం. కానీ, మాలో మేము ఆ ఆడపిల్లలను గురించి యెలా మాట్లాడుకునేవాళ్ల మంటే, వాళ్ళు వింటే సిగ్గుతోనూ, కోపంతోనూ వాళ్లకు మతులు పోయేవి.

"అతను — మరి — మన తాన్యామీద కన్ను వేయడని ఆశిస్తాను," అని హెడ్ బేకర్ ఉట్టిపాటుగా అన్నాడు, ఆదుర్దాగా.

ఆ మాటతో మే మందరమూ కొయ్యబారిపోయినాము. యెందువల్లనో మేము తాన్యా విషయం మరిచిపోయినాము — సిపాయి తన పెద్ద అందమైన విగ్రహంతో ఆమెను కనబడకుండా కప్పేసినట్లైంది. గోలగా వాదోపవాదం చెలరేగింది: తాన్యా అతన్ని ఖాతరు చేయదని కొంద రన్నారు, సిపాయి ఆకర్షణలకు ఆమె తట్టుకోలేదని మరికొందరు నిర్ధారణగా అన్నారు, అతను తాన్యాతో సరసాలు ప్రారంభిస్తే అతని యెముకలు విరవాలని మరికొందరు ప్రతిపాదించినారు. చివరకు అందరమూ ఒక నిర్ణయానికి వచ్చినాం — సిపాయిమీదా, తాన్యామీదా ఒక కన్ను వుంచాలనీ, అతన్ని గురించి ఆమెకు హెచ్చరిక యివ్వాలనీ.... దానితో వాదం ముగిసింది.

సుమారు ఒక నెల గడిచింది. సిపాయి బన్నులు కాలుస్తూ వుండినాడు, కుట్టుపని పిల్లలతో తిరుగుతూ వుండినాడు, తరుచుగా మమ్మల్ని చూడడానికి వచ్చేవాడు, కానీ యెప్పుడూ తన ప్రేమ విజయాల గురించి యేమీ చెప్పేవాడు కాదు — అతను చేసే దల్లా మీసాలు మెలివేయడమూ, పెదవులు నాక్కోవడమూ.

తాన్యా ప్రతిరోజూ ప్రొద్దున వచ్చేది ఉప్పు రొట్టెల కోసం. ఆమె యెప్పటిలాగే ఉల్లాసంగా, ముద్దుగా, ప్రసన్నంగా వుంది. సిపాయి విషయం ఆమెతో ప్రస్తావించడానికి మేము ప్రయత్నించినాం — ఆమె అతన్ని "మిడి గుడ్ల బొమ్మ" అనేది, యింకా తమాషా

పేర్లు పెట్టేది, దానితో మా మనసులు కుదుటబడినాయి. కుట్టుపని పిల్లలు సిపాయిని పట్టుకొని వ్రేలాడడం చూసి, మా చిన్న తాన్యాను చూసి మేము గర్వించినాం. అతనిపట్ల తాన్యా వైఖరి మా కందరికీ గుండె బలం యిచ్చింది, ఆమె ప్రభావంవల్లనా అన్నట్లు మేము అతన్ని నిరసనతో చూడసాగినాం. ఆమెమీద మా ప్రేమ యింకా యెక్కువైంది, ప్రతి ఉదయమూ ఆమెకు యింకా సంతోషంగా, యింకా ఆదరంగా స్వాగతం చెప్పేవాళ్లం.

కానీ ఒక రోజు సిపాయి తాగి కాస్త తూలుతూ మావద్దకు వచ్చినాడు. అతను కూర్చొని నవ్వసాగినాడు; యేమిటి తన్ను గిలిగింతలు పెట్టేది అని మేము అడిగితే, చెప్పినాడు:

"నన్ను గురించి వాళ్లలో యిద్దరికి యుద్ధం జరిగింది – లీదాకూ, గ్రూషాకూ. వాళ్ళు ఒకరి నొకరు యేమేమి చేసుకున్నా రని! సిసలైన సర్కస్ అనుకోండి, హోహ్హో! ఒకతె మరొకతెను జుట్టు పట్టుకొని నేలమీద యీడుస్తూ దారిలోకి లాగింది, అక్కడ ఆమెమీద యెక్కి కూర్చుంది. హోహ్హోహ్హో! ఒకరి నొకరు ముఖాలు బరుక్కున్నారు, బట్టలు చింపుకు న్నారు. నాకు నవ్వు వచ్చింది. గానీ! యీ ఆడవాళ్లు శుభ్రంగా యెందుకు పోట్లాడుకోలేరు? యెందుకు బరుక్కుంటారు, ఆఁ?"

అతను బెంచీమీద కూర్చున్నాడు, శుభ్రంగా, ఆరోగ్యంగా, ఉల్లాసంగా కనపడుతూ, తెరిపి లేకుండా నవ్వుతూ. యెందువల్లనో యీసారి అతను మాకు అసహ్యంగా వుండినాడు.

"ఆడపిల్లల విషయంలో నే నింత అదృష్టప్పీనుగను యెలా ఐనానో? బలే తమాషా! అంతెందుకూ, నే నలా వూరక కన్ను గీటితే చాలు, పని జరిగిం దనుకోండి!"

అతను తళతళ లాడే వెంట్రుకలు నిండిన తన తెల్లని చేతు లెత్తి దబామని మోకాళ్లమీద కొట్టినాడు. అతను సంతుష్ట ఆశ్చర్యంతో మమ్మల్ని పరికించి చూసినాడు, స్త్రీల విషయంలో తన అదృష్టానికి తానే నిజంగా అచ్చేరువుపడినట్లు. అతని యెర్రని వూదు ముఖం కడుపు నిండిన సంతోషంతో నిగనిగ మెరిసింది. అతను మాటిమాటికీ పెదవులు నాక్కుంటున్నాడు.

మా హెడ్ బేకర్ కోపంగా తన సిబ్బిని ఓవెన్‌గడ్డమీద గలగల లాడించి, హఠాత్తుగా అన్నాడు వ్యంగ్యంగా:

"చిన్న కుందేళ్లను పడగొట్టడం ఘనకార్య మేమీ కాదు – పులిపిల్ల అయితే యేం చేస్తావో చూడాలని వుంది!"

"ఆఁ, యేమిటీ? నాతోనా చెప్తున్నది?"

"ఆఁ, నీతోనే."

"యేమిటి చెప్పింది?"

"యేమీ లేదు.... పోనీలే."

"యిదుగో, ఆగు! యేమి టిదంతా? యేమిటి నీ వనేది – పులిపిల్ల?"

నా బేకర్ జవా బియ్యలేదు. అతని సిబ్బి ఓవెన్‌లో వేగంగా ఆడింది, ఉడికిన రొట్టెలను లోపలికి విసరివేస్తూ, కాలిన రొట్టెలను నేలమీద పడవేస్తూ — వాటిని కుఱ్ఱవాళ్లు తాళ్లకు గుచ్చుతున్నారు. అతను సిపాయిని మరిచిపోయినట్లుంది. కానీ సిపాయి హఠాత్తుగా ఉఱ్ఱేకం పొందినాడు. అతను లేచి ఓవెన్‌వద్దకు అడుగును వేసినాడు, గాలిలో ఊకించి యెగిరే సిబ్బి హేండిల్ అతని రొమ్ముకు వెంటనే తగిలే ప్రమాదానికి అతను లోనైనాడు.

"యిలా చూడు — యేమిటి నీ వన్నది? అది నాకు అవమానం. నన్ను కాదనగల ఆడపిల్లే లేదు! లేదండీ లేదు! మరి నీవేమో నన్ను సూటిపోటి మాట లంటున్నావు."

అతను నిజంగా అవమాన పడినట్లు కనపడినాడు. అర్థమౌతున్నది, అతని ఆత్మగౌర వానికి మూల మంతా ఆడవాళ్లను చెరచడంలో అతనికి గల సామర్థ్యమే. బహుశా యీ సామర్థ్యం ఒక్కటే అతను పొగడుకోగల మానవ లక్షణం, యీ ఒక్కదానివల్లనే తాను మానవుణ్నని అతను అనుకోగలుగుతున్నాడు.

కొంతమంది మనుషు లున్నారు, ఆత్మకో శరీరానికో పట్టిన రోగమే వాళ్ల ప్రధాన విషయం. ఆ రోగం వాళ్ల జీవిత మంతా ఆక్రమిస్తుంది, దాని కోసమే వాళ్లు బతుకుతారు. దానివల్ల బాధపడుతూ, దానినుండి బలం పొందుతారు వాళ్లు. దాన్ని గురించి వాళ్లు యితర్లకు ఫిర్యాదు చేస్తారు, ఆ విధంగా తమ తోటి ప్రాణుల ఆసక్తిని చూరగొంటారు. యితర్లనుండి వాళ్లు సానుభూతిని వసూలు చేసుకుంటారు. వాళ్లకు జీవితంలో వున్నదల్లా యీ రోగం ఒక్కటే. వాళ్లకు దీన్ని తొలగిస్తే, రోగం బాగుచేస్తే, వాళ్లు పరమ దౌర్భాగ్యంలో పడిపోతారు, యెందుకంటే వాళ్లు తమ ఏకైక ప్రాణాధారం కోల్పోయి, వట్టి పొట్టు అయిపోతారు. ఒకోసారి ఒక మానవుని జీవితం యెంత నిరర్థకంగా వుంటుం దంటే, వాడు విధిలేక యేదో ఒక దుర్వ్యసనం అలవాటు చేసుకొని, దానిమీద బతకవలసి వస్తుంది. మనుషులు వట్టి విసుగువల్ల దుర్వ్యసనాలకు లోనౌతారని చెప్పవచ్చు.

సిపాయికి ఆయువు పట్టున దెబ్బ తగిలింది. అతను రోజుతూ నా బేకర్‌మీదికి పోయినాడు:

"లేదు, నాకు చెప్పాలి — యెవ రది?"

"చెప్పా లంటావా?" అన్నాడు బేకర్, హఠాత్తుగా యెదురు తిరిగి.

"ఔను!"

"తాన్యా తెలుసునా?"

"అయితే?"

"అంతే, అదీ విషయం. అక్కడ యేం చేస్తావో చూస్తాను."

''నేనా?''

''ఆఁ, నీవే.''

''ఆమెనా? మంచినీళ్ల ప్రాయం!''

''చూద్దాం!''

''నీవే చూస్తావ్! హాహ్హా!''

''ఆఁ, ఆమె –''

''నెల కూడా పట్టదు!''

''నిక్కు లున్నాయి, సిపాయికి, కదూ?''

''పక్షం రోజులు! చూపిస్తాను! యెవ రన్నావ్? తాన్యానా? ప్చ్!''

''సరే, యిక పద. నాకు అడ్డ మున్నావు!''

''పక్షం రోజులు, అంతే, పని అయిపోతుంది! హుఁ, నీవు!''

''దాటు బయటికి!''

బేకర్ ఉట్టిపాటు కోపంతో మండిపోయి సిబ్బి పైకెత్తినాడు. సిపాయి దిగ్భ్రమతో వెనక్కు తగ్గినాడు, కొద్ది క్షణాలు మా అందర్నీ మౌనంగా పరికించి చూసి, కటువుగా ''సరే!'' అని గొణిగినాడు, తరువాత వెళ్లిపోయినాడు.

యీ మాటకు మాటను మేము మౌనంగా విన్నాం, గాఢమైన ఆసక్తితో. కానీ సిపాయి వెళ్లిపోతూనే అందరమూ బిగ్గరగా ఉద్రిక్త వాదోపవాదంలో దూకినాం.

యెవరో బేకర్‌తో గట్టిగా అన్నాడు:

''నీవు రేపెట్టింది మంచి పనికాదు పావెల్!''

''నీ పని నీవు చూసుకో!'' కేకరించినాడు బేకర్.

సిపాయి గర్వానికి దెబ్బ తగిలిందనీ, తాన్యాకు ప్రమాదం యేర్పడిందనీ మేము గుర్తించినాము. అయినా దీని పర్యవసానం యెలా వుంటుందో అన్న ఒక ఆహ్లాదకరమైన తీవ్ర ఆతురత మమ్మ ల్నందరినీ ఆవహించింది. సిపాయిని యెదిరించి తాన్యా నిలబడు తుందా? దాదాపు ఏకగ్రీవంగా మేము మా నమ్మకాన్ని వ్యక్తం చేసినాం:

''తాన్యానా? నిలబడుతుంది! వూరక లొంగిపోయేది కాదు, కానే కాదు!''

మా దేవతను పరీక్షకు పెట్టాలని మాకు చచ్చేటంత పట్టుదలగా వుండింది. మా దేవత నమ్మకమైన దేవత అనీ, పరీక్షకు నిలుస్తుందనీ ఒకరి కొకరు నచ్చజెప్పుకోడానికి మా శాయశక్తులా ప్రయత్నించినాం. సిపాయిని తగినంతగా యెగదోసినామా లేదా అని మేము సందేహించ సాగినాం కూడా – అతను పందెం మరిచిపోతా డనీ, అతని అహంకారాన్ని మే మింకా పొడవవలసి వుంటుందనీ అనుమానిస్తూ. అప్పటినుండి మా జీవితాలకు ఒక కొత్త ఉద్వేగకర ఆసక్తి తోడైంది, అంతకు మునుపెన్నడూ మే మెరుగనిది. రోజుల తరబడి

మాలో మేము వాదించుకుంటూ వుండినాం; యెందువల్లనో మా అందరికీ తెలివితేటలు పెరిగినట్లైంది, మేము బాగా మాట్లాడుతూ వుండినాం, యెక్కువగా మాట్లాడుతూ వుండినాం. మేము సైతానుతో జూదం ఆడుతున్నామా అన్నట్లు వుండింది, మేము తాన్యాను పణంగా ఒడ్డినట్లు. సిపాయి నేరుగా తాన్యామీదికి ఫిరంగులు బారు చేసినాడని బన్ బేకర్ల ద్వారా మాకు తెలిసినప్పుడు మా ఉద్వేగం పూనకం వచ్చినట్లు పెరిగింది, జీవితం యెంత పారవశ్యం కలిగించే అనుభవంగా వుండిందంటే, యీ స్థితిని వినియోగించుకొని మా యజమాని రోజూ యిరవై మణుముల పిండిముద్ద అదనంగా మాముందర పడవేయడం మేము గమనించను కూడా లేదు. పనితో మాకు అలసట కలిగినట్లు కూడా లేదు. పొద్దస్తమానం తాన్యా పేరు మా పెదవులమీద ఆడుతూ వుండింది. ఆమె ప్రొద్దున పూట రాకకొరకు ఒక వింత ఆతురతతో యెదురుచూసేవాళ్లం. ఒకోసారి ఊహించు కునేవాళ్లం, మమ్మల్ని చూడడానికి ఆ రోజు వచ్చేది కొత్త తాన్యా అనీ, మేము రోజూ చూసిన తాన్యాగా వుండదనీ.

అయినా మేము ఆమెతో పందెం సంగతి యేమీ చెప్పలేదు. ఆమెను మేము బొత్తిగా ప్రశ్న లడగలేదు, మామూలు సహృదయపు అపేక్షతోనే చూసినాం. కానీ మా వైఖరిలో యేదో కొత్తది చొరబడింది, తాన్యాపట్ల మా పాత అనుభూతులకు పరాయిది – ఆ కొత్త అంశం యేమి టంటే యేమి జరుగుతుందో తెలుసుకోవాలనే నిశితమైన తహతహ, ఖడ్గధార లాగ నిశితమైనది, కరకైనది.

"అబ్బాయిలూ, యీరోజు గడువు!" బేకర్ అన్నాడు ఒక రోజు ప్రొద్దున పనికి వంగుతూ.

యెవరూ చెప్పకపోయినా మాకది బాగా తెలుసు. అయినా అందరమూ ఉలికిపడినాం.

"ఆమెను గమనించండి. వచ్చే సమయమయింది'" బేకర్ సూచించినాడు.

యెవరో భారంగా అన్నారు: "అది కంటికి కనపడేది కాదు."

మళ్లీ రద్దీగా హుషారైన వాదోపవాదం చెలరేగింది. యీ రోజు, చిట్ట చివరకు, మాకు తెలుస్తుంది, మాలోని ఉత్కృష్టమైన దంతా నమ్మి ఉంచిన పాత్ర యెంత శుచిగా వున్నదీ, యెంత మైలపడకుండా వున్నదీ. ఆ ఉదయం మాకు మొట్టమొదటి సారిగా తెలిసి వచ్చింది, మేము పెద్ద పందెం పెట్టి జూదం ఆడుతున్నా మనీ, మా దేవతకు పెట్టిన యీ పరీక్ష ఆ దేవతనే పూర్తిగా ధ్వంసం చేయవచ్చు ననీ. ఆ అన్నాళ్లూ మాకు తెలుస్తూనే వుండింది, సిపాయి తన ప్రణయ చేష్టలతో పట్టుదలగా తాన్యాను వెంటబడుతున్నా డని, కానీ యే కారణంవల్లనో మే మెవరమూ ఆమెను అడగలేదు, అతన్నిగురించి ఆమె యే మనుకొనేదీ. ఆమె క్రమం తప్పకుండా ప్రతి రోజూ ప్రొద్దున ఉప్పు రొట్టెల కోసం మావద్దకు వస్తూనే వుంది, యెప్పుడూ మామూలుగానే వుంది.

ఆ రోజు కూడా త్వరలోనే ఆమె గొంతు వినపడింది:

"ఓయ్, జైలు పకులూ! నేను వచ్చినాను...."

మేము తొందరగా తలుపు తెరిచినాం, ఆమె లోపలికి వస్తూనే, మామూలుకు భిన్నంగా, మౌనంతో స్వాగతం చెప్పినాం. ఆమెను మేము బిర్రుగా చూసినాం, ఆమెతో యేమనడానికీ మాకు తోచలేదు, యే మడగడానికీ తోచలేదు. ఆమె యెదుట మేము నిలబడినాం, మౌనంగా, కరకుగా వున్న గుంపు. స్పష్టంగా ఆమె ఆశ్చర్యపడింది మా అసాధారణ స్వాగతంతో, హఠాత్తుగా ఆమె ముఖం తెల్లబడి ఆందోళన చెందడం గమనించినాం. గద్గద కంఠం లాంటి కంఠంతో ఆమె అడిగింది:

"మీ రందరూ యెందు కింత... కొత్తగా వున్నారు."

"నీవో?" అన్నాడు బేకర్ భీకరమైన కంఠంతో, ఆమె ముఖంమీద చూపులు నిలిపి.

"నే నేమిటి?"

"యేమీ లేదు."

"సరే, ఉప్పు రొట్టెలు యివ్వు, త్వరగా."

మును పెప్పుడూ ఆమె తొందరపాటు లక్షణాలు ప్రదర్శించలేదు.

"బోలెడు టైముంది," యెదురుమాట చెప్పినాడు బేకర్, కదలకుండా నిలబడి, చూపులు యింకా ఆమె ముఖంమీదనే నిలబెట్టి.

ఉట్టి పాటుగా ఆమె వెను దిరిగి, వాకిలి గుండా అదృశ్యమైపోయింది.

బేకర్ తన సిబ్బి తీసుకొని, ఓవెన్‌వైపు తిరిగి, ప్రశాంతంగా మాటలు జారవిడిచినాడు:

"ఆఁ — ఆయిపోయింది ఈమె కథ! అతను అన్నంత పనీ చేసినాడు, బద్మాష్!"

మేము టేబుల్‌వద్దకు పోయినాం గుంపుగా, ఒకదా న్నొకటి తోసుకునే గొర్రెల మందమాదిరీ; కూర్చొని, మౌనంగా, నిరుత్సాహంగా మా పని ప్రారంభించినాం. కాసే పుండి యెవరో అన్నారు:

"బహుశా ఆమె — అది కాదేమో —"

"నోరు మూయ్! యిక చాలు!" బేకర్ అరిచినాడు.

మా కందరికీ తెలుసు అతను తెలివిపరుడని, మా అందరికంటె తెలివిపరుడని. సిపాయి గెలిచినట్లు అతనికి నమ్మకం యేర్పడిందని ఆ అరుపు ద్వారా మాకు వెల్లడి అయింది. మాకు దుఃఖం కలిగింది, ఆందోళన కలిగింది.

పండ్రెండు గంటలప్పుడు — భోజన విరామంలో — సిపాయి వచ్చినాడు. అతను యెప్పటిలాగే శుభ్రంగా, ముస్తాబైనట్లుగా వున్నాడు, యెప్పటిలాగే నిటారుగా మా ముఖాల్లోకి చూసినాడు. మేము అతనివైపు చూడడానికి యిబ్బంది పడిపోయినాం.

"చెప్పండి, ఒక సిపాయి యేమి చెయ్యగలిగేదీ చూపించ మంటారా?" అన్నాడు

అతను అహంకారపు చీదరింపుతో. "మీరు వూరక అలా దారిలోకి వెళ్లి, సందులగుండా తొంగిచూడండి. అర్థమైందా?"

మేము గుంపుగా దారిలోకి పోయినాం, ఒకరి మీద ఒకరు పడుతూ చెక్క పలకల గోడ సందులకు ముఖాలు ఆనించి బయటి ఆవరణలోకి చూస్తూ వుండినాం. మేము చాలా సేపు కాచుకో నక్కర లేకపోయింది. కాసేపట్లో తాన్యా తొందర తొందరగా అడుగులు వేస్తూ, ఆదుర్దాగా చూస్తూ ఆవరణ దాటింది, కరిగిన మంచుగల బురద గుంతలు యెగురుతూ. సామాన్ల గది వాకిలి గుండా ఆమె అదృశ్యమైంది. కొంచెం సేపటికి సిపాయి తీరికగా అడుగులు వేసుకుంటూ, యీలవేస్తూ వచ్చి, అతను కూడా లోపలికి పోయినాడు. అతను చేతులు జేబుల్లో పెట్టుకున్నాడు, మీసాలు అల్లాడుతున్నాయి....

వర్షం పడుతూ వుంది, చినుకుల పాటుకు గుంతల్లో నీళ్లు చలించడం మాకు కనపడుతున్నది. అది మబ్బులు గ్రమ్మిన చిత్తడి దినం — చాలా దుర్దినం. యింటి కప్పులమీద యింకా మంచు వుంది, నేల అంతా నల్లని రొచ్చు గుంతలతో నిండి వుంది. యింటి కప్పులమీద కూడా మంచుమీద మట్టి పొర వుంది. వర్షం నెమ్మదిగా పడుతున్నది, దాని చప్పుడు విసుగు కలిగిస్తున్నది. ఆ దారిలో కాచుకొని వుండడం చలిగా, బాధగా వుంది.

సామాన్ల గదిలోనుండి మొదట బయటికి వచ్చింది సిపాయి. అతను తీరికగా నడుస్తూ ఆవరణ దాటినాడు, మీసాలు అల్లాడిస్తూ, చేతులు జేబుల్లో లోతుగా పెట్టుకొని — దాదాపు తన మామూలు పద్ధతిలోనే.

తరువాత తాన్యా బయటికి వచ్చింది. ఆమె కండ్లు... ఆమె కండ్లు మెరుస్తున్నాయి సంతోషంతోనూ, ఆనందంతోనూ; ఆమె పెదవులు చిరునవ్వు నవ్వుతున్నాయి. ఆమె కలలో లాగ నడుస్తూ వుంది, ఊగుతూ, తూలుతూ....

మేము భరించలేకపోయినాం అది. అందరమూ పరుగెత్తుకుంటూ పోయి వాకిలి తీసి ఆవరణలోకి దూకి, ఆమెను చూసి కేకలు వేస్తూ, యీలలు వేస్తూ, భీకరంగా, బిగ్గరగా ఆటవికమైన అల్లరి చేసినాం.

ఆమె మమ్మల్ని చూసినప్పుడు ఉలికిపడి, నిశ్చలంగా నిలిచింది, ఆమె కాళ్లు బురద గుంతలో వున్నాయి. మేము ఆమె చుట్టూ నిలబడి ఒక విధమైన ద్వేషపూరిత ఆనందంతో రోత బూతు యెత్తిపొడుపులు ధారాపాతంగా కుమ్మరించినాం ఆమెమీద.

అది మేము తీరికగా, నిదానంగా చేసినాం, ఆమెచుట్టూ వున్న వలయాన్ని తప్పించుకొని పోడానికి ఆమెకు మార్గం లేదని గమనించి, ఆమెను మేము తనివిదీర యెత్తిపొడవవచ్చు నని గమనించి. యెందుకో, చిత్రంగా, మే మామెను కొట్టలేదు. ఆమె మామధ్య అలా నిలబడివుంది, యీవైపుకూ ఆవైపుకూ తల తిప్పుతూ, మా తిట్లు వింటూ. యిక మేము అంతకంతకూ తీవ్రంగా, భీకరంగా మా దురాగ్రహపు బురదా, విషమూ ఆమెమీద చిమ్మినాం.

ఆమె ముఖంలో రక్తం హరించిపోయింది. ఆమె కన్నులు, ఒక క్షణం క్రితం అంత ఆనందంగా కనిపించినవి, విప్పారినాయి, ఆమె వూపిరి యెగబోసుకొంటున్నది, పెదవులు వణుకుతున్నాయి.

యిక మేము, ఆమెచుట్టూ నిలబడి, ఆమెమీద కసి తీర్చుకుంటున్నాం — యెందుకంటే, ఆమె మమ్మల్ని దోచుకోలేదా? ఆమె మాకు చెందింది, మా ఉత్కృష్టమైన హృదయ భావాలు ఆమెమీద కుమ్మరించినాం; ఆ ఉత్కృష్టమైనది బిచ్చగానికి వేసిన బిచ్చమంతే ఐనా, మేము యిరవై ఆరుమందిమి, ఆమె ఒక్కతే; మేము ఆమెను యెంత హింసపెట్టినా ఆమె నేరానికి తగినంత కాదు. మేము ఆమెను యెంతగా అవమానించినామో! ఆమె ఒక్క మాట అనలేదు, వట్టి భయకంపంతో మావైపు గుడ్లప్పగించి చూస్తూ వుంది, ఆపాదమస్తకం వదరుతూ.

మేము కేకలు వేసినాం, హుంకరించినాం, కక్కరించినాం. మరికొందరు మనుషులు వచ్చినారు. మాలో ఒకడు ఆమె జాకెట్ చేయి లాగినాడు.

హఠాత్తుగా ఆమె కండ్లు నిప్పులు కక్కినాయి. ఆమె నిదానంగా చేతులెత్తి వెంట్రుకలు సరిదిద్దుకొని, బిగ్గరగా, కానీ ప్రశాంతంగా, మా ముఖాలమీదనే అన్నది:

"ఓ, పనికి మాలిన జైలు పక్షులు!"

అని ఆమె నేరుగా మామీదికి నడిచింది, మేము అక్కడ లేనట్లుగానే, మేము ఆమె దారికి అడ్డం నిలబడనట్లు. అందుకే మే మెవరమూ ఆమె దారికి అడ్డం లేనట్లే అయింది.

ఆమె మా వలయం దాటిన తర్వాత, వెనక్కి తిరగకుండా, అప్పటి లాగే బిగ్గరగా, యేవగింపూ, గర్వమూ నిండిన కంఠంతో అన్నది:

"ఓ, మురికి పందులు! పశువులు!"

ఆమె వెళ్లిపోయింది — నేరుగా, అందంగా, గర్వంగా.

మేము మిగిలినాం అక్కడ, ఆవరణ మధ్యలో, చుట్టూ బురదతో, వర్షంలో, సూర్యుడు లేని బూడిదరంగు ఆకాశంకింద.

తరువాత మేము కూడా మా చిత్తడిరాతి గుహలోకి కాళ్లీడ్చుకుంటూ పోయినాం. పూర్వం లాగే సూర్యుడు మా కిటికీ గుండా యెప్పుడూ తొంగిచూడలేదు, తాన్యా మళ్లీ రాలేదు.

1899

# తుఫానుపక్షి పాట*

తళతళలాడే సముద్రంపైన యెత్తున తుఫాను మేఘాలను గుమికూరుస్తున్నాయి మారుతాలు — మేఘాలకూ సముద్రానికీ మధ్య సగర్వంగా ప్రదక్షిణం చేస్తున్నది తుఫాను పక్షి, నల్లని మెరుపు చారలాగ.

యిప్పుడు దాని పక్షాంచలం నిమురుతుంది తరంగాన్ని, యింతలో అది లేస్తుంది పైకి శరవేగంతో, మేఘాలను చీలుస్తూ, భీకరంగా కూతవేస్తూ; పక్షి సాహస కంఠధ్వనిలో కనిపెడతాయి మేఘాలు ఒక తన్మయత్వాన్ని.

ఆ కేకలో ధ్వనిస్తుంది తుఫాను కొరకు ఆరాటం! దాని ఉద్రేకమూ, దాని ఆగ్రహమూ, దాని ఆత్మవిశ్వాసమూ ప్రజ్వలించడం ధ్వనిస్తుంది అందులో.

గల్స్ భయ కంపంతో యేడుస్తున్నాయి — యేడుస్తున్నాయి, జలాలమీద అటూ యిటూ ఉరుకుతున్నాయి, తమ భీతిని సముద్రపు చీకటి లోతుల్లో దాచిపెట్టడానికి సంతోషంగా యిష్టపడతాయి.

గ్రీబ్ పక్షులు**కూడా యేడుస్తున్నాయి. పోరాటపు అనిర్వచనీయ ఆనందం అక్కర లేదు వాటికి. ఉరుము ఫెళఫెళతో అవి జడుసుకున్నాయి.

తెలివితక్కువ పెంగ్విన్‌లు శిలల సందుల్లో ముడుక్కున్నాయి.... తుఫాను పక్షి ఒక్కటే ప్రదక్షిణం చేస్తున్నది సగర్వంగా సముద్రంమీద, వెండి నురుగుల జలాలమీద.

---

*తుఫానుపక్షి పాట — యిది 1901లో, ప్రథమ రష్యన్ విప్లవ (1905) ప్రాంగణంలో రచింపబడింది. జారిజంకు వ్యతిరేకంగా పోరాటం చేయాలని అది ఉద్బోధించింది.

తుఫానుపక్షి — వంకర ముక్కూ, వెడల్పు తక్కువ రెక్కలూ గల పెద్ద సముద్రపు పక్షి. — సం.

** గ్రీబ్ పక్షులు — పెద్ద సముద్రపు పక్షులు; యెక్కువగా ఉత్తరాన వుంటాయి. — సం.

యింకా యింకా కిందికి, యింకా యింకా నల్లగ వంగుతున్నాయి తుఫాను మేఘాలు సముద్రంమీదికి, గానలోల తరంగాలు కాంక్ష భారంతో ఉవ్వెత్తుగా లేస్తున్నాయి ఉరుములవైపు.

హుంకరించింది ఉరుము. యిప్పుడు పోరుతున్నాయి జలాలు హోరాహోరి మారుతాలతో. ఆగ్రహంతో మారుతాలు వాటిని అవిచ్ఛేద్య బాహుబంధంలో గ్రసించి, ఆ యింద్రనీల రాసులను విసరి నేలకు కొడుతున్నాయి, తీర శిలలమీద తుత్తునియలు చేస్తూ.

నల్లని మెరుపు చారలాగ ప్రదక్షిణం చేస్తూ అరుస్తున్నది తుఫాను పక్షి, తుఫాను మేఘాలలో బాణంలాగ దూసుకపోతూ, అలల నురుగులో వేగంగా కోసుకపోతూ.

అది భూతంలాగ తిరుగుతున్నది, నల్లని తుఫాను భూతంలాగ, నిరంతరం నవ్వుతూ, నిరంతరం యేడుస్తూ—అది తుఫాను మేఘాలను చూసి నవ్వుతున్నది, ఆనందాతిరేకంతో యేడుస్తున్నది.

ఉరుము హుంకారంలో విజ్ఞాన నిధి అయిన భూతానికి వినపడుతుంది అలసట గుసగుస. దానికి తెలుసు తుఫాను చచ్చిపోతుందని, సూర్యుడు దిగ్విజయం పొందుతాడని. సూర్యుడు యెప్పుడూ దిగ్విజయం పొందుతాడు!

గాలి గర్జించింది. ఉరుము ఫెళఫెళ హుంకరించింది...

రౌద్రంగా మెరుపు ప్రజ్వలించింది తుఫాను మేఘాలలో, ఘూర్ణిత సముద్రంపైన యెత్తున; ఆ జ్వాలా బాణాలను పట్టి ఆర్పివేస్తున్నాయి జలాలు, వాటి సర్పాకార ప్రతిబింబాలు గిజగిజ తన్నుకుంటున్నాయి సముద్రంలో, చచ్చిపోతూ.

తుఫాను యిది! చెలరేగింది తుఫాను!

భయమెరుగని తుఫాను పక్షి యింకా ప్రదక్షిణం చేస్తున్నది సగర్వంగా మెరుపుల మధ్య, గర్జించే, ఘీంకరించే సముద్రంపైన. దాని కేక ఆనంద పారవశ్యంతో ఆకాశ మంతా ఆవరించింది, దిగ్విజయ జోస్యంలాగ.

చెలరేగనీ దాని ఉగ్ర తాండవం!

1901

# ఇటలీ గాథలు*

"సాక్షాత్తు జీవితంనుండి పుట్టినవాటికంటె మేలైన కథలు లేవు."

హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్

## పార్మా పిల్లలు

జినోవాలో రైల్వే స్టేషన్ ముందర వున్న చిన్న చౌకులో జనం చిక్కగ గుమికూడినారు. వాళ్లలో అత్యధిక భాగం కార్మికులు, కానీ మంచి దుస్తులు వేసుకొని, పుష్టిగా వున్నవాళ్లు కూడా కొద్దిమంది వున్నారు. గుంపు ముందర నగర కౌన్సిల్ సభ్యులు నిలబడి వున్నారు; వాళ్ల తలలపైన నగరంయొక్క సిల్కు జండా, యుక్తిగా ఎంబ్రాయిడరీ చేయబడింది, ఆడుతూ వుంది, దాని పక్కన కార్మిక సంస్థల రంగురంగుల జండాలతో. బంగారు కుచ్చులూ, అంచులూ, దారాలూ జిగేలు మంటున్నాయి, జండా కట్టెల కొనలు మెరుస్తున్నాయి, సిల్కు సవసవ శబ్దం చేస్తున్నది, నోట్లో పాడుకునే బృందగానంలాగ ఆ ఉల్లాసపు గుంపునుండి మెల్లని మూలుగు ఉద్భవిస్తున్నది.

పైన, యెత్తైన వేదికమీద, నిలబడి వుంది కొలంబస్ విగ్రహం, తన నమ్మకాల కొరకు అన్ని బాధలు పడిన స్వాప్నికునిది, నమ్మినాడు గనుక విజయం పొందినవానిది. యీనాడు కూడా అతను ఆ జనంవైపు చూస్తున్నాడు, ఆ పాలరాతి పెదవులు అంటున్నట్లుంది:

---

*1906కూ 1913కూ మధ్య రచింపబడిన యిరవై యేడు కథలలో యివి నాలుగు.

"నిజానికివి కథలు కావు — జీవితపు కరకు వాస్తవాలచేతనో, జీవితపు విసుగుచేతనో అలసిపోయి, బాధపడి, తన ఆత్మనూ, తోటి మానవుల ఆత్మలనూ రంజింపజేయడానికి, తన ఊహా శక్తిచేత ఒక భిన్న జీవితాన్ని, వాస్తవ జీవితంకంటె సజీవమైన, ఉల్లాసకరమైన, సహృదయమైనదాన్ని, లేక బహుశా మరింత భయంకరమైన దాన్నో సృష్టించే మనిషియొక్క స్వకపోల కల్పనలు కావు," అని యీ కథా పరంపర గురించి గోర్కీ రాసినాడు. — సం.

"నమ్మినవాళ్లే విజయం పొందుతారు."

వాయిద్యగాళ్లు తమ వాద్యాలు విగ్రహం కాళ్లవద్ద వేదికచుట్టూ పెట్టినారు, ఆ యిత్తడి బంగారు లాగ తళతళ మెరుస్తున్నది యెండలో.

కడుపు లోపలికి వున్న అర్ధ చంద్రాకారపు స్టేషన్ భవనం బరువైన పాలరాతి రెక్కలు చాచుకొని వుంది, కాచుకొని వున్న ఆ గుంపును ఆలింగనం చేసుకోవాలని కోరుతున్నట్లు. రేవులోనుండి పొగఓడల బరువైన ఉఛ్ఛ్వాస నిశ్వాసాలూ, నీళ్లలో ప్రొపెల్లర్ తిరిగే అస్పష్ట ధ్వనీ, గొలుసుల గలగలలూ, యీలలూ, కేకలూ వినపడు తున్నాయి. కానీ చౌకు ప్రశాంతంగా, వేడిగా వుంది, మండే యెండలో. యిండ్ల బాల్కనీలలోనూ, కిటికీలవద్దా స్త్రీలు నిలబడి వున్నారు, చేతులలో పూలతో; వాళ్ల పక్కన పండగ దుస్తులతో పిల్లలు పూలలాగే వున్నారు.

రైలు యీల వేసుకుంటూ స్టేషన్‌లోకి వస్తుండగా గుంపు కదలబారింది; నలిగిపోయిన హాట్లు కొన్ని నల్లని పక్షుల్లాగ గాలిలో యెగిరినాయి. వాద్యగాళ్లు తమ వాద్యాలు తీసుకున్నారు; కొందరు గంభీరమైన పెద్దవాళ్లు దుస్తులు సర్దుకొని, తొందర తొందరగా అడుగులు ముందుకు వేసి, గుంపువైపు తిరిగినారు, ఉద్రేకంగా మాట్లాడుతూ, చేతులు కుడికీ, యెడమకూ చాపుతూ.

మెల్లగా గుంపు విడిపోయింది, వీధిలోకి విశాలమైన దారి చేస్తూ.

"యెవరిని కలుసుకోడానికి వచ్చినారు వాళ్లు?"

"పార్మానుండి వచ్చే పిల్లలను!"

పార్మాలో సమ్మె జరిగింది. యజమానులు లొంగలేదు. కార్మికులు యెంతో కష్ట పరిస్థితులకు లోనై, తమ పిల్లలను ఆకలి మంటలనుండి రక్షించడానికి, వాళ్లను జినోవాకు పంపడానికి నిశ్చయించినారు.

స్టేషన్ భవనం స్తంభాల వెనుకనుండి చిన్న పిల్లలు చక్కని ఊరేగింపుగా వచ్చినారు, అర్ధనగ్నంగా, తమ చింపిరి బట్టల్లో వింత, అస్తవ్యస్తపు పిల్ల మృగాలలాగ కనపడుతూ. వాళ్లు చేతులు చేతులు పట్టుకొని, వరుసకు అయిదుగురు చొప్పున నడుస్తున్నారు, దుమ్మునిండి, అలసిపోయిన చిన్న పిల్లలు. వాళ్ల ముఖాలు గంభీరంగా వున్నాయి, కానీ వాళ్ల కండ్లు మిలమిల మెరుస్తున్నాయి; వాద్యగాళ్లు గరిబాల్డీ* పాట వాయించినప్పుడు వాళ్ల క్షుత్పీడితమైన బోసెముకల చిన్న ముఖాలమీద సంతోషపు చిరునవ్వు నృత్యంచేసింది.

---

*గరిబాల్డీ, జూసెప్ (1807–1882), ఇటలీ దేశపు జాతీయ నాయకుడు, విప్లవ ప్రజాస్వామ్యవాది – ఇటలీ జాతీయ విముక్తికీ, సమైక్యతకూ జరిగిన ఉద్యమానికి నాయకుడు. – సం.

ముందు తరం ప్రజలకు గుంపు చెవులు చిల్లులు పడే కేకలతో స్వాగతం చెప్పింది, వాళ్ల ముందు జండాలు వంగినాయి, బాండు మేళాలు రణగొణ ధ్వని చేసినాయి, పిల్లలు కండ్లు చెదిరి, నివ్వెరపోయేటట్లు; యీ స్వాగతానికి వాళ్లు కొద్దిగా దిగ్భ్రమ చెంది, క్షణకాలం ముడుచుకపోయినారు, తరువాత హఠాత్తుగా తెప్పరిల్లి నిటారుగా నిలబడే సరికి వాళ్లు మరింత యెత్తుగా వున్నట్లు కనపడినారు, ఒకే ముద్దగా కలిసిపోయి వందల కంఠాలనుండి ఒకే కేక ఉద్భవించింది:

"ఇటలీ వర్ధిల్లాలి!"

"యువ పార్మా వర్ధిల్లాలి!" గర్జించింది గుంపు, వాళ్ల ముందుకు ఉరుకుతూ.

"గరిబాల్డి వర్ధిల్లాలి!" అరిచినారు పిల్లలు, బూడిదరంగు అలుగు రూపంలో గుంపులోకి చొచ్చుకొనిపోతూ, గుంపులో కలిసిపోయి.

హోటల్ కిటికీలలోనూ, మిద్దె కప్పులమీదా చేతిరుమాళ్లు తెల్లని పకులలాగ అల్లాడినాయి; పూల జల్లూ, ఉత్సాహపు కేకలూ కురిసినాయి కింద వున్న గుంపు తలలమీద.

ప్రతిదీ పండుగ కళ సంతరించుకుంది, ప్రతిదీ జీవం పోసుకుంది, బూడిదరంగు పాలరాయి కూడా కళకళలాడే రంగులు పూసినట్లు కనిపించింది.

గాలికి జండాలు రెపరెప లాడినాయి, టోపీలూ, పూలూ గాలిలో ఆడినాయి, గుంపు తలలు దాటి పిల్లల చిన్న తలలు పైకి లేచినాయి, చిన్న మురికి హస్తాలు ఆప్యాయంగా ముందుకు సాగి, పూలను పట్టుకోడానికి ప్రయత్నం చేసినాయి, దిక్కులు ప్రతిధ్వనించినాయి యెడతెగని మహా నినాదంతో:

"సోషలిజం వర్ధిల్లాలి!"

"ఇటలీ వర్ధిల్లాలి!"

పిల్లలను దాదాపు అందరినీ సంగ్రహించుకున్నారు. కొందరు పెద్దవాళ్ల భుజాలమీద కూర్చున్నారు, కొందరు జంపు మీసాలవాళ్ల విశాలమైన రొమ్ములకు కరుచుకున్నారు. కేకల, నవ్వుల రణగొణలో సంగీతం దాదాపు మునిగిపోయింది.

స్త్రీలు గుంపులోకీ, బయటికీ చిటపట ఉరుకుతూ, మిగిలిన కొత్త పిల్లలను యెత్తుకుంటూ, ఒకరి కొకరు కేకలు వేస్తున్నారు:

"నీవు యిద్దర్ని తీసుకుంటావా అన్నితా?"

"ఔను. నీవో?"

"మరిచిపోవద్దు, కుంటి మార్గరీతాకు ఒక పిల్ల...."

ఒక ఆహ్లాదకరమైన ఉద్విగ్న భావం రాజ్యం చేసింది అక్కడ, అన్ని దిక్కులా కళకళలాడే ముఖాలూ, చెమ్మగిల్లిన జాలి కన్నులూ వున్నాయి, అప్పుడే సమ్మెదార్ల పిల్లలు కొందరు బ్రెడ్డు నములుతున్నారు.

''మా కాలంలో యెవరికీ యీ ఆలోచనే లేదు!'' అన్నాడు గడ్డ ముక్కుగల ఒక వృద్ధుడు, పండ్లసందున నల్లని చుట్ట పెట్టుకుని.

''యెంతో సులభం కూడా....''

''ఔను. సులభమూ, తెలివైనదీ.''

వృద్ధుడు నోట్లో చుట్ట తీసి, దాని కొసవైపు చూసి బూడిద విదలిస్తూ నిట్టూర్చినాడు. తరువాత దగ్గరలో యిద్దరు పొర్మా పిల్లలను — అన్నదమ్ములని కనపడు తున్నది — చూసి అతను తన హేటు కండ్లమీదికి లాక్కొని, చేతులు సాచినాడు; పిల్లలు ముఖం మాడ్చుకొని వెనక్కి పోయినారు, అతను హఠాత్తుగా నేలమీద కూలబడి కోడిపుంజులాగ కూత వేసినాడు, పిల్లలు పగలబడి నవ్వినారు, రోడ్డు చప్టామీద తమ వుత్త మెడమలు తాటిస్తూ. ఆ మనిషి లేచి, హేటు సర్దుకొని, తూలుతూ వెళ్లిపోయినాడు, తన ధర్మం తాను నెరవేర్చినట్లు తృప్తిపడుతూ.

తల నెరసిన ఒక గూని స్త్రీ, మంత్రకత్తెలాంటి ముఖంతో, వక్కి గడ్డంమీద వెళ్లబొడుచుకున్న తెల్ల వెంద్రుకలతో, కొలంబస్ విగ్రహం పీఠంవద్ద నిలబడి యేడుస్తూ వుంది, రంగు మాసిన శాలువ కొనతో యెర్రబడిన కండ్లు తుడుచుకుంటూ. కళావిహీనంగా, వికృతంగా వున్న ఆమె ఆ ఉద్రిక్త జనసమూహంలో వింత అయిన అనాద లాగ వుండింది.

ఒక నల్ల జుట్టు జినోవా యువతి టకటక వచ్చింది, సుమారు యేడేండ్ల ప్రాయంగల యువకుని చేయి పట్టుకొని నడిపిస్తూ; అతను కొయ్య బూట్లు వేసుకున్నాడు, దాదాపు భుజాలు తాకేటంత పెద్ద బూడిదరంగు హేటు పెట్టుకున్నాడు. అతను తన చిన్న తలను యెగిరేస్తున్నాడు, హేటును కండ్లమీదనుండి యెగదోయడానికి, కానీ అది మళ్లీమళ్లీ అతని ముఖంమీదికి జారుతున్నది, చివరకా యువతి దాన్ని వూడలాగి, గాలిలో ఆడించింది, నవ్వుతూ, పాడుతూ; కుర్రవాడు చిరునవ్వులు చిందులాడే ముఖంతో తల యెగరేసి చూసి, ఆ హేటును పట్టుకోడానికి యెగిరినాడు, యింతలో ఆ హేటూ, అతనూ యిద్దరూ కనపడకుండా గుంపులో కలిసిపోయినారు.

ఒక పొడుగాటి మనిషి, బలమైన వుత్త ముంజేతులవాడు, తోలు ఆప్రన్ కట్టుకొని, భుజంమీద ఒక ఆరేండ్ల చిన్న పిల్లను యెక్కించుకున్నాడు, తెల్ల చిట్టెలక లాంటి చిన్న పిల్లను.

''నేను చెప్పేది అర్థమైందా?'' అన్నాడు అతను, ధగధగ మెరిసే యెర్ర జుట్టుగల చిన్న పిల్లవాణ్ని చేయి పట్టుకొని తన పక్కన నడుస్తున్న స్త్రీతో. ''యీ పని వేర్లూని పాదుకుంటే.... అప్పుడిక మనల్ని ఓడించడం సులభం కాదు, యేమంటావ్?''

విజయసూచకమైన చిక్కని నవ్వుతో అతను భుజంమీది చిన్ని బరువును నీలి గాలిలోకి యెగిరేస్తూ, అరిచినాడు:

"వర్ధిల్లాలి పార్మా-ఆ!"

క్రమంగా జనం వెళ్లిపోయినారు, పిల్లలను మోసుకుంటూనో, చేతులు పట్టుకొని నడిపించుకుంటూనో; చివరకు చౌకు ఖాళీ అయింది, అక్కడ మిగిలిందల్లా నలిగిపోయిన పూలూ, పప్పరమెంట్ల కాగితాలూ, ఉత్సాహపు పోస్టర్ల గుంపూ, వాటిపైన కొత్త ప్రపంచాన్ని కనిపెట్టిన మనిషియొక్క ధీరోదాత్త విగ్రహమూ.

కొత్త జీవితంలోకి పురోగమిస్తున్నవాళ్ల ఆనంద నినాదాలు వీధుల్లో ప్రతిధ్వనించినాయి, గొప్ప తూర్యారావాలలాగ.

## సారంగం

యెల్లప్పుడూ మంచు కిరీటాలు ధరించిన యెత్తైన పర్వతాల మధ్య వుంది నిశ్చలమైన నీలి సరస్సు. నల్లని శిల్పాలంకరణం లాంటి తోటలు విస్తారమైన మడతలు మడతలుగా తరంగిస్తున్నాయి నీటి అంచుదాకా. తెల్లని భవనాలు, పంచదార పలకలతో కట్టినట్లున్నవి, నీళ్లలోకి నిలజూస్తున్నాయి; పసిబిడ్డ ప్రశాంత నిద్ర లాగుంది ఆ నిశ్చలత్వం.

తెల్లవారింది. పూల పరిమళం ఆహ్లాదకరంగా వస్తున్నది కొండలమీదనుండి. పొద్దు అప్పుడే పొడిచింది. చెట్ల ఆకులమీదా, గడ్డి అంచులమీదా మంచు బిందువులు తళతళ లాడుతున్నాయి. కొండకోనలోకి విసరివేయబడిన రిబ్బన్ లాగుంది రోడ్డు. రోడ్డు కంకర రాళ్లతో వేయబడింది, కానీ చేతికి మొహమల్‌లాగా మెత్తగా తగులుతుందని అనిపిస్తుంది.

ఒక రాళ్ల కుప్ప పక్కన కూర్చున్నాడు ఒక కార్మికుడు, తుమ్మెద లాగే నల్లగా వున్నవాడు. అతని ముఖంలో ధైర్యమూ, సహృదయతా వ్యక్త మౌతున్నాయి, అతని రొమ్మున ఒక మెడల్ వ్రేలాడుతున్నది.

యెండకు కప్పువేసుకున్న చేతులు మోకాళ్లమీద పెట్టుకొని అతను యెగజూస్తాడు, చెస్ట్‌నట్ చెట్టుకింద నిలబడిన బాటసారి ముఖంలోకి,

"యీ మెడ లండీ," అతను చెప్తాడు, "సింప్లాన్ సారంగంలో నా పనికిగాను యిచ్చింది."

తరువాత దిగజూసి, తన రొమ్ముమీద తళతళ లాడే లోహపు ముక్కవైపు మృదువుగా చిరునవ్వు నవ్వుతాడు.

"ఔను, యే పనైనా కష్టమే, అది నీ రక్తంలోకి యెక్కిందాకా, దాన్ని నీవు ప్రేమించడం నేర్చుకునే దాకా, అప్పు డది నిన్ను కదిలిస్తుంది, ఆ తర్వాత యిక కష్టంగా వుండదు. కానీ అది సులభంగా లేదనుకో!"

అతను మెల్లగా తల వూపినాడు, సూర్యునివైపు చూసి చిరునవ్వు నవ్వుతూ;

తరువాత హఠాత్తుగా ఉత్సాహం పొంది, చేయి వూపినాడు, అతని నల్లని కండ్లు మిలమిల మెరిసినాయి.

"ఒకోసారి అది కాస్త జడుపు పుట్టించేది. భూమికి కూడా యేదో ఒక అనుభూతి వుండి తీరుతుంది, యేమంటావ్? మేము లోతుగా తొలుచుకొనిపోయి, కొండ దరికి పెద్ద గాయం చేసినప్పుడు, ఆ లోపలి భూమి మాకు కోపంగా యెదురైంది. దాని ఊర్పు వేడిగా వుండింది, మా గుండెలు దిగజారినాయి, మా తలలు భారమైనాయి, మా యెముకలు సలిపినాయి. చాలామందికి కలిగింది యీ అనుభవం! తరువాత అది మామీదికి రాళ్లు విసరింది, వేడి నీళ్లు చిమ్మింది. భయంకరంగా వుండింది! ఒకోసారి, నీళ్లమీద వెలుతురు పడినప్పుడు, ఆ నీళ్లు యెర్రగా మారేవి, మా నాన్న అనేవాడు, మేము భూమిని గాయపరిచినా మనీ, అది మమ్మల్నందర్నీ తన రక్తంలో ముంచేస్తుందనీ, మాడ్చేస్తుం దనీ! అది వట్టి ఊహే ననుకో, అయినా, లోపల భూగర్భంలో లోతున, గొంతుకు చుట్టుకునే చీకట్లో, నీళ్లు యేడుపు సవ్వడితో టపటప చిందేచోట, రాతిమీద యినుము గరగర లాడే చోట, అలాంటి చోట ఆ మాటలు వింటే, యేదైనా సాధ్యమే అనిపిస్తుంది. అక్కడంతా అంత ఊహాతీతంగా వుండింది. మేము, ఆ మనుషులం, యెంతో అల్పంగా కనిపించినాం ఆ పర్వతంతో పోలిస్తే, మేఘాలను ఒరుసుకునే ఆ పర్వతం, దాని కడుపులోకి మేము తూట్లు వేస్తూ వుండినాం.... నీ వది చూసి వుంటే అర్థమౌతుంది, అల్ప మానవులమైన మేము పర్వత దరిలో చేసిన ఆ నోరు తెరుచుకున్న పెద్ద బిలం నీవు చూసి వుంటే, ప్రొద్దున్నే మే మా బిలంలో ప్రవేశించి, మా వెనుక సూర్యుడు దుఃఖంతో చూస్తూ వుండగా, భూమి కడుపులోకి మేము తొలుచుకుంటూ పోవడం నీవు చూసి వుంటే, ఆ యంత్రాలూ, పర్వతంయొక్క ఆ విచార వదనమూ నీవు చూసి వుంటే, లోపల అంతరాళంలో ఆ భారమైన దబదబ శబ్దమూ, పిచ్చివాని వెడనవ్వుల్లా ప్రతిధ్వనించే ఆ ప్రేలుళ్లూ నీవు విని వుంటే, నేను చెప్పేది నీకు అర్థమౌతుంది."

అతను చేతులు పరీక్షగా చూసుకొని, నీలి కోటుమీది లోహపు బొమ్మను సర్దుకొని మెల్లగా నిట్టూర్చినాడు.

"మానవునికి పని చేయడం తెలుసు!" గర్వంతో కొనసాగించినాడు అతను. "ఆ, నిజమండీ, మానవుడు అల్పుడే అయినా, పని చేయదలచుకుంటే అజేయమైన శక్తి కాగలడు. నమ్మండి నామాట, మానవుడు తృణప్రాయుడే అయినా, పూనుకున్న పని యేదైనా సాధించగలడు. మా నాన్న మొదట యిది నమ్మలేదు.

"మా నాన్న అనేవాడు, 'ఒక దేశంనుండి ఒక దేశానికి పర్వతం తొలిచి సొరంగం వేయడం దేవుణ్ని ధిక్కరించడం, దేవుడు పర్వతాల గోడలతో భూమిని విభజించినాడు.

చూస్తూ వుండు, మేరీమాత మనల్ని పరిత్యజిస్తుంది!' ఆయన పొరపాటు పడినాడు, మేరీమాత తన్ను ప్రేమించేవాళ్లను యెప్పుడూ పరిత్యజించదు. తరువాత మా నాన్న దాదాపు నాలాగే అనుకోసాగినాడు; యెందుకంటే తాను పర్వతంకంటె గొప్పవాడైనట్లూ, బలవంతుడైనట్లూ ఆయనకు అనిపించింది. కానీ ఒకప్పుడు, పండుగ రోజుల్లో టేబుల్‌వద్ద కూర్చొని, వైన్ సీసా ముందర పెట్టుకొని, నాకూ యితర్లకూ ఉపన్యాసం యిచ్చేవాడు:

" 'దేవుని బిడ్డలారా,' అది ఆయన అభిమాన నుడికారాల్లో ఒకటి, ఆయన బాగా దైవభీతి గలవాడు, 'దేవుని బిడ్డలారా,' అనేవాడు ఆయన, 'మీరు భూమితో అలా పోరాటం చేయలేరు, తన గాయాలకు ఆమె కసి తీర్చుకుంటుంది, ఓడిపోకుండా నిలుస్తుంది! మీరు చూస్తూ వుండండి: సరిగా పర్వతం గుండెవద్దకు మనం తొలుచుకుంటూ పోతాం, అక్కడ గుండెను తాకినప్పుడు యెగిసి మంటల్లో పడిపోతాం, భూమి గుండెలో అగ్ని వుంది, అందరికీ తెలుసు అది! భూమిని దున్నడం వేరు, ప్రకృతి మాత ప్రసవ వేదనలో తోడ్పడడం మానవుని విధి, కానీ ఆమె ముఖాన్నీ, రూపాన్నీ వికృతపరచడం — ఆ సాహసం పనికిరాదు. చూడండి, పర్వతంలో తొలుచుకుంటూ ముందుకు పోయేకొద్దీ, గాలి వేడి ఔతుంది, వూపిరి భారవౌతుంది....' "

అతను మెల్లగా నవ్వినాడు, వ్రేళ్లతో మీసాలు మెలివేస్తూ.

"ఆయన ఒకడే కాదు అలా అనుకున్నది, మరి ఆయన చెప్పింది నిజమే: మేము ముందుకు పోయేకొద్దీ వేడి యెక్కువైంది, అంతకంతకూ మాలో యెక్కువమంది జబ్బు పడి చచ్చిపోసాగినారు. వేడి నీటి ఊటలు అంతకంతకూ బలమైన ధారలుగా దూసుక వచ్చినాయి, మట్టి గడ్డలు వూడి పడినాయి, లుగానోనుండి వచ్చిన మా మనుషులు యిద్దరికి పిచ్చి పట్టింది. రాత్రిపూట బారకాసుల్లో చాలామంది పిచ్చికేకలు వేసేవాళ్లు, భయకంపంతో మూలుగుతూ మంచాలమీదనుండి యెగిరి దూకేవాళ్లు....

" 'నే నన్నది నిజం కాదా?' అన్నాడు మా నాన్న. ఆయన కండ్లలో భీతి నిండింది. ఆయన దగ్గు అంతకంతకూ ముదిరింది.... 'నే నన్నది నిజం కాదా?' అన్నాడు ఆయన. 'ప్రకృతిని జయించలేరు మీరు!'

"చివర కాయన మంచాన బడినాడు, మళ్లీ లేవకుండా. ఆయన దిట్టమైన ముసలివాడు, మా నాన్న, మూడు వారాలు మృత్యువుతో పోరాడినాడు, మొండిగా, ఒకరితో చెప్పకోకుండా, తన యోగ్యత తా నెరిగిన మనిషిలాగ.

" 'నా పని తీరింది పావొలో,' అన్నాడు ఆయన నాతో ఒక రాత్రి. 'జాగ్రత్తగా వుండు, యింటికి పో, మేరీమాత నిన్ను కాపాడుగాక!" తరువాత ఆయన చాలాసేపు మౌనంగా వుండినాడు, కండ్లు మూసుకొని అలా పండుకున్నాడు బరువుగా వూపిరి తీసుకుంటూ."

ఆ మనిషి లేచి నిలబడి, పర్వతంవైపు యెగజూసి, ఒళ్లు విరుచుకున్నాడు, కీళ్లు పటపట మనిపిస్తూ.

"తరువాత ఆయన నా చేయి పట్టుకొని నన్ను దగ్గరికి తీసుకొని యిలా అన్నాడు — భగవంతుని సాక్షిగా అన్నా డండీ! — 'పావొలో', చూడు బాబూ, అయినా పని సాధిస్తా రనుకుంటాను: మనమూ, అవతలివైపునుండి సొరంగం తొలిచేవాళ్లూ పర్వతంలోపల కలుసుకుంటాం, మనం కలుసుకుంటాం, నీవు నమ్ముతున్నావు, కదూ పావొలో?' ఔను, నేను నమ్మినాను. 'అది మంచిది బాబూ! మనిషికి యెప్పుడూ తాను చేసే దాంట్లో నమ్మక ముండాలి, విజయం కలుగుతుందని విశ్వాసం వుండాలి, భగవంతునిలో నమ్మక ముండాలి, మేరీమాత ప్రార్థనలవల్ల భగవంతుడు మంచి పనులకు తోడ్పడతాడు. నిన్ను వేడుకుంటాను బాబూ, అది జరిగితే, పర్వతంలోపల వాళ్లూ వీళ్లూ కలుసుకుంటే, నా గోరీవద్దకు వచ్చి చెప్పు, నాన్నా, అది జరిగింది! అని. అప్పుడు నాకు తెలుస్తుంది!'

"అది మంచి మాట గదండీ, నేను అలాగే ఆయనకు మాట యిచ్చినాను. తరువాత అయిదు రోజులకు ఆయన చనిపోయినాడు. చనిపోడానికి రెండు రోజులు ముందు ఆయన నన్నూ, యితర్లనూ కోరినాడు, సొరంగం లోపల తాను పని చేసిన చోట తన్ను పూడ్చిపెట్ట మని, ఆ పని చేయమని ఆయన మమ్మల్ని ప్రాధేయపడినాడు, కానీ ఆయన మతి చెడి పలవరించినా డనుకుంటాను.

"మా నాన్న చనిపోయిన తర్వాత పదమూడు వారాలకు మేమూ, అవలి పక్కనుండి మావైపు వస్తుండినవాళ్లూ పర్వతంలో కలుసుకున్నాం. ఓహ్, అది ఆనందంతో మతులు చెడిన దిన మండీ, చీకటి భూగర్భంలో లోపల, అవతలివైపు పని జరిగే శబ్దం మేము మొదట విన్న దినం; భూమి కడుపులో అవతలివైపునుండి మమ్మల్ని కలుసుకోడానికి వచ్చేవాళ్లు చేసే ధ్వనులు మేము విన్నా మండీ — మమ్మల్ని, మమ్మ ల్నందరినీ, ఒక దెబ్బతో చూర్ణం చేయగలిగినంత బ్రహ్మాండమైన భారం గల భూమికింద విన్నాం!

"చాలా రోజులు మే మా శబ్దాలు విన్నాం, బోలు శబ్దాలు, రోజు రోజుకూ మరింత బిగ్గరగా, మరింత స్పష్టంగా పెరిగినవి; విజేతల ఆటవిక ఆనందం మమ్మల్ని ఆవేశించింది. మేము రాక్షసుల్లాగ పనిచేసినాం, దుష్ట భూతాల్లాగ పనిచేసినాం, మాకు అలసట అనిపించలేదు, ఒకరి ప్రేరణ అవసరం లేకపోయింది. ఓ — అది హాయిగా వుండింది, సూర్యుడు వెలిగే రోజున నృత్యం చేసినట్లు వుండింది, అలా వుండింది, ప్రమాణం చేసి చెప్తాను! యిక మే మందరమూ పసిపిల్లలలాగ దయగా, మెత్తగా అయినాం. ఆ — అనేక దీర్ఘ మాసాల పాటు పందికొక్కుల్లాగ తొలుచుకుంటూ పోయిన చోట భూగర్భంలోని అంధకారంలో అవతలివాళ్లను కలుసుకోవా లనే కోరిక యెంత బలీయంగా, యెంత ఉద్రేకపూరితంగా వుంటుందో మీకు తెలిసే వుంటేనా!"

ఆ స్మృతితో అతని ముఖం ఉద్వేగంతో యెర్రబడింది. అతను తన శ్రోతను సమీపించి, తన అత్యంత మానవ దృక్కులతో అతని కండ్లలోకి లోతుగా నిలజూస్తూ, మెల్లగా, సంతోషం నిండిన కంఠంతో చెప్పకపోయినాడు:

"చివరకు, అడ్డం వున్న ఆఖరి మట్టిపొర కూలి పడి, ఉజ్వలమైన దివిటీ పసుపు మంట ఆ తెరపిని వెలిగించినప్పుడు, ఆనంద బాష్పాలు ప్రవహించే నల్లని ముఖం ఒకటి కనిపించింది, దానివెనుక మరికొన్ని దివిటీలూ, మరికొన్ని ముఖాలూ కనిపించినాయి, విజయార్భటులు గర్జించినాయి, ఆనంద నినాదాలు — ఓహ్, అది నా జీవితంలో కెల్ల సంతోషపు దినం, అది నేను జ్ఞాపకం చేసుకున్నప్పుడు, నా జీవితం వృధా కాలే దనిపిస్తుంది. అది పని, నా పని, పవిత్రమైన పనండీ, నమ్మండి! మేము బయటికి యెండలోకి వచ్చినప్పుడు, మాలో చాలామంది నేలమీద పడి, నేలను ముద్దుపెట్టుకున్నాం, యేడుస్తూ; అది దేవతా కథంత అద్భుతంగా వుండింది! ఔను, మేము ఓడిపోయిన పర్వతాన్ని ముద్దుపెట్టుకున్నాం, భూమిని ముద్దుపెట్టుకున్నాం; ఆనాడు నేను యెన్నడూ లేనంత సన్నిహితుణ్నైనాను భూమికి, భూమిని స్త్రీని ప్రేమించినట్టు ప్రేమించినాను!

"మా నాన్న గోరీవద్దకు పోయినాను. చచ్చినవాళ్లు వినలేరని నాకు తెలుసు, అయినా పోయినాను; మనకోసం శ్రమించి, మనలాగే బాధపడినవాళ్ల కోర్కెలను గౌరవించాలి కదా, యేమంటారు?

"ఔనౌను, ఆయన గోరీవద్దకు పోయి, కాలితో నేలమీద తట్టి, ఆయన ఆజ్ఞాపించినట్లే అన్నాను:

" 'నాన్నా, అది జరిగింది!' అన్నాను నేను. 'మనుషులు జయించినారు. జరిగింది నాన్నా అది!' "

## తల్లి

తల్లులను గురించి యెంతైనా చెప్పవచ్చు. అనేక వారాలుగా శత్రు సైన్యాలు బిగువైన ఉక్కు వలయంలాగ నగరాన్ని చుట్టుముట్టినాయి. రాత్రిపూట నెగళ్లు మండేవి, మంటలు నల్లని చీకటిగుండా నగరం కోటగోడలను తొంగిచూసేవి, లక్ష యెర్రని కన్నుల్లాగ — అవి క్రూరంగా మండేవి, వాటి భయంకర ధగధగలు ముట్టడి వేయబడిన నగరంలో విషాదభరి ఆలోచనలు కలిగించేవి.

శత్రువులు వేసిన ఉరితాడు బిగుసుకుంటూ వుండడం వాళ్ళు కోటగోడలమీదనుండి చూసినారు; నెగళ్ల చుట్టూ తిరిగే నల్లని నీడలు చూసినారు, కడుపు నిండిన గుర్రాల

సకిలింపులూ, ఆయుధాల ఖణేల్ శబ్దాలూ, విజయంమీద విశ్వాస మున్నవాళ్ల పెద్ద నవ్వులూ, పాటలూ విన్నారు – శత్రువుల పాటలకంటె, నవ్వులకంటె చెవికి అసహ్యమైనది మరొకటి యేమంటుంది?

నగరానికి నీళ్లు అందించే కాలవ లన్నిటిలోనూ శత్రువులు శవాలు వేసినారు, కోటగోడల చుట్టూ వున్న ద్రాక్షతోటలు కాల్చి బూడిద చేసినారు, పొలాలు చెడదొక్కినారు, పండ్ల తోటలు పడగొట్టినారు – నగరం యిప్పుడు అన్ని పక్కలా అరక్షితమైంది, దాదాపు ప్రతిరోజూ శత్రువుల ఫిరంగులూ, తుపాకులూ దానిమీదికి సీసమూ, యినుమూ వర్షిస్తున్నాయి.

యుద్ధ మంటే విసుగు చెందిన, ఆకలి కడుపుల సైనిక దళాలు యిరుకు నగర వీధుల్లో ముఖాలు మాడ్చుకొని కవాతు తిరుగుతున్నాయి. యిండ్ల కిటికీలనుండి క్షతగాత్రుల మూలుగులూ, ఇపిరి పట్టినవాళ్ల కేకలూ, స్త్రీల ప్రార్థనలూ, పిల్లల యేడుపులూ వినపడుతున్నాయి. మనుషులు గుసగుసలతో మాట్లాడుకుంటున్నారు, వాక్యం మధ్యలో ఆగిపోతూ, వ్యగ్రమైన జాగ్రత్తతో: యేమి టా చప్పుడు, శత్రువులు వస్తున్నారా?

రాత్రులు మరీ ఘోరం. రాత్రి నిశ్శబ్దంలో మూలుగులూ, కేకలూ మరీ స్పష్టంగా వినపడతాయి. దూరపు కొండల కోనలనుండి సగం పడిపోయిన కోటగోడలవైపు నల్లని నీడలు దొంగల్లాగ ప్రాకుతాయి, శత్రు శిబిరాన్ని కంటికి కనపడకుండా చేస్తూ. నల్లని కొండ పేటులమీద ఉదయించే చంద్రుడు యెవరో పోగొట్టుకున్న డాలులాగ కనిపిస్తాడు, కత్తి దెబ్బలతో నొక్కులు పోయిన డాలులాగ.

నగర ప్రజలు బయటి సహాయం గురించి నిస్పృహ చెందుతూ, శ్రమచేతా, ఆకలిచేతా నీరసించిపోయి, విముక్తి లభిస్తుందనే ఆశ దినదినానికీ అడుగంటి, ఆ చంద్రునివైపూ, గొగ్గి పండ్ల కొండపేటులవైపూ, కోనల నల్లని ఉదర కుహరాలవైపూ, రద్దీగా వున్న శత్రు శిబిరంవైపూ వెలపరంతో గుడ్లప్పగించి చూసేవాళ్లు. ప్రతిదీ వాళ్లకు మృత్యువును జ్ఞాపకం చేసేది; వాళ్లను ఓదార్చడానికి ఆకాశంలో ఒక్క నక్షత్రం కూడా లేదు.

యిండ్లలో దీపాలు వెలిగించుకోడానికి వాళ్లకు భయం. దట్టమైన చీకటి వీధులను ఆవరించింది. ఆ చీకట్లో, నీళ్ల లోపల తిరిగే చేపలాగ, నిశ్శబ్దంగా తిరుగుతున్నది నఖశిఖ పర్యంతం నల్లని ముసుగు కప్పుకున్న ఒక స్త్రీ.

జనం ఆమెను చూసి, ఒకరితో ఒకరు గుసగుస లాడుకున్నారు:

"ఆమేనా?"

"ఆమే!"

వాళ్లు మూలల్లో నక్కుకున్నారు, లేదా తలలు వంచుకొని గబగబా ఆమెను దాటిపోయినారు. గస్తీ నాయకులు ఆమెను కఠినంగా హెచ్చరించినారు:

"మళ్లీ బయట తిరుగుతున్నారా మరియానాగారూ? జాగ్రత్త, మిమ్మల్ని యెవరైనా చంపెయ్యవచ్చు, హంతకుని పట్టుకోవాలని యెవరూ ఆదుర్దా పడరు...."

ఆమె ఆగి నిలబడింది, కానీ గస్తీవాళ్లు దాటిపోయినారు, ఆమెమీదికి చేయెత్తడానికి సాహసం లేకనో, లేక యేవగింపుతోనో; సాయుధ భటులు ఆమెను శవాన్ని చూసినట్లు చూసి తప్పుకున్నారు. చీకట్లో ఒంటరిదై పోయి, ఆమె మళ్లీ వీధి వీధికీ తన ఏకాకి సంచారం సాగించింది, నిశ్శబ్దంగా, నల్లగా, నగర దౌర్భాగ్యం రూపుదాల్చినట్లు; ఆమె చుట్టూ అన్ని వైపులా, ఆమెను వెంటబడుతున్నట్లు, విషాద ధ్వనులు వెలువడినాయి: మూలుగులూ, అరుపులూ, ప్రార్థనలూ, విజయం గురించి ఆశ పూర్తిగా కోల్పోయిన సైనికుల దిగులు గుసగుసలూ.

ఒక పౌరురాలూ, ఒక తల్లీ అయిన ఆమె తన కొడుకును గురించీ, తన దేశం గురించీ ఆలోచిస్తున్నది: తన పట్టణాన్ని ధ్వంసం చేస్తున్నవాళ్ల అగ్రభాగాన తన కొడుకు వున్నాడు, తన ఉల్లాసపు కొడుకు, అందమైన కొడుకు, హృదయంలేని కొడుకు. కానీ, యెంతో కాలం కాలేదు, అప్పుడు ఆమె అతన్ని చూసి గర్వించింది, తన దేశానికి తాను యిచ్చిన అమూల్యమైన కానుకగా భావించింది, తాను పుట్టిన, తన కొడుకు పుట్టి పెరిగిన, నగరంయొక్క ప్రజలకు తోడ్పడడానికి తాను యీ భూమిమీదికి కొనితెచ్చిన లోకోపకారక శక్తిగా భావించింది. ఆమె హృదయం అనేక అదృశ్య సూత్రాలతో బంధింపబడి వుంది ఆ పురాతనమైన రాళ్లకు, తన తాత ముత్తాతలు తమ యిండ్లు కట్టిన, ఆ నగరం కోటగోడలు నిలిపిన, ఆ రాళ్లకు – బంధింపబడి వుంది తన రక్తబంధువుల యెముకలు కలిసిన ఆ మట్టికి, ఆ ప్రజల గాథలకు, పాటలకు, ఆశలకు. యిప్పు డామె హృదయం ఒక ప్రియతముణ్ని కోల్పోయింది, అది దుఃఖించింది. ఆమె తన హృదయంలో తూకం వేసుకుంది, త్రాసులోలాగ, తన కొడుకుమీది ప్రేమనూ, తన జన్మ నగరంమీది ప్రేమనూ, కానీ ఆమె కర్థం కాలేదు యేది యెక్కువ తూకమో.

ఆ విధంగా ఆమె రాత్రిపూట నగర వీధుల్లో సంచారం చేస్తూ వుండింది. చాలామంది ఆమెను గుర్తించలేక, ఆమె నల్లని ఆకారాన్ని తమ కందరికీ అంత సమీపంలో వున్న మృత్యు దేవత ఆకారంగా పొరబడి, భయంతో వెనుకడుగు వేసేవాళ్లు; గుర్తించడ మంటూ చేసినప్పుడు మౌనంగా వెనుదిరిగి పోయేవాళ్లు, దేశద్రోహి తల్లినుండి.

కానీ ఒక నాడు, కోటగోడవద్ద ఒక మారుమూల ఆమె ఒక స్త్రీని చూసింది; ఆ స్త్రీ ఒక శవం పక్కన మోకాళ్లమీద వంగి వుంది, భూమిలో తానూ ఒక భాగమైనంత నిశ్చలంగా. ఆమె ప్రార్థన చేస్తూ వుండింది, తన దుఃఖ తప్తమైన ముఖం పైకెత్తి నక్షత్రాలవైపు. పైన గోడమీద గస్తీ సైనికులు గొంతులు తగ్గించి మాట్లాడుకుంటున్నారు, తమ ఆయుధాలు రాతిమీద గరగర లాడుతుండగా.

దేశద్రోహి తల్లి అడిగింది:

"నీ భర్తా?"

"కాదు."

"సోదరుడా?"

"నా కొడుకు. నా భర్త పదమూడు నాళ్ల కింద హతుడైనాడు, యీనాడు నా కొడుకు."

మోకాళ్లమీదనుండి లేచి హతుని తల్లి వినయంగా అన్నది:

"మేరీమాత సర్వమూ చూస్తుంది, సర్వమూ తెలుసుకుంటుంది, ఆమెకు నా కృతజ్ఞతలు!"

"యెందుకని?" అడిగింది యీమె. ఆమె జవాబు చెప్పింది:

"యిప్పుడు వీడు దేశం కొరకు పోరాడుతూ సగౌరవంగా మరణించినాడు గనుక చెప్పగలను, వీణ్ని గురించి నేను భయపడుతూ వుండినాను: వీడు విలాసజీవి, వినోదా లంటే చెవి కోసుకునేవాడు. నేను భయపడేదాన్ని, వీడు తన నగరానికి ద్రోహం చేయవచ్చునని, మరియానా కొడుకు లాగ, దైవద్రోహీ మానవద్రోహీ అయిన మన శత్రువుల నాయకుని లాగ — వాడూ, వాణ్ని గన్న ఆ కడుపూ నాశనం గాను!"

మరియానా ముఖంమీద ముసుగు కప్పుకొని తన దారిన పోయింది. మరుదినం ప్రొద్దున ఆమె నగర రక్షకుల ముందు నిలబడి యిలా అన్నది:

"నా కొడుకు మీకు శత్రువుగా తయారైనాడు. నన్ను చంపనైనా చంపండి, లేకపోతే కోట ద్వారాలు తెరిచి నన్ను వానివద్దకు పోనివ్వనైనా పోనివ్వండి...."

వాళ్లు యిలా జవాబిచ్చినారు:

"నీవు మనిషివి. నీ దేశంమీద నీకు ప్రేమ వుండాలి. నీ కొడుకు మా కందరికీ యెంత శత్రువో నీకూ అంత శత్రువే."

"నేను వాని తల్లిని. వానిమీద నాకు ప్రేమ వుంది. వాడు యిలా అయినందుకు నా బాధ్యత వుందని అనుకుంటున్నాను!"

వాళ్లు పరస్పరం సంప్రదించుకొని నిర్ణయం చేసినారు:

"నీ కొడుకు పాపాలకు నిన్ను చంపడం గౌరవప్రదం కాదు. అతనితో నీవీ మహాపాపం చేయించి వుండజాల వని మాకు తెలుసు, నీ మనఃక్షోభ మాకు అర్థవౌతున్నది. కానీ హామీ ఖైదీగా కూడా నీవు యీ నగరానికి అక్కరలేదు; నీ కొడుకు నీకు గవ్వ విలువ యివ్వడు, రాక్షసుడు అతను నిన్ను మరిచిపోయినాడని మాకు నమ్మకం; మరి అదే నీకు శిక్ష, నీవు శిక్షార్హురాలి వని నీవనుకుంటే! యిది మృత్యువుకంటె కూడా భయంకరమైన దని మా నమ్మకం."

"ఔను," అన్నది ఆమె. "మృత్యువుకంటె భయంకరమైనదే."

ఆ విధంగా వాళ్ళు కోట ద్వారాలు తెరిచి, ఆమెను నగరం వదలిపెట్టిపో నిచ్చినారు. తన పుట్టిన గడ్డను, యిప్పుడు తన కొడుకు చిందించిన రక్తంతో తడిసిన గడ్డను, ఆమె వదలిపోవడం వాళ్ళు కోట బురుజులమీదనుండి చాలాసేపు గమనించినారు. ఆమె మెల్లగా నడిచింది, ఆ గడ్డతో తెంచుకోడానికి ఆమె పాదాలు వెనకాడినాయి, నగర రక్షకుల మృత దేహాలకు ఆమె శిరసు వంచి నమస్కరించింది, ఒక విరిగిన ఆయుధాన్ని అసహ్యంతో కాలితో పక్కకు తన్నింది, సకల ఆయుధాలూ తల్లులకు అసహ్యమే, ప్రాణ రక్షణ చేసేవి తప్ప.

తన ఉత్తరీయం కింద అమూల్యమైన నీళ్ల చెంబు పెట్టుకున్నట్లు, అందులోనుండి ఒక చుక్క ఒలుకుతుందేమో అని భయపడుతున్నట్లు, ఆమె నడిచింది. కోట గోడమీదనుంచి గమనించేవాళ్లకు ఆమె ఆకారం అంతకంతకూ చిన్న దయ్యేకొద్దీ, తమ దిగులూ, నిస్పృహా ఆమెతో వెళ్లిపోయినట్లు వాళ్లకు అనిపించింది.

దారి మధ్యలో ఆమె ఆగడం వాళ్లకు కనిపించింది, ఆగి ఆమె తలమీద ముసుగు తొలగించి, వెనక్కి తిరిగి, నగరంవైపు చాలాసేపు తేరిచూసింది. శత్రు శిబిరంలోనివాళ్లు పొలంలో ఆమె ఒంటరిగా వుండడం చూసినారు, ఆమె లాగే నల్లగా వున్న ఆకారాలు జాగ్రత్తగా ఆమెను సమీపించినాయి.

వాళ్లు ఆమెను సమీపించి అడిగినారు, ఆమె యెవరైందీ, యెక్కడనుండి వచ్చిందీ.

"మీ నాయకుడు నా కొడుకు," అన్న దామె. ఆమె మాటను యెవరూ సందేహించలేదు. వాళ్లు ఆమె పక్కన నడుస్తూ అతని కీర్తిగానం చేస్తూ, అతను యెంత తెలివిపరుడు అయిందీ, యెంత ధైర్యశాలి అయిందీ చెప్పినారు. ఆమె గర్వంగా తల యెత్తుకొని వినింది, యేమీ ఆశ్చర్యపడకుండా — తన కొడుకు మరొక విధంగా వుండజాలడు.

చివరకు ఆమె అతనిముందు నిలబడింది, యెవరు పుట్టడానికి తొమ్మిదినెలలు ముందే ఆమెకు పరిచితుడో, యెవరు ఆమె హృదయానికి భిన్నమైనట్లు యెప్పుడూ ఆమెకు అనిపించలేదో, అతనిముందు. సిల్కూ, మొహమలూ ధరించి అతను ఆమెముందర నిలబడినాడు, రత్నాలు తాపిన ఆయుధాలతో. అంతా వుండవలసినట్లే వుంది, ఆమె అతన్ని యెన్నోసార్లు కలలో అలా చూసింది — ఐశ్వర్యంతో, కీర్తితో, మెప్పుతో.

"అమ్మా!" అన్నాడు అతను, ఆమె చేతులు ముద్దుపెట్టుకున్నాడు. "నీవు నావద్దకు వచ్చినావు, నా పక్షాన వున్నావు, ఆ పాడు నగరాన్ని రేపు పట్టుకుంటాను."

"నీవు పుట్టిన నగరం," అని ఆమె జ్ఞాపకం చేసింది.

తన బలంతో కైపెక్కి, కీర్తి దాహంతో తల చెడి, అతను ఆమె ప్రశ్నలకు యువ్వన మదంతో జవాబిచ్చినాడు:

"నేనీ ప్రపంచంలో పుట్టినాను, ప్రపంచం కొరకు పుట్టినాను, ప్రపంచం నన్ను చూసి ఆశ్చర్యంతో అదిరిపోవా లని నా ప్రయత్నం! నీ కోసం యీ నగరాన్ని నేను యిన్నాళ్లూ ధ్వంసం చేయలేదు. యిది నా దేహంమీద పుండులా గుంది, నా సత్వర కీర్తి లాభాన్ని అడ్డగించింది. యిప్పుడిక ఆ మొండి మూర్ఖుల గూడును రేపు ధ్వంసం చేస్తాను!"

"అక్కడున్న ప్రతి రాయికీ నీవు తెలుసు, నీ పసితనం గుర్తు వుంది."

"రాళ్లు మూగవి, మనిషి వాటిని మాట్లాడేటట్లు చేస్తే తప్ప. పర్వతాలు నన్ను గురించి మాట్లాడనీ, నేను కోరేది అది!"

"మనుషులో?" అడిగింది ఆమె.

"ఆ, ఔను, నేను మనుషులను మరిచిపో లేదమ్మా. నాకు వాళ్లు కూడా కావాలి, మనుషుల స్మృతిలోనే వీరులు చిరంజీవు లౌతారు!"

ఆమె అన్నది:

"వీరుడు మృత్యువును ధిక్కరించి జీవాన్ని సృష్టించేవాడు, మృత్యువును జయించేవాడు...."

"కాదు!" అతను అభ్యంతరం చెప్పినాడు. "నగర నిర్మాత యెంతో విధ్వంసకుడూ అంతే కీర్తికాయుడు. చూడు, రోమును నిర్మించింది యెవరో మనకు తెలియదు — ఈనియాసో లేక రోములసో — కానీ, ఆ నగరాన్ని ధ్వంసం చేసిన అలారిక్ మొదలైన వీరుల పేర్లు మనకు బాగా తెలుసు...."

"అన్ని పేర్లనూ అధిగమించి నగరం జీవించింది," తల్లి జ్ఞాపకం చేసింది అతనికి.

యిలా వాళ్లు సూర్యుడు విశ్రమించేదాకా మాట్లాడుకొన్నారు. అంత కంతకూ తక్కువగా ఆమె అతని వికృత సంభాషణకు అడ్డు పడింది, అంత కంతకూ కిందికి వాలింది ఆమె సగర్వమైన శిరస్సు.

తల్లి సృష్టిస్తుంది, తల్లి రక్షిస్తుంది, విధ్వంసం గురించి ఆమెతో మాట్లాడడ మంటే ఆమెకు వ్యతిరేకంగా మాట్లాడడం; కానీ అది తెలియదు అతనికి, ఆమె మనుగడకు గల కారణాన్ని తొలగిస్తున్నానని తెలియదు అతనికి.

తల్లి యెప్పుడూ మృత్యువుకు వ్యతిరేకం; మనుషుల సంసారాలలోకి మృత్యువును కొనితెచ్చే చేయి అంటే తల్లులకు ద్వేషం, రోత. కానీ కొడుకు యిది గమనించలేదు, హృదయాన్ని జడం చేసే ముష్కర కీర్తి ధగద్ధగలతో అతని కండ్లు చెదిరినాయి.

తల్లి యెంత నిర్భీతిగా వుండగలదో అంత యుక్తిగానూ, అంత నిర్దయగానూ వుండగలదు తాను సృష్టించి పోషించే జీవానికి ప్రమాదం యేర్పడి నప్పుడు, అనే విషయంకూడా అతనికి తెలియదు.

ఆమె తల వంచి కూర్చున్నది, వైభవోపేతంగా వున్న నాయకుని గుడారం వాకిలి గుండా ఆమెకు నగరం కనపడింది, తన లోపలి తీయని ప్రాణ స్పందనను తాను మొదట అనుభవించిన నగరం, యిప్పుడు విధ్వంసన దాహంతో తపించిపోతున్న యీ బిడ్డ పుట్టినప్పటి ప్రసూతి వేదనా సంక్షోభాన్ని తను అనుభవించిన నగరం.

యెర్రని సూర్య కిరణాలు కోట గోడలకూ, నగరంలోని గోపురాలకూ నెత్తురు రంగు అద్దినాయి, కిటికీల గాజు తలుపులు బాధాపూరితంగా ధగధగలాడినాయి, నగర మంతా గాయాల రాశిగా కనిపించింది, ప్రతి గాయంనుండి యెర్రని ప్రాణసారం ప్రవిస్తున్నట్లు. కాసేపట్లో నగరం నల్లబడింది పీనుగలాగ, దానిపైన చుక్కలు వెలిగినాయి ప్రేత దీపాలలాగ.

శత్రువుల దృష్టి ఆకర్షింపబడుతుందనే భయంతో దీపాలు వెలిగించని చీకటి గృహాలు కనిపించినాయి ఆమెకు, అంధకారంలో మునిగిపోయి, పీనుగుల కంపుతో నిండిపోయిన వీధులు కనిపించినాయి ఆమెకు, మృత్యువు కోసం కాచుకొని వున్న జనుల నీరసపు గుసగుసలు వినిపించినాయి ఆమెకు — అన్నీ చూసింది ఆమె, ఆమెకు ఆత్మీయమైనవీ, ప్రీతిపాత్రమైనవీ అన్నీ ఆమెముందు మూగగా నిలబడి, ఆమె నిర్ణయంకోసం యెదురుచూస్తున్నాయి, నగరంలోని ఆ ప్రజల కందరికీ తాను తల్లి ఐనట్లు అనిపించింది ఆమెకు.

మేఘాలు చీకటి శిఖరాలనుండి లోయలోకి దిగివచ్చి, మృత్యు సన్నికృష్ట నగరంమీద రెక్కల గుర్రాల లాగ రివ్వున వాలినాయి.

"యీ రాత్రి మేము దాడి జరపవచ్చు," అన్నాడు ఆమె కొడుకు, "రాత్రి తగినంత చీకటిగా వుంటే! సూర్యుడు నీ కండ్లలో వెలుగుతూ వుంటే చంపడం కష్టం, కత్తుల తళతళలకు కండ్లు చెదిరిపోతాయి, చాలా దెబ్బలు పక్కన పడతాయి," అన్నాడు అతను, తన ఖడ్గం పరీక్షించుకుంటూ.

తల్లి అతనితో అన్నది:

"రా బాబూ, నా రొమ్మున తల పెట్టి విశ్రాంతి తీసుకో, జ్ఞాపకం చేసుకో చిన్నప్పుడు నీవు యెంత ఉల్లాసంగా, యెంత దయగా వుండినావో, అందరూ నిన్ను యెంతగా ప్రేమించేవాళ్లో...."

అతను ఆమె చెప్పినట్లు విన్నాడు, తల ఆమె ఒడిలో పెట్టి కండ్లు మూసుకొని, యిలా అన్నాడు:

"నేను కీర్తిని మాత్రమే ప్రేమిస్తాను, నన్ను యిలాంటి వాణ్నిగా చేసినందుకు నిన్ను ప్రేమిస్తాను."

"ఆడవాళ్లనో?" అడిగింది ఆమె, అతనిమీదికి వంగి.

"చాలామంది వున్నారు. వాళ్లు వెగటు కలిగిస్తారు అతి మధురమైన వన్నీ కలిగించినట్లే."

“నీకు పిల్లలు కావాలని లేదూ?” ఆమె అడిగింది ఆఖరున.

“యెందుకు? యెవరి చేతిలోనైనా చావడానికా? నాలాంటివా డెవడో వాళ్లను చంపుతాడు. నా కది బాధ కలిగిస్తుంది, పగ తీర్చుకోడానికి ముసలివాణ్నై, నీరసించి వుంటాను.”

“నీవు అందమైనవానివి, కానీ మెరుపు తీగలాగ గొడ్డుబోతువు,” అన్నది ఆమె నిట్టూరుస్తూ.

“ఔను, మెరుపు లాగ...” అన్నాడు అతను, చిరునవ్వుతో.

అలాగే అతను తన తల్లి రొమ్ముమీద పసిబిడ్డ లాగ నిద్రపోయినాడు.

అప్పుడు ఆమె తన నల్లని ఉత్తరీయం అతనిమీద కప్పి, అతని గుండెలోకి కత్తి దించింది, అతను ఒక్కసారి విలవిలలాడి మరణించినాడు — తన కొడుకు గుండె యెక్కడ కొట్టుకునేదీ ఆమెకంటె బాగా యెవరికి తెలుసు గనుక. తరువాత నివ్వెరపోయిన పహరా సైనికుల కాళ్ల ముందర ఆ శవాన్ని పడవేసి, ఆమె నగరాన్ని ఉద్దేశించి యిలా అన్నది:

“ఒక పౌరురాలిగా, నా దేశంకొరకు నేను చేయగలిగి నంతా చేసినాను: తల్లిగా నేను నా కొడుకుతోనే వుంటాను! యిక యిప్పుడు మరొకణ్ని కనలేను, నా జీవితం యెవరికీ పనికిరాదు.”

ఆ కత్తిని — అతని రక్తంతో, తన రక్తంతో, యింకా వెచ్చగా వున్న కత్తిని — స్థిరమైన చేతితో ఆమె తన రొమ్మున దించుకుంది, వేటు మళ్లీ సరైన స్థానంలోనే పడింది, బాధా దష్టమైన గుండెను కనుక్కోవడం కష్టం కాదు గనుక.

## పేపే

పేపేకు పదేండ్లు. అతను చిక్కిపోయి, సన్నగా, బల్లిలాగ చురుకుగా వుంటాడు; అతని సన్నని భుజాలమీదనుండి అతుకుల పేలికలు వ్రేలాడుతుంటాయి; అతని చర్మం, యెండతో మురికితో నల్లబడి, లెక్కలేనన్ని చిరుగుల గుండా బయటికి తొంగిచూస్తూ వుంటుంది.

అతను యెండిపోయిన గడ్డి పరకలా గుంటాడు, సముద్రపు పిల్లగాలికి అటూ యిటూ కొట్టుకపోయేదాని లాగ. పొద్దు పొడిచింది మొదలు పొద్దు గూకిందాకా అతను ఆ దీవిలో యీ రాతిమీదికీ ఆ రాతిమీదికీ యెగురుతుంటాడు; అలత యెరుగని అతని చిన్ని గొంతులోనుండి పొంగి వచ్చే ప్రవాహాన్ని యే గంటలోనైనా వినవచ్చు:

“అందాలరాసి యీ యిటలీ,
నా మాతృదేశ మీ యిటలీ!”

ప్రతిదీ అతనికి ఆసక్తికరంగానే వుంటుంది: చల్లని తల్లి భూమిమీద అంత వెర్రిగా విరగబూసే పూలూ, పూదా గండ శిలల మధ్య ఉరుకుతూ పారాడే బల్లులూ, ఉలితో తీర్చి చెక్కినట్లున్న ఆలివ్ చెట్ల ఆకుల్లోనూ, ద్రాక్షతీగల పచ్చని లతా శిల్పంలోనూ వుండే పక్షులూ, సముద్రపు అడుగున చీకటి తోటల్లో విహరించే చేపలూ, పట్నంలోని యిరుకు వంకర వీధుల్లో విదేశీయులూ: కత్తి గంటు ముఖం గల బలిసిన జర్మనీవాడూ, మానవద్వేషి పాత్రను నటించే నటునిలా గున్న యింగ్లీషువాడూ, ఇంగ్లీషువానిలాగ వుండాలని వ్యర్థ ప్రయత్నం చేసే అమెరికావాడూ, గిలకలాగ గోలచేసే అనితర సాధ్యమైన ఫ్రెంచివాడూ.

వెంద్రుకలు నిక్కబొడుచుకునే టంతగా స్వాతిశయంతో ఉబ్బిన జర్మనీవాణ్ని పేపే తన నిశితమైన కండ్లతో చూసి, "యేం ముఖం!" అంటాడు తన నేస్తులతో. "అరె, అతని ముఖం నా కడుపంత పెద్దది!"

పేపేకు జర్మనీవాళ్లంటే యిష్టంలేదు. ఆ పట్నంలోవాళ్ళ వైను తాగి, ఆకు లాడి, పేపర్లు చదివి, రాజకీయాలు చర్చించుకునే వీధుల్లోనూ, చౌకుల్లోనూ, చిన్న చీకటి హోటళ్లలోనూ వుండే భావాలూ, హృదయ భావాలే పేపేవి.

ఆ పట్నంవాళ్లు అంటారు, "మన బీద దక్షిణాది వాళ్లకు బాల్కన్ స్లావులే దగ్గరివాళ్లు, మన మైత్రికి ప్రత్యుపకారంగా ఆఫ్రికా యెడారులను మనకు బహుమానంగా యిచ్చిన మన పొత్తుదార్ల కంటె."

దక్షిణాది సాదాజనం యీ మాట పదేపదే అంటుంటారు. పేపే అన్నీ వింటాడు, యేదీ మరిచిపోడు.

అడుగో అక్కడొక మొద్దులాంటి యింగ్లీషువాడు, పంగల కట్టె లాంటి కాళ్లతో అంగలు వేస్తున్నాడు. అతని ముందర పేపే కూనిరాగం తీస్తున్నాడు విషాద గీతం లాంటి దేదో, లేక వట్టి విషాద గేయమో:

"నా మిత్రుడు పోయెను స్వర్గం
నా భార్యకు కలిగెను దుఃఖం...
యేమీ అర్థం కాలేదూ
ఆమెకు ఒంట్లో యేం బాధో."

పేపే నేస్తులు అతని వెనుక నడుస్తూ వుంటారు, నవ్వులతో వూగిపోతూ; ఆ విదేశస్థుడు తన మసక కన్నులతో నిబ్బరంగా వాళ్లవైపు చూసినప్పుడల్లా వాళ్లు చిట్టెలుకల్లాగ పారిపోయి పొదల మాటున్నో, గోడల చాటున్నో దాక్కుంటారు.

పేపేను గురించి వినోదకరమైన కథలు యెన్నైనా చెప్పవచ్చు.

ఒకరోజు ఒకామె అతన్ని తన మిత్రురాలివద్దకు పంపింది, తన తోటలో కాసిన ఆపిల్ పండ్ల బుట్ట యిచ్చి.

"నీ కొక సోల్డో* యిస్తాను!" అని చెప్పింది ఆమె. "నీకు అక్కర కొస్తుందిలే బాగా."

పేపే వెంటనే బుట్ట తీసుకొని, నెత్తిమీద పొందించుకొని, బయల్దేరినాడు. సాయంత్రానికి గాని అతను సోల్డోకోసం తిరిగిరాలేదు.

"చాలా తీరికగా వచ్చినావే," అన్నది ఆమె.

"ఔను అమ్మగారూ, చాలా అలిసిపోయినాను!" జవాబిచ్చినాడు పేపే నిట్టూరుస్తూ. "మరీ, ఒకటి, రెండు, మూడు... ఐదు... పది...!"

"అదే మిట్రా, పదికంటె యెక్కువే వుండాలి! నిండు బుట్ట అది!"

"పండ్లు కాదు అమ్మగారూ, కుర్రవాళ్లు."

"పండ్ల మాటేమిటిరా?"

"ముందు కుర్రవాళ్ల సంగతి చెప్పనీయండి అమ్మగారూ: మికేలే, జోవానీ...."

ఆమెకు కోపం వచ్చింది. పేపేను భుజం పట్టుకొని వూపింది ఆమె:

"చెప్పు, ఆపిళ్లు యిచ్చినావా, లేదా?" ఆమె అరిచింది.

"వాటిని చౌకు దాకా మోసుకపోయినాను అమ్మగారూ! వినండి, నేను యెంత బాగా ప్రవర్తించినానో. మొదట వాళ్ల వెక్కిరింపులు నేను లక్ష్యపెట్టలేదు. నేను మనసులో అనుకున్నాను, నన్ను వాళ్లు గాడిదతో పోల్చనీలే, అదంతా అమ్మగారిమీద గౌరవంతో భరిస్తాను, అంటే మీరే అమ్మగారూ. కానీ వాళ్లు మా అమ్మను యెగతాళి చేయడం ప్రారంభించేసరికి, చాలనిపించింది. నేను బుట్ట కింద పెట్టి, మీరు చూసి తీరాల్సింది అమ్మగారూ, ఆ పండ్లతో ఆ కుర్ర సైతాన్లను యెంత చక్కగా కొట్టినానో. మీరు ఆనందించేవాళ్లు!"

"నా పండ్లు దొంగిలించినారు వాళ్లు!" అరిచింది ఆమె.

పేపే విచారంగా నిట్టూర్చినాడు.

"లేదండీ," అన్నాడు అతను, "వాళ్లకు తగలకుండా తప్పిపోయిన పండ్లన్నీ గోడకు తగిలి పచ్చడైనాయి. తక్కినవి తిన్నాం, నేను శత్రువులను ఓడించి, వాళ్లతో రాజీ చేసుకున్న తర్వాత...."

నున్నగా గొరిగిన పేపే తలమీద ఆమె తిట్లు కుమ్మరించింది. అతను శ్రద్ధగా, వినయంగా విన్నాడు, అప్పుడప్పుడూ మరీ పసందైన నుడికారాన్ని రిక్క వేసి మెచ్చుకుంటూ.

---

* సోల్డో — చిన్న ఇటాలియన్ నాణ్యం. — సం.

"ఓహో, యెంత సొగసు! యేమి భాష!"

చిట్ట చివరకు ఆమె కోపం చల్లారి, అతన్ని వదలిపెట్టినప్పుడు ఆతను చెప్పినాడు ఆమెతో:

"ఆ కుర్రకుంకల గలీజు తలకాయలను మీ అద్భుతమైన ఆపిల్ పండ్లతో నేను యెంత సుందరంగా కొట్టిందీ మీరు చూసివుంటే యిలా ఆందోళన పడేవాళ్లు కాదు. మీరే గనుక చూసి వుంటేనా, అంతెందుకూ, నాకు ఒకటి కాదు, రెండు సోల్డోలు యిచ్చేవాళ్లు!"

ఆ తెలివితక్కువ మనిషికి అర్థంకాలేదు, ఆ విజేతకున్న మితమైన గర్వం; ఆమె కేవలం అతనివైపు పిడికిలి బిగించి ఊపింది.

పేపే అక్క అతనికంటె చాలా పెద్దది, కానీ అతనికంటె చురుకైనది కాదు. ఆమె ఒక ధనిక అమెరికన్ బంగళాలో యింటి పని చేయడానికి పోయింది. వెంటనే ఆమె రూపం మారింది; ఆమె శుభ్రంగా, మట్టసంగా తయారైంది, బుగ్గలకు గులాబి రంగు వచ్చింది, ఆగస్టులో వూరి పక్వానికి వచ్చే పేర్ పండులాగ కనిపించ సాగింది ఆమె.

"నీవు నిజంగా రోజూ తింటావా?" అని ఆమె తమ్ముడు ఆమె నడిగినాడు ఒకసారి.

"రోజుకు రెండు సార్లు, మూడు సార్లు కూడా తింటాను కావాలనుకుంటే," అన్న దామె గర్వంగా.

"పండ్లు అరిగిపోకుండా చూసుకో," పేపే హితబోధ చేసినాడు.

కాసేపున్న తర్వాత అతను అడిగినాడు, "మీ యజమాని చాలా ధనవంతుడా?"

"ఓ, ఆయన రాజుకంటె ధనవంతు డనుకుంటాను!"

"నన్ను వెర్రి వెంగళప్పను చేస్తావో! ఆయనకు యెన్ని ట్రౌజర్లు వున్నాయి చెప్పు?"

"చెప్పడం కష్టం."

"పది?"

"బహుశా యింకా యెక్కువే వుంటాయి."

"అయితే నా కొకటితే, కాళ్లు మరీ పెద్దవి గాకుండా, వున్నవాటిలో వెచ్చగ వుండేది పట్టుకరా."

"యెందుకు?"

"మరి, నా ట్రౌజరు చూడు."

నిజానికి చూడవలసింది అంతగా లేదు అక్కడ, పేపే ట్రౌజర్లో కొద్దిగా మాత్రమే మిగిలివుంది.

"నిజమే," అక్క అంగీకరించింది, "నీకు కాసిని బట్టలు కావలసిందే! కానీ, మనం దొంగిలించినా మని ఆయన అనుకోడూ?"

"జనం మనకంటె తెలివితక్కువవాళ్లని అనుకోవద్దు!" పేపే ఆమెకు నమ్మకం

చెప్పినాడు. "దండిగా వున్నవానిదగ్గర మనం కాస్త తీసుకుంటే అది దొంగతనం కాదు, కేవలం పంచుకోవడం."

"నీవు చెత్త మాట్లాడుతున్నావు," అతని అక్క ఆక్షేపించింది. కానీ పేపే త్వరలోనే ఆమె నీతులను ఓడించినాడు. ఆమె మంచి తేలిక బూడిద రంగు ట్రౌజర్ ఒకటి వంట గదిలోకి తెచ్చింది. అది అతని మొత్తం యెత్తుకంటె కొంచెం పెద్దదైన మాట నిజమే. కానీ ఆ యిబ్బందిని యెలా అధిగమించాల్సిందీ పేపేకు వెంటనే అర్థమైంది.

"కత్తి యిలా యివ్వు!" అన్నాడు అతను.

యిద్దరూ కలిసి వేగంగా ఆ అమెరికన్ ట్రౌజరును కుర్రవానికి చాలా అనుకూలంగా వుండేటట్లు మార్చినారు. వాళ్ల ప్రయత్నాల ఫలితం కాస్త వదులుగా, సంచిలాగ వున్నా, సుఖమైన సంచిలాగే వుంది. దాన్ని తాళ్లతో భుజాలకు తగిలించి, ఆ తాళ్లను మెడ చుట్టూ ముడివేసినారు. ట్రౌజర్ జేబులు చేతు లైనాయి.

వాళ్లు దాన్ని యింకా మేలైన, అనుకూలమైన బట్టగా తయారు చేసేవాళ్లే, కానీ యింతలో ఆ ట్రౌజర్ యజమాని భార్య వాళ్ల కృషికి అడ్డుపడింది. ఆమె వంటగదిలోకి వచ్చి, అనేక భాషల్లో యెంతో వికృతమైన శబ్ద సముదాయం విడుదల చేయసాగింది, అంతే వికృతమైన ఉచ్చారణతో, అమెరికన్ల సంప్రదాయం ప్రకారం.

ఆ వాగ్ధారను ఆపడానికి పేపే యేమీ చేయలేకపోయినాడు; అతను ముఖం మాడ్చుకున్నాడు, రొమ్ముమీద చేయి పెట్టి అదుముకున్నాడు, నిస్పృహతో చేత్తో తల పట్టుకున్నాడు, బిగ్గరగా నిట్టూర్చినాడు, కానీ ఆమె శాంతించలేదు, ఆమె మగడు రంగంమీదికి వచ్చిందాకా.

"యేం జరిగింది?" అడిగినాడు అతను.

దానిమీద పేపే చెప్పినాడు:

"అయ్యా, మీ ఆవిడ చేసే రచ్చకు నేను యెంతో ఆశ్చర్యపడుతున్నాను. నిజానికి మిమ్మల్ని గురించి కాస్త కించపడుతున్నాను. నాకు అర్థమయ్యే దేమిటంటే, మేము మీ ట్రౌజర్‌ను చెడగొట్టినట్లు ఆమె భావిస్తున్నది, కానీ నామాట నమ్మండి, అది నాకు సరిగ్గా సరిపోయింది. ఆమె అనుకుంటున్నది, మీకున్న ఒకే ఒక ట్రౌజర్‌ను నేను తీసుకున్నాననీ, మీరు మరొకటి కొనుక్కోలేరనీ...."

అమెరికన్ ఆ ఉపన్యాసం నిబ్బరంగా విని, యిలా అన్నాడు:

"మరి నేను అనుకునే దేమంటే, పోలీసువాళ్లను పిలవడం న్యాయమని."

"నిజంగా?" పేపే అచ్చెరువుతో ప్రశ్నించినాడు, "యెందుకు?"

"నిన్ను జైలుకు తీసుకపోడానికి...."

పేపే మనసుకు యెంతో నొప్పి తగిలింది. నిజాని కతను యేడ్చే స్థితిలో వున్నాడు, కానీ కన్నీళ్లు దిగమింగి యెంతో హుందాగా యిలా అన్నాడు:

"యేమండీ, జనాన్ని జైలుకు పంపడం మీకు సంతోషం కలిగిస్తే, అది మీ సొంత వ్యవహార మనుకోండి! కానీ నేనైతే అలా చేయను, నాకే చాలా ట్రౌజర్లు వుండి, మీకే ఒకటికూడా లేకపోతే! మీకు రెండు యిచ్చేవాణ్ని, బహుశా మూడు యిచ్చేవాణ్ని, ఒకేసారి మూడు ట్రౌజర్లు తొడుక్కోవడం అసాధ్యమే అనుకోండి! అందులోనూ యెండ కాలంలో...."

అమెరికన్ పగలబడి నవ్వినాడు, ధనవంతులు కూడా ఒకోసారి చమత్కారం గ్రహిస్తారు.

తరువాత అతను పేపేకు చాకొలెట్లు తినిపించి, ఒక ఫ్రాంక్* యిచ్చినాడు. పేపే ఆ నాణ్యం కొరికి చూసి, దాతకు కృతజ్ఞత తెలిపినాడు:

"థాంక్సండీ! నాణ్యం మంచిదే ననుకుంటాను?"

కానీ పేపే అత్యంత స్వచ్ఛమైన స్థితిలో వుండేది శిలల మధ్య ఒంటరిగా నిలబడి, వాటి పగుళ్లను సాలోచనగా పరిశీలిస్తున్నప్పుడు — శిలా జీవితాల అగమ్య చరిత్రను అధ్యయనం చేస్తున్నట్లు. అలాంటి సమయాలలో చైతన్య విలసితమైన అతని కన్నులు ఆశ్చర్యంతో విచ్చుకొని, చెమ్మగిలుతాయి; నాజూకైన చేతులు వీపువెనుక లేసులాగ అల్లుకొని వుంటాయి; అతని తల కొద్దిగా వంగి, మందమారుతంలో పుష్పంలాగ మెల్లగా కదలుతూ వుంటుంది. అతను గొంతులో మెల్లగా యేదో కూనిరాగం తీస్తూ వుంటాడు. పాడుకోవడం అతని నిత్య కృత్యం.

అతను పూలను చూస్తూ వున్నప్పుడు కూడా గమనించడం బాగుంటుంది, గోడలమీద పుష్కలంగా వూదారంగు పూసే విస్టేరియా పూలను చూస్తూ వున్నప్పుడు. ఫిడేలు తంతెలాగ బిగుసుకొని నిలబడి వుంటాడు అతను, సముద్రపు ఊర్పులతో చైతన్యం పొందిన పట్టు పూరేకుల లలిత ప్రకంపనాలను వింటున్నట్లు.

చూస్తూ, పాడుతాడు అతను:

"ఫియూరినో... ఫియూరినో...."

దూరాననుండి, యేదో బ్రహ్మాండమైన తంబురానుండి వచ్చే నాదంలాగ, సముద్రపు నీరసమైన గుసగుసలు వస్తాయి. పూలమీద సీతాకోకచిలుకలు ఒక దాన్నొకటి తరుముతుంటాయి. పేపే తల యెత్తి వాటి ఆకాశ గమనాన్ని చూపులతో అనుసరిస్తాడు, యెండకు రెప్ప లారుస్తూ, చిరునవ్వులో విడిపోయిన పెదవులతో; ఆ చిరునవ్వులో కాస్త

---

*ఫ్రాంక్ — ఫ్రెంచి నాణ్యం. — సం.

అసూయా, కాస్త విషాదమూ కలిసివుంటాయి, కానీ భూమిమీది ఉన్నత ప్రాణియొక్క ఉదారపు చిరునవ్వు అది.

"ఛో!" అని అరుస్తాడు అతను, మరకత వర్ణపు బల్లిని భయపెట్టడానికి చప్పట్లు చరుస్తూ.

సముద్రం అద్దంలాగ నిశ్చలంగా వున్నప్పుడు, శిలలమీద సముద్రపు పోటు వేళ వుండే నురుగు లేసుల అలంకారాలు లేనప్పుడు, పేపే ఒక రాయిమీద కూర్చొని, తన కాంతివంతమైన కన్నులతో పారదర్శకపు నీళ్లలోకి చూస్తూ వుంటాడు; ఆ నీళ్లలో యెరపుదాటు సముద్రపు తీగల మధ్య చేపలు నున్నగా జారుతుంటాయి, రొయ్యలు ముందుకూ వెనకకూ దూకుతుంటాయి, యెండ్రకాయ పక్కవాటుగా ప్రాకుతూవుంటుంది. ఆ ప్రశాంతిలో కుర్రవాని స్వచ్ఛమైన కంఠం ఆ యింద్రనీల జలాలమీద సుకుమారంగా ప్రవిస్తుంది:

"సాగరమా, ఓ, సాగరమా...."

పెద్దవాళ్లు తరుచుగా పేపే వైపు అసమ్మతిగా తల ఆడిస్తారు:

"వాడు అరాజకవాది ఔతాడు!"

కానీ మరింత దయగలవాళ్లు, యెక్కువ వివేచనగలవాళ్లు, మరొక విధంగా అభిప్రాయ పడతారు:

"పేపే మన కవి ఔతాడు...."

యిక పెట్టెలు చేసే పస్క్వాలినో, వెండితో పోతపోసినట్లున్న తలా, ప్రాచీన రోమన్ నాణ్యాలమీద ముద్రింపబడినలాంటి ముఖమూ గల ముసలివాడు — విజ్ఞుడూ, గౌరవనీయుడూ అయిన పస్క్వాలినోకు సొంత అభిప్రాయం వుంది:

"మన పిల్లలు మనకంటె యెంతో బాగా వుంటారు, వాళ్ల జీవితాలుకూడా బాగుంటాయి!"

చాలామంది అతన్ని నమ్ముతారు.

# కడుపులో చెయి పెట్టి....

ఒక వేడి వేసవి రాత్రి, పట్నం అంచులోని ఒక ఒంటరి వీధిలో నాకు ఒక వింత దృశ్యం కనిపించింది: ఒక స్త్రీ ఒక పెద్ద మడుగు మధ్యలో నిలబడి, కాళ్లతో తొక్కుతూ, బురద చిమ్ముతూ వుంది, చిన్నపిల్లలు చేసేటట్లు — చిందులు తొక్కుతూ, ఒక రోత పాట ముక్కుతో పాడుతున్నది.

పగలు తీవ్రమైన తుఫాను పట్నాన్ని ఊపేసింది. వర్షానికి వీధిలోని బంకమట్టి నానింది. మడుగు లోతుగా వుంది, ఆ స్త్రీ కాళ్లు దాదాపు మోకాళ్ల దాకా మునిగిపోయినాయి. కంఠాన్నిబట్టి చూస్తే, గాయని తాగింది. నృత్యంలో అలసిపోయి పడితే, ఆ చిక్కని బురదలో ఆమె సులభంగా మునిగిపోగలదు.

నేను హైబూట్ల పైకొనలు యెగలాగి, మడుగులో కాళ్లీడ్చుకుంటూ పోయి, ఆమెను చేతులు పట్టుకొని వట్టి నేలమీదికి యీడ్చుక వచ్చినాను. ఒక క్షణం పాటు ఆమెకు జడుపు పుట్టి వుండాలి, అణకుగా నావెంట వచ్చింది. కానీ వెంటనే మనిషంతా వడదిరిగి, కుడి చేయి వూడలాక్కొని, నన్ను రొమ్ముమీద గుద్ది,

"ఓ! ఓ!'" అని కేకవేసింది.

మరు నిముషం ఆమె మళ్లీ మడుగులో వుంది, నన్ను కూడా అందులోకి లాక్కొనిపోయి.

"పో, సచ్చినోడా!" గొణిగింది ఆమె. "నేను రాను! నీవు లేకుండా నేను బతుకుతాను.... నేను లేకుండా నీవు బతకడానికి ప్రయత్నం చెయ్.... రక్షించండి!"

ఒక రేయివాచ్‌మన్ చీకటిలోనుండి వెలువడి, మాకు నాలుగైదు అడుగుల దూరంలో నిలబడి జబర్దస్తీగా అన్నాడు:

"యేమిటి గలాటా?"

నేను చెప్పినాను, ఆమె బురదలో మునిగిపోయి చస్తుందేమో నని నాకు భయంగా వుందనీ, ఆమెను బయటికి చేర్చడానికి ప్రయత్నిస్తున్నాననీ. వాచ్‌మన్ ఆమెను పరిశీలనగా చూసి, కేకరించి వుమ్మేసి, ఆజ్ఞాపించినాడు.

"మాష్కా, రా బయటికి!"

''నాకు రావాలని లేదు.''

''వచ్చెయ్, ఊఁ!''

''రాను.''

''నీవు వాయించమన్నావా, చావుపీనుగా?'' వాచ్‌మన్ మెత్తగా అని, నావైపు తిరిగి సుహృద్భావంగా, ఆషామాషీగా అన్నాడు: ''యీ పేట మనిషే, తాళ్లు వూడదీస్తుంది, మాష్కా ఫ్రోలిహ్. సిగరెట్టుందా?''

యిద్దరమూ ముట్టించినాం. ఆ స్త్రీ మడుగులో చిందులు తొక్కుతూ, అరుస్తున్నది.

''దొరలు! నేనే నా దొరను. కావాలంటే మునుగుతాను.''

''నీవు అడుగున ఒకటిస్తాను, జాగర్త!'' హెచ్చరించినాడు వాచ్‌మన్ – అతను దృఢంగా వున్న ముసలి గడ్డం మనిషి. ''ప్రతి రాత్రీ యిదే గలాటా చేస్తుంది. యింటివద్ద కాళ్లులేని కొడుకు వున్నాడు.''

'''యీమె యిల్లు చాలా దూరమా?''

''యీ మనిషిని చంపెయ్యాలి,'' అన్నాడు వాచ్‌మన్, నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా.

''యెవరో ఒకరు ఆమెను యింటికి తీసుకపోవాలి,'' నేను సూచనగా అన్నాను.

వాచ్‌మన్ తన గడ్డంలోకి ''హూఁ'' అన్నాడు. తన సిగరెట్టు వెలుతురులో నా ముఖంలోకి తొంగిచూసి, వెళ్లిపోయినాడు, బురదలో దబదబ అడుగులు వేస్తూ.

''తీసుకపో! ముందు ఆ మూతి బాగా చూడు.''

ఆ స్త్రీ బురదలో కూర్చుంది. బురదమీద చేతులు కొట్టడం ప్రారంభించింది ఆమె, అసహ్యమైన ముక్కిడి కంఠంతో కీచుమంటూ:

''తెడ్డు వేస్తున్నాను.... సముద్రంలో....''

ఆకాశపు చీకటి గుహలోనుండి ఒక పెద్ద నక్షత్రం మడ్డి జిడ్డు నీళ్లలో ప్రతిఫలించింది. మడుగులో నీళ్లు కదిలినప్పుడు ప్రతిబింబం అదృశ్యమౌతున్నది. నేను మళ్లీ మడుగులో కాళ్లీడ్చుకుంటూ పోయి, ఆ గాయనిని చంకల కింద పట్టుకొని యెత్తి, మోకాళ్లతో తోస్తూ, బయట కంచె దగ్గరికి మోసుకపోయినాను. ఆమె ప్రతిఘటించింది, చేతులు కొట్టుకుంది, నన్ను సవాల్ చేసింది:

''కొట్టు, ఊఁ, కొట్టు! నాకు లెక్కలేదు! ఓ, నువ్వు పశువు.... ఓ, పనికిమాలిన వెధవ. కానీ, కొట్టు!''

ఆమెను కంచెకు ఆనించి, ఆమె యిల్లు యెక్కడని అడిగినాను. ఆమె తన కైపెక్కిన తలకాయ యెత్తి నల్లని, మబ్బుగమ్మిన కన్నులతో నావైపు చూసింది. ఆమె ముక్కుదూలం లోపలికి అణగిపోయింది. ముక్కుకొన పైకి యెగ పొడుచుకొని వచ్చింది, గుండీలాగ. ఆమె

పై పెదవి గాయపు కనుమతో సొట్టపోయి, చిన్ని పలువరుసను బయటపెడుతున్నది. ఆమె చిన్న వూదు ముఖం నావైపు కోరచూపులు చూసింది:

''సరే లే, పోదాంరా,'' అన్నది ఆమె.

మేము బయలుదేరినాం, కంచెను రాచుకుంటూ. ఆమె స్కర్టు తడి అంచు నా కాళ్లకు కొరడాలాగ తగులుతున్నది.

''పోదాంరా, ప్రియా,'' అన్నది ఆమె బొంగురు గొంతుతో, గెలిచి వస్తున్నట్లు కనిపిస్తూ. ''నీతో బాగా వుంటాను. నీకు సుఖ మిస్తాను.''

ఒక ఆవరణలోని పెద్ద రెండంతస్తుల యింటివద్దకు తెచ్చింది ఆమె నన్ను. ఆవరణలో బండ్లూ, పీపాలూ, జాజి చెక్కల పెట్టెలూ, కట్టెల రాసులూ చిందరవందరగా వున్నాయి. వాటి మధ్య ఆమె అతి జాగ్రత్తగా, గుడ్డిదానిలాగా దారిచేసుకుంటూ వెళ్లి, పునాదిగోడకు వున్న ఒక రంధ్రంవద్ద ఆగింది.

''దిగు,'' అన్నది ఆమె.

తూలుతున్న ఆమె దేహాన్ని నిలబట్టుకోడానికి ఆమె నడుముచుట్టూ నాచేయి వేసి, బంక పట్టిన గోడకు ఆనుకుంటూ, జారుడు మెట్లు దిగినాను. చేతులతో తడుముతూ తలుపుమీద ఫెల్టు ముసుగునూ, గడెనూ కనుక్కొని, వాకిలి తెరిచి, గడపలో నిలబడినాను, ముందుకు పోవడానికి తటపటాయిస్తూ.

''నీవేనా అమ్మా?'' చీకటిలోనుండి మెల్లగా కంఠం వినిపించింది.

''నేనే.''

తారు వాసనతో కలిసిన వెచ్చని కుళ్లువాసన ముఖానికి కొట్టింది. అగ్గిపుల్ల వెలిగింది. దాని మినుకు మినుకు కాంతిలో ఒక పిల్లవాని పాలిపోయిన ముఖం క్షణకాలంపాటు కనపడింది.

''మరెవ రుంటారు? నేనే,'' అన్నది మళ్లీ ఆమె, తన బరువంతా నామీదవేసి ఆనుకుంటూ.

మరొక అగ్గిపుల్ల వెలిగింది, గ్లాసు చప్పుడు వినబడింది, పుల్లలాంటి తమాషా అయిన చేయి ఒక చిన్న రేకు లాంపు వెలిగించింది.

''నా బంగారు,'' అంటూ ఆమె, తూలుతూ, ఒక మూలన కుప్పకూలి పడింది. అక్కడ, యిటుక నేలమీద, బొత్తిగా యెత్తులేని పరుపు ఒకటి పరిచి వుంది.

మందుతూ, పొగ వస్తున్న వత్తిని తగ్గించి, పిల్లవాడు లాంపు వెలుతురు సరిచేసినాడు. అతని ముఖం గంభీరంగా వుంది, ముక్కు సూదిగా వుంది, ఆడపిల్లలలాంటి చిన్న నోరు వుంది — అన్నీ కలిసి మంచి చిత్రకారుడు వేసిన ముఖంలా వుంది, యీ చిత్తడి చీకటి గుహలో పరమ అసందర్భంగా. లాంపు సరిచేసి అతను తన కుచ్చులలాంటి కన్నులతో నావైపు చూపు సారించి,

"తాగింది కదూ?" అన్నాడు.

అతని తల్లి పరుపుమీద అడ్డం పడివుంది, వెక్కిళ్ళూ, గురకలూ కలిసిన ధ్వనులు చేస్తూ.

"ఆమెకు బట్టలు విప్పించాలి," అన్నాను.

"విప్పు," పిల్లవాడు జవాబిచ్చినాడు, కండ్లు నేలకు వాలుస్తూ.

నేను ఆమె తడిసిన స్కర్టు వూడలాగడానికి పూనుకుంటూనే అతను వ్యవహార ధోరణిలో మెల్లగా అడిగినాడు:

"లాంపు ఆర్పేయనా?"

"యెందుకూ?"

అతను జవాబియ్యలేదు. నేను అతని తల్లి దుస్తుల పనిలో నిమగ్నమై, ఆమెను పిండి మూటలాగా అటూ యిటూ తిప్పుతూ, అతన్ని గమనించినాను. కిటికీకింద నేలమీద వున్న ఒక జాజి చెక్కల పెట్టెలో కూర్చున్నాడు అతను. మందమైన పలకలతో చేయబడిన ఆ పెట్టెమీద నల్లని అచ్చు అక్షరాలతో యిలా రాసి వుంది:

జాగ్రత్తగా పట్టుకోవాలి
యన్.ఆర్.అండ్ కో

చౌకం కిటికీ అడుగు భాగం పిల్లవాని భుజాల యెత్తున వుంది. గోడ వెంబడి అనేక వరసల చిన్న షెల్ఫులు వున్నాయి; వాటిమీద సిగరెట్టు పెట్టెలూ, అగ్గి పెట్టెలూ పేర్చి వున్నాయి. పిల్లవాడు కూర్చున్న పెట్టె పక్కన మరొక పెట్టె వుంది. దానిమీద పసుపురంగు దళసరి కాగితం పరిచి ఉంది. ఆ పెట్టెను టేబుల్‌లాగ వాడుకుంటున్నట్లు తెలుస్తున్నది. తన దయనీయమైన చేతులు మెడవెనుక ఒకదానితో ఒకటి పట్టుకొని, పిల్లవాడు తల యెత్తి నల్లని కిటికీ అద్దాలవైపు చూస్తున్నాడు.

ఆమె బట్టలు విప్పి, నేను ఆ తడి బట్టలు స్టౌమీదికి విసరివేసి, ఒక మూలన వున్న మట్టి వాష్‌స్టాండులో చేతులు కడుక్కున్నాను. నా చేతిగుడ్డతో చేతులు తడుచుకుంటూ పిల్లవానితో అన్నాను:

"సరే, యిక వస్తాను!"

పిల్లవాడు నావైపు చూసి కాస్త తడబడుతూ అన్నాడు:

"యిక లాంపు ఆర్పేసేదా?"

"నీ యిష్టం."

"వెళ్లిపోతున్నావా నీవు, పండుకోవూ?" అతను కృశించిన చేయి ఒకటి తన తల్లివైపు చూపినాడు.

"ఆమె పక్కన."

"యెందుకూ?" అన్నాను, యేమీ అర్థం కాక.

"నీకే తెలియాలి," అన్నాడు అతను నా గుండెలమీద గుద్దినట్లున్న అమాయకత్వంతో. అతను మళ్లీ అన్నాడు:

"అందరూ పండుకుంటారు."

తల కంపంపట్టి, చుట్టూ చూసినాను. నా కుడి పక్కన ముందుకు వచ్చిన అసహ్యపు స్టౌ వుంది; పొయ్యిమీద యెంగిలి పళ్లేలు వున్నాయి; జాజిచెక్కల పెట్టె వెనుక, ఒక మూల, తారు పూసిన తాళ్ల ముక్కలూ, ఒక పీచు కుప్ప, కట్టెలూ, కొయ్య ముక్కలూ, ఒక కర్రా వున్నాయి.

నా కాళ్లదగ్గర చాచి పడివుంది గురకలు తీసే పసుపురంగు శరీరం.

"కాసేపు నీపక్కన కూర్చుందునా?" అని అడిగినాను పిల్లవాణ్ని.

అతను ముఖం ముడుచుకొని అన్నాడు:

"ఆమె తెల్లవారిందాకా లేవదు, తెలుసు గదూ."

"ఓ, ఆమెతో నాకు పనిలేదు."

అతని పెట్టెపక్కన నేలమీద కూర్చొని, నేను అతని తల్లిని యెలా కలుసుకున్నదీ చెప్పినాను. నేను హాస్యంగా మాట్లాడడానికి ప్రయత్నించినాను:

"ఆమె బురదలో కూర్చొని పడవ నడప సాగింది, తెడ్లు వేస్తున్నట్లు, పాట పాడుతూ...."

అతను తల వూపినాడు, చిన్న బలహీనపు చిరునవ్వుతో, మరొకవైపు తన చిన్న రొమ్ము గీక్కుంటూ.

"తాగినందువల్ల అది. గెలివిగా వున్నప్పుడు కూడా తమాషాలు చేస్తుంది. చిన్న పిల్లలాగ...."

అతని కన్నులు నేను యిప్పుడు స్పష్టంగా చూడగలిగినాను — అవి నిజంగా కుచ్చులే, ఆశ్చర్యకరమైనంత పెద్ద వెంట్రుక లున్నాయి కనురెప్పలకు, రెప్పలమీద కూడా చిన్న వెంట్రుకలు దట్టంగా పెరిగినాయి. అతని కన్నులకింద వున్న నీలి నీడలు పాలిపోయిన చర్మంరంగును మరింత పాలిపోయినట్లు చేస్తున్నాయి. ముక్కుదూలానికి పైన ముడుతగల విశాలమైన నుదిటికిపైన యెర్రని ఉంగరాల జుట్టు ఒత్తుగా వుంది. శ్రద్ధగా, ప్రశాంతంగా వున్న ఆ కన్నులలోని భావం మాటలకు అందనిది. వాటి విచిత్ర మానవేతర భావాన్ని అలాగే నిలపడానికి నేను చేయగలిగిందంతా అదే.

"నీ కాళ్లకు యేమైంది?"

పాత పేలికలమధ్య తంటాలు పడి అతను ఒక కృశించిపోయిన కాలు బయట పెట్టినాడు; అది కడ్డీ లాగుంది. ఒక చేతితో దాన్ని యెత్తి పెట్టె అంచుమీద పెట్టినాడు.

"యెలా వున్నాయో చూసినావా? రెండూ, పుట్టుకతోనే అలా వున్నాయి. అవి నడవలేవు, వాటికి ప్రాణం లేదు — వట్టి దండుగమారివి...."

"మరి ఆ చిన్న పెట్టెల్లో యేమున్నాయి?"

"అది నా జంతుశాల," అన్నాడు అతను, కట్టె పుల్లను యెత్తినట్లు కాలును చేత్తో యెత్తి మళ్లీ పెట్టె అడుగున పాత పేలికల మధ్య దూరుస్తూ. తరువాత వికసించిన ముఖంతో, ఆప్యాయపు చిరునవ్వుతో అతను అన్నాడు:

"దాన్ని చూడాలని వుందా? అయితే సరిగా కూర్చో. అలాంటిది నీ జన్మలో యెప్పుడూ నీవు చూడలేదు."

దేహానికి మించి పొడవుగా వున్న సన్నని చేతులు చాకచక్యంగా కదలిస్తూ అతను లేచి షెల్ఫులమీద పెట్టెలు తీయసాగినాడు, ఒకటొకటే నాకు అందిస్తూ.

"జాగ్రత్త, వాటిని తెరవొద్దు, పారిపోతాయి అవి! చెవి దగ్గర పెట్టుకొని విను! యేం?"

"లోపల యేదో కదలుతున్నది."

"ఆహా. అది సాలెపురుగు, ఆ భడవ! దాని పేరు డ్రమ్మర్. అంతకంటె తెలివైనది వుండబోదు!"

ఆ అద్భుతమైన కన్నులు వెలిగిపోతున్నాయి, ఆ నీలిదాటు ముఖంమీద చిరునవ్వు చిందులు తొక్కుతున్నది. వడిగల చాకచక్యపు చేతులతో అతను పెట్టెలను షెల్ఫులమీదనుండి తీసి, తన చెవి దగ్గర పెట్టుకొని, తరువాత నా చెవి దగ్గర పెట్టి, ఉత్సాహంతో పొంగిపోతూ వ్యాఖ్యానం చేస్తున్నాడు:

"యిదిగో యిది బొద్దింక అనీసిమ్, జంబాలరాయడు, సిపాయిల్లాగా. యిది యీగ, దీని పేరు ఆఫీసర్‌గారి భార్య, గలీజుముండ. రోజంతా గీపెడుతూ వుంటుంది, అందరినీ తిడుతూ వుంటుంది, అమ్మను జుట్టుపట్టుకొని లాగింది కూడా. యీగ కాదు — రోడ్డవతల వున్న ఆఫీసర్‌గారి భార్య, యీగ ఆమెలాగా వున్న దంతే. మరి, యిది నల్ల బొద్దింక, పెద్ద గొప్ప బొద్దింక — పేరు యజమాని; చెడ్డవాడు కాదు, తాగుబోతు మాత్రమే, సిగ్గులేని వెధవ కూడా. ద్రావకం పుచ్చుకున్నాడంటే పెరట్లో బిత్తల ప్రాకుతాడు, ఒళ్లంతా బొచ్చే, నల్లకుక్కలాగా. యిదేమో పేడ పురుగు, నికొదీమ్ పెద్దనాన్న. అతన్ని బయట పట్టుకున్నాను. తీర్థయాత్రలు చేస్తున్నానని చెప్పుకుంటాడు, కానీ నిజానికి దొంగ. చర్చి కోసం డబ్బు వసూలు చేస్తున్నా డట; అమ్మ అతన్ని చీప్‌స్కేట్ అంటుంది; అతను కూడా ఆమె ప్రియుల్లో ఒకడు. ఆమెకు లెక్కలేనంతమంది ప్రియులు, చుట్టూ యీగల్లాగ, ఆమెకు ముక్కు లేకపోయినా."

"ఆమె నిన్ను కొడుతుందా?"

"యెవరు, ఆమా? భలేవానివే! నేను లేకుండా ఆమె బతకలేదు. చాలా దయగలది, యేమంటే తాగుబోతు — కానీ మరి మా వీధిలో అందరూ తాగుబోతులే. ఆమె అందంగా, ఆనందంగా వుంటుంది కూడా.... మితిమీరిన తాగుబోతు, బజారు లంజ! నే నంటాను ఆమెతో, తాగుడు వదిలెయ్, తిక్క మనిషీ, షావుకారు వౌతావు అని — కానీ ఆమె వూరక నవ్వుతుంది. వట్టి తెలివితక్కువది, యేం చేస్తుంది! కానీ ఆమె మంచిది, లేచినప్పుడు నీవు చూస్తావుగా!"

అతను ఆకర్షవంతంగా చిరునవ్వు నవ్వినాడు. ఆ చిరునవ్వు యెంత మనోహరంగా వుందంటే, నాకు వెక్కివెక్కి యేడవా లనిపించింది, పట్నం యావత్తూ వినేటట్లు బిగ్గరగా రోదించా లనిపించింది, సానుతాపంతో అంతగా నా గుండె తరుక్కుపోయింది. ఆ అందమైన తల ఆ సన్నని మెడమీద యేదో వింత పుష్పంలాగ ఊగింది. ఆ కన్నులు ఉత్సాహంతో అంతకంతకూ ప్రకాశవంతమై నన్ను దుర్నిరోధమైన శక్తితో ఆకర్షించినాయి.

శిశుసహజమైన, కానీ దారుణమైన, అతని వదరు మాటలు వింటూ కాసేపు నేను యెక్కడున్నదీ మరిచిపోయినాను. హఠాత్తుగా మళ్లీ స్పృహలోకి వచ్చినాయి బయట బురద చిందిన ఆ జైలులాంటి కిటికీ, ఆ స్టౌ నల్లని కడుపూ, మూలనున్న ఆ పీచూ, వాకిలిపంచన నూనెలాగ పసుపురంగు దిరిగిన పాతబట్టల కుప్పమీద వున్న ఆ తల్లి అనే మనిషి శరీరమూ.

"మంచి జంతుశాల, కదూ?" అన్నాడు పిల్లవాడు గర్వంగా.

"చాలా మంచిది."

"సీతాకోకచిలుకలు లేవనుకో — సీతాకోకచిలుకలూ, గొంగళి పురుగులూ."

"నీ పేరేమి?"

"ల్యోంక."

"నా పేరే."

"నిజంగా? నీ వెవరు?"

"ఓ, నే నెవరూ కాదు, వట్టి అనామకుణ్ని."

"ఆఁ, నన్ను నమ్మిస్తావ్? ప్రతి వొకరూ యెవరో ఒకరుగా వుంటారు. నాకు తెలుసు. నీవు మంచివానివి."

"కానేమో."

"నాకు కనపడుతున్నది. నీవు భయపడుతున్నావు కూడా."

"భయమా?"

"పందెం!"

రహస్యం తెలుసుకున్నట్లు చిరునవ్వు నవ్వి అతను నావైపు కన్ను గీటినాడు.

''నేను భయపడుతున్నా నని యెందు కనుకున్నావ్?''

''మరి, యిక్కడ నాతో కలిసి కూర్చున్నావు, రాత్రిపూట బయటికి పోడానికి భయపడుతున్నా వని అర్థమౌతున్నది.''

''కానీ యిప్పటికే తెల్లవారుతున్నది.''

''యిక వెళ్లిపోతావు.''

''మళ్లీ వస్తాను నిన్ను చూడడానికి.''

అతను నన్ను నమ్మలేదు. ఆ మనోహరమైన పాదలలాంటి కన్నులు తన రెప్పల వెంట్రుకలతో మూసినాడు అతను. ఒక క్షణం ఆగి అన్నాడు:

''యెందుకు?''

''నీతో కలిసి కూర్చోడానికి. నీవు చాలా ఆసక్తికరమైనవానివి. మళ్లీ రావచ్చునా?''

''దర్జాగా. యిక్కడికి అందరూ వస్తుంటారు.''

నిట్టూర్పుతో అతను మళ్లీ అన్నాడు:

''తమాషాకు అంటున్నావు.''

''కాదు. వస్తాను, నిజంగా వస్తాను!''

''సరే అయితే. కానీ నావద్దకు రా, అమ్మవద్దకు కాదు — యెవరి క్కావాలి ఆమె? మనం స్నేహితులంగా వుందాం, నీవూ నేనూ.''

''సరే.''

''అదీ. నీవు పెద్దవానివైనా పరవాలేదు. నీ కెన్నేండ్లు?''

''యిరవై యొకటి వస్తాయి.''

''నాకు పన్నెండు వస్తాయి. నాకు యెవరూ సవాసం లేరు, నీళ్ల మనిషి కూతురు కాత్కా తప్ప. కానీ వాళ్లమ్మ తంతుంది నన్ను చూడడానికి వస్తుందని. నీవు దొంగవా?''

''కాదు. దొంగ యెందుకు?''

''నీ ముఖం అంత వికారంగా వుంది, యెముకల గూడులాగా; పొడవైన ముక్కూ, సరిగ్గా దొంగల కున్నట్లు. యిక్కడ మా యింటికి యిద్దరు దొంగలు వస్తారు. ఒకడు సాష్క, మూర్ఖుడూ, రౌడీ. మరొకడు వానెచ్క — దయగలవాడు, కుక్కలాగా. నీ దగ్గర చిన్న పెట్టె లేమైనా వున్నాయా?''

''తెస్తానులే కొన్ని.''

''తే. నీవు వస్తావని అమ్మకు చెప్పను.''

''చెపితే యేం?''

''అదంతే. మగవాళ్లు మళ్లీ వస్తే అమ్మకు యెంతో సంతోషం. మగవాళ్లంటే ఆమెకు ప్రేమ. ఆడసరుకంటే — ఊహూఁ, సరిపడదు. మా అమ్మ వుందే, తమాషా అయిన

పిల్ల. ఆమెకు పద్దెనిమిదేండ్లు వున్నప్పుడు నేను కడుపున పడినాను. యెలా కడుపు అయిందో ఆమెకే తెలియదు. నీవు యెప్పు డొస్తావు?"

"రేపు సాయంత్రం."

"సాయంత్రాని కల్లా ఆమె తాగి వుంటుంది. దొంగతనం చేయకపోతే బతకడాని కేం చేస్తావు నీవు?"

"బవేరియన్ బీరు అమ్ముతాను."

"ఊహూం? నాకొక సీసా తెస్తావా?"

"ఓ, తప్పక. మరి, యిక వస్తాను."

"వెళ్లిరా. మళ్లీ వస్తావా?"

"తప్పక."

అతను పొడవైన చేతులు రెండూ చాపినాడు. ఆ సన్నని చల్లని చిన్న యెముకలు రెండూ నా చేతుల్లో పట్టుకొని కరచాలనం చేసినాను. వెనక్కి తిరిగి చూడకుండా యెగ్రబాకి బయటి ఆవరణలోకి వచ్చినాను, తాగిన మనిషిలాగా.

తెల్లవారుతున్నది. శిథిల భవనాల తడి కుప్పమీద వణుకుతూ మరణించే వేగు చుక్క వ్రేలాడుతున్నది. బేస్‌మెంటు కిటికీల చౌకం కన్నులు — తాగుబోతు కన్నుల్లాగా కాంతిహీనంగా, మకిలిగా వున్నవి — యింటి గోడకింద వున్న బురద రంధ్రంలోనుండి నావైపు నిలజూస్తున్నాయి. గేటు పక్కన బండిలో ఒక యెర్ర ముఖం మనిషి నిద్రపోతున్నాడు, బట్టలులేని పెద్ద కాళ్లు దూరదూరంగా బారచాపుకొని; దట్టంగా పెరిగిన అతని బిరుసు గడ్డం ఆకాశంలోకి పొడుచుకొని వుంది — ఆ గడ్డంలో తెల్లని పండ్లు మెరుస్తున్నాయి, ఆ మనిషి కండ్లు మూసుకొని భూతంలాగ వెటకారంగా నవ్వుతున్నట్లు. ఒక ముసలి కుక్క — వీపున కొంత భాగం బొచ్చు లేనిది, కాలే నీళ్లవలన కలిగిన బొబ్బమచ్చలాగుంది అది — నా దగ్గరకు వచ్చి, నా కాళ్లు మూచూసి, ఆకలిమంటతో కుసిలించింది, పిలవని పేరంటంలాగ వచ్చిన జాలితో నా గుండెను నింపుతూ.

వీధుల్లోని మడుగులు, తెల్లవార్లూ తేరి, ఉదయాకాశాన్ని ప్రతిబింబిస్తున్నాయి; నీలి ప్రతిబింబాలూ, అరుణ ప్రతిబింబాలూ ఆ మురికి మడుగులకు ఒక బాధాకరమైన, అనవసరమైన, ఆత్మకు తికమక కలిగించే సౌందర్యం యిస్తున్నాయి.

మరుదినం కొన్ని తుమ్మెదలనూ, సీతాకోకచిలుకలనూ పట్టుకొమ్మని మా వీధిలోని పిల్లలతో చెప్పినాను. మందుల షాపులో సొగసైన చిన్న పెట్టెలు కొన్ని కొన్నాను. సాయంత్రం ల్యోంకను చూడడానికి పోయినాను, ఒక సీసా బీరూ, మిఠాయిలూ, బన్నులూ కూడా తీసుకొని.

అవధులు లేని అబ్బురపాటుతో స్వీకరించినాడు నా బహుమతులు ల్యోంక, కన్నులు పెద్దవి చేసుకొని, పగటి వెలుతురులో మరింత అందంగా చేసుకొని.

"ఓహో!" అన్నాడు అతను, నిండు కంఠంతో, చిన్న పిల్లలకు అసహజమైన విధంగా. "యేమిటిదంతా! లక్షాధికారివా యేమిటి? లక్షాధికారి వెలా ఔతావ్ — అంత సాదా దుస్తులు వేసుకున్నావ్, దొంగనూ కాదంటావ్? ఓ, యెంత అందమైన పెట్టెలు! వాటిని ముట్టుకో డానికి కూడా నాకు భయమౌతున్నది, చేతులు కడుక్కోలేదు. యేమి టది అందులో? ఓ, ఓ, యెంత పెద్ద తుమ్మెద! అంతా రాగిరంగు, పచ్చగా కూడా వుంది — ఓ, హో! పరుగెత్తి యెగిరిపోదా మనుకున్నావా? అదంతా కుదరదు."

హఠాత్తుగా అతను ఉల్లాసంగా కేకవేసినాడు:

"అమ్మా! యిలా రావే, వచ్చి నా చేతులు కడుగు. యితను యేమి తెచ్చినాడో యిలా చూడు. రాత్రి వచ్చి నిన్ను యింట్లో పడేసినాడే, బీటు పోలీసులాగా, అతను. యితను పేరు కూడా ల్యోంకయే."

"ఆయనకు థాంక్స్ చెప్పు," వింత ప్రశాంత కంఠం నా వెనుకనుండి వినిపించింది.

పిల్లవాడు చురుకుగా తల ఆడించినాడు:

"థాంక్యూ, థాంక్యూ!"

ఆ బేస్‌మెంటు గదిలో పీచులాంటి ధూళి దట్టంగా మేఘంలాగ కమ్ముకుంది. ఆ ధూళిగుండా, స్టౌమీద, బూసిబూసిగా కనపడుతున్నది ఆ స్త్రీ చిక్కని జుట్టూ, విరూపం చెందిన ముఖమూ, చిత్తరువులో లాగ చెదరని అప్రయత్నపు చిరునవ్వులో బయటపడిన పండ్ల నిగనిగలూ.

"గుడ్ మార్నింగ్!" అన్నాను.

"గుడ్ మార్నింగ్," అని ఆమె బదులు చెప్పింది. ఆమె ముక్కిడి కంఠం ప్రశాంతంగా, సంతుష్టిగా, దాదాపు ఉల్లాసంగా వుంది. ఆమె కండ్లు రిక్కబెట్టి నావైపు చూస్తున్నది, హాస్య మాడుతున్నట్లు.

ల్యోంక నన్ను మరిచిపోయి, ఒక తేనె కేకు నములుతూ, పెట్టెలు జాగ్రత్తగా మూత తీస్తూ, తనలో తాను గొణుక్కుంటున్నాడు. అతని రెప్పల వెంట్రుకల నీడ చెక్కిళ్లమీద పడి కనులకింద నీలిమను మరింత స్పష్టపరిచింది. ముసలివాని ముఖంలాగ సూర్యుడు కిటికీ అద్దాల గుండా మసక మసకగా చూస్తున్నాడు. పిల్లవాని లేతయెరుపు జుట్టుమీద మృదువైన యెండ పడుతున్నది. గొంతు దగ్గర అతని చొక్కా తెరచుకొని వుంది; చర్మాన్నీ, కనపడీ కనపడని చనుమొననూ పైకి ఆడిస్తూ, సన్నని యెముకల వెనుక అతని గుండె కొట్టుకోవడం నాకు వినపడుతున్నది.

అతని తల్లి స్టౌ దిగి, వాష్‌స్టాండు కింద ఒక టవల్ తడిపి, ల్యోంకవద్దకు వచ్చి, అతని యెడమ చేయి తన చేతిలోకి తీసుకొంది.

"వాడు పారిపోయినాడు, వుండు, వాడు పారిపోయినాడు!" అంటూ అతను అరిచినాడు, తన పెట్టెలో గింజుకుంటూ, ఒళ్లంతా సుడి తిరుగుతూ, తన కింద పాత బట్టలు చెల్లాచెదరు చేస్తూ, వివర్ణమైన, చలనం లేని కాళ్లు కనపడేటట్లు. ఆమె నవ్వింది, పాత బట్టల మధ్య తారాడుతూ.

"పట్టుకో!" అరిచింది ఆమె.

తుమ్మెదను పట్టుకొని ఆమె తన అరచేతిలో పెట్టుకొని, నీలిరంగు గల తన చిలిపి కన్నులతో పరిశీలనగా చూసి, పాత నేస్తంతో మాట్లాడుతున్నట్లు నాతో యిలా అన్నది:

"మా దగ్గర యిలాంటివి చాలా వున్నాయి."

"పచ్చడి చెయ్యొద్దు దాన్ని," అన్నాడు ఆమె కొడుకు హెచ్చరికగా. "ఒకసారి కైపులో వున్నప్పుడు ఆమె నా జంతుశాలమీద కూర్చొని యెన్నింటినో పచ్చడి చేసింది."

"అది మరిచిపో, నా బంగారూ."

"వాటిని పూడ్చిపెట్టినాను, కుప్పలు కుప్పలు."

"తరువాత నీకు మరికొన్ని పట్టుకొని తెచ్చినాను, తేలేదూ?"

"యేమి లాభం! నీవు పచ్చడి చేసినవి ప్రెయినింగు పొందినవి, మట్టిబుర్రా. అవి చచ్చినప్పుడు వాటిని స్టౌకింద పూడ్చిపెడతాను — పెట్టెలోనుండి బరిగాడుతూ పోయి వాటిని పూడ్చిపెడతాను — అక్కడ శ్మశానం వుంది. తెలుసునా, ఒకసారి నాదగ్గర ఒక సాలెపురుగు వుండింది, మీంక అని, అమ్మ ప్రియుల్లో ఒక డున్నాడులే అలాగ — పాత వాడులే, యిప్పుడు జైల్లో వున్నాడు, లావుగా, హుషారైనవాడు —"

"ఓ, నా బంగారు కొండ," అన్నది ఆమె, పిల్లవాని ఉంగరాల జుట్టును తన చిన్న, రాగిరంగు, మొద్దు వేళ్ల చేతితో నిమురుతూ. తరువాత తన మోచేత్తో నన్ను పొడుస్తూ, నవ్వు కన్నులతో యిలా అన్నది:

"బాగున్నాడు కదూ, నా కొడుకు? యేమి కండ్లు, ఔనా?"

"ఒక కన్ను తీసుకొని నాకు కాళ్లివ్వు," పండ్లు యికిలిస్తూ ల్యోంక అన్నాడు, తుమ్మెదను పరిశీలిస్తూ. "యినుము లాగుంది. బలిసింది. ఆ సన్యాసిలాగ; అమ్మా — నీవు నిచ్చెన అల్లి యిచ్చినావే అతను — జ్ఞాపక ముందీ?"

"జ్ఞాపకం లేకేం."

నవ్వుతూ ఆమె ఆ కథ చెప్ప నారంభించింది.

"ఒక రోజు ఒక సన్యాసి వూడిపడినాడు యింట్లోకి, యేనుగంత మనిషి, వచ్చి

అన్నాడు, 'నీవు తాళ్లు వూడదీసే మనిషివి – మరి నాకొక తాటి నిచ్చెన చేసిస్తావా?' నా జన్మలో నేనెప్పుడూ అలాంటి నిచ్చెన్ల మాట వినలేదు. కాదన్నాను, నాచేత కాదన్నాను. 'నేను నేర్పుతాను,' అన్నాడు అతను. అంటూ కోటు తీసినాడు, నీవు నమ్ముతావో లేదో గాని, మొత్తం కడుపు చుట్టూ సన్నని తాడు చుట్టి వుంది, పొడుగాటి గట్టి తాటి చుట్ట. నాకు నేర్పినాడు అతను. నిచ్చెన అల్లుతూ నాకు ఆలోచన కలిగింది: సరే, అతనికి యెందు కిది? చర్చిలో దొంగతనం చేయడాని కేమో?''

ఆమె నవ్వింది. కొడుకు భుజం చుట్టూ చేయి వేసి, ఆ భుజం నిమురుతూ వుంది.

''చిత్రమైన మనుషులు! వాయిదా నాడు సరిగ్గా వచ్చినాడు అతను. నే నన్నాను: అయ్యా, యిది దొంగతనం చేయడాని కైతే, అదేమీ నా దగ్గర కుదరదు. కానీ అతను నవ్వినాడు, జిత్తులమారి నవ్వులాగా. నవ్వి అన్నాడు, 'కాదు, యిది గోడ యెక్కడానికి. పెద్ద యెత్తైన గోడ వుంది, మే ముండే చోట. మరి మేము పాపాత్ములం, సరిగ్గా గోడ కవతల పాపం నివసిస్తున్నది – అర్థమైందా?' అప్పు డొప్పుకున్నాను. అతని కది కావలసింది రాత్రిపూట ఆడవాళ్ల వేట కన్నమాట. యేమి నవ్వుకున్నాంలే, అతనూ నేనూ.''

''నీకు నవ్వు అంటే యిష్టంలే, బలే యిష్టం,'' అన్నాడు పిల్లవాడు, పెద్దవాళ్ల ధోరణిలో. ''సమొవార్ వేడి చేయవా.''

''చక్కెర లేదు.''

''పోయి కొనుక్కురా.''

''డబ్బుకూడా లేదు.''

''హుఁ, నీ తాగుడు కొంప ముంచింది! యితని దగ్గర తీసుకో.''

నావైపు తిరిగి అన్నాడు అతను:

''డబ్బేమైనా వుందా?''

నేను ఆమెకు కొంత డబ్బు యిచ్చినాను. ఆమె హుషారుగా యెగిరి నిలబడి, ఒక చిన్న, నొక్కులుపోయిన, మరకల సమొవార్ స్టౌమీదనుండి తీసుకొని, గొంతులోనే రాగం తీస్తూ బయటికి పోయింది.

''అమ్మా!'' పిల్లవాడు ఆమె వెనుక కేకవేసినాడు. ''ఆ కిటికీ కడుగు. నా కేమీ కనిపించడం లేదు! హుషారైన మనిషి, యేమనుకున్నావో!'' అతను చెప్పకపోయినాడు, పురుగుల పెట్టెలు జాగ్రత్తగా షెల్ఫులమీద పెడుతూ. షెల్ఫులు అట్టవి, చెమ్మ యెక్కిన గోడలో యిటుకల మధ్య కొట్టిన చీలలకు దారాలతో వ్రేలగట్టబడినాయి. ''కష్టపడి పనిచేస్తుంది కూడా. తాళ్లు పీచు దీయడం మొదలుపెడితే వూపిరాడదు. కొంపంతా దుమ్మే. నేను యేడుస్తాను: అమ్మా బయటికి తీసుకపోవే, నీకు పుణ్యముంటుంది,

యిక్కడ వూపిరాడక చస్తాను. ఆమె అంటుంది, కాస్త ఓర్చుకో, నాకు తోడుగా వుండు, అని. ఆమెకు నేనంటే ప్రేమ, సందేహం లేదు! ఆమె పనిచేస్తూ పాటలు పాడుతుంది, వేలకొద్దీ పాటలు వచ్చు, వేలకొద్దీ.''

అతను ఉత్సాహంతో ఉప్పొంగినాడు, ఆ అద్భుతమైన కన్నులు తళతళ మెరుస్తున్నాయి, ఆ దట్టమైన కనుబొమలు పైకి లేచినాయి, అతను బొంగురు ఉచ్చ కంఠంతో పాట ప్రారంభించినాడు:

''అదుగో అక్కడ సోఫాలో
పడుకొని వున్నది సోఫీ....''

కాసేపు విని నే నన్నాను:

''అది మంచి పాట కాదు.''

''అన్నీ అంతే,'' ల్యోంక నాకు నమ్మకంగా చెప్పినాడు, తరువాత హఠాత్తుగా ఉలికిపడినట్లు అన్నాడు: ''అదుగో, సంగీతం వచ్చింది! త్వరగా, నన్ను పైకెత్తు.''

నేను ఆ తేలికైన చిన్న యెముకల గూడును, పల్చని బూడిదరంగు శరీరపు సంచిలో వున్నదాన్ని, పైకెత్తినాను. ఆత్రంగా అతను తెరచిన కిటికీగుండా తల బయటికి దూర్చినాడు, అక్కడ బొమ్మలాగ నిశ్చలంగా వుండిపోయినాడు, ఆ నవిసిపోయిన కాళ్ళు గోడమీదుగా, దీనంగా, కింద ఊగులాడుతున్నాయి. బయట ఒక వీధి ఆర్గన్ యేదో పాటను కర్ణ కఠోరంగా కక్కేస్తున్నది, ఒక కీచుగొంతు పిల్లవాడు ఆనందంతో కేకలు వేస్తున్నాడు, ఒక కుక్క ప్రశాంతంగా మొరుగుతున్నది. ల్యోంక యీ సంగీతం వింటూ, ఆ రాగానికి అనుగుణంగా తనలో తాను మృదువుగా ఆలాపన చేస్తున్నాడు.

బేస్‌మెంటులో దుమ్ము అణిగి, వెలుతురు కొంచెం యెక్కింది. ఆమె పరుపుకుపైన గోడకు ఒక చౌక గడియారం తగిలించి వుంది; దాని పెండూలం, అర్ధ రూపాయి పరిమాణం గలది, బూడిదరంగు గోడమీద కుంటుతూ పారాడుతున్నది. పొయ్యిమీద యెంగిలి తట్టలు కడగలేదు. ప్రతిదానిమీదా మందంగా దుమ్ము కప్పుకుంది, అన్నిటికంటె దట్టంగా మూలల్లో మురికి చింపిరి పాతల్లా వ్రేలాడుతున్న సాలెగూళ్ళమీద. ల్యోంక నివాసం ధూళి బొరియను పోలి వుంది; దాని ప్రతి అంగుళంనుండీ మితిలేని వికారపు మురికితనం సిగ్గు విడిచి నీ ముఖంలోకి నిలజూస్తుంది.

సమొవార్ విషాదంగా ఆలాపన చేయసాగింది. దానికి భయపడినట్లు వీధి ఆర్గన్ నోరు మూసుకుంది. ఒక బొంగురు గొంతు కోపంగా చీదరించింది:

''అల్లరి మూక!''

''నన్ను కిందికి తీసుకపో,'' అన్నాడు ల్యోంక, నిట్టూరుస్తూ. ''అతన్ని తరిమేసినారు.''

నేను అతన్ని పెట్టెలో కూర్చోపెట్టినాను. అతను బాధతో ముఖం చిట్లించి, చేతులతో రొమ్ము రుద్దుకున్నాడు, జాగ్రత్తగా దగ్గుతూ.

"రొమ్ములో నొప్పి. అసలైన గాలి చాలాసేపు పీల్చుకుంటే నాకు పడదు. సరేగాని, యెప్పుడైనా దయ్యాలను చూసినావా?"

"లేదు."

"నేనూ చూళ్లేదు. దయ్యాలు వస్తాయేమో అని రాత్రిపూట స్టౌకింద చూస్తూ వుంటాను. యెప్పుడూ రాలేదు. దయ్యాలు స్మశానాల్లో వుంటాయి, కదూ?"

"దయ్యాలతో నీకేంపని?"

"ఆసక్తికరంగా వుంటాయి. దయ్యాలలో ఒకటైనా మంచి దయ్యం కావచ్చు గదా? నీళ్లు మోసేవాళ్ల పిల్ల కాత్కా సామాన్ల గదిలో దయ్యం పిల్లను చూసి జడుసుకుంది. భయంకరమైనవి చూస్తే నాకు భయం లేదు."

అతను తన కాళ్ల చుట్టూ పాత బట్టలు సర్ది, వడివడిగా చెప్పుకుపోయినాడు:

"నాకు యిష్టం కూడా — భయంకరమైన కలలు నాకు యిష్టం, నిజం. నా కొకసారి చెట్టుకు పైన వేర్లు మొలిచినట్లు కల వచ్చింది — ఆకులు నేలమీద వున్నాయి, వేర్లు పైన ఆకాశంలోకి చాచుకున్నాయి. ఒళ్లంతా చెమటతో, భయపడి మెలకువ వచ్చింది. మరొకసారి కలలో అమ్మ బట్టలు లేకుండా పండుకుంది, ఒక కుక్క ఆమె కడుపును పీక్కతింటున్నది. ఒక ముక్క కొరుకుతుంది, బయటికి ఉమ్మేస్తుంది, మళ్లీ యింకో ముక్క కొరుకుతుంది, ఊమ్మేస్తుంది. మరోసారి మా యిల్లు వూడలాక్కొని వీధిలో స్వారిచేస్తూ పోయింది, వాకిలి తలుపులూ, కిటికీ తలుపులూ ధణధణ లాడినాయి, ఆ ఆఫీసర్‌గారి భార్య పిల్లి దాని వెంటబడింది...."

అతను వణుకుతున్నట్లు తన పల్చని భుజాలు కదిలించి, ఒక మిఠాయి తీసుకొని, దానికి చుట్టిన రంగు కాగితం విప్పి, దాన్ని జాగ్రత్తగా సాపుచేసి కిటికీలో పెట్టినాడు.

"యీ కాగితాలతో నేను మంచి మంచి వస్తువులు తయారుచేస్తాను. లేదా వీటిని కాత్కాకు యిస్తాను. ఆ పిల్లకు కూడా మంచి మంచి వస్తువు లంటే యిష్టం — గాజు ముక్కలూ, పెంకులూ, కాగితాలూ, అలాంటివి. అది సరే గాని, తుమ్మెదకు బాగా తిండి పెడుతూ పెడుతూ పోతే గుర్రమంత ఔతుంది కదూ?"

స్పష్టంగా అతను యిది నమ్ముతున్నాడు. అందుకని నే నన్నాను:

"బాగా తిండి పెడితే ఔతుంది."

"ఓ, నిజంగా!" అతను కేకవేసినాడు, సంతోషం పట్టలేక. "మరి అమ్మ వూరక నవ్వుతుంది, తెలివితక్కువ కుంక!"

ఆ మాటకు ఒక పాడు తిట్టు కలిపినాడు అతను.

"ఆమెకు తెలివి లేదు. పిల్లికి తిండి పెడితే యింకా త్వరగా గుర్రమంత ఔతుంది కదా?"

"ఓ, తప్పక."

"తిండి నాదగ్గరలేదు, ఖర్మ. వుంటేనా, బ్రహ్మాండం!"

అతను ఉద్వేగంతో బిగుసుకపోయినాడు, చేతితో రొమ్ము గట్టిగా పట్టుకున్నాడు.

"యీగలు కుక్కంతవి ఆడుతూ పోతాయి. మరి బొద్దింకతో యిటుకబండ్లు లాగించవచ్చు – గుర్రమంతే వుంటే అది బలంగా వుంటుంది కదూ!"

"యిబ్బంది యేమిటంటే, వాటికి మీసా లుంటాయి."

"పరవాలేదు. మీసాలను పగ్గాలుగా చేసుకోవచ్చు. లేదా, ప్రాకే సాలెపురుగును తీసుకో – లావుగా, యెంత పెద్దదంటే... యెంత పెద్ద దబ్బా? అయినా, పిల్లికంటె పెద్దదైతే బాగుండదు, అసహ్యంగా వుంటుంది! నాకు కాళ్లుంటే బాగుండు, యేది యెలా చేయాల్సిందీ చూపించేవాణ్ని. యమకష్టం చేసి, నా జంతువుల కన్నిటికీ తిండిపెట్టేవాణ్ని. అంగడి పెట్టేవాణ్ని, తరువాత అమ్మకు పొలంలో యిల్లు కొనిపెట్టేవాణ్ని. నీ వెప్పుడైనా పొలం చూసినావా?"

"ఓ, చూసినాను."

"యెలా వుంటుంది చెప్పు?"

నేను పొలాలను గురించీ, పచ్చికబీళ్లను గురించీ అతనికి చెప్పసాగినాను. అంతరాయం కలిగించకుండా అతను శ్రద్ధగా వింటున్నాడు. అతని కనురెప్పల వెంట్రుకలు కనులమీదికి వ్రాలినాయి, అతనికి నిద్ర వస్తున్నట్లు. యిది చూసి నేను గొంతు తగ్గించినాను. కానీ యింతలో అతని తల్లి లోపలికి వచ్చింది, ఉడుకుతున్న సమొవార్‌తోనూ, చేతికింద ఒక కాగితం పొట్లంతోనూ, కోటుకిందనుండి నిక్కబొడుచుకున్న వోడ్కా సీసాతోనూ.

"వచ్చేసినాను!"

"విన్నా వటే," నిట్టూర్చినాడు పిల్లవాడు, విప్పారిన కన్నులతో. "అంతా గడ్డీ, పూలే. అమ్మా, యెక్కడైనా తోపుడుబండి తెచ్చి నన్ను బయటికి పొలంలోకి తీసుకపోలేవూ! పొలం చూడకుండా యిలాగే చచ్చిపోతాను. నీవు వట్టి మొద్దువే అమ్మా, నిజంగా!" అంటూ, విషాదంగా, నొప్పిపడిన కంఠంతో ముగించినాడు అతను.

తల్లి దయగా అన్నది:

"తిట్టకూడదు. నీ వింకా చిన్నవానివి."

"నీకేం, తిట్టవద్దంటావు – నీ యిష్టం వచ్చిన చోటికి పోతావు, కుక్కలాగా. నీవు అదృష్టవంతురాలివి." నావైపు తిరిగి అతను అన్నాడు: "అది సరేగాని, పొలం చేసింది దేవుడేనా?"

''దేవుడే ననుకుంటాను.''

''యెందుకు?''

''మనుషులు షికారు పోడానికి.''

''ఆరు బయట పొలం,'' అన్నాడు పిల్లవాడు, కాంక్షాభారపు చిరునవ్వుతో. ''నా జంతుశాలను అక్కడికి తీసుకపోయి, అన్నిటినీ వదలిపెట్టేస్తాను, తప్పక. హాయిగా వుండనీ అవి, నా పెంపుడు జంతువులు. మరి, దేవుణ్ని దేవాలయంలో తయారుచేస్తారా?''

అతని తల్లి యిల్లెగిరపోయేటట్లు గొల్లుమనింది, నవ్వుతో ఊగిపోతూ. నవ్వు పట్టలేక పరుపుమీద పడిపోయి, కాళ్ళు తన్నుకుంటూ, కేకలు వేసింది:

''హోహో, నన్ను పైకి మోసుకపోండి యెవరైనా! హో, నా బంగారు తండ్రి! హో, యెంత నవ్వు తెప్పించినాడు!''

ల్యోంక ఆమెవైపు చిరునవ్వుతో చూసి, అపేక్షగా ఒక బూతు తిట్టు తిట్టినాడు.

''కడుపు కుట్టుపట్టుకునేటట్లు నవ్వుతుంది, పసిపిల్లల మాదిరే! ఆమెకు నవ్వు లంటే యిష్టం, బలే యిష్టం.''

ఆ బూతు తిట్టు మళ్లీ వాడినాడు అతను.

''నవ్వనీలే,'' అన్నాను నేను. ''నవ్వితే నీకేమీ యిబ్బంది లేదు కదా?''

''లేదు, నాకేమీ యిబ్బంది లేదు. నా కోపమల్లా ఆమె కిటికీ కడగనప్పుడే. యెప్పుడూ ప్రాథేయపడుతుంటాను, కిటికీ కడుగు, యెండ అనేది కంటబడడం లేదు, అని. కానీ ఆమె యెప్పుడూ మరిచిపోతూనే వుంటుంది.''

ఆమె టీ కప్పులు కడుగుతూ, ముసిముసినవ్వు నవ్వి, నావైపు చూసి మిలమిలలాడే నీలి కన్ను గీటింది.

''నా బాబు రత్నాల రాసి కదూ, దేవుని చలువవల్ల? వీడు లేకపోతే యెప్పుడో యే యేట్లోనో పడి చచ్చేదాన్ని, నిజంగా. లేదా వురి పోసుకునేదాన్ని.''

యీ మాట చిరునవ్వుతో అన్నది ఆమె.

వున్నట్టుండి ల్యోంక అడిగినాడు:

''నీవు తెలివితక్కువవానివా?''

''యేమో, నాకు తెలియదు. యేం?''

''అమ్మ అన్నది నీవు తెలివితక్కువవాని వని.''

''ఔను, అన్నాను. మరి యెందు కన్నానని?'' ఆమె ఉద్వేగం ప్రకటించింది, అతని మాటలకు జంకుపడకుండా. ''తాగిన ఆడమనిషిని వీధిలోనుండి తీసుకొచ్చినాడు, పరుపుమీద

పండుకోబెట్టి వెళ్లిపోయినాడు, అలాగే వూరక! నే నామాట కసితో అనలేదు. యెంత చాడీల కోరువురా, హుఁ!''

ఆమె కూడా పసిపిల్లలలాగే మాట్లాడింది, ఆమె మాట్లాడిన వైనం చిన్నపిల్లలా గుంది. ఆమె కన్నులుకూడా పసిపిల్ల కన్నుల్లా స్వచ్ఛంగా వున్నాయి — ఆ ముక్కులేని ముఖంలో, పండ్లు కనపడేటట్లు పైకి లేచిన పై పెదవిపక్కన ఆ కన్నులు మరీ వికారంగా వున్నాయి. మూర్తీభవించిన క్రూర వికట హాసమో, ఉల్లాసపు అవహేళనో అన్నట్లు.

''సరే, టీ తాగుదాం'' అన్నది ఆమె ప్రశాంత గంభీరంగా.

ల్యోంక పక్కన వున్న మరొక పెట్టెమీద సమొవార్ వుంది, దాని నొక్కులు పడిన మూతకిందనుండి చిలిపిగా వచ్చే ఆవిరి ధార అతని భుజానికి తగులుతున్నది. చేయి ఆ భుజంమీద పెట్టి, అరచేయి తడి ఔతూనే, అది జుట్టుకు తుడుచుకున్నాడు అతను, కలగంటున్న వానిలాగా పరధ్యానపు చూపుతో.

''నేను పెద్దవాణ్నైనాక అమ్మ నాకు తోపుడుబండి చేసిస్తుంది. వీధుల్లో బరిగాడుతూ అడుక్కుంటాను. కావలసి నంత అడుక్కున్నాక, పొలంలోకి బరుగుతూపోతాను,'' అన్నాడు అతను.

''ఓహోహో,'' ఆమె నిట్టూర్చి, మరు క్షణమే మృదువుగా నవ్వింది. ''పొలమంటే స్వర్గ మనుకున్నాడు, బంగారు బుజ్జి! అక్కడ వుండే దల్లా గుడారాలూ, సిగ్గు విడిచిన సిపాయిలూ, తాగుబోతులూ.''

''కాదు, అదేం కాదు,'' ల్యోంక అడ్డుపడినాడు ఆమెకు, ముఖం చిట్లిస్తూ. ''యిత న్నడుగు, పొలం యెలా వుంటుందో, యితను చూసినాడు.''

''నేనూ చూసినాను.''

''తాగినప్పుడు.''

వాదించుకోవడం మొదలుపెట్టినారు వాళ్లు, అచ్చం చిన్నపిల్లల్లాగా. చిన్నపిల్లల్లాగే ఆవేశపూరితంగా, అర్థంపర్థం లేకుండా. యింతలో వెచ్చగా సాయంత్ర మయింది. యెర్ర బడుతున్న ఆకాశంలో ఒక దట్టమైన మేఘం, నీలిమించిన ముదురు బూడిదరంగుది, నిశ్చలంగా వుంది. బేస్‌మెంటులో చీక టయింది.

పిల్లవాడు ఒక మగ్గు టీ తాగినాడు, చెమట పట్టింది అతనికి. నావైపు చూసి, తరువాత ఆమెవైపు చూసి, అన్నాడు అతను:

''నాకు కడుపు నిండింది, నిద్ర కూడా వస్తున్నది, నిజంగా....''

''నిద్రపో అయితే,'' తల్లి సలహా యిచ్చింది.

''మరి అతను వెళ్లిపోతాడు! వెళ్లిపోతావా?''

“భయం లేదులే, నేను వెళ్లనివ్వను,” అన్నది ఆమె, నన్ను మోకాలితో పొడుస్తూ.

“వెళ్లిపోవద్దు,” అన్నాడు ల్యోంక. అతను కండ్లు మూసుకొని, సుఖంగా ఒళ్లు సాచి, తన పెట్టెలోకి యెగిరి కూర్చున్నాడు. తరువాత హఠాత్తుగా తల యెత్తి, తల్లితో యిలా అన్నాడు, మందలింపుగా:

“నీ వెందుకు యితన్ని పెండ్లిచేసుకోకూడదు, ఆడవా ళ్లందరిలాగ, యెవరో యెల్లయ్యతోనూ, పుల్లయ్యతోనూ తంటాలుపడడంకంటె – వాళ్లు నిన్ను వూరక కొడతారు. యితను మంచివాడు, నిజంగా మంచివాడు....”

“నిద్రపో,” అన్నది ఆమె మృదువుగా, తాను టీ తాగుతున్న సాసర్ మీదికి వంగుతూ.

“యితనికి డబ్బు కూడా వుంది.”

ఒక నిముషం ఆమె మౌనంగా వుంది, వికారపు పెదవులతో టీ తాగుతూ, తరువాత నాతో యిలా అన్నది, పాత పరిచయస్తునితో మాట్లాడుతున్నట్లు:

“యిలా బతుకుతున్నా మన్నమాట, యెలాగో నెట్టుకొస్తూ, వీడూ నేనూ, మరెవ్వరూ లేకుండా. బయట ఆవరణలోనివాళ్లు నన్ను తిడతారు, చెడిపోయిన మనిషి నంటారు. అయితే యేం? నాకు సిగ్గుపడవలసిం దేమీ లేదు. పైగా, నా ముఖం చూడు, పైపాటున దెబ్బ తిన్న సరుకును నేను. యెవరికైనా కనపడుతుంది నేను దేనికి పనికొచ్చేదీ. ఆఁ, వీడు నిద్రపోయినాడు, నా బంగారు బాబు. నా బాబు మంచివాడు కదా?

“ఔను. చాలా మంచివాడు!”

“వీణ్ని కండ్లారా చూసినట్లే వుండదు నాకు. తెలివిపరుడు కూడా, కదూ?”

“మంచి వివేకవంతుడు.”

“నీవు గమనించినావు. వీని తండ్రి గౌరవస్తుడు, వయసుమీరినవాడు. అతను ఒక – వాళ్లను యేమంటారు? వాళ్లకు ఆఫీసు వుంటుంది చూడు. కాగితాలు రాస్తారు.”

“నోటరీయా?”

“ఆఁ, అదీ! మంచి పెద్దమనిషి. దయగలవాడు. అతనికి నేనంటే ప్రేమ. నేను వాళ్లింట్లో పనిమనిషిగా వుండినాను.”

ఆమె పిల్లవాని వుత్త కాళ్లను పాతబట్టలతో కప్పింది, తలకింద దిండులాగా వున్న ఆ నల్లని వస్తువును సర్దింది. తరువాత సాఫీ అయిన కంఠంతో మళ్లీ చెప్పసాగింది:

“అతను హఠాత్తుగా చచ్చిపోయినాడు. రాత్రిపూట జరిగింది అది, నేను వాళ్లింటి నుండి వచ్చిన కాసేపటికి. నేలమీద పడిపోయినాడు, అలాగే ప్రాణం వదలి పడిపోయినాడు. నీవు వ్యాపారం చేస్తున్నా వన్నమాట – బీరు వ్యాపారం?”

"ఔను."

"సొంతమా?"

"కాదు. ఒక షావుకారుకింద."

ఆమె నాకు దగ్గరగా జరిగి అన్నది:

"నా విషయంలో మీరేమీ నీతకాలకు పోనక్కరలేదు. నాకేమీ జబ్బులు లేవు, యీ వీధిలో యెవర్నైనా అడగండి, నా సంగతి అందరికీ తెలుసు."

"నాకు నీతకాలు లేవు."

ఆమె తన చిన్న చేయి, కరకువారిన వ్రేళ్లతో, ముక్కలు పోయిన గోళ్లతో, నా మోకాలిమీద పెట్టి, నిండు మనస్సుతో అన్నది:

"ల్యోంక విషయంగా మీకు నేను చాలా కృతజ్ఞురాలిని — అతని కీనాడు నిజంగా పండగ దినం. మీరు చేసిన పని చాలా మంచి పని."

"యిక పోవాలి," అన్నాను.

"యెక్కడికి?" అన్నది ఆమె, ఆశ్చర్యపడి.

"పని వుంది, చూసుకోవాలి."

"వుండిపోండి!"

"వీల్లేదు."

ఆమె తన కొడుకువైపు చూసింది, తరువాత కిటికీవైపూ, ఆకాశంవైపూ చూసింది, ప్రశాంతంగా అన్నది:

"యెందు కుండిపోకూడదు? నా ముఖాన్ని కర్చీఫ్‌తో కప్పుకుంటాను. నా కొడుకుకోసం మీకు నేను కృతజ్ఞత తెలపాలని వుంది. ముసుగు కప్పుకుంటాను, యేం?"

కడుపులోపలినుండి వచ్చిన ఆప్యాయతతో, నిష్కపటమైన ఆర్ద్ర హృదయంతో మాట్లాడింది ఆమె. ఆమె కన్నులు — విరూపం చెందిన ముఖంలోని ఆ పసిపిల్లల కన్నులు — చిరునవ్వు నవ్వినాయి, బిచ్చగాళ్ల చిరునవ్వు కాదు, కృతజ్ఞతా రుణం తీర్చుకోగల భాగ్యవంతుల చిరునవ్వు.

"అమ్మా!" హఠాత్తుగా అరిచినాడు పిల్లవాడు, ఉలిక్కిపడి లేచికూర్చొని. "అవి ప్రాకుతున్నాయి, త్వరగా లే అమ్మా!"

"కలవరిస్తున్నాడు," అన్నది ఆమె నాతో, తన కొడుకుమీదికి వంగుతూ.

నేను లేచి బయటి ఆవరణలోకి పోయి నిలబడినాను, ఆలోచనలో మునిగిపోయి. తెరచిన బేస్‌మెంటు కిటికీ గుండా ఒక పాట బిగ్గరగా ప్రవహించింది, తల్లి కొడుకుకు పాడే జోలపాట. ఉత్సాహభరితమైన ముక్కిడి స్వరాలతో పాడుతున్న పాట అది; పాటలోని వింత మాటలు స్పష్టంగా ఉచ్చరింపబడుతున్నాయి:

"కడుపులో చెయిపెట్టి కలచినట్లుండే
బాధలూ వేదనలు ముసురుకొనుచుండే
యెన్నని చెప్పేది కడగండ్లూ
గుండెనూ కోసేటి రంపాలూ
అగచాట్లమారి యీ పాపిష్టి బతుకూ
పారిపోదా మన్న దారి కనరాదూ!"

వడివడిగా అడుగులు వేస్తూ ఆవరణ దాటిపోయినాను, పొంగి వచ్చే యేడుపును ఆపుకోడానికి పటపట పండ్లు నూరుతూ.

1913

# ఒక మానవుని జననం*

1892 కరువు సంవత్సరం — సుహూంకూ, ఒచెమ్‌చీరీకి మధ్య — కొదోర్ నది ఒడ్డున — సముద్రానికి చేతివేటు దూరంలో — తళతళ మెరిసే కొండ సెలయేటి ఉల్లాసపు కలకల నాదాన్ని మించి, తీరాన్ని ఒరుసుకునే సముద్రపు అలల గలగల స్పష్టంగా వినవచ్చు.

శరదృతువు. చెర్రీ లారెల్ చెట్ల పండుటాకులు కొదోర్ నది తెల్లని నురుగులో, చాకచక్యం గల చేపల్లాగ, సుడిదిరుగుతూ, పురకలువేస్తూ వున్నాయి. నేను నది ఒడ్డున రాళ్లలో కూర్చొని, కొంగలూ, కాక్మొరంతులూ కూడా బహుశా ఆకులను చేపలుగా భ్రమించి, ఆశాభంగం పొందుతున్నాయని అనుకుంటూ వున్నాను — అందుకే అవి అక్కడ, కుడి వైపున, చెట్ల కవతల, ఒడ్డును సముద్రం ఒరుసుకునే చోట, అంత బాధగా అరుస్తున్నాయి.

తలమీద చెస్ట్‌నట్ చెట్లు బంగారు సొమ్ములు పెట్టుకున్నాయి, నా కాళ్లవద్ద యెన్నో ఆకులు పడి వున్నాయి, మనుషుల ముంజేతులనుండి ఖండింపబడిన హస్తాల లాగ కనిపిస్తూ. అవతలి వొడ్డున హార్న్‌బీమ్ కొమ్మలు అప్పుడే బోడివై, చినిగిన వలలాగ గాలిలో వ్రేలాడుతున్నాయి. ఆ వలలోపల, అందులో చిక్కుకున్నట్లు, ఒక పసుపు యెరుపు రంగుల కొండ వడ్రంగి పిట్ట యెగురుతూ, తన నల్లని ముక్కుతో చెట్టు బోదె బెరడును పొడుస్తున్నది, పురుగులను బయటికి తరమడానికి; ఆ పురుగులను వెంటనే దిగమింగుతున్నాయి సుదూర ఉత్తరంనుండి వచ్చిన అతిథులు — హుషారైన చిన్న టామ్‌టిట్‌లూ, బూడిదరంగు నట్‌హేచ్‌లూ.

నా యెడమ వైపు, కొండ పేటులకు ఆనుకొని నల్లని మేఘాలు వ్రేలాడుతున్నాయి, వర్షం కురవబోయేటట్లు. వాటి నీడలు పచ్చని కొండ దరులమీద ప్రాకుతున్నాయి; ఆ దరులలో యెండిపోయినట్లు కనిపించే బాక్స్‌వుడ్ చెట్లు పెరిగినాయి, పురాతనమైన బీచ్,

---

* యీ కథ గోర్కీ జీవితంలోని ఒక ఘటనమీద ఆధారపడింది. 1892 వేసవి అంత్యకాలంలో గోర్కీ కాకసస్‌లో, సుహూం — నొవొరొస్సీయిస్క్ రోడ్డు నిర్మాణంలో పనిచేసినాడు. అక్కడ, ఒక నిర్మానుష్యమైన దారిలో నొప్పులు పడుతున్న స్త్రీ ఒకామె ఆయనకు తటస్థపడింది. ఆమెకు కాన్పు చేసినాడు ఆయన. — సం.

లిండెన్ చెట్ల తొర్రలలో అడవి తేనె దొరుకుతుంది — రోమ్ కాలంలో ఆ తేనె పాంపే సైనికులను దాదాపు తలకిందులు చేసింది, దాని తీయని కైపుతో మొత్తం ఒక లీజియన్ అంతా పడిపోయినారు. తేనె టీగలు లారెల్, అజాలియా పూలనుండి తయారు చేస్తాయి ఆ తేనెను, బాటసారులు చెట్ల తొర్రలలోనుండి దాన్ని తీసుకొని, గోధుమతో చేసే పల్చని లావాష్ రొట్టెలకు పూసుకొని తింటారు.

నేను చేస్తూ వుండిన పని సరిగ్గా అదే, చెస్ట్‌నట్ చెట్లకింద రాళ్లమీద కూర్చొని, ఒక కోపిష్టి తేనె టీగ వేసిన కాట్లను రుద్దుకుంటూ. తేనె నింపిన టీ సాసులో బ్రెడ్డు ముక్కలు ముంచి తింటున్నాను, అలసట చెందిన శరత్కాలపు సూర్యుని విలాస క్రీడలను చూసి ఆనందిస్తూ.

శరదృతువులో కాకసస్ ఒక గొప్ప వైభవోపేతమైన చర్చిలా గుంటుంది, గొప్ప జ్ఞానులు — వాళ్లు విధిగా గొప్ప పాతకులు కూడా — తమ గతాన్ని అంతరాత్మ నిశిత దృక్కులనుండి దాచుకోడానికి కట్టిన చర్చిలా గుంటుంది; బంగారూ, పచ్చలూ, నీలాలూ పొదిగిన విస్తారమైన దేవళంలా గుంటుంది; సమర్కాండ్, షెమాహాలలోని తుర్కీయులు పట్టుతో నేసిన మహా నాజూకైన రత్నకంబళాలు పరిచిన పర్వత సానువులతో. వాళ్లు ప్రపంచాన్నంతా దోచుకొని తెచ్చిన కొల్లసొమ్ము సూర్యుని ముందర వుంచినారు, సూర్యునికి అర్పణ చేస్తూ:

"భవదీయం — భవజ్జనితం — భవదర్థం!"

...పెద్ద గడ్డాల, తెల్ల జుట్టు బృహత్కాయులు చురుకైన చిన్న పిల్లల లాగ వికసించిన నేత్రాలతో పర్వతాలమీదనుండి కిందికి దిగిరావడం నాకు కనిపించింది; వాళ్లు భూమిని అలంకరిస్తూ, రంగురంగుల సంపదలను తమ దండి చేతులతో వెదజల్లుతూ, పర్వతాగ్రాలను మందమైన వెండి పొరలతో కప్పుతూ, వివిధ వృక్షాల జీవద్వస్త్రాలను కొండ చరియలకు కట్టబెట్టుతూ వస్తున్నారు — వాళ్ల చేతికింద యీ పుణ్యభూఖండం అనిర్వచనీయ సౌందర్యం సంపాయించుకుంది.

యెంత అద్భుతమైన పదవి — యీ ప్రపంచంలో మానవునిది! యెంత అద్భుతమైన వస్తు సంపద కనపడుతుంది, హృదయాన్ని చలింప జేసే సౌందర్యం కలిగించే నిశ్చలానందం యెంత తీయగా గుండెను పిండుతుంది!

నిజమే, ఒకోసారి కష్టంగా వుంటుంది. గుండెలో ద్వేష జ్వాలలు చెలరేగుతాయి, దుఃఖం తీరని ఆశతో హృదయ రక్తం పీలుస్తుంది, కానీ యిది శాశ్వతంగా వుండదు. తరుచుగా సూర్యుడు కూడా యెంతో విషాద దృక్కులు బరపుతాడు మానవులమీద: తాను వాళ్లకోసం యెంతో శ్రమపడినాడు, కానీ యెంత దౌర్భాగ్యపు మూకగా తయారైనారు వాళ్లు....

కొంతమంది మంచివాళ్లు వున్నారు, సహజమే అది, కానీ వాళ్లను బాగుచెయ్యాలి, లేదా పునర్నిర్మాణం చెయ్యాలి.

...నా యెడమ పక్క పొదలపైన అటూ యిటూ కదిలే నల్లని తలలు కనపడుతున్నాయి. సముద్ర తీరపు గుసగుసలమధ్య, నది గళగరింపుల మధ్య మానవ కంఠాలు సవసవగా వినపడుతున్నాయి. అవి "కరువు పీడితు"లవి, వాళ్లు సుహూంలో రోడ్డు నిర్మిస్తూవుండినారు, యిప్పుడు ఒచెమ్‌చీరీకి పోతున్నారు, అక్కడ మళ్లీ పని దొరుకుతుందనే ఆశతో.

వాళ్లు నాకు తెలుసు — వాళ్లది ఒరేల్. వాళ్లతో కలిసి నేను పనిచేసినాను. మొన్న మాకు డబ్బు యిచ్చేసి పొమ్మన్నారు. నేను వాళ్లకంటె ముందు, రాత్రిపూట బయలుదేరినాను, సూర్యోదయం చూడడానికి సముద్రతీరం చేరుకునేటట్లు.

వాళ్లు అయిదుమంది వుండినారు — నలుగురు రైతులూ, యెత్తు బొమికలు గల ఒక రైతు యువతీ. ఆమె గర్భిణి; పెద్ద కడుపు పైకి తోసుకొని వచ్చింది, రెప్పవేయక చూసే ఆమె లేత నీలి కన్నుల్లో భయం కనిపించేది. పసుపు రంగు కర్చీఫ్‌లో ఆమె తల పొదలపైన వూగుతూ నాకు కనిపిస్తున్నది, వికసించే పొద్దు తిరుగుడు పూవు గాలిలో వూగినట్లు. ఆమె మగడు సుహూంలో మరణించినాడు — పండ్లు మితిమీరి తిని. నేను వీళ్లతో కలసి ఒకే గుడిసెలో వుండినాను: పాత రష్యన్ సంప్రదాయానికి అనుగుణంగా వాళ్లు తమ కష్టాలను యెంతగానో, యెంతో బిగ్గరగా చెప్పుకునేవాళ్లు, వాళ్ల మొత్తుకోళ్లు మూడు మైళ్ల దూరం వినిపించి వుంటాయి.

వీళ్లు మొద్దు మనుషులు, శనిదేవత కాలి కింద నలిగి, కృశించి నీరసించి పోయిన తమ పుట్టిన గడ్డనుండి పెకలింపబడి, గాలి కాలపు పండు టాకుల్లాగ యిక్కడికి కొట్టుకవచ్చినవాళ్లు. యీ వింత సంపన్మయ వాతావరణానికి వాళ్లు కండ్లు చెదిరి, నివ్వెర పోయినారు, యిక్కడి కష్టమైన పనితో పూర్తిగా కొయ్యబారిపోయినారు. వాళ్లు తమ మసకబారిన దిగులు కన్నులు పులపొడుస్తూ ప్రతిదాన్నీ దిగ్భ్రాంతితో చూసేవాళ్లు, ఒకరివైపు ఒకరు జాలిగా చిరునవ్వు నవ్వుతూ, నీరస కంఠాలతో మాట్లాడుకునేవాళ్లు:

"ఓ, యేమి భూమి!"

"బంగారు పండే భూమి!"

"అయినా, కాస్త గరువు నేల...."

"సుఖం లేని భూమి, మొత్తానికి...."

వాళ్లకు తమ సొంత వూర్లు జ్ఞాపకం వచ్చేవి—కొబిలీ లోగ్, సుహోయ్ గోన్, మ్రొకెంకొయె — ప్రతి పిడికెడు మట్టిలోనూ తమ తాతముత్తాతల బూడిద కలిసిన వూర్లు — ప్రతిదీ మనసులో నాటుకొని, తమకు పరిచితమై, ప్రీతిపాత్రమై, ప్రతిదీ తమ చెమటతో తడిసిన వూర్లు.

వాళ్లతో కలిసి అక్కడ మరొక స్త్రీ వుండేది – యెత్తుగా, నిటారుగా, పెద్ద దవడలతో, కొయ్యపలక లాగ చదునైన రొమ్ముతో, బొగ్గులాగ నల్లగా వున్న, కాంతిలేని మెల్ల కండ్లతో.

సాయంత్రం పూట ఆమె, పసుపు కర్చీఫ్ స్త్రీతో కలిసి, గుడిసె వెనుక కొంత దూరం పోయి, రాళ్ల కుప్పమీద కూర్చొని, చేతిమీద చెంప మోపి, తల ఒక పక్కకు వాల్చి, కోపిష్టి గొంతు యెత్తి పాడేది:

"వూరి శ్మశానం ఆవలనూ
పచ్చపచ్చనీ పొదల మాటునా
బంగరు కాంతుల యిసుక తిన్నెపై
నా తెల్లని శాలువ పరిచెదనూ.
అక్కడ కూర్చుంటాను
నా ప్రియతము డొచ్చిందాకా
ఆతడు అచటికి రాగానే
ఆహ్వానిస్తా హృదయంతో...."

పసుపు కర్చీఫ్‌ల మనిషి సాధారణంగా మౌనంగా వుండేది, మెడ వంచి తన కడుపువైపు చూసుకుంటూ. ఒకోసారి ఆమె కూడా కలిసేది, పాటలోని విషాదపూరితమైన మాటలను బొంగురు, యీడుపు, మగ గొంతుతో పాడుతూ:

"ఓ ప్రియతమా,
నా హృదయమా,
నాకిక లేనే లేదా
మళ్లీ నిను గను రాతా...."

దక్షిణాది రాత్రుల వూపిరాడనీని నల్లని చీకటిలో యీ శోక కంఠాలు వింటుంటే ఉత్తరాది మంచు యెడారులూ, హుంకరించే మంచు తుఫానులూ, తోడేళ్ల దూరపు కూతలూ జ్ఞాపకం వస్తాయి....

తరువాత మెల్ల కంటి స్త్రీ జ్వరంతో పడిపోయింది. ఆమెను స్ట్రెచర్‌మీద పట్టణానికి తీసుకపోయినారు. దానిమీద ఆమె వణుకుతూ యేడ్చింది, వూరి శ్మశానం గురించీ, బంగరు కాంతుల యిసుక తిన్నె గురించీ పాట పాడుతూనే వుందా అన్నట్లు.

...కర్చీఫ్ తల వంగి అదృశ్యమైంది.

నేను తిండి ముగించి, పావులోని తేనెను ఆకులతో కప్పి, సంచి భుజానికి

తగిలించుకొని, వాళ్లు పోయే దారిలోనే తీరికగా బయలుదేరినాను, కార్నెల్ చేతికర్ర గట్టి నేలమీద టకటకలాడిస్తూ.

నేను ఆ యిరుకు బూడిదరంగు రోడ్డుమీద పోతూవుండినాను. నా కుడివైపు ముదురు నీలపు సముద్రం పైకీ కిందికీ యెగుర్లాడుతున్నది. అదృశ్యంగా వున్న వడ్రంగులు వేలకొలది తోపడాలతో సముద్రంమీద పనిచేస్తున్నట్లు వుంది ఆ దృశ్యం; తోపడా పొట్టు గాలికి కొట్టుకొని పోతున్నది బీచివైపు, గలగల మంటూ; ఆ గాలి తడిగా, వెచ్చగా, సువాసనగా వుంది, ఆరోగ్యంగల స్త్రీ ఊరుపులాగ. ఒక టర్కిష్ ఫెలుకా, రేవువైపు వంగి, నీళ్లలో సరసరపోతున్నది, సుహూం చేరుకోడానికి; దాని తెరచాపలు సుహూంలోని ఆర్భాటపు ఇంజనీరు వూదు చెక్కిళ్లలాగ ఉబ్బుకొని వున్నాయి — అతను చాలా ముఖ్యమైనవాడు. యెందుకనో అతను అక్షరాలు తేలబలికేవాడు.

"నోరు మూషుకో! తెలివిపరుణ్నని హనుకున్నా వేమో, చిటికెలో పోలీస్ స్టేషన్‌కు పంపించేస్తాను!"

మనుషులను పోలీస్ స్టేషన్‌కు పంపించడం అతనికి యిష్టం. యిప్పటికల్లా గోరీలోని పురుగులు అతన్ని యెముకల దాకా శుభ్రం చేసి వుంటాయనే ఆలోచన హాయిగా వుంది.

...నడక సుఖంగా వుంది, గాలిలో తేలిపోతున్నట్లుంది. ఆహ్లాదకరమైన ఆలోచనలూ, రంగురంగుల స్మృతులూ మనసులో మెల్లగా నృత్యం చేస్తున్నాయి. నాలోపల నృత్యం చేసే ఆకారాలు సముద్రంలోని అలల్లాగ వున్నాయి — పైన తెల్లని శిఖరాలతో, లోపల లోతుల్లో ప్రశాంతంగా; అక్కడ యవ్వనపు ఉజ్వల ఉల్లాసపూరిత ఆశలు నిబ్బరంగా యీదుతున్నాయి, ఉప్పనీటి లోతుల్లో తళతళ మెరిసే చేపల్లాగ.

రోడ్డు సముద్ర తీరంవైపు పోతున్నది, అలలు ఒరుసుకునే యిసుక పీకకు అంతకంతకూ దగ్గరౌతూ. పొదలు కూడా సముద్రాన్ని చూడాలని ఉబలాటపడుతున్నట్లుంది, రిబ్బన్ లాంటి రోడ్డుమీదికి వంగి, అపార నీల జలార్ణవంవైపు మెడలు సాచుతున్నాయి.

పర్వతాలమీదనుండి గాలి వీస్తూ వుండింది — వర్షం వచ్చే సూచన.

...పొదలలోనుండి మెల్లని మూలుగు వినిపించింది — మనిషి మూలుగు, యెప్పుడైనా మనుషుల గుండెలను కదిలించేది.

నేను పొదలు పక్కకు తొలగించి చూసినాను, పసుపు కర్చీఫ్ స్త్రీ కనిపించింది. ఆమె వాల్‌నట్ చెట్టు బోదెకు ఆనుకొని వుంది, తల భుజంమీదికి వాలి వుంది, నోరు వికృతంగా వుంది, కండ్లు ఉబికి పిచ్చిగా వున్నాయి. తన పెద్ద పొట్టమీద చేతులు పెట్టుకొని, పొట్ట యెగిరెగిరి పడేటంత మహా అసహజంగా ఆమె వూపిరి యెగపోసుకొంటున్నది, పొట్ట చేతులతో పట్టుకొని, తోడేలు లాగ పసుపురంగు పండ్లు వెళ్లబెట్టి, మూలుగుతున్నది.

"యేమిటిది? యెవరైనా కొట్టినారా నిన్ను?" నేను అడిగినాను, ఆమెమీదికి వంగుతూ. ఆమె ఆ బూడిదరంగు దుమ్ములో తన వుత్త కాళ్లు వూకించినట్లు కదిలించి, తన బరువైన తల తిప్పుతూ గసపెట్టింది:

"వెళ్లిపో.... సిగ్గు లేదూ, వెళ్లిపో...."

అప్పుడు అర్థమైంది నాకు అదేమైందీ — అంతకు ముందొకసారి చూసినాను అది. సహజంగానే నేను భయపడి వెనక్కి వురికినాను. కానీ ఆమె బిగ్గరగా, దీర్ఘంగా కేకలు వేయసాగింది. ఆమె కండ్లు తలకాయలోనుండి బయటికి వెళ్లబొడుచుకొని వచ్చినట్లున్నాయి. ఆ కండ్లలో కన్నీరు పొంగి, ఉబ్బి బిగిసిన ముఖంమీద కారుతున్నది.

యిది చూసి నేను మళ్లీ ఆమె దగ్గరికి పోయినాను. నా సంచీ, కెటిలూ, టీ పావూ నేలమీద పడవేసి, ఆమెను నేలమీద సాచి వెలకిల పండబెట్టి, ఆమె మోకాళ్లు వంచబోతుండగా, ఆమె నన్ను పక్కకు తోసి, నా ముఖంమీదా, రొమ్ముమీదా కొట్టి, అటుతిరిగి దోగాడుతూ పొదల్లోకి పోయింది, ఆడ యెలుగు లాగ గురగుర మంటూ, గర్జిస్తూ:

"సైతాన్! పశువు!"

ఆమె చేతులు సచ్చుబడి బోర్లపడింది, ముఖం నేలకు కొట్టుకుంది. ఆమె మళ్లీ కేకలు ప్రారంభించింది, కాళ్లు వూకించి సాచుతూ.

ఆ ఉద్వేగపు అలజడిలో ఆ వ్యవహారం గురించి నాకు తెలిసిందంతా వేగంగా జ్ఞాపకం చేసుకున్నాను. ఆమెను వెలకిల దిప్పి, ఆమెకాళ్లు మడిచినాను — పిండం పైపొర అప్పటికే వెలుపలికి వచ్చింది.

"కదలకుండా వుండు, వచ్చేస్తున్నది."

నేను బీచికి పరుగెత్తుకుంటూ పోయి, చొక్కా చేతులు పైకి మడిచి, చేతులు కడుక్కొని, మంత్రసాని పని చేయడానికి తిరిగి వచ్చినాను.

మంటలో బేర్చ్ తాటలాగ ఆమె విలవిల లాడుతున్నది. ఆమె తన చుట్టూ నేలమీద చేతులతో కొట్టుతూ, వాడిపోయిన గడ్డి గంటలు పెరికి, నోట్లో దురుక్కోడానికి ప్రయత్నిస్తున్నది; ఆ ప్రయత్నంలో ఆమె యెరుపెక్కిన పిచ్చి కండ్లు గల తన వికృత భయంకరమైన ముఖంమీద మట్టి పోసుకుంది. యింతలో పైపొర పగిలి శిశువు తల కనిపించింది. నేను ఆమె కాళ్లు విలవిల తన్నుకోకుండా పట్టుకోవలసి వచ్చింది, శిశువు బయటికి రావడానికి తోడ్పడవలసి వచ్చింది, యేడ్చే వంకర నోట్లో ఆమె గడ్డి దురుక్కోకుండా చూడవలసి వచ్చింది.

మేము ఒకరినొకరం కాస్త తిట్టుకున్నాం — ఆమె పండ్లు యీలకరిచి తిట్టింది,

నేను మెల్లగా తిట్టినాను; ఆమె బాధతోనూ, బహుశా సిగ్గుతోనూ తిట్టింది, నేను దిక్కు తెలియకపోవడంతోనూ, అపారమైన సానుభూతితోనూ తిట్టినాను.

"తండ్రీ!" ఆమె గసపోసుకుంది, నల్లబడిన, నురుగు నిండిన పెదవులు కొరుక్కుంటూ; యెండలో హఠాత్తుగా రంగు వెలిసినట్లున్న ఆమె కన్నులనుండి నీళ్లు దుమికినాయి, దుర్భరమైన ప్రసూతి వేదనలో తల్లి కడవలతో కార్చే కన్నీళ్లు; ఆమె దేహమంతా ముక్కలు ముక్కలుగా చీలుస్తున్నట్లు, బిగుసుకొనిపోయింది.

"పో... వెళ్లిపో... సైతాన్!"

వడ దిరిగిన చేతులతో ఆమె నన్ను తోస్తూ వుండింది. నేను నిండు మనస్సుతో అన్నాను:

"మతి పోగొట్టుకోవద్దు! త్వరగా కానీ, ఐపోతుంది."

నాకు ఆమెపట్ల యెనలేని పరితాపం కలిగింది, ఆమె కన్నీళ్లు నా కన్నులలోనుండే దుముకుతున్నట్లున్నాయి. ఆవేదనతో నాగుండె వ్రీలిపోయింది. నాకు యేడుపు వచ్చేటట్లుంది. నిజానికి యేడుస్తూ కేకవేసినాను:

"ఊఁ! కానీ!"

అంతే — నా చేతుల్లో ఒక మానవుడు వున్నాడు — యెర్రని బుల్లి మానవుడు. కన్నీళ్లతో నా కండ్లు మసకలు గమ్మినా, వాణ్ని చూడగలిగినాను — ఒళ్లంతా యెర్రగా, ప్రపంచంపట్ల అప్పుడే అసంతృప్తి చెంది, తన్నుకుంటూ, కొట్టుకుంటూ, గొంతెత్తి అరుస్తున్నాడు, యింకా తల్లికి బంధింపబడి వున్నప్పటికీ. వానికి నీలి కండ్లు వున్నాయి, నలిగిపోయిన యెర్రని ముఖంమీద తమాషా అయిన చిన్న ముక్కు అణగదోసినట్లుంది, వాడు వేసే కేకలకు పెదవులు కదలుతున్నాయి:

"యా-ఆ-ఆ.... యా-ఆ-ఆ...."

వాడు బంక బంకగా వున్నాడు, నా చేతుల్లోనుండి జారిపోతాడేమో అని నాకు భయమైంది. నేను మోకాళ్లమీద కూర్చొని వాణ్ని చూస్తూ నవ్వుతున్నాను — వాణ్ని చూడడం అంత సంతోషంగా వుంది నాకు. ఆ సంతోషంలో తరువాత చేయవలసిన పని పూర్తిగా మరిచిపోయినాను.

"తాడు కోసెయ్...." తల్లి గుసగుస చెప్పింది; ఆమె కండ్లు మూసుకొనివుంది, ముఖం వాడిపోయి, తెల్లగా వుంది శవంలాగ. నల్లబడిన పెదవులు కదిలీ కదలనట్లుగా ఆమె మళ్లీ అన్నది:

"కోసెయ్... కత్తితో."

నా కత్తి ఆ గుడిసెలో యెవరో దొంగిలించినారు; కనుక బొడ్డు తాడును పండ్లతో కొరికినాను. పసివాడు భీకరగ మేళంలాగ అరిచినాడు. తల్లి చిరునవ్వు నవ్వింది. ఆమె

కన్నుల చీకటి లోతుల్లో అపూర్వంగా నీలి దీపాలు వెలగడం కనిపించింది నాకు. నల్లబారిన ఆమె చేయి స్కర్టులో జేబు కోసం తారాడింది. కాట్లు పడి రక్తం చిమ్మిన పెదవుల సందున ఆయాసంగా మాటలు వెలువడినాయి:

"నాకు... శక్తిలేదు.... నా జేబులో... టేపుముక్క వుంది.... బొడ్డు... ముడెయ్."

నేనా టేపుముక్క వెదకి పసివాని బొడ్డు ముడివేసినాను. ఆమె మరింత చిక్కగా చిరునవ్వు నవ్వింది, ఆ ముఖంలోని ఆనందమూ, వెలుగూ దాదాపు నా కండ్లకు మిరుమిట్లు గొలిపినాయి.

"నీవు సర్దుకో, యింతలో నేను వీణ్ని తుడుచుకొని వస్తాను."

ఆమె ఆందోళనతో గుసగుస చెప్పింది:

"జాగ్రత్త. మెల్లగా తుడువు. జాగ్రత్తగా."

ఆ యెర్రని బుల్లి మానవ శకలంతో మెల్లగా వ్యవహరించవలసిన అవసరం లేకపోయింది. వాడు పిడికిళ్లు బిగించి అరవ సాగినాడు, నన్ను యుద్ధానికి రమ్మని సవాల్ చేస్తున్నట్లు:

"యా-ఆ-ఆ!"

"అదీ, అలా వుండాలి! నీ హక్కులు నీవు స్థాపించుకోవాలి భయ్యా! లేకపోతే నీ చుట్టూ వున్న జనం నీ పీక నులిమేస్తారు."

ఒక అల వచ్చి నా యిద్దరిమీదా యెగిరి పడింది. దాని తుంపురులు తాకినప్పుడు వాడు మరీ బిగ్గరగా, అత్యంత మనస్ఫూర్తిగా కేకలు వేసినాడు. తరువాత, నేను వాని రొమ్మూ, వీపూ తట్టసాగినప్పుడు వాడు కనుబొమలు ముడివేసి, అలలు ఒకటొకటే వానిమీద పొర్లినప్పుడు తన్నుకుంటూ అరవసాగినాడు.

"అరువు భయ్యా, అరువు! దిక్కులు దద్దరిల్లేటట్లు అరువు!"

మేము అతని తల్లివద్దకు చేరుకునేటప్పటికి ఆమె కండ్లు మూసుకొని నేలమీద పండుకొని వుంది; ప్రసవానంతరపు నొప్పులతో ఆమె పెదవులు కొరుక్కుంటూ వుంది; మూల్గుల, నిట్టూర్పుల మధ్య ఆమె వీరసపు గుసగుస వినపడింది:

"పిల్లవాణ్ని... యిలా యివ్వు...."

"పిల్లవాని కేం తొందర లేదులే."

"యిలా యివ్వు!"

వణికే చేతులతో ఆమె తారాడుతూ జాకెట్ విప్పకో సాగింది. ఆమె రొమ్ముమీది బట్టలు తొలగించడంలో నేను తోడ్పడినాను. ఆ రొమ్ము యిరవైమంది పసిబిడ్డలను సాకడానికి తగినంతగా ప్రకృతి తయారు చేసింది. కేకలు వేసే ఆ ఒరేల్ వాస్తవ్యుని నేను ఆమె వెచ్చని దేహానికి ఆనించినాను. వాడు వెంటనే గ్రహించి, యేడుపు మానినాడు.

"తల్లీ, మేరీమాతా," మెత్తగా అన్నది ఆమె, వణుకుతూ, సంచిమీద వున్న చింపిరి తలను అటూ యిటూ తిప్పుతూ.

హఠాత్తుగా ఆమె మెల్లగా కేకవేసి, మళ్లీ కండ్లు తెరిచింది, పవిత్రమైన, అనిర్వచనీయ సౌందర్య విలసితమైన మాతృత్వపు కండ్లు. ఆ నీలి కండ్లు పైకి నీలి ఆకాశంలోకి చూసినాయి. సంతోషభరమైన, కృతజ్ఞతాభరమైన చిరునవ్వు ఆ కండ్లలో మెరిసి లీనమైపోయింది. బరువుగా చేయి యెత్తి ఆమె శిలువ గుర్తు వేసుకుంది, తనకూ బిడ్డకూ వేసింది.

"భగవంతుని గన్న తల్లీ... మేరీమాతా...."

ఆమె కండ్లు కాంతి తగ్గినాయి, ఆమె చాలా సేపు మౌనంగా వుండిపోయింది, దాదాపు వూపిరి కూడా పీల్చకుండా. తరువాత వ్యవహార ధోరణిలో, దృఢమైన కంఠంతో ఆమె అన్నది:

"నా సంచి విప్పు, బాబూ."

నేను సంచి ముడి విప్పినాను. ఆమె లీలగా చిరునవ్వు నవ్వుతూ, నావైపు నిశ్చలంగా చూసింది. ఆమె గుంత చెక్కిళ్లూ, చెమట పట్టిన నొసలూ యెర్రబారినట్లు తోచింది నాకు.

"ఒక నిముషం పక్కకు పో."

"శ్రమ పడవద్దు."

"సరేలే. పక్కకు పో."

నేను పొదల మాటుకు పోయినాను. నా గుండె అలసిపోయింది, నా రొమ్ములో చిలిపి పకులు పాడుతున్నట్లుంది. యిదీ, సముద్రపు నిరంతర మర్మర ధ్వనీ యెంతో హాయిగా వున్నాయి, ఒక సంవత్సర మంతా అలాగే వింటూ వుండవచ్చు ననిపించింది.

దగ్గరలోనే యెక్కడో సెలయేటి గలగల వినిపించింది. ఆడపిల్ల తన ప్రియుణ్ని గురించి చెలికత్తెతో చెప్పుతున్నట్లుంది అది.

పొదల పైన తల లేచింది, పసుపు కర్చీఫ్ మట్టసంగా కట్టుకొని.

"అదేమిటి? యింత తొందరగా లేచినావు?"

ఒక పొద కొమ్మలు పట్టుకొని ఆమె కూర్చుంది; ఆమె ముఖ మంతా పాలిపోయింది, ఆమె ప్రాణమంతా తోడేసినట్లు. కండ్లకు బదులు రెండు పెద్ద నీలి సరస్సులు వున్నాయి అక్కడ. చిరునవ్వు నవ్వుతూ, సుకుమారమైన అనుభూతి నిండిన కంఠంతో ఆమె అన్నది:

"చూడు, యెలా నిద్రపోతున్నాడో."

వాడు బాగానే నిద్రపోతున్నాడు. కానీ, నాకు తెలిసినంత వరకు, పసిబిడ్డ లందరిలాగే. భేద మేమైనా వుంటే పరిసరాలలో వుంది: వాడు తళతళ మెరిసే శరత్కాలపు

ఆకుల కుప్పమీద, ఒక పొదకింద పండుకున్నాడు, అలాంటి పొదలు ఒరేల్ ప్రాంతంలో పెరగవు.

"నీవు పండుకుంటే మంచిది, అమ్మా," అన్నాను.

"లేదు," అన్న దామె నీరసంగా తల ఆడిస్తూ. "సర్దుకొని బయలుదేరాలి ఆ వూరు — అదేదీ?"

"ఒచెమ్‌చీరీ?"

"ఆఁ. మావాళ్లు యిప్పటికే కొన్ని మైళ్లు ముందు పోయివుంటారు."

"నడిచి పోతానంటా వేమిటి?"

"మేరీమాత లేదూ? ఆమె తోడ్పడుతుంది."

సరే, మేరీమాత ఆమెకు తోడు వుంది గనుక, నేను నోరు మూసుకున్నాను!

ఆమె ఆ ముడుచుకున్న చిన్న ముఖంవైపు నిశ్చలంగా చూసింది, కండ్లలో హార్దికమైన మెత్తని కాంతి పుంజాలు కళకళలాడుతూ. ఆమె పెదవులు నాక్కుంది, చేత్తో మెల్లగా తన రొమ్ము నిమురుకుంది.

నేను ఒక మంట ముట్టించి, చుట్టూ రాళ్లు అమర్చినాను, వాటిమీద కెటిల్ పెట్టడానికి.

"నిముషంలో నీకు కాస్త టీ తయారుచేస్తాను, అమ్మా."

'ఓ, చెయ్! నా రొమ్ములో అంతా యెండిపోయింది."

"మీవాళ్లు నిన్ను యెందుకు వదిలేసినారు?"

"లేదు, వదిలేయలేదు. నేను వెనుక బడిపోయినాను. వాళ్లు కాస్త తాగినారు... అది మంచిదే అయింది. వాళ్లు నావెంట వున్నప్పుడు యిది జరిగివుంటే యెలా వుండేదో."

ఆమె నావైపు చూసి, ముఖానికి మోచేయి అడ్డం పెట్టుకుంది. తరువాత రక్తంతో సహా యెంగిలి ఉమ్మేసి, సిగ్గుపడుతూ చిరునవ్వు నవ్వింది.

"యిది మొదటి కాన్పా?"

"ఔను. నీ వెవరు?"

"మనిషిని, యేదో ఒక విధంగా...."

"అది కనపడుతున్నదిలే. నీకు పెండ్లైందా?"

"అంత గౌరవం కలగలేదు."

"బొంకుతున్నావు!"

"లేదు."

ఆమె రెప్పలు వాల్చింది; తరువాత అన్నది:

"యీ ఆడవాళ్ల పని నీ కెలా తెలుసు?"

అప్పుడు బొంకినాను.

"నేర్చుకున్నాను. నేను విద్యార్థిని – అంటే తెలుసా?"

"బాగా తెలుసు. మా గురువుగారి పెద్ద కొడుకు విద్యార్థి. గురువు కావడానికి నేర్చుకుంటున్నాడు."

"అదే, నేనూ ఒక విద్యార్థిని. పోయి నీళ్లు తెస్తాను."

ఆమె పసిబిడ్డమీదికి వంగింది, వానికి వూపిరి ఆడుతున్నదో లేదో వినడానికి. తరువాత సముద్రంవైపు చూసింది.

"స్నానం చేస్తే బాగుండు, కానీ యిక్కడి నీళ్లు వింతగా వున్నాయి. యేమి నీళ్లు యివి? ఉప్పగా, చేదుగా వుంటాయి."

"స్నానం చేసిరాపో – యివి ఆరోగ్యకరమైన నీళ్లు."

"నిజంగా?"

"ఔను. సెలయేట్లోకంటె వెచ్చగా వున్నాయి కూడా, అవి మంచులా గున్నాయి."

"నీవు చెప్తే సరే...."

ఒక అబ్‌హాజియన్ గుర్రంమీద తూగుతూ, నడక వేగంతో పోతూవుండినాడు, అతని తల రొమ్ముమీదికి వాలి వుంది. ఆ బిగువైన చిన్న గుర్రం, చెవులు అల్లాడిస్తూ, పెద్ద నల్లని కండ్లతో మావైపు సందేహంతో చూసి సకిలించింది. రౌతు, బొచ్చు టోపీ పెట్టుకున్న తన తల వూకించి యెత్తి, మా దిశగా చూసి, మళ్లీ తల వాల్చినాడు.

"తమాషా అయినవాళ్లు, యిక్కడి మనుషులు, అంత భయంకరంగా కనిపిస్తారు కూడా," అన్నది ఒరేల్ యువతి మెల్లగా.

నేను నీళ్లు తేవడానికి పోయినాను. సెలయేరు స్వచ్ఛంగా, పాదరసంలాగ రాళ్లమీద నుండి దుముకుతున్నది; శరత్కాలపు ఆకులు ఉల్లాసంగా నీళ్లలో పల్టీలు కొడుతున్నాయి. అద్భుతం! నేను చేతులూ, ముఖమూ కడుక్కొని, కెటిల్‌నిండా నీళ్లు పట్టుకొని, తిరిగిపోయినాను. పొదల సందున ఆమె కనిపించింది, మోకాళ్లమీద ప్రాకుతూ, ఆందోళనగా వెనక్కి చూస్తూ.

"యేమిటి సంగతి?"

ఆమె ఉలిక్కిపడింది, ముఖం తెల్లబడింది. ఆమె తన శరీరంకింద యేదో దాచిపెట్టడానికి ప్రయత్నిస్తున్నది. అది యేమయిందీ నేను ఊహించుకున్నాను.

"అది యిలా యివ్వు, పాతిపెడతాను."

"ఓ! దీన్ని స్నానాల గదిలో పాతిపెట్టాలి, భూమిలో...."

"యిక్కడ త్వరలో స్నానాల గది కట్టబోతున్నారా?"

"నీవు హాస్య మాడుతున్నావు, నాకేమో భయంగా వుంది! యే జంతువైనా

తినిపోతే యెలా? దీన్ని భూమిలో పాతిపెట్టాలి.''

ఆమె ముఖం పక్కకు తిప్పుకొని, తడిగా వున్న బరువైన మూటె నా చేతి కిచ్చి, మెల్లగా, సిగ్గుపడుతూ అంది:

''సరిగా చేస్తావు కదూ, లోతుగా? యేసు క్రీస్తు కోసమని... యీ పసివాని కోసమని, సరిగా చెయ్, నీకు పుణ్య ముంటుంది....''

నేను తిరిగి వచ్చేటప్పటికి ఆమె బీచినుంచి వస్తున్నది, తడబడే అడుగులతో, చేయి పార జాపుకొని; ఆమె స్కర్టు నడుముదాకా తడిసింది, ముఖం కొద్దిగా యెర్రబారింది, లోపలి కాంతితో వెలుగుతున్నట్లు. నేను ఆమెను మంట దగ్గరికి తీసుకవచ్చి, ఆశ్చర్యంతో అనుకున్నాను:

''యేమి శరీర బలం!''

తరువాత మేము తేనెతో టీ తాగినాం. ఆమె మెల్లగా అన్నది:

''అయితే చదువు మానేసినా వన్నమాట?''

''ఔను.''

''తాగుడు — కదూ?''

''ఔను. తాగుడుతో నాశనమైనా నమ్మా!''

''సిగ్గు చేటు! యిలా చూడు, నీవు సుహూంలో తిండిని గురించి మేనేజర్‌తో రగడ పెట్టుకున్నప్పుడు నిన్ను చూసినాను. అప్పు డనుకున్నాను: యితను తాగుబోతై వుండాలి, యెవరన్నా యితనికి భయం లేదు.''

ఆమె తన వాచిన పెదవులమీది తేనె నాక్కుంది. సరికొత్త ఒరేల్ మనిషి ప్రశాంతంగా నిద్రిస్తున్న పొదవైపు ఆమె తన నీలి కన్నులు తిప్పుతూనే వుంది.

''వీడు యెలా బతుకుతాడో?'' అన్నది ఆమె నిట్టూరుస్తూ, నావైపు పరిశీలనగా చూస్తూ. ''నీవు మంచి సాయం చేసినావు — కృతజ్ఞురాలిని. కానీ వీనికిది మంచిదేనా, యేమో....''

తినడం, తాగడం అయిన తర్వాత ఆమె సిలువ గుర్తు వేసుకుంది. నేను నా సంసారం సర్దుకుంటూ వుండగా ఆమె మత్తుగా వూగుతూ కూర్చుంది, మళ్లీ రంగు వెలిసినట్లున్న కన్నులతో నేలకేసి నిలజూస్తూ. తరువాత ఆమె లేచి నిలబడింది.

''నిజంగా బయలుదేరుతున్నావా?'' అన్నాను.

''ఔను.''

''నడిచే శక్తి వుందంటావా?''

''మేరీమాత లేదూ? వాణ్ని యిలా యివ్వు!''

''వీణ్ని నేను తెస్తాను.''

కొంత వాదులాట తర్వాత ఆమె లొంగింది. మేము బయలుదేరినాం, పక్కపక్కన, భుజం భుజం రాచుకుంటూ.

"తొట్రుకొని పడను గదా," అన్న దామె, క్షమార్పణగా చిరునవ్వు నవ్వుతూ, నా భుజంమీద చెయ్యి పెట్టి.

రష్యా దేశపు కొత్త పౌరుడు, అజ్ఞాత భవితవ్యం గల మానవుడు, నా చేతుల్లో పండుకొని వున్నాడు, ముక్కుతో పెద్దవాళ్ల చప్పుళ్లు చేస్తూ. సముద్రం, తెల్లని తోపడా పొట్టుతో నగిషీ చేయబడి, ఒడ్డుకు కొట్టుకుంటూ, మర్మరిస్తున్నది; పొదలు ఒక దానితో ఒకటి గుసగుసలాడుతున్నాయి, సూర్యుడు మధ్యాహ్న రేఖమీద ప్రకాశిస్తున్నాడు.

మేము మెల్లగా నడుస్తూ పోయినాం, తల్లి అప్పుడప్పుడూ నిలబడి దీర్ఘంగా నిట్టూరుస్తూ, తల వెనక్కి యెగిరేస్తూ, సముద్రంవైపూ, అడవులవైపూ పర్వతాలవైపూ నిలజూస్తూ, తరువాత తన కొడుకు ముఖంలోకి తొంగిచూస్తూ. ఆమె కండ్లు వేదనాశ్రువులచేత క్షాళితమై మళ్లీ ఆశ్చర్యకరమైనంత స్వచ్ఛంగా వున్నాయి, అనంత ప్రేమ జ్యోతియొక్క నీలి కాంతితో వెలిగిపోతూ.

ఒకసారి ఆమె నిలబడి అన్నది:

"తండ్రీ, భగవంతుడా! యెంత అద్భుతంగా వుంది! నేను యిలాగే పోగలను, ప్రపంచం చివరకు యిలాగే యిలాగే, వీనితో, యీ నా పసివాడు పెరుగుతూ, తల్లి రొమ్మున స్వేచ్ఛగా పెరుగుతూ, నా ముద్దుల చిన్నారి బాబు...."

సముద్రం మర్మరిస్తూనే వుంది....

1912

# భరత వాక్యం

రష్యన్ మహామేధావి మక్సీమ్ గోర్కీ సమస్త మానవ జాతికి చెందినవాడు.

అచ్చు అందే ప్రతి చోటా గోర్కీ రచనలు చదువుతారు. ఆయన కృతులు 127 భాషల్లోకి అనువదింపబడినాయి. సోవియట్ యూనియన్‌లో ఆయన గ్రంథాలు 2,674 కూర్పులలో ప్రచురింపబడినాయి. ఆయన మాతృదేశంలో ఆయన రచనలు మొత్తం అచ్చయినవి 11 కోట్ల ప్రతులు.

1892లో, మక్సీమ్ గోర్కీ అనే కలంపేరు గల మొదటి కథ "మకార్ చుద్రా" ప్రచురింపబడినప్పుడు, దాని రచయిత, నీజ్నీ-నోవ్‌గొరాద్ (యిప్పుడు గోర్కీ) అనే పట్టణానికి చెందిన అలెక్సేయ్ పేష్కొవ్ అనే కార్మికునికి యిరవై నాలుగేండ్లు. కానీ ఆ యిరవై నాలుగేండ్లలో ఆయన యెన్ని చూసి, యెన్ని పాట్లు పడినా డంటే, యెంత జీవితానుభవ సంపద సంపాయించినా డంటే, ఆ విషయంలో ఆనాటి రచయితల్లో ఆయనకు సాటి రాగలవాళ్ళు లేరు.

గోర్కీ తన జీవితపు ప్రథమ సంవత్సరాలను తన ప్రసిద్ధ త్రికం "బాల్యం," "నా సేవక జీవితం," "నా విశ్వవిద్యాలయాలు" అనేవాటిలో వర్ణించినాడు.

"తన పరిసరాలను ప్రతిఘటించడంలో మనిషి సృష్టింపబడతాడు. నా జీవిత పరిస్థితులు కష్టమయ్యే కొద్దీ నాకు మరింత బలం — మరింత తెలివి కూడా — కలిగినట్లు నా జీవితంలో చాలా చిన్నప్పుడే గ్రహించినాను," అని గోర్కీ తన తదనంతర జీవితంలో అన్నాడు.

యిరవై యేండ్ల వయసులో గోర్కీ ఉద్యోగం కొరకు రష్యా దక్షిణాది ప్రాంతాలు -- యుక్రేన్, బెస్సరేబియా, క్రైమియా, కాకసస్ — నాలుగు మూలలకూ నడిచినాడు; తన సంచారాలలో ఆయన వేలకొలది అత్యంత భిన్నమైన వ్యక్తులను కలుసుకున్నాడు.

యితరులపట్ల తీవ్రమైన ఆసక్తీ, దయా గోర్కీ విలక్షణ గుణాలలో ఒకటి; ప్రజలు కూడా తమ హృదయాలు తెరిచి ఆయనకు తమ హాస్య, ఉద్విగ్న, విషాద జీవిత ఘటనలు వెల్లడించినారు. తరువాతి కాలంలో, తనను రచనకు ప్రేరేపించిన కారణాలను గోర్కీ యీ విధంగా వివరించినాడు: "నేను రచన యెందుకు ప్రారంభించినాను? జవాబు యిది:

వ్యధాపూరితమైన జీవితపు విసుగుయొక్క ఒత్తిడివల్లనూ, నాకు అన్ని మానసిక ముద్రలు వుండడంవల్లనూ నాకు రాయక తప్పలేదు.''

''స్కెచ్చిలూ, కథానికలూ'' అనే పేరు గల గోర్కీ మొదటి కథా సంపుటం 1898లో వెలువడింది. అది బ్రహ్మాండమైన విజయం పొంది, గోర్కీని సాహిత్య ప్రపంచంలో చేహొవ్, లేవ్ తొల్‌స్తోయ్‌ల శ్రేణికి చేర్చింది.

గోర్కీ ప్రథమ రచనలలో నిర్భీక వాస్తవిక యథార్థమూ, అంత కష్టమైన జీవితం గడిపిన రచయితలో అసాధారణమైన మహా ఉల్లాసమూ, ''సాహసపు ఉన్మాదా''న్ని కీర్తించడమూ కలిసి వున్నాయి.

''చెలరేగనీ దాని ఉగ్ర తాండవం'' – యిలా సాహసాన్ని కీర్తించడమూ, ఉద్బోధించడమూ అవసరమైనాయి ఆ విప్లవ పోరాటపు తొలి సంవత్సరాలలో బలవంతుడైన శత్రువుతో పోరాడడానికి లేచే ప్రజలకు.

యీ సంపుటంలో గోర్కీయొక్క ప్రసిద్ది చెందిన రొమాంటిక్ గాథలు ''మకార్ చుద్రా,'' ''ముసలి ఇజెర్గిల్,'' ఆయన ''తుఫానుపక్షి పాట'' వున్నాయి.

''ముసలి ఇజెర్గిల్'' కథ ప్రత్యేకంగా ఆసక్తికరమైంది – దానిలోని మూడు భాగాలు మానవుని యెదుట గల మూడు మార్గాలను చూపిస్తాయి. ఒంటరితనం మానవునికి సంభవించగల అత్యంత భయంకరమైన దుర్గతి అనీ, మృత్యువును కూడా మించిన శిక్ష అనీ లార్ర కథ నిరూపిస్తుంది. ఆ కథలోని చివరి భాగం, దాంకొ మండే గుండెను గురించిన గాథ, ప్రజల స్వేచ్ఛ కొరకు స్వార్థ త్యాగం చేయడంలోని ఆనందం గురించి చెపుతుంది.

కానీ, ఇజెర్గిల్ జీవితాన్నే వర్ణించే కథా మధ్య భాగంయొక్క ఉద్దేశమేమిటి? దాని ఉద్దేశం యిది: మనిషి సాహస కార్యాలు చేస్తూ, తన కోసం మాత్రమే, తన సొంత ఆనందం కొరకు మాత్రమే, జీవించకూడదు, ఒకేసారి దాంకొగానూ, లార్రగానూ వుండడానికి ప్రయత్నించకూడదు. అది అసాధ్యం; యెందుకంటే, అలా వుంటే, ఇజెర్గిల్ యవ్వనంలో వున్నట్లు దృఢమైన, ధైర్యమైన మనిషి ఆత్మలోకి కూడా ''భయమూ, బానిస భావమూ'' ప్రవేశిస్తాయి.

జీవిత కష్టాలచేత ''అధోలోకాల''కు యీడ్వబడి కూడా, రష్యన్ వ్యక్తిత్వపు ఆకర్షణీయ లక్షణాలైన హృదయ వైశాల్యాన్నీ, ప్రజ్ఞనూ, ఆనంద కాంక్షనూ నిలుపుకున్నవాళ్లను గోర్కీ తన దేశాటనంలో కలుసుకున్నాడు.

యీ విధంగా వెలువడినాయి మొరటు మానవుల గురించిన కథలు, బూర్జువా సమాజంచేత తోసివేయబడినవాళ్లను గురించిన కథలు (''చెల్కాష్,'' ''కొనొవాలొవ్,'' ''ఒక శరదృతువు,'' ''ఒర్‌లోవ్ దంపతులు,'' ''ఒకనాటి ప్రజలు'').

పతితుల పట్ల గోర్కీకి సానుభూతి వుండింది; వాళ్ల స్వేచ్ఛా ప్రియత్వంచేతా, వ్యక్తిగత ఆస్తి పట్ల గల ద్వేషంచేతా, జీవిత పరమార్థ అన్వేషణచేతా ఆయన ఆకర్షితుడైనాడు.

కానీ వాళ్ళు ఆయన వీరులు కారు; అనుసరించదగిన ఆదర్శాలుగా వాళ్లను ఆయన యెప్పుడూ చిత్రించలేదు. మానవ జీవితాలనూ, సామర్థ్యాలనూ, ఆశలనూ ధ్వంసం చేసిన పాత ప్రపంచం చేసిన నేరాలకు వాళ్ళు "ప్రత్యక్ష సాక్ష్యం" అనవచ్చు.

గోర్కీ అనేక యితివృత్తాల రచయిత. అధోజీవుల వర్ణనలు కాక, ఆయన "జీవిత యజమాను"లైన రష్యన్ వర్తకులనూ, మధ్యతరగతులనూ, బూర్జువా మేధావులనూ చిత్రించినాడు.

"పొద్దుబోడానికి" అన్న కథలో నిర్జీవత్వంలాంటి నిర్వ్యాపారత్వంలోకీ, విసుగులోకీ దిగజారిపోయిన సివిల్ ఉద్యోగులు నా అన్నవాళ్లు లేని పిరికి పనిమనిషి అరీనాను ఆత్మహత్యకు తరుముతారు.

నిజమైన కళాకారుడు తన పాఠకులకు వాళ్ల చుట్టూ వున్న ప్రపంచంయొక్క సౌందర్యాన్నీ, వైవిధ్యాన్నీ వెల్లడిస్తాడు. మక్సీమ్ గోర్కీ అలాంటి కళాకారుడు. ఆయన కథలలో ప్రకృతియొక్క అందమైన చిత్రాలూ, మామూలు శ్రామిక జనులవీ, సగర్వ యోధులవీ ఆకర్షణీయ చిత్రాలూ పుష్కలంగా వున్నాయి.

చౌకబారు లాడ్జింగులలోనూ, మురికిపేటలలోనూ, మధ్యతరగతి నిర్జీవ గృహాలలోనూ, బేకరీలోనూ, ఫాక్టరీలలోనూ, అంగళ్లలోనూ, గోర్కీకి దృఢమైన స్వభావాలూ, అసాధారణ ఉదాత్త వ్యక్తిత్వాలూ, అశాంత అన్వేషణాశీల చింతనా కనిపించినాయి.

ఆయన "ఇటలీ గాథలు," "రష్యాలో" అన్న కథలు ఉల్లాసపూరితమైన, జీవితాన్ని ఉద్ఘాటించే సంగీతంతో ప్రతిధ్వనిస్తాయి. తన "ఇటలీ గాథల"లో గోర్కీ ప్రజల తరగని ఆశాదృక్పథాన్నీ, శక్తినీ కీర్తించినాడు. "ఒక మానవుని జననం" అన్న ఆయన కథ జీవితానందాన్నీ, ప్రకృతి నూత విజ్ఞతనూ ఉద్ఘాటిస్తుంది.

"యెంత అద్భుతమైన పదవి – యీ ప్రపంచంలో మానవునిది! యెంత అద్భుతమైన వస్తు సంపద కనపడుతుంది, హృదయాన్ని చలింప జేసే సౌందర్యం కలిగించే నిశ్చలానందం యెంత తీయగా గుండెను పిండుతుంది!" అన్నాడు గోర్కీ.

1905 నాటి ప్రథమ రష్యన్ విప్లవ ప్రాంగణంలోని రష్యాలో వచ్చిన బలీయమైన విప్లవ ఉప్పెనతో గోర్కీ, రచయితగా, పబ్లిక్ వ్యక్తిగా, చాలా ప్రభావితుడైనాడు. ఆయన ఉత్తేజిత రచన "తుఫానుపక్షి పాట" ఆ విప్లవ ఉప్పెనకు ఆయన యిచ్చిన సొంత తోడ్పాటు.

లెనిన్‌తో గోర్కీ సమావేశాలూ, మైత్రీ గోర్కీ దృక్పథాన్ని రూపుదిద్దడంలో నిర్ణయాత్మకమైనవి. గోర్కీ రచనా సామర్థ్యం గురించి లెనిన్‌కు గొప్ప అభిప్రాయం

వుండింది. సిద్ధాంతగతంగా లెనిన్ గోర్కీని అపారంగా ప్రభావితం చేసినాడు. గోర్కీని లెనిన్ "విప్లవపు తుఫానుపక్షి" అన్నాడు. "ఆయన తన మహత్తర రచనలద్వారా రష్యా కార్మికవర్గ ఉద్యమంతో, యావత్ ప్రపంచ కార్మికవర్గ ఉద్యమంతో ఏకమైనాడు," అని లెనిన్ అన్నాడు.

చిన్న కథ మొదలుకొని "క్లిమ్ సామ్‌గీన్ జీవితం" అలే బృహద్రచన వరకు గోర్కీ అత్యంత భిన్నమైన శాఖలలో రచనలు చేసినాడు. ఆయన ప్రముఖ నాటక కర్త కూడా. ఆయన రచించిన ఇరవైకి పైగా నాటకాలు రష్యన్, విదేశ నాటక రంగ అభివృద్ధికి గణనీయంగా తోడ్పడినాయి. ఆయన గొప్ప విమర్శకుడు, పత్రికా రచయిత, ఉజ్వలమైన శైలీ, గంభీరమైన వస్తువూ గల సుప్రసిద్ధ వ్యాసాలు రాసినవాడు.

1968 మార్చి 28 నాడు మనం గోర్కీ శత జయంతి జరుపుకున్నాం. ఆయన మరణించి ముప్పై యేండ్లకు పైగా అయింది; కానీ ప్రపంచ మంతటా ప్రజల మనస్సులనూ, హృదయాలనూ ఆకర్షిస్తూ ఆయన ప్రపంచ సాహిత్య ప్రక్రియలో యింకా కేంద్ర వ్యక్తిగా వున్నాడు.

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగానీ, దీని పేర్పూ కూర్పూ గురించిగానీ మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ మా భావిప్రచురణల సహాయార్థం మాకు పంప ప్రార్థన.

మా చిరునామా:

Progress Publishers, 21 Zubovsky Boulevard, Moscow, USSR.

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్
విజయవాడ – 2.

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజార్
హైదరాబాద్.



" 'మనుషుల కొరకు నేను యేం చేయాలి?!' ఉరుమును మించిన శబ్దంతో దాంకొ అరిచినాడు.

"హఠాత్తుగా అతను తన రొమ్ము పగల చీల్చి, గుండె వూడ బెరికి, తలపైన యెత్తుగా పట్టుకున్నాడు.

"అది సూర్యునిలాగ వెలిగింది, సూర్యునికంటె కూడా కాంతిగా వెలిగింది; అరణ్యం ఉద్ధతి తగ్గిపోయి, యీ దివిటీవలన, తన జనుల పట్ల గల యీ మహా ప్రేమ దివిటీవలన, కాంతివంతమైంది."

గోర్కీ, "ముసలి ఇజెర్గిల్."

"... నే నొక సజీవ దీపాన్ని అయినట్లూ, నా రొమ్ములో నా గుండె యెర్రని మంటతో మండుతున్నట్లూ నాకు అనిపిస్తుంది. చీకటిలో దారి తప్పి భయపడినవాడు యీ చిన్ని దీప కళికను చూడాలని నా ఆకాంక్ష..."

గోర్కీ, "రష్యాలో."

యీ సంపుటంలోని పది కథలూ మక్సీమ్ గోర్కీ ప్రతిభ సృష్టించిన అత్యుత్తమమైన వాటినుండి యెన్నుకోబడినాయి.

యిందులో వున్నాయి ఆయన ప్రసిద్ధ వీర, కాల్పనిక గానాలూ, దేవతా కథలూ, గాథలూ ("మకార్ చుద్రా," "ముసలి ఇజెర్గిల్," "తుఫాను పక్షి పాట"), జీవిత కష్టాలకు తట్టుకోలేక "అధోలోకాల"కు జారిపోయిన ఉజ్వల ప్రజ్ఞావంతుల బాధలకూ, దారిద్ర్యానికీ, సర్వనాశనానికీ సంబంధించిన హృదయ విదారక చిత్రణలూ ("చెల్కాష్," "కడుపులో చెయిపెట్టి..."), అల్పబుద్ధుల హృదయ రాహిత్యాన్నీ, మోటుతనాన్నీ నిర్దాక్షిణ్యంగా గుట్టు కడగడాలూ ("పొద్దుబోడానికి", "యిరవై ఆరుమంది పురుషులూ, ఒక అమ్మాయీ"), ప్రకృతినీ, ప్రేమనూ, దయనూ కీర్తించడమూ ("ఇటలీ గాథలు," "ఒక మానవుని జననం").

మానవుని మనస్సులోకీ, ఆత్మలోకీ లోతుగా దూరగల మంచి మనశ్శాస్త్రజ్ఞుడైన గోర్కీ యీ కథల్లో మనకు కనపడతాడు.

ఆయన దీర్ఘ రచనా జీవితంలో సృష్టింపబడిన యీ కథలు విప్లవ పూర్వ రష్యా జీవితపు సర్వస్వం అనవచ్చు.